C

380

థమ సంపుటి

# భాషాశాస్త్ర సంగ్రహము

స్ఫూర్తిశ్రీ

# భాషాశాస్త్ర సంగ్రహము

(GENERAL LINGUISTICS)



స్వాస్తి శ్రీ

టి. భాస్కరరావు, ఎం. ఏ.,

లెక్చరరు, ఏ.సి. కాలేజి, గుంటూరు

# మందుమాట

ఆధునికకాలమున నభ్యుదయమునొందిన శాస్త్రములలో భాషాశాస్త్రమొకటి. సంకుచితావధులనుదాటి, స్వపరభేదములను దాటి సర్వభాషలను స్వాయత్తము చేసికొని సర్వభాషలకు సమాశ్రయమైన శాస్త్రము భాషాశాస్త్రము. ఈనాడు నాగరకప్రపంచము నలుమూలల భాషాశాస్త్రము తన వెలుగులను ప్రసరింపజేయుచున్నది; విశ్వైకభావమునకు విధాతయై విశ్వజనీనతను వెలయింపజేయుచున్నది.

ఎందువలననో, ఆధునికభాషాశాస్త్రము గ్రంథరూపమున నింతవరకు తెలుగున ఆవిర్భవింపలేదు. కళాశాలాపాఠ్యప్రణాళికలో లేకపోయినను, విశ్వవిద్యాలయ పాఠప్రవచనములందు భాషాశాస్త్రము పర్యాప్తస్థానమును గడించుకొనియే యున్నది. తెలుగునాటనేకాక భారతదేశమంతటను, భారతదేశమునందే కాక విశ్వవ్యాప్తముగను కీర్తినందిన భాషాశాస్త్రవేత్తలు ఆంధ్రులలో నున్నారన్నది హర్షింపదగినవిషయము. గురుస్థానీయులయినవారలకు నా ప్రణామాంజలి.

తెలుగులో గ్రంథము రాలేదన్న యావేదన, శాస్త్రమునందు నాకున్న యాసక్తి, పరీక్షార్థులును శాస్త్రజిజ్ఞాసువులును వ్రాసిన వందలకొలది యుత్తరముల నిర్బంధము- ముప్పేటగా నన్ను ప్రకృతగ్రంథరచనాబద్ధుని గావించినవి.

ఉన్నతపాఠశాలా విద్యార్థినై యున్నకాలమున "ఒక్కపుట వ్రాయుటకు ఇరువది పుటలు చదువవలయు" నన్న ఆంగ్లసూక్తిని మా అధ్యాపకులొకరు సెలవిచ్చిరి. అది నా పాలిట మంత్రమైనది. రచయితనైనప్పటినుండియు నాకు రక్షాకవచమైనది. శాస్త్రగ్రంథములు స్వకపోలకల్పితములు కావు. పూర్వాపూర్వుల ననుసరించుటయే యనంతరుల కర్తవ్యము.

ప్రకృతగ్రంథమును వ్రాయుటకు ఇరువది గ్రంథములు కాదు-దరిదాపుగా అరువది డెబ్బది గ్రంథములు చదివితిని. తెలుగులో డా. భద్రిరాజు కృష్ణమూర్తి, డా. పి. యస్. సుబ్రహ్మణ్యము, డా. బూదరాజు రాధాకృష్ణ ప్రభృతులు రచించిన ప్రకీర్ణ పత్రికా వ్యాసములు నాకు సహకరించినవి. ఆంగ్ల హిందీ సంస్కృత కన్నడగ్రంథములు నాకు మూలధనమైనవి. రచనావిషయమున సూచనలు, సరుదుబాటులుచేసిన సహవ్రతులు శ్రీ నేతి అనంతరామశాస్త్రి, ఎం. ఏం., చిత్రాలంకరణము చేసిన మిత్రులు శ్రీ పులిచెర్ల సాంబశివరావు, ఎం. ఏ. వారికి నా ధన్యవాదములు.

తుమ్మెద పెక్కుపువ్వులనుండి పూదేనెను గ్రహించును. దానిని పుట్టతేనెగా మార్చి లోకమున కందించును. అట్లు అందించుటలోనే తుమ్మెదకు సార్థకత్వము.

# అంకితము

తెలుగు మాటల జిలుగు వెలుగులు
ఇరుగు పొరుగు భాషల యింపు సొంపులు
గుర్తించి నర్తింపజేసిన
నా తలిదండ్రులు
నాకలోక వాసులు
వీరాంబా బుచ్చిరాజ దంపతులకు

# విషయానుక్రమణిక

[ప్రథమ సంపుటి]

# 1 భూమిక

భాష యని యన్నప్పుడు వెంటనే మానవుడు గుర్తువచ్చును. భాష యొక సాధనమైనపుడు మానవుడు తత్సాధకుడు. భాష మానవుని స్వార్జితసంపద. ఈ సంపద నుపయోగించుకొనియే మానవుడు సంఘజీవి యగుచున్నాడు. భాషయే లేనియెడల సంఘమును లేదు. కావ్యాదర్శ కారుడు 'వాచామేవ ప్రసాదేన లోకయాత్రా ప్రవర్తతే' అని నిర్ణయించుట యెంతో సమీచీనమై యున్నది. ఒక మానవుడు మానవునితో వ్యవహరింపవలయునన్న భాషయే సాధనము. నిజమునకు మానవ జీవితమునంతను భాషయే యావరించియున్నదన్నప్పటికి నతిశయోక్తి కాదు.అయినప్పటికిని మనకున్న యత్యంతసాన్నిహిత్యమువల్లనో,అవినాభావమువల్లనో మనము భాషావైశిష్ట్యమును గుర్తించుట సక్రమముగా జరుగుటలేదు. నిజమునకు జీవుల కుచ్ఛ్వాసనిశ్వాసము లెంత ముఖ్యములో మానవులకు భాష యంత ముఖ్యము. కాని యుచ్ఛ్వాస నిశ్వాసక్రమము జీవ మున్నంతవరకు స్వాభావికముగానే సాగుచుండును. అది జీవుల స్వాభావికధర్మము. భాష స్వాభావికముగా సమకూడునది కాదు. అది స్వార్జితము. అంతేకాదు. అదియే మానవుల నితరజీవుల నుండి వేరుచేయగల విశిష్టలక్షణము.

మానవ శబ్దము 'మన్' ధాతువునుండి యుత్పన్నమైనది. ఈ యధారమునుబట్టి 'మానవుడు'అని యనగా ఆలోచనాపరుడన్న యర్థము లభించును. ఆలోచనమే జ్ఞానమునకు ఆధారపీఠము. లోకమును దర్శించుట యవలోకనము;దానిని గురించి విమర్శించుట యాలోచనము; దానినిబట్టి యొక నిర్ణయమును గలిగియుండుట జ్ఞానము. అవలోకనము

వలన నాలోచనము కలుగును; ఆలోచనమువలన జ్ఞానము కలుగును; అందువలన నన్వేషణము సాగును; అందువలన నభ్యుదయము కలుగును. ఇట్టి చక్రము నిరంతరపరిభ్రమణశీలమై జ్ఞానపరిపోషక మగును. కావుననే మానవజాతినిగూర్చి జ్ఞానమునకు యోగ్యమైన సామర్థ్యము గలవారన్న భావముతో 'hamo sapiens' అని పేర్కొనుచుందురు. అది యథార్థమే కాని యింతకంటెను 'homo loquens' అని యనుట యోగ్యతరముగా నుండును. భాషకు యోగ్యమయిన సామర్థ్యము గల వారని దీని యర్థము. ఇదియే మానవులకున్న విశిష్టతను నిరూపించుటకు యోగ్యమైయున్నది.

ప్రతివ్యక్తియు భాషాసమాజమునకు సంబంధించి యుండును. ఒక్కొక్కప్పుడు రెండు మూడు భాషాసమాజములకు సైతము సంబంధించి యుండవచ్చును. సమాజమునందలి కార్యక్రమముల నన్నింటిని సమాహారరూపముగా 'సంస్కృతి' యని పిలువవచ్చును. జాతిశాస్త్రజ్ఞులు సంస్కృతిని భౌతికసంస్కృతి యని, అభౌతికసంస్కృతి యని రెండు విధములుగా విభాగింతురు. గృహనిర్మాణము, వస్త్రధారణము, భూషణాద్యలంకారసామగ్రి మున్నగునవి భౌతికసంస్కృతిని రూపొందించును. మతము, చట్టము, సంప్రదాయము, విశ్వాసము మొదలయినవి అభౌతిక సంస్కృతిని రూపొందించును. భాష అభౌతికసంస్కృతియందే అంతర్భవించును. మూర్తములై యుండు వస్తువులవలన నేర్పడుటచేత, ఆ యా వస్తువులను పరిశీలించి భౌతికసంస్కృతి నవగాహనము చేసికొనవచ్చును. అభౌతికసంస్కృతి నవగాహనము చేసికొనుట కట్టి సౌకర్యము కానరాదు. సమాజమునందలి సభ్యులు భాష నుపయోగించు విధానమును, దానికి వారు స్పందించువిధానమును బాగుగా గమనించుట యొక్కటియే సాధనము. దీనినిబట్టి మానవుని ప్రవర్తనవిధానమంతయు భాష ననుసరించి, భాషపై నాధారపడి సాగుచున్నదన్న

విషయము స్పష్టమగుచున్నది. భౌతిక సంస్కృతిని బాగుగా నవగాహనము చేసికొనవలయు నన్నప్పటికిని భాషను సాధనముగా నుపయోగించుకొనక తప్పదు. వస్తువులకు గలపేరులు, వాని యుపయోగములు, వాని చరిత్ర మున్నగువానిని భాషాసాధనముచేతనే తెలిసికొన వీలగును. ఈ విషయమున లియొనార్డు బ్లూమ్ ఫీల్డు [1] చెప్పిన మాటలు గమనార్హములు.'ఒక మానవసమాజమునుపరిశీలింపవలయునన్న మనము తద్భాషనవగాహనము చేసికొనవలయును. మన మా సమాజపు విధానములను, వాని చారిత్రకమూలమును నిశితముగా గుర్తించుటకు, వారి భాషయొక్క క్రమబద్ధమైన వివరణమును సంపాదించి యుండవలయును. మానవజాతి గురించి యే విషయమును గ్రహింపవలయు నన్నప్పటికి ఈ విధముగా వివిధములైన సమాజములను పరిశీలింపవలయును. మానవునిగురించి యే కొంచెము మనకు తెలిసినప్పటికి అది యీ విధమైన యధ్యయనమువల్లనే తెలిసినది.'

పై మాటలనుబట్టి మానవుని కుపయోగపడుటయే కాక, మానవుని గురించి యే విషయము తెలిసికొనవలయునన్నను భాష యవసరమని తేలుచున్నది. నిజమునకు భాషయే లేనియెడల [2]కావ్యాదర్శకారుడు చెప్పినట్లు మూడులోకములను చీకటు లావరించు ననుటలో సందేహింపవలసిన పని లేదు. తాత్కాలికముగా గొంతుక పోయినప్పుడు

1. In order to observe a human group, we must understand its speech. If we want to probe deeper into the ways of the community and their historical origin, we must possess, to begin with, a systematic description of its language. In order to know any thing about mankind, we must study in this way a varied set of communities. What little we know about man has come from study of this kind. [Philosophical aspects of language]

2. ఇద మంధంతమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే.

మనము చెప్పదలచుకొన్న విషయమును చెప్పలేనిస్థితిలో ఎంత క్రుంగి పోవుదుమో మన కనుభవములో నున్న విషయమే. అట్లే, ఒక రొకవిషయమును చెప్పుచుండగా నడుమనున్న గోలవల్ల, మన కావిషయము వినిపింపనప్పుడు మనకెంత విసుగు కలుగునో, మనమెంత నిస్సహాయుల మగుదుమో కొంతకు కొంతయైన మన యనుభవమునందు తెలిసికొని యుందుము. ఆ సమయమునందు చిమ్మచీకటిలో తడవుకొనుచున్నట్లే యుండుననుటలో సందేహము లేదు. మన సర్వకార్యములకు మూలము భాష; మన సర్వసాధనములకు మూలము భాష. ఐతరేయారణ్యకము[3] 'భాషయే మన సర్వకామ్యములను పిదుకు'నని తెల్పుచున్నది. ఇంత ప్రధానమైనది భాష. ఈ సంగతిని గుర్తించిన పిమ్మట 'భాష' యను పదమును మరింత సూక్ష్మముగా నర్థము చేసికొనుట యవసరము.

## 1. ౧ భాషాస్వరూపము

'భాష్యతే ఇతి భాషా' యన్నది భాషాశబ్ద వ్యుత్పత్తి. భాషింపబడునది భాష యగును. ఇప్పుడు భాషింపబడుట యనగా నేమి? యన్న ప్రశ్న యుదయించును. 'భాష్' అన్న ధాతువు[4] 'వ్యక్తమగు వాక్కు' నందు ప్రయుక్తమగును. ఉచ్చారణావయవములవలన సువ్యక్తములగు వాక్కుల సమూహమునకు భాషయన్న వ్యవహారము చెల్లును. ఇది మహాభాష్యకారుడగు పతంజలిమహర్షి నిర్ణయము. ఇతరేతర శాస్త్రజ్ఞులు చేసిన నిర్వచనములను సంగ్రహింతము.

'బుద్ధిజీవులయొక్క యనుభవముల యభివ్యక్తియే భాష'. ఇది Eisler అనువాని నిర్వచనము. బుద్ధిజీవుల యనుభవములు కేవలము భాషమూలముననే కాక చిత్రలేఖనాది కళలమూలమున నైతము వ్యక్తములగుట కాక్షేపము లేదు. కావున, ప్రకృతనిర్వచనము అతివ్యాప్తిదోషమునకు పాల్పడినది.

---

3. వాగ్వై సర్వాన్ కామాన్ దుహే.
4. వ్యక్తాయాం వాచి.

'చిత్తస్థితిని వ్యక్తము చేయుటకు చేసిన యుద్దేశపూర్వకధ్వనుల యుచ్చారణమే భాష' యని Marty అను నాయన నిర్వచించెను. భాషవలన చిత్తస్థితిని వ్యక్తముచేయుట మాత్రమే కాదు; అభిప్రాయములు, ఆశయములు, ఆలోచనములు మొదలగు నెన్నింటినో వ్యక్తము చేయవచ్చును. వ్యక్తముచేయుటయే కాక శ్రోతకు సంచోదనమును కలిగింపవచ్చును. పైనిర్వచనమునందు వక్తృస్థితిని గుర్తించుటయే జరిగినది కాని శ్రోతృస్థితిని గుర్తించుట జరుగలేదు. కావున ఇది అవ్యాప్తిదోషమునకు పాల్పడినది. ఐనను, ఉద్దేశపూర్వకధ్వను లని యనుటచేత భాషకు నుద్దేశమునకు గల సంబంధమును గుర్తించుట జరిగినది.

'భాష యన్నది మనుష్యులకు విశిష్టముగా నున్న యాలోచన కొక సాధనము' అని Erdmann నిర్వచనము. ఇదికూడ అసమగ్రమే. ఇందు ధ్వనివిషయము కాని, ఉచ్చారణవిషయము కాని లేకపోవుటచేత ప్రత్యేకముగా భాషకే పరిమితముచేయుటకు వీలులేకుండ నున్నది. ఐనప్పటికిని భాషకు నాలోచనమునకు నడుమనున్న సంబంధమును సమర్థించుట జరిగినది.

'సైద్ధాంతికధిషణకు సంబంధించిన కళయే భాష. భాష నిజముగా దానికి బాహ్యావ్యక్తీకరణమే' అని Hegel నిర్వచనము. ఇందు ఆంతరంగికమైయున్న ధిషణయే వ్యక్తీకృతమైనప్పుడు భాషారూపమును ధరించునన్న భావము గోచరించుచున్నది.

'స్వయంప్రేరితములై యుచ్చారితములగు సాంప్రదాయిక సంకేతముల వ్యవస్థయే భాష' అని Ebbinghaus నిర్వచనము. ఇందు ధ్వనులను సంకేతములుగా గుర్తించుట, ఆ సంకేతములు సాంప్రదాయికము లని యనుట ముఖ్యవిషయములు. భాష నొక వ్యవస్థగా గుర్తించుటకూడ గమనింపవలసిన విషయము.

'భాష యన్నది భావములను వ్యక్తీకరించు సంకేతముల వ్యవస్థ' అని F. de Saussure నిర్వచించెను. ఇదియు సమగ్రము కాదు. సంప్రదాయము, ఉచ్చారితధ్వనులు మున్నగువిషయములను విడిచి పెట్టుట యిచ్చటి లోపము.

'అభివ్యంజనముకొరకై వ్యవస్థీకరింపబడిన యుచ్చారిత నియత ధ్వనుల విధానమే భాష' యని Croce నిర్వచనము. నియతధ్వనులని యనుటచేత సంప్రదాయమును గుర్తించుట జరిగినదని భావింపవచ్చును. కాని, పైనిర్వచనములలో వలెనే యిచ్చటకూడ ప్రేషకుడైన వక్తను గ్రహించి, గ్రాహకుడైన శ్రోతను విస్మరించుట జరిగినది.

'స్వయంప్రేరణోత్పన్నములైన సంకేతముల విధానమువలన అభిప్రాయములను ఆవేశములను అభీష్టములను సంప్రేషణముచేయు సహజాతభిన్నమైన కేవలము మానవీయమైన పద్ధతియే భాష' అని Edward Sapir నిర్వచనము. ఇందు భాష మానవీయమన్న యంశము ప్రధానముగా గుర్తింపదగినది. ఇది సహజాతభిన్న మనుట యెన్న దగిన యంశము. Bloomfield భాషకూడ నడచుట, భుజించుట మున్నగు నంశములతో సమానముగానే పరిగణించినట్లు కనిపించును. అవి సహజాతములు. ఆహారవిహారనిద్రాదులు సర్వజంతుసామాన్యములు. భాష సహజాతము కాదు; బుద్ధివిశేష సమార్జితము. ఈ విషయమును విశేషించి చెప్పుట యీ నిర్వచనమునందు కనవచ్చును.

'ఒక సమాజమునందలి సభ్యులు వ్యవహరించుట కుపయోగించు స్వచ్ఛంద వాచికసంకేతముల వ్యవస్థయే భాష' అని Sturtevant నిర్వచనము. 'ఒక సాంఘికసముదాయము సహకరించుకొనుటకు సాధనమైన స్వచ్ఛందవాచికసంకేతముల వ్యవస్థయే భాష' అని Bloch అనునాయనయు Trager అను నాయనయు నిర్వచించిరి. ఈ చివరినున్న రెండు నిర్వచనములందును చెప్పుకొనదగినంత పెద్దభేదము కానరాదు.

పైని చెప్పికొన్న నిర్వచనములలో, ఏ యొక్కటియు సమగ్రము కాదు; అట్లని త్రోసిపుచ్చుటకును వీలులేదు. ప్రతినిర్వచనమునందు వస్తుస్థితి కొంత వ్యక్తమగుచున్నదనుటలో సందేహము లేదు. తియ్యదన మననేమో మన యనుభవమునుబట్టి మనకు తెలియును; కాని నిర్వచింపలేము కదా! ఎంత యత్నించినను సమగ్రముగా, సమర్థముగా నిర్వచించుట సాధ్యముకాదు. భాషావిషయముకూడ అంతే. అయినను, పైనున్న నిర్వచనము లన్నింటిలోను సమాహార రూపముగా సత్య మిమిడియున్నది.

చివరి నిర్వచనములు రెండును సన్నిహితములై యున్నవని చెప్పుకొంటిమి. కావున, అందలి లక్షణమునకు వివరణము చెప్పుకొందము. భాష స్వచ్ఛందవాచిక సంకేతముల వ్యవస్థ యన్నది సారాంశము. అందు నాలుగంశములు విమర్శనీయములు గలవు. ఒక్కొక్కదానిని వేరువేరుగా పరిశీలింతము. సౌకర్యము ననుసరించి, మన పరిశీలనమును చివరి యంశమునుండి ప్రారంభింతము.

1. భాష యొక వ్యవస్థ: అభౌతిక సంస్కృతియందు భాష అత్యంతప్రధానమైన యొక యంగము. ఇతరాంగములైన మతము, చట్టము, సంప్రదాయము మొదలయినవానికిని భాషకును వ్యవస్థావిషయమున భేదము లేదు. వ్యవస్థ యన్నది తనకు తానుగా కనబడునది కాదు. పరిశీలనార్హములైన ప్రవృత్తులను క్రమపద్ధతిలో వివరించుకొనుచు రాగా, మొత్తముమీద వ్యవస్థ కానవగును. సంప్రదాయమే యున్న దనుకొందము. అది యొక వ్యవస్థ యని చెప్పుకొంటిమి. దానిని గుర్తింపవలయునన్న పాటింపవలసిన విధాన మొకటియున్నది. ప్రతిదినము సమాజమునందలి ప్రతిమనుష్యుడు చేయుచేష్టలను గుర్తింపవలయును; దైనందిన కార్యకలాపములను పరిశీలింపవలయును; వానిని గూర్చి యితరులు వెల్లడించెడి యభిప్రాయముల నాకళించుకొనవల

యును. అప్పుడు కర్తవ్యాకర్తవ్యనిర్ణయము గావించుకొనవలయును. ఇట్లు పరిశీలనమువల్ల సంగ్రహించిన క్రియాకలాపములను, అన్య సభ్యులు వెల్లడించు నభిప్రాయములతో సరిపోల్చి, కర్తవ్యాకర్తవ్య నిర్ణయము చేసి క్రోడీకరించుకొనవలయును. అప్పుడు సంప్రదాయ మొక వ్యవస్థ యన్న విషయము స్పష్టమగును. అట్లే ఒక సమాజము నందలి సభ్యులు తమ భావాదులను ప్రకటించుట కుపయోగించు వర్ణ శబ్దవాక్యాదులను వర్ణించుట, ఆ యా సన్నివేశములను వివరించుట, ఆ యా వాక్కులవలన నగు ప్రచోదన ప్రతిక్రియాదులను నిరూపిం చుట- ఇది యంతయు భాషాసంబంధమైన వ్యవస్థ. దీనినే వ్యాకరణ మని యనవచ్చును.

2. భాష సంకేతముల వ్యవస్థ : ఒక సమాజమునందలి మను ష్యులు పలుకు మాటలు కొన్ని వస్తువులకు, కొన్ని చేష్టాదులకు సంకే తములు మాత్రమే. 'మాట' యని యన్నప్పుడు అదియొక భావము నకు బదులుగా ఉపయుక్తమైన సంకేతమని గ్రహింపవలయును. 'పులి' యని యన్నప్పుడు నిజముగా పులి వచ్చుటనో యున్నది. అయినప్ప టికి దానికి బదులుగా పైశబ్దము నుపయోగించుట జరుగును. శబ్దము వాచికముకాగా వాచ్యమైనది యర్థమగును.

ఒక పదము కాని, పదాంశము కాని, పదబంధము కాని భాషా రూప మనిపించుకొనును. భాషారూపమున కర్థమును నిర్ణయింపవలయు నన్న, అది యుపయోగింపబడు సందర్భముల నన్నింటిని చక్కగా నవ గాహనము చేసికొని, యేకరూపమై యున్న యంశమును నిర్ణయింప వలయును. అర్థమన్నది వ్యవహారజగత్తునకు సంబంధించిన విషయము. కావున, ప్రతివ్యక్తియు తన చుట్టుపట్ల సాగు భాషావ్యవహారమును పరి శీలించి, అర్థమును అవగాహనము చేసికొనవలయును. ఇది యాభ్యా సికక్రియ. మనకు తెలిసి కాని తెలియక కాని, యిట్లు చేయుచునే

యుందుము. కొన్నియెడల తప్పులు చేయుటయు, సవరించుకొనుటయు జరుగుచుండును. మొత్తముమీద శబ్దములు సంకేతములు మాత్రమే. వాని నభ్యాసము మూలముననే అలవరుచుకొనుట వీలుపడును.

3. భాష వాచిక సంకేతముల వ్యవస్థ: పైని చెప్పికొన్నవి వాచిక సంకేతములు కావలయును. సంకేతములు పెక్కువిధములుగా నుండవచ్చును. ఆంగికముద్రలు, బొమ్మలు, దీపములు, జెండాలు, భేరీ ధ్వనులు, ఈల యూదుటలు, గంటల మ్రోతలు – ఇవన్నియు సంకేతములుగా నుపయోగపడును. రోడ్డుమీద 'పరుగెత్తుచున్న బాలుని బొమ్మ' నిలిపినయెడల దగ్గరలో పాఠశాల యున్నదన్న విషయము తెలియును. ఎక్కడనైన 'X' గుర్తు వేసియున్నయెడల ఆ స్థలమును దాటి పోరాదన్న విషయము తెలియును. ఇట్టివి దృశ్యసంకేతములు. ఇవి పగటిపూట వెలుతురుగా నున్నప్పుడు మాత్రమే పనికివచ్చును. సన్నిహితులకు మాత్రమే పనికివచ్చును. భేరీధ్వనులు మొదలయినవి శ్రవ్యసంకేతములు. ఇవి కొంత పరోక్షముగా నున్నవారికి సైతము పనికివచ్చును. ఇంకను మరికొన్ని సంకేతము లిట్టివి కలవు. కాని యివి యేవియు భాషాంశములు కాలేవు. మానవులు తమ వాచికాంగముల సహాయమున వెలువరించు వివిధధ్వనులు మాత్రమే వాచికసంకేతములు కాగలవు. అవి మాత్రమే భాషాంశము లగును. ఇచ్చట నింకొక పొరపాటు పడరాదు. వాచికాంగములనుండి వెలువడినంత మాత్రముననే యే ధ్వనియు భాషాంశము కాజాలదు. ఆ ధ్వనికి సాంకేతికపువిలువ కూడ ఉండవలయును. దగ్గులు, తుమ్ములు, ఆవలింతలు మొదలయినవి వాచికాంగములవలననే కలుగును. అయినను వానికి సాంకేతికపువిలువ లేకపోవుటచేత, అవి భాషాంశములు కాజాలవు.

4. భాష స్వచ్ఛందవాచిక సంకేతముల వ్యవస్థ: సంకేతములు స్వచ్ఛందము లన్నది ముఖ్యవిషయము. వస్తువునకును, దానికి వాచిక

మగు సంకేతమునకును నిజమైన సంబంధమేమియు లేదు. తెలుగువారు 'పులి' యనగా, కన్నడులు 'హులి' యని, హిందీయులు 'బాఘ్' అని, ఆంగ్లేయులు 'Tiger' అని యందురు. వాచికములు భిన్నములైనను, వస్తు వొక్కటే. ఒకే వస్తువునకు వేర్వేరు భాషాసమాజములలో వేర్వేరు సంకేతములు వాడుకలో నున్నవని యర్థము. దీనినిబట్టి సంకేతమునకును, సంకేతిత వస్తువునకును విడరాని సంబంధ మున్నదని తలచుట తప్పని తేలుచున్నది. అయినను సాంప్రదాయకమైన వాడుక హేతువుగా ఆ భ్రాంతి కలుగుచున్నది. ఈ విషయమును బహు భాషావేత్తలు సులభముగా గుర్తింపగలరు. నిజమున కీ పదములలో ఒకదాని కెంత విలువయున్నదో తక్కినవానికి నంతే విలువ యున్నది. ఇందొకటి తక్కువ కాదు; ఒకటి యెక్కువ కాదు. అన్నియు స్వచ్ఛందముగా నేర్పడినవే. సంప్రదాయమే అనుకోని యొప్పందముగా వ్యవహరించి, ఆ యా మాటలకు ఆ యా యర్థములను స్థిర పరుచును. ఈ రహస్యమును గుర్తించిన భాషావేత్త తమ భాష మాత్రమే సక్రమమని యెన్నడును వాదింపడు. అట్లే భాషాభ్యాసకుడు ప్రతిభాషను యథాతథముగా గ్రహించి పదసామాగ్రి, వ్యాకరణము మున్నగునంశముల నభ్యసించును.

పై నాలుగు విషయములతోపాటు, మరికొన్ని విషయములను కూడ భాషాస్వభావమును గుర్తించుటకై తెలిసికొనవలయును. భాష ప్రవర్తనకు సంబంధించిన యభ్యాసము. ఏ యభ్యాసమైనను లేత వయసులో నేర్పడినంత సులభముగా, తరువాతివయసున నేర్పడదు. ఐదేండ్ల ప్రాయము వచ్చుసరికే బాలుడు తన భాషను తగినంతవరకు నేర్చుకొని యుపయోగింపగలుగును. పెద్ద యెదిగినతరువాత ఒక భాషను నేర్చుకొనవలయునన్న అంత సులభము కాదు. పైగా పూర్వమలవడిన యభ్యాసమును మార్చుకొనవలయును. అప్పుడుకాని

శ్రోత్రధ్వనులను, శ్రోత్రవ్యాకరణమును గ్రహించి యభ్యసించుట సాధ్యము కాదు.

సృష్టియం దెన్నో ధ్వనులు కలవు. మనము వానిని చాలవరకు వేర్వేరుగా గుర్తింపగలము. అయినను, ఒక్కొక్క భాషయందు ఒక కొన్నిధ్వనులు మాత్రమే యుపయుక్తము లగును. ఒక భాషలో ముఖ్యమైనదిగా పరిగణింపబడు ధ్వనికి మరొక భాషలో గుర్తింపు లేక పోవచ్చును; ఒక భాషలో అప్రధానమైనది మరొక భాషలో అత్యంత ప్రధానమైనది కావచ్చును. ఒక భాషయందు పది, పదునైదు ధ్వనులు మాత్రమే యుండవచ్చును; ఇంకొక భాషయందు దాదాపు వంద వరకు నుండవచ్చును. ఏమయినను, భాష యేకవ్యాయతికము (one-dimensional). ఒక సమయమునందు ఒక ధ్వనిమాత్రమే యుపయోగింప వీలగును.

భాష యొక వ్యవస్థ యని చెప్పికొంటిమి. అన్ని వ్యవస్థలవలెనే యిదియు క్రమబద్ధమై యుండును. కాని సమాజముతోడి సంబంధము వలన, భాషయందును కొన్ని మార్పుపాట్లు కలుగును. అందువలన, సహజములయిన సామాన్యధర్మములతోపాటుగా, కొన్ని విశేషధర్మములనుగూడ అంగీకరింపవలసివచ్చును. తక్కిన మానవీయసంస్థల వలెనే భాష సుఘటితమై యుండును; అయినను తన ప్రవాహశీలము వల్ల మార్పును పొందుచుండును. అట్టిమార్పు కొన్ని దశాబ్దులకాలములో, శతాబ్దులకాలములో జరుగును. ఒకే భాష పెక్కు భాషలుగా విడుటయు సంభవింపవచ్చును.

భాషయందు వక్త నాశ్రయించుకొని వాచ్యత యను గుణము, శ్రోత నాశ్రయించుకొని శ్రవ్యత యను గుణము – రెండు గుణము లవశ్యముగా నుండును. ఇది నిశ్చయమే. మౌనముగా కూర్చుండి యాలోచించుకొనుచున్నప్పుడు భాషావ్యవహారము లేదనుటకు వీలు

కాదు; అట్లే మౌనపఠనము చేయునప్పుడుగాని, మౌనముగా వ్రాయు చున్నప్పుడుగాని ఆంతరంగిక భాష యున్నదనియే యంగీకరింపవలయును. ఇట్టియెడల కండరముల కదలికవలన వాచికాంగములనుండి యుత్పన్న మగు ధ్వని బహిర్గతము కాకుండ నిరోధింపబడుచున్నది.

ఆంగికముద్రలవంటి సంకేతములు గాని, పశుపక్ష్యాదులు చేయు ధ్వనులు గాని 'భాష' యన్న వ్యవహారమునకు తగవు. భావప్రకటన సామర్థ్యము వానికి సైతము మున్నదని యంగీకరింపవలయును. 'భాష భావ వాహకము' అన్న యభిప్రాయముతో పక్షుల భాష, జంతువుల భాష, సాంకేతిక భాష యన్నట్లుగా వ్యవహరించుట విరివిగా కలదు. అయినను, దేన్నైనను భాష యని యనుటకు శాస్త్రవేత్తలు కొన్ని లక్షణము లుండవలయునని పేర్కొనిరి. ఆ లక్షణముల నీక్రింద చూతము.

1. ద్వంద్వాత్మకత : ప్రతిభాషయు విశిష్టములైన కొన్ని వర్ణ ములుగా ఒకవంక, విశిష్టములైన కొన్ని పదాంశములుగా మరొకవంక వింగడించుటకు వీలుగా నుండును. ఈ వర్ణములయొక్కయు పదాంశ ములయొక్కయు కూడికచేతనే మానవభాష యేర్పడును. చిలుకలు, మైనగోరలు మొదలయినవి కొన్ని వాక్కులను పలుకగలుగును. వాని నవి యభ్యాసక్రమమున పలుకునే కాని యుద్దేశపూర్వకముగా పలు కవు. 'అందుకు సందేహమా?' యన్నకథ యొకటి కలదు. ఒక వర్తకు డొక చిలుకను మిక్కిలి యెక్కువ వెలకు విక్రయింపజూపెను. అందులకు 'దీని ధర యింత యుండునా?' అని కొనుటకు వచ్చినవాడు వర్తకుని ప్రశ్నించెను. దాని కతడు 'దానినే యడుగుడు' అని చెప్పెను. అతడు దానిని ప్రశ్నింపగా 'అందుకు సందేహమా?' అని సమాధాన మిచ్చెను. దాని యుక్తియుక్తమైన సమాధానమునకు సంతుష్టి పడి, ఆతడు దానిని కొనెను. ఆపిదప నాతడేమి ప్రశ్న వేసినను 'అందుకు సందేహమా?' అన్న సమాధానము మాత్రమే వినిపింపసాగెను.

దానితో చిలుక బండారము బయటపడినది. 'ముందు వెనుక లాలో చింపక మూర్ఖుడనై యింత డబ్బు పోసి కొంటిని' అని యతడు తన్ను దాను నిందించుకొనెను. అప్పుడుకూడ చిలుక 'అందుకు సందేహమా?' అన్న తన వచస్సంపదను పునరుక్తము చేసెనట! అంత విచారములోను నవ్వు పుట్టి, అతడు చిలుకను స్వేచ్ఛగా విడిచి పెట్టెను. ఇది కథ. దీనిని బట్టి చిలుకకు తానుపలుకు మాటలయర్థము తెలియదని తెల్లమగు చున్నది. అది మొత్తమువాక్యమును మొద్దుగా అభ్యసించినదే కాని అందలి వర్ణములయొక్క పదములయొక్క నిర్మాణము నది యెరుగదు. కూత కూయుట యెట్టిదో, మొత్తమువాక్యము నుచ్చరించుటకూడ దాని పాలి కట్టిదే యైనది. మానవభాషలో నున్న ద్వంద్వాత్మకత పక్షుల కూతలలోను, జంతువుల యరపులలోను లేదు.

2. ఉత్పాదకత : భాషలోని నిర్మాణాంశములను కలిపి క్రొత్త రూపముల నుత్పన్నము చేయవచ్చును. శిశువు పెద్దలు మాటలాడు కొనుచుండగా విని విని, వానినే తిరిగి పలుకును. ఇట్లు కొంతకాల మైన పిమ్మట తాను స్వయముగా క్రొత్తనిర్మాణములను చేయగలుగును. 'అమ్మ వచ్చుచున్నది; అమ్మ పిలుచుచున్నది; అమ్మను చూడు; అమ్మను పిలు' - మొదలయిన వాక్యములను విన్న శిశువు అన్ని వాక్యములలోను సామాన్యముగా నున్న 'అమ్మ' యన్న పదమును విశిష్టముగాగుర్తింపగలుగును. ఇట్లే యితరవాక్యసముదాయములనుండి వేర్వేరు భాగములను గుర్తించి, వానిని తనకు కావలసిన పద్ధతిలో జోడించి 'అక్క వచ్చుచున్నది; అక్క పిలుచుచున్నది; అక్కను చూడు; అక్కను పిలు' - మొదలయిన విధముగా నుపయోగించుకొన గలుగును. క్రమముగా వేర్వేరు ధ్వనులను, వేర్వేరు శబ్దములను గుర్తించి, సక్రమముగా నుపయోగించుకొనును. తా నంతకుముందు వినని వాక్యములనుగూడ నిర్మాణముచేయును. శ్రోతయు వాని నవ

గాహనము చేసికొనగలుగును. ఈ యుత్పాదకత మూలముగానే మానవుల వ్యవహారము క్రొంగొత్త పొలిమేరలను నెలకొల్పుకొనుట సాధ్య మగుచున్నది. చిలుకలు, మైనగోరలు మొదలయినవాని వాక్కుల కీ యుత్పాదకత యెంతమాత్రమును లేదు. కొన్ని చిలుకలు 'చుట్టా లొచ్చారు' అని అనగలవు. ఎవరు వచ్చినప్పటికిని వాని ప్రకటనరీతిలో మార్పు రాదు. 'చుట్టాలు' అని అనుటకు బదులుగా 'మిత్రులు, శత్రులు, దొంగలు' మొదలయిన మాటలను వాడుట వానికి సాధ్యము కాదు. 'వచ్చారు' అనుటకు బదులుగా 'వెళ్ళారు, చూశారు,' మొద లయిన రూపాలను వాడుట సాధ్యము కాదు. ఇంతకుముందు చెప్పి నట్టుగా వాక్య మంతయు ముద్దుగా ననుటయే కాని, క్రొత్త నిర్మాణములను గావించుట వాని కలవికాని పని. అవి యుద్దేశ పూర్వకోచ్చారణములుగూడ కావని యనుటచేత, క్రొత్తనిర్మాణముల కవకాశమే లేదు.

3. స్వచ్ఛందత: నిజముగా వాచికమైన శబ్దమునకును, వాచ్య మైన వస్తువునకును సంబంధ మెంతమాత్రమును లేదు. ఆంగికముద్రలు గాని చిత్రములు గాని, యితరవిధములైన సంకేతములు గాని సాధార ణముగా వస్తువుయొక్క స్వరూపమునో, స్వభావమునో యనుకరించును. తేనెటీగలు, చింపాంజీలు మున్నగునవి ధ్వనిచేయుటతోపాటు దిశను దూరమును నిర్దేశించుచు ననుసరించును. ఎఱ్ఱదీపము చూపిన బండ్ల నాపవలయు ననియు, ఆకుపచ్చదీపము చూపిన బండ్లను పోనీయవచ్చు ననియు సంకేతములు. ఇవి రూఢినిబట్టి యేర్పడినవి మాత్రమే. ఇట్లు నిర్ణయించుటకు తర్కసంగతమైన హేతువు లేదు. మోర్సు సాంకేతిక పద్ధతి టెలిగ్రాఫువిధానమునం దుపయోగపడును. చుక్కలను, గీతలను వేర్వేరు రీతులలో కలిపి వ్రాతయక్షరములకు సంకేతములుగా వ్యవహ రింతురు. ఇచ్చటకూడ స్వచ్ఛందతయే యున్నది. భాషయే సంకేత

ముల వ్యవస్థయైనప్పుడు వ్రాత భాషకు సంకేతము. ఆ వ్రాతయందలి యక్షరములకు సంకేతములు చుక్కల గీతల సముదాయములు. నిజమున కివి సంకేతముల సంకేతములకు సంకేతము లన్నమాట! ఇట్లే యింకను పెక్కు విధములైన సంకేతము లుండును. అందుకొన్ని కొంత సామంజస్యమును కలిగియున్నప్పటికిని, పెక్కు సంకేతములు భాషాసంకేతములవలెనే స్వచ్ఛందములై యుండును.

4 పరస్పరపరివర్తనీయత : వక్త యుచ్చరించిన మాటలవలన ధ్వనితరంగములు కలుగును. అవి శ్రోతయొక్క కర్ణకుహరమునందు ప్రవేశించి, అచ్చటనున్న కర్ణభేరి (Ear-drum) ని ప్రకంపింపజేయును. ఈ ప్రకంపనములు నాడీమండలముమూలమున ధ్వనులుగా మార్పు నొంది వినిపించును. ఈ ధ్వనులవలన నాతడు ప్రచోదనము పొందును. ప్రతి ప్రచోదనమునకు ప్రతిక్రియ యుండును. ఆ ప్రతిక్రియ క్రియారూపమున నుండవచ్చును; వాగ్రూపమున నుండవచ్చును. ఒకడు 'పాము పాము' అని యరచె ననుకొందము. దగ్గరలో నున్న ఒకడు పరుగెత్తుకొని పోవచ్చును; ఇంకొకడు కట్టెనో, రాతినో పట్టుకొని రావచ్చును; ఇంకొకడు వెనుదిరిగి పరిశీలనగా చూడవచ్చును. ఇవన్నియు క్రియారూప ప్రతిక్రియలు. ఒకడు 'ఎక్కడ?' అని మాత్రము ప్రశ్నింపవచ్చును. ఇది వాగ్రూప ప్రతిక్రియ. ఒక ప్రచోదనమునకు ఉభయవిధప్రతిక్రియ లొకేకాలమున నుండుటకు సైత మాక్షేపము లేదు. ఇంతకును వక్త యుపయోగించిన సంకేతములను శ్రోత గ్రహించినట్లే, తిరిగి యతడు పలికిన సంకేతములను మొదటివక్తయు గ్రహించును. వాచికసంకేతములకు మాత్రమే వాచ్యత, శ్రవ్యత యను రెండు ధర్మము లున్నవి. తక్కిన సంకేతములకు ఆ సదుపాయము లేనందువలన సందేశముల నొకపక్షమునుండి వ్యక్తముచేయుటకే కాని, రెండవ పక్షమునుండి గ్రహించుటకు వీలు చాలవరకు లేదని చెప్పవచ్చును.

5. ప్రత్యేకత : భాషాసామాన్య లక్షణములతో పాటు, ప్రతి భాషకు ఒక ప్రత్యేకమైన వ్యవస్థ యుండును. అది నాగరకభాష యైనను, అనాగరకభాషయైనను దాని ప్రత్యేకత దాని కుండును. కొందరు తమ భాషనుమాత్రమే యెరిగియుండుటచేత, తదన్యభాషలు భాషాశబ్దవాచ్యములు కావని, వాని కొక పద్ధతియే లేదని ప్రకటించుట జరుగుచుండును. 'బాలుడు వచ్చుచున్నాడు', 'బాలిక వచ్చుచున్నది' అని యనుట యలవాటున్న తెలుగువానికి 'లడ్కా ఆతా హై' 'లడ్కీ ఆతీ హై' అని యనుట కొంతవరకు అర్థవంతముగానే కనిపించును. 'A boy comes' అని యన్నట్లుగానే 'A girl comes' అని అనుటకు మాత్రమే అలవాటుపడ్డ ఆంగ్లేయునికి తెలుగు హిందీ భాషల వాక్య నిర్మాణవైఖరి యలజడిని కలిగించును. ఇట్లు వేర్వేరు భాషలు వ్యవస్థలను కలిగియుండును అది వాని నిర్మాణక్రమమునుబట్టి, అర్థస్ఫోరకత్వమునుబట్టి తగినట్లుగా వ్యవహరించు సామర్థ్యమును గలిగియుండును.

6. కాలాంతరప్రాప్తి : మానవభాష వాచ్యకాలముతో సంబంధము లేకుండ వాడుటకు వీలు కలిగియుండును. మానవుడు వేదయుగమునుగూర్చియు మాటలాడగలడు; వర్తమానయుగమునుగూర్చియు భవిష్యద్యుగమును గూర్చియు సమానముగానే మాటలాడగలడు. శ్రోతయు దాని నవగాహనము చేసికొనగలడు. ఇతరసంకేతములు తత్కాలవిషయమును మాత్రమే సూచించును గాని కాలాంతరవిషయమును సూచింపజాలవు.

7. దేశాంతరప్రాప్తి : కాలాంతమునందు వ్యవహృత మగునట్లే మానవభాష దేశాంతరమునందు సయితము వ్యవహృతము కాగలదు. వాచ్యమైన వస్తువునుగూర్చి ఆ వస్తువున్న చోటనే కాక దూరప్రాంతమునందు సైతము వ్యవహరింపవచ్చును. మనము చూడని విషయముల నెన్నింటినో గ్రహించుటకు మన జ్ఞానవిజ్ఞానముల నభివృద్ధి

పొందించుకొనుట కీ లక్షణమే తోడ్పడుచున్నది. ఇచ్చట నింకొక విషయమును గుర్తింపవలయును. యంత్రసాహాయ్యమువలన టేపు రికార్డులు, గ్రామఫోనురికార్డులు నిర్మించి దేశాంతరమునకు తీసికొనిపోవచ్చును. 'ఆ రికార్డులనుండి వచ్చు శబ్దమును భాష యనవచ్చునా?' యన్నది ప్రశ్న. ఔపచారికముగా భాష యని యనవచ్చునేమో కాని, శాస్త్రదృష్టితో అట్లనుటకు వీలులేదు. వక్తృముఖ నిర్గతధ్వనులకే భాషాసంకేతయోగ్యత యున్నది కాని విద్యుదయస్కాంత తరంగముల వలన నిష్పన్నములగు ధ్వనుల కా యోగ్యత లేదు. ఒక పుస్తకము భాష కానట్లే యాంత్రికసాధనముకూడ భాష యగుటకు వీలు కాదు. ఐనను, ప్రయోగశాలయందు భాషాపరిశీలనమున కిదియే ప్రముఖ సాధనమనుట విస్మరింపరాదు. ఆచరణమున దీనిని భాషగా పరిగణింప వలయు ననుట కిది తారకాణము.

8. సాంస్కృతికసంప్రేషణము: మన మిదివరకు చెప్పుకొన్నట్టుగా, భాష అభౌతికసంస్కృతియందు అతిముఖ్యమైన యంగము. దీని మూలముననే భౌతికసంస్కృతినిగూడ సక్రమముగా గ్రహించుటకు, ఇతరుల కందజేయుటకు వీలు కలుగుచున్నది. మానవభాష వారసత్వముగా సంక్రమించునది కాదు; చారిత్రకముగా వ్యవస్థితమైన భాషను అభ్యాసక్రమమున సమాజసభ్యు లార్జించుచున్నారు. శిశువులు పెద్దలనుండి గ్రహింతురు; వారు కాలక్రమమున స్వీయానుభవముతో జోడించి దానిని తరువాతితరమువారి కందింతురు. ఇట్లు భాషతోపాటు సంస్కృతి పరంపరాప్రాప్త మగును. భాషవల్లనే సంస్కృతి రక్షితమై, యభివృద్ధిని పొందును. భాషయే లేకపోయినయెడల, ప్రతివ్యక్తియు మృగావస్థతో ప్రారంభించి, యించుమించుగా ఆ యవస్థలోనే యంతరింపవలసి వచ్చెడిది. కావున, మానవుని నిత్యవ్యవహారమునకే కాక నిరంతరసాంస్కృతిక సంప్రేషణమునకు, అభ్యుదయమునకు భాష యెంతో సహకరించును.

పైనున్న యెనిమిది లక్షణము లేకత్రితము లై జంత్వాది సంకేతములందు కానరావు. ఇందు ఒకటి రెండు లక్షణములు వానియందును కనుపింపవచ్చును. అంతమాత్రమున నవి భాషాపదమున కర్హములు కాలేవు. నిజమునకు మానవుడు మానవు డనిపించుకొన్నది భాష నుపయోగించుకొనుట యెరిగినప్పటినుండియే. అప్పటినుండియే మానవునకు తక్కిన జీవరాశులకంటె నొక విశిష్టత యేర్పడినది; భాషాస్వరూపమే మానవస్వరూపమును దిద్ది తీర్చినది.

## 1. 2 భాషోత్పత్తి

ఏ విషయమునుగురించి యాలోచించుట మొదలు పెట్టినప్పటికిని దాని పుట్టుపూర్వోత్తరములను తెలిసికొనిన గాని మానవునకు తృప్తి కలుగ దనుట వాస్తవము; భాషావిషయముకూడ దీని కపవాదము కాదు. భాషను నాలుగు మూలలనుండి నిశితముగా పరిశీలించుట మొదలిడినతోడనే 'ఉత్పత్తి' మొదటి విషయమై యెదుట కనుపట్టినది. భాషోత్పత్తి యెట్లు జరిగినది ? ఎప్పుడు జరిగినది? మొదటి భాష యేది? ఇవన్నియు నొకే గొలుసులోని లంకెలు. ఒకటి తెలిసిన యెడల మిగిలిన వానినిగూడ తెలిసికొనవచ్చు నన్న యుత్కంఠ యీ యన్వేషణకు హేతువైనది. వేర్వేరు పండితులు వేర్వేరు వాదములను ప్రతిపాదించిరి. పరస్పరవిరుద్ధవాదములు బయలువెడలినవి. విషయము మహాగహనమైనది. 'విట్నీ' మున్నగు విద్వాంసులు భాషోత్పత్తినిగురించి చర్చించుటయే అనావశ్యకమని నిరర్థకమని నిర్ణయించిరి. కాని, యీవిషయమై కల్పనలు చేయకుండ, కౌతూహలము చూపకుండ నుండుట అసాధ్యమని 'ఎస్పర్సను' ప్రభృతులు భావించిరి. మొత్తముమీద భాషోత్పత్తికి సంబంధించిన చర్చలు మార్గము తప్పి, అసలు విషయమునే అపఖ్యాతి పాలుచేసినవి. తత్ఫలితముగా, క్రీ. శ. 1866 లో స్థాపింప

బడిన *'పారిసు భాషాసమాజము' తన నిబంధనములలో 'భాషోత్పత్తిని గురించి యెవరును వ్యాసము చదువరా' దని యొక నియమము నేర్ప రుచుకొనెను. ఆ వాదోపవాదము లంతటి దుస్థితి కాలవాలములైన వన్నమాట!

ప్రాచీనకాలమునందు ప్రాక్తనభాషను నిర్ణయింపవలయునన్న కుతూహలముతో కొన్ని ప్రయోగములు సాగినవి. అట్టివానిలో నాలు గింటినిగూర్చి తెలియవచ్చుచున్నది. ఇప్పటికి రెండువేల యేండ్ల క్రిందటనున్న 'హెరొడొటస్' అను గ్రీకుచరిత్రకారుడు చెప్పిన కథ యీ నాలుగింటిలో మొదటిది. ఈజిప్టుదేశపు రాజగు 'సామితికస్' అను నతడు శిశువుల నిద్దరిని జనసంపర్కమునుండి వేరుగా తీసికొనిపోయి పెంచుటకు నియమించెను. సమయమున కాహారాదిసౌకర్యములు కలు గజేయుటకు మనుష్యుల నేర్పాటుచేసెను; ఏవిధమైన భాషయు వినబడ కుండునట్లు కట్టుదిట్టములు చేసెను. ఆ పిల్లలు క్రమముగా వయసున వృద్ధిచెందిరి; వారికి మాటలాడుట మాత్రము రాలేదు. కాని, ఒక రోజున నొక పిల్లవాడు 'బెకొస్' అను మాటను పల్కినట్లు సంరక్షకు డొకడు వచ్చి నివేదించెను. అది ఫ్రిజీభాషాపద మనియు, దానికి 'రొట్టె' యన్న యర్థము కలదనియు రాజాస్థానపండితులు నిర్ణయించిరి. రాజు తన ప్రయోగఫలితమునుబట్టి ఫ్రిజీభాషయే ప్రప్రథమభాష యని నిర్ధారణ చేసికొనెను. శాస్త్రజ్ఞులు దీనిని కేవలము కథగానే పరిగణింతురు.

స్వేబియసురాజగు రెండవ ఫ్రెడరిక్కు కూడ ఇట్టి ప్రయో గము చేసెను. అతడు కొందరు పిల్లల నడవియందు వేరుగా పెంచుట కేర్పాట్లు గావించెను. కొంతకాలము తరువాత పరిశీలింపగా వారి కే భాషయు రాలేదని తేలినది. స్కాట్లండుదేశపు రాజగు నాల్గవజేమ్సు

* La Societe de Linguistic de Paris

మొగలుచక్రవర్తి యగు అక్బరుపాదుషా కూడ ఇట్టి ప్రయోగములను చేసిరట! పిల్లల కెట్టి భాషయు నలవడకుండుటే అన్నిచోట్ల నిరూపితమైన సత్యము. పై ప్రయోగములవల్ల, మానవజాతియందు పుట్టినంతటిలో భాష యబ్బుట యసత్యమని తేలినది. అయినను భాషోత్పత్తి కారణాన్వేషణ మాత్రము యథాస్థితముగా మిగిలినే యున్నది.

మానవభాష ప్రారంభమైన చాలకాలమునకుగాని చరిత్ర ప్రారంభము కాలేదు. అందువలన, చరిత్ర కందని కాలములోని అగాధముల నన్వేషించి యొక నిర్ణయమునకు వచ్చుట సాధ్యమైన విషయము కాదు. అయినను, తెలిసిన విషయమునుబట్టి తెలియని విషయము నూహించుట జిజ్ఞాసువైన మానవుని కొక వేడుక. పూర్వకాలము నుండియు నెందరో తత్త్వజ్ఞులీ విషయమై తమ యూహాపోహాలను పోహాళించిరి. 'ఆడంస్మిత్' అను నొక తత్త్వజ్ఞుడు భాషోత్పత్తివాదములను సమీకరించి యొక వ్యాసము రచించెను. అది బహుజనసమ్మతిని సంపాదించుకొనగలిగెను.

భగవద్దత్తవాదము: భాష భగవద్దత్తమని ప్రాచీనుల యభిప్రాయము. భాషను మనుష్యుడు నిర్మింపలేదనియు, భగవంతుడే కల్పించి మానవునికి ప్రసాదించెననియు వారి నిశ్చయము. భారతీయులు సంస్కృతభాషను అమరభాష యని సంభావించుచున్నట్లే మహమ్మదీయులు అరబ్బీభాషను, క్రైస్తవులు హిబ్రూభాషను దేవతల భాషలుగా భావించి మన్నించుచున్నారు. ఈడెనుతోటలో భగవంతుడు స్వీడిషు భాషను,ఆదము డేనిషుభాషను, పాము ఫ్రెంచిభాషను మాటలాడెనని ఒక స్వీడిషుభాషాశాస్త్రవేత్త నిర్ణయించెను. ఇట్టి వానినిబట్టి భగవంతుడే మానవునకు భాషను ప్రసాదించెనన్న విశ్వాసము బలీయముగా నున్నట్లు స్పష్టము కాగలదు. దేవతలు వాగ్దేవిని సృష్టించిరని 'దేవీం వాచమజనయన్త దేవాః' అని ఋగ్వేదమునందు కలదు. ఆదము ఏ వస్తు

వుల నే పేరులతో పిలచెనో ఆ వస్తువుల కా పేరులనే భగవంతు డను గ్రహించె నని బైబిలునందలి 'జెనిసిస్' అను విభాగమునందు కలదు. వస్తువులను సృష్టించిన భగవంతుడే పేరులను సైతము సృష్టించి యిచ్చెననియు, వస్తువులకు వానికి వాచకములైన పేరులకు నిశ్చితమైన సంబంధము కలదనియు నీ వాదమునందలి సారాంశము.

పూర్వము జరిగిన భాషోత్పత్తిసంబంధి ప్రయోగములనుబట్టి మనుష్యభాషాసంబంధము లేనియెడల మనుష్యునకు భాష యలవడ దన్న విషయము నిరూపితమైనది. కావున భాషను భగవంతుడే యిచ్చె నన్న వాదము అపాస్తము కాక తప్పదు. కాని, ఒకటి మాత్రమునిజము. ఇతరజీవులకు లేని సౌకర్యము మానవునికి కలదు. మానవుని కంఠమున గల స్వరపేటిక యెట్టి శబ్దము నైనను స్పష్టముగా నిర్దిష్టము గా పలుక గలదు. ఇదియు భగవదనుగ్రహమే. అట్టి స్వరపేటిక సాహాయ్యమున మానవుడు వివిధశబ్దములను భిన్నభిన్నస్వరములలో అవస్థానగుణముగా పలికి భాషను కల్పించుకొనెను; దానినే తరువాతివారు స్వప్రయత్నము వల్ల సముపార్జించుకొని రనుట సత్యసంగతమై కనిపించును. వాచ్య వాచకములకు నిశ్చితసంబంధము కలదన్న నిశ్చయముకూడ సరియైనది కాదు. ఒక వస్తువున కొక భాషలో నొక శబ్దమును వాడుచుండగా మరొక భాషలో మరొక శబ్దమును వాడుచుండుట అనుభవసిద్ధమే. అయినప్పటికిని కొందరు తమ కలవాటయిన పదమే సరియైన దనియు, అన్యమేదైనను దోషయుక్తమే యనియు భావించువారు కలరు. ఈనాడు ఆంగ్లపాఠశాలలందు విద్యాభ్యాసముచేయు పిల్లలు తల్లిదండ్రులను Mammy, Daddy అని పిలుచుట యెక్కువగా కాననగును. ఆ పిలు పులకు పిల్లల తల్లిదండ్రులు పులకించి పోవచ్చును గాని వారి తల్లి దండ్రులు మాత్రము 'చక్కగా అమ్మా నాన్నా అని పిలువక అవేమి పిలుపులురా! చదువుకొన్నంతలో అమ్మను నాన్ననుగూడ మార్చివేయు

చున్నారే!' అని మండలించుటకు యత్నింతురు. నిజముగ కర్థమునందు భేదము లేకపోయినను, సన్నిహితమైన దాత్మీయమై అదియే సరియైన దన్న భ్రమను కలుగజేయును. కావున, ఈ వాదము నమ్మికపైని భ్రమపైని కాలూదుకొని నిల్చినదే కాని తర్కమునకు నిల్చునది కాదని స్పష్టముగా నిర్ణయము చేయవచ్చును.

బౌవౌవాదము: అనుకరణము కారణముగా భాష పుట్టినదని కొందర వాదము. ఈ వాదమును 'లీబ్నిజ్' అను పండితుడు తొలుదొల్త ప్రతిపాదించెను. మానవుడు తన చుట్టుప్రక్కలనుండి ధ్వని చేయుచున్న పశుపక్ష్యాదుల ననుకరించెను. కాకి 'కాకా' యనును; కావున అది 'కాకము' అనియైనది. అట్లే 'భే' యని యరచుటచే కప్పకు 'భేకము' అను పేరు కలిగినది. అట్లే కోకిలకూత 'కూకూ' అన్నట్లుగా నుండు నన్నభావమున 'cuckoo' అను వ్యవహారము కలిగినది. చిన్న పిల్లల వ్యవహారమున 'మేక' యనుటకు బదులుగా అరపునుబట్టి 'మే' యని వాడుట వినిపించును. అట్లే రైలుబండి యనుటకు బదులుగా కూతనుబట్టి 'కూబండి' యని వాడుట కలదు.

ఈ ధ్వన్యనుకరణమునుగూర్చి యొక కథ గలదు. దాని నిక్కడ చెప్పుకొనుట యప్రస్తుతము కాదు. ఒకమారొక యాంగ్లేయుడు చైనాదేశమునకు వెళ్లెను. అచ్చట నొక భోజనగృహమందు భోజ్యములు సిద్ధపరుపబడెను. అందే పదార్థ మేదియో ఆంగ్లేయుని కర్థము కాలేదు. అచ్చటనే భోజనముచేయుచున్న మరియొకని కొక పాత్రమును చూపి అందలి పదార్థ మే మని ప్రశ్నించెను. ఆ రెండవవాడు చైనీయుడు; ఆతని కాంగ్ల భాష రాదు. ఆంగ్లేయునకు చైనాభాష రాదు. ఇరువురును మాటలాడుకొనుట కవసరమైన భాషాసాధనము వారికి లేనట్లే యైనది. ఇంతలో ఆంగ్లేయుడు పాత్రను చూపుచు 'క్వాక్ క్వాక్' అని ప్రశ్నార్థకముగా చూచెను. చైనీయుడు భావమును

గ్రహించి 'బౌవౌ' అని యనెను. బాతు చేయు ధ్వని ననుసరించి 'యిది బాతు మాంసమా?' అన్న ప్రశ్నను ఆంగ్లేయుడు సూచింపగా, కుక్క చేయు ధ్వని ననుసరించి 'యిది కుక్క మాంసము' అన్న సమాధాన మును చైనీయుడు సూచించెను. ఇరువురు నొకరి నొకరు గ్రహింప గలిగిరి.

ప్రాక్తనమానవుడీ విధమైన మనస్తత్వముతోనే అనేక శబ్ద ములను సాధించుకొని యుండుననుటకు సందేహము లేదు. స్వాభావిక ములైన ధ్వనులనే కాక ధ్వన్యనుకరణశబ్దములనుగూడ అనుకరించుట భాషా ప్రాథమికరూపము. మానవుడు చేయు ధ్వనులనుగూడ మరొక మానవుడు విని గ్రహించుటయు, దానికి బదులుగా మరొక ధ్వనిని చేయుటయు స్వాభావికము. కావున ప్రకృతిలోని శబ్దములను, పశు పక్ష్యాదులు చేయు శబ్దములను అనుకరించుట యాధారముగా భాష యేర్పడుచున్న దని సిద్ధాంతము. దీనికి అనుకరణవాద మని పేరు.

ఎన్నో భాషలలో ఇట్టి ధ్వన్యనుకరణాత్మకములయిన శబ్దము లున్నమాట సత్యము. కాని చుక్కలు, చంద్రుడు, సూర్యుడు మున్నగు మానపదార్థము లెన్నో కలవుకదా! వీనికిని పేళ్లు గలవు. కావున ధ్వన్య నుకరణమే భాషోత్పత్తికి కారణ మని చెప్పుట సర్వత్ర సమంజసము కాదు. ఈ లోపమును గమనించియే 'మాక్సుముల్లరు' దీనికి 'బౌవౌ వాద' మని పరిహాసపూర్వకమైన పేరిడెను. పై కథనుబట్టి యీ నామ ధేయము కల్పితమయ్యెనో, యీ నామధేయమునుబట్టియే పైకథ కల్పి తమయ్యెనో తెలియదు. అయినను, అనుకరణవాదమునకు బౌవౌవాద మన్న పేరుకూడ స్థిరమైపోయినది.

డింగ్ డాంగ్ వాదము : మాక్సుముల్లరు తన పక్షమున తాను 'అనురణన వాదము' ను ప్రతిపాదించెను. ధ్వనికిని భావమునకును అనురూపమైన సంబంధ మొకటి యుండును; ప్రకృతి యందలి

లయాత్మకము; ప్రతిపదార్థమును ప్రకంపనములను గలిగియుండును; ఆ ప్రకంపనముల కనుగుణముగనే శబ్దము వక్తనోట వెలువడును – ఇది యీ వాదసారము. Whisper అని యన్నప్పుడు చెవిలో రహస్యముగా గుసగుసలు చెప్పుకొనునప్పటి శబ్దము వినిపించును. తెలుగునందలి 'గుసగుస' యన్నదికూడ అట్టి ధ్వన్యాత్మకతను కలిగియే యున్నది. Glow అని యన్నప్పుడు ఏదో యొక వికాసము, ఒక దీప్తి యున్నట్లు అనిపించును. Zig Zag అని యన్నప్పుడు 'వంకర టింకర' యని తెలుగున నున్నట్లుగానే ఒక వక్రత భాసించును. ఇట్లే గణగణ, ఠబాలున, చట్టున మున్నగు పదములు క్రియాసందర్భసముద్భూతములగు ధ్వనులను అనుకరించుచున్నట్లు అనిపించును. భాషాశాస్త్రజ్ఞులు దీనిని 'డింగ్‌డాంగ్‌వాద' మన్న పేరుతో వ్యవహరింతురు.

ఇదియు శాస్త్రసిద్ధాంతముగా నిలుచునంతటి శక్తిమంతము కాదు. కవితాహృదయము కలవారి కే శబ్దమైనను విశిష్టముగా కనిపింపవచ్చును. శబ్దముతో నిత్యపరిచయము సంపాదించుకొన్న పిమ్మట ఆ యా శబ్దములలో ఈనాడు మనము విశిష్టధ్వనులను కనుగొనవచ్చును. అంతమాత్రమున ఇదే సత్య మనుట కవకాశము చాలదు. పైగా, ఇట్టి పదము లే భాషయందైనను అల్పసంఖ్యాకములై యుండును. వీనికే సర్వప్రాధాన్యము నిచ్చుట సమంజసము కాదు. ఈ వాదముపై నే విధమైన యాక్షేపములును వెలువడకముందే వాదప్రవర్తకుడైన మాక్సుముల్లరు తన వాదమును విడిచిపెట్టుకొనెను.

పూ పూ వాదము: భావావేశము కారణముగా అప్రయత్నముగా వెలువడు శబ్దములే భాషోత్పత్తికి మూలబీజము లని కొందర యభిప్రాయము. కొన్ని విధములయిన భావావేశములు కొన్ని విధములయిన శబ్దముల యుత్పత్తికి ప్రచోదకములుగా ప్రవర్తించుననుటలో అభ్యంతర ము లేదు. మానవుడు తన భావములను వెల్లడించుటకు కర

చరణాద్యవయవముల నొక పద్ధతిలో కదలించును. దానితోపాటుగా 'ఏ ఓ' మున్నగుధ్వనులనుగూడ ముఖమునుండి వెలువరించును. కొన్ని యెడల విశేషభావావేశవ్యంజకములుగా అబ్బా, అయ్యో, ఓహో, ఆహా మున్నగుశబ్దములుకూడ వెలువడును. ఆ ధ్వనులును, మూక సంకేతములును నేటిభాషకు మూలరూపము లని వారి యభిప్రాయము. ఈ వాదము 'ఫూ ఫూ' (Pooh Pooh) వాద మని పేరొందినది. దీనికే 'టట్-టట్' వాద మని మరొక పేరున్నది.

కాని, ఇది అంగీకార్యము కాదు. భాష లేనప్పుడు సంకేతముల నుపయోగించుట సహజము. ఇప్పటికిని అన్యభాషీయులకు మన భావము లను వెల్లడి చేయవలసివచ్చినప్పుడు సంకేతముల నాశ్రయించుట తప్పుటలేదు. కావుననే వీనిని భాషకు మూలరూపముగా భావించుట పొరపాటు. ధ్వన్యాత్మకమైన భాష కరచరణాదిసంకేతములవల్ల ఏర్పడె ననుట యుక్తిసహము కాదు. 'హెర్డరు' అనునాయన యీ వాదము నాక్షేపించిన వారిలో ప్రముఖుడు. అప్రయత్నపూర్వకములైన ఉచ్చా రణధ్వనులు భావావేశవ్యంజనమునకు మిక్కిలి యావశ్యకము లనుటలో సందేహము లేదు. 'అయ్యో' మున్నగుధ్వనులను వక్త తెలిసి యుప యోగించుట లేదు; తనకు తెలియకుండగనే స్వాభావికప్రతిక్రియగా వానిని వెలువరించుట జరుగుచున్నది. భాష యన్నది ప్రయత్నపూర్వక క్రియ. కావున పైవాదము పరాస్త మగుచున్నది.

**యో హి హో వాదము:** బరువులను మోయునప్పుడు, బట్టల నుతుకునప్పుడు, పడుగెత్తుకొని వచ్చునప్పుడు ఉచ్ఛ్వాసనిశ్వాసములు దీర్ఘముగను బరువుగను సాగును. ఇటువంటి సమయములందు కండర ములు బిగిసి, నాదతంత్రులు ప్రకంపనమునొంది కొన్ని విధములగు ధ్వనులను జనింపజేయును. ఇంతవరకు చేయుచున్న పనివల్ల కలిగిన శ్రమ యీ విధముగా ధ్వనిపూర్వకముగా శ్వాసక్రియను గావించుటతో

కొంత ఉపశమించినట్లు కనిపించును. సామూహికముగా, ఒక తెగ జనులు తమ పనిపాటులలో ఉపయోగించుకొన్న యీ ధ్వనులే క్రమ క్రమముగా అర్థవంతములై భాషారూపము ధరించెనని యొక వాదము. దీనిని Muscular Theory అని యందురు. పడవలను లాగువారు వెలువరించు 'యోహిహో' అను ధ్వనులనుబట్టి దీనికి 'యోహిహో వాద' మనియు నామాంతరము కలిగినది. నోరీ (Norie) అను పండితుడు ఈ వాదప్రవర్తకులలో ప్రముఖుడు.

ఇతరవాదములందు వలెనే దీనియందును లోపము గలదు. అర్థహీనములైన ధ్వనులే అర్థవంతమై భాషకు మూలమని స్థాపించుట పొసగదు. పైగా, ఇట్టి శబ్దములే భాషయందైనను మిక్కిలి అల్ప సంఖ్యలో నుండును.

ధాతువాదము: ధాతువులనుండి భాష పుట్టినదని కొందర నిశ్చయము. వీరి వాదమును ధాతువాద మని యనవచ్చును. ధాతువాదులలో యాస్కాచార్యుడు ప్రప్రథముడు. మొట్టమొదట ఎట్లో కొన్ని ధాతువులు లభించినవి; వానినుండి అనేకములగు శబ్దములు నిష్పన్నములైనవి. ఆ ధాతువులే భాషలోని సర్వశబ్దములకు మూలములైనవి. ఇది అనేకులకు సమ్మతమైన వాదము. కాని, దీనియందు సైతము లోపము కనిపింపక పోదు. ప్రపంచమున గల కొన్ని భాషలలో ధాతువు పేరుమాత్రమునకైనను కనిపింపదు. సంస్కృతాదిభాషలందు ధాతుస్వరూపము స్పష్టముగా సాక్షాత్కరించు ననుమాట సత్యము.

ప్రాథమికదశయందు వాక్యములే వ్యవహృతములు కాగా, వానియందలి సాదృశ్యవైదృశ్యములను పరిశీలించి పండితులు విశ్లేషణ కార్యక్రమము ననుసరించిరి. అట్లు వేరుపడినవి ధాతువులు. కావున, ధాతువులను మూలముగా చేసికొని భాషాపర్వతము నిల్చిన దనుట

సత్యమును వ్యత్యస్తము గావించుటయే యగునని కొందర నిశ్చయము. పండితులు భాషాపర్వతమును శకలీకరించి వేర్వేరు శిలలకు వేర్వేరు పేళ్లుంచిరి. అట్టివానిలో ధాతువులు ప్రధానములు. అనంతరకాలమున ధాతువులు హేతువులుగా అనేకశబ్దము లుత్పన్నమైన వన్నను విప్రతిపత్తి లేదు.

వివక్షావాదము : వివక్షాప్రేరణమే కారణముగా మాటలు పుట్టిన వని కొందర వాదము. 'విట్నీ' మున్నగువారు "వ్యక్తీకరణాభిలాషయే భాషాభివృద్ధికి ప్రప్రథమ లక్షణము" అని ప్రతిపాదించిరి. భయము, శోకము, విసుగు, సంకోచము, సంతోషము మున్నగుభావములను వెల్లడింపవలయు నన్న అభిలాషవల్ల మొదట మాటలు వెలువడె నని వీరు చెప్పుదురు. అరణ్యజీవితమును గడపు ఆదిమమానవుడు క్రూరమృగములవల్ల కలుగు భయముచేతనో, అటునిటు నడయాడుటలో శరీరమునకు తగిలిన గాయముచేతనో గట్టిగా అరచెడివాడు; అట్లే చిన్నచిన్న జంతువులను భయపెట్టుటకు కేకలు పెట్టెడివాడు. ఇట్లు హృదయములోని భయాందోళనములను, సంతోషసంభ్రమములను వెల్లడించుటకు వేసిన కేకలు, పెట్టిన బొబ్బలు భాషాస్వరూపసంపాదకములని యందురు. కాని, యే భాషలో నైన నిట్టి శబ్దములు స్వల్పసంఖ్యాకము లైయుండును. అట్టియెడల ఆ శబ్దములే భాషకు రూపము దిద్దె ననుట యుక్తిసంగతము కాజాలదు.

సమాలోచన వాదము : పరస్పరసమాలోచనవల్ల భాష పుట్టె నని కొందర వాదము. కొందరు వ్యక్తులు కూర్చుండి, బాగుగా ఆలోచనముచేసి భాషను కల్పించి రని వీరి యభిప్రాయము. తాము వాడు కొను వస్తువులకు సర్వసమ్మతముగా సమాలోచనము జరిపి నామకరణము గావించియుందు రని వీరి యూహ. దీనిని 'సమాలోచనవాద' మందము. ఈ వాదమునకు మూలపురుషుడు 'రూసో'. ఇది యంతయు అభూత

కల్పనముపై నాధారపడి యున్నది. భాషయే లేనినాడు సమాలోచ
నము జరుపు టెట్లు? సంభాషించు టెట్లు? అంతే కాక, నలుగురును
కలిసి నిర్ణయించినంతటిలో భాష యుత్పన్నమయ్యె ననుట యుక్తి
సహము కాజాలదు. అనంతరకాలమున భాషలో కొన్ని సంస్కారములు
తీసికొని వచ్చుటకు ఇట్టి సమావేశములు పనికి వచ్చునేమో కాని
భాషయే లేనినాడు సమాలోచన మనుమాట నేల విడిచి సాము
చేయుట.

సమన్వయ వాదము: ఒకటి మాత్రము సత్యము. పైని చెప్పిన
సర్వవాదములు యథోచితముగ భాషోత్పత్తికి సహకరించును. ప్రాథ
మికదశలో నెట్లున్నను పరిణామక్రమములో పైవాదములు చాలవరకు
పనిచేసి యుండును. 'స్వీటు' మున్నగువారు సమన్వయవాదమునే
సమర్థించిరి.

పైని చెప్పినవాదము లన్నింటినిబట్టి మానవుడు కొంత కాలము
పాటు మూగవాడై యుండియుండు నని చెప్పవలసి వచ్చుచున్నది.
కాని, ఇది సరియైన నిర్ణయము కా దనిపించును. ప్రారంభమునుండియు
మానవుడు ధ్వనుల నుపయోగించె ననియు, అట్టి శక్తి యాతనికి సహ
జావబోధము (instinct) గా సంక్రమించె ననియు అనుకొనదగును.
కుక్కలు, పిల్లులు మొదలగునవికూడ అశిక్షితముగనే ధ్వనులను చేయు
చున్నవిగదా! అట్లే ప్రాక్తనమానవుడును చేసి యుండును. ఆహార
సంపాదనము, దాంపత్యజీవనము, శిశుపోషణము, శత్రుసంహారము
మున్నగువిషయములు సర్వజీవులకు సమానము. నోరు కేవలము ఆహార
గ్రహణమునకే యేర్పడినను, మానవుడు తన స్వశక్తివలన దాని
నింకను లాభదాయకముగా నుపయోగించెను. పరిసరములం దున్న
పశుపక్ష్యాదుల ధ్వనుల ననుకరించెను. దీని కాతని యన్వేషణపరాయ
ణత్వముకూడ తోడుపడియుండును. సహజవికాసము, పరిసరముల

ననుకరించు ప్రయత్నము, క్రొత్తక్రొత్త మార్పులను సాధించు సంత తోత్సాహము - ఇవన్నియు భాషోత్పత్తికి సహకారులే అనవలసి యుండును.

మానవు డెప్పుడైనను, ఒక క్రొత్తవస్తువును చూచినయెడల ఇతరులకు చెప్పవలయు నని తహతహలాడుచుండును. పేరు తెలియని యెడల దాని గుణములను వర్ణించి, దాని స్వరూపమును వివరించి, యితరులకు తెలియజెప్పుటకు యత్నించునే కాని యూరకొనడు. ఈ విధ మగు వివక్ష మానవప్రయత్నమునకు దోహదమై భాషోత్పత్తికి కారణ మైనది. ఇట్లు అనేక కారణములు సమన్వయమొంది భాషోత్పత్తికి సహ కరించి యుండునని పరిశీలన చేసినమీదట మనకు గోచరము కాగలదు. నేటి పరిస్థితులనుండి యెన్నియో సంవత్సరములక్రిందటి పరిస్థితులను సమగ్రముగా అవగాహన చేసికొన్నగాని యిదమిత్థ మని వాస్తవమును నిశ్చయింపజాలము.

## 1. 3 భాషాధ్యయనము

మానవుడు భాష నుపయోగించుట ప్రారంభ మైనప్పటినుండియు భాషాధ్యయనము ప్రారంభమైన దని చెప్పవచ్చును. ప్రాకృతమానవు డెట్లు భాష నభ్యసించెనో తెలిసికొనుటకు మన కీ నాడు సాధనములు లేవు; ఉన్నది యూహ యొక్కటే. అజ్ఞాతవిషయములను గ్రహించు టకు అనుమానప్రమాణమునే సాధనముగా చేసికొనవలయును. ప్రత్య క్షప్రమాణము నవలంబముగా చేసికొనియే అప్రత్యక్షవిషయము నూహింపవలయును. శిశువు భాషాసంపాదనము చేసికొను విధానము మనము గుర్తింపగలము. పరిసరములందు వినిపించు శబ్దప్రపంచమును విని, తద్ద్వారమున జరుగు క్రియాకలాపములను గమనించి, శబ్దమునకు నర్థమునకు నడుమ నొక సంబంధ మున్నట్లు గ్రహించును. తిరిగి తా

నుపయోగింపవలసినప్పుడు తన గ్రహణశక్తినిబట్టి తా నుపయోగించును. పెద్దలు శిశువులకు అభినయపూర్వకముగా 'కళ్లు చూపించు, ముక్కు చూపించు, నోరు చూపించు, చేతులు చూపించు, కాళ్లు చూపించు' మొదలయిన విధముగా వాక్యములను చెప్పుదురు. శిశువు క్రమక్రమముగా క్రియారూపమున సమాధానము చెప్పును. మొట్టమొదట పెద్దల ననుకరించుటయే జరిగినను, వాక్యనిర్మాణక్రమమును బట్టి ఏ భాగమున కా భాగమును వేరుగా గ్రహింపగల్గును. 'చూపించు' అన్నది అన్ని వాక్యములందును సమానాంశము. తక్కిన భాగము నందలి భేదమునుబట్టియే అంగనిర్దేశమునందు భేదము కలుగుచున్నది. కావున ఆ శబ్దముల కా యంగము లర్థములని యాతడు గ్రహించును. 'కళ్లివిగో, ముక్కిదిగో, నోరిదిగో, చేతులివిగో, కాళ్లివిగో' మొదలయిన విధముగా పెద్దలు చెప్పుట విని విని తానుకూడ అట్లే చెప్పుట మొదలిడును. 'ఇదిగో, ఇదిగో' అన్నవి నిర్దేశమునకు నుపయోగింతురని, 'చూపించు' అన్నది ప్రశ్నమునకు నుపయోగింతురని గూడ గ్రహించును. ఇప్పు డొక పొరపాటు చేయవచ్చును. 'కళ్లివిగో' అని అన్నట్టుగానే 'ముక్కివిగో' అనికాని, 'ముక్కిదిగో' అని అన్నట్టుగానే 'కళ్లిదిగో' అనికాని యనవచ్చును. దానిని పెద్దల సవరింపు వలన గాని, తన పరిశీలనమువలన గాని సవరించుకొనును. ఇట్లే క్రమక్రమముగా భాషను సంపాదించుకొనును.

భాషోత్పత్తివిషయమున భిన్నవాదములను చూచితిమి. భాషా సంపాదనము విషయమున నట్టి వాదముల కవకాశము లేదు. ఈ కాలమున శిశు వే విధముగా నేర్చుకొనునో, ప్రాచీనకాలమున నాటి మానవు డట్లే నేర్చుకొనియుండును. ఇతరుల వ్యవహారమునుబట్టి, తన వ్యవహారము ననువుగా మలచుకొనియుండును. తన వ్యవహారమును బట్టి యితరుల వ్యవహారమునకు దోహదము చేసియుండును. ఒకే

భాషాసమాజమునందలి సభ్యులు పరస్పరవ్యవహారమునకు భాష నుప యోగించుకొందురు. పరస్పరభాషణముచేతనే భాష వ్యవస్థితమై పురోగతి నొందును.

ఇచ్చట నింకొక విషయమును గుర్తింపవలయును. శిశువు కాని, ప్రాచీనమానవుడు కాని భాషాభ్యసనసమయమున నొక వ్యవస్థను గుర్తించుట నిశ్చయము. ఆ వ్యవస్థయే వ్యాకరణము. 'కల్లివిగో' అని యన్న శిశువు 'ముక్కువిగో' అని మొదటి దినములలో నన్న నన వచ్చును. కాని సవరించుకొని 'ముక్కిదిగో' యని యనుట యలవరుచు కొనక మానడు. అమ్మ వచ్చింది, అక్క వచ్చింది, అమ్మమ్మ వచ్చింది – మొదలయిన వాక్యాల సామ్యమున 'నాన్న వచ్చింది' అని అన్నట్లు వాడవచ్చును. కాని తరువాతికాలమున దానిని మార్చుకొనును. దీనినిబట్టి విశేష్య విశేషణముల కున్న సంబంధమును, కర్తృక్రియల కున్న యన్వయమును శిశువు గుర్తించుచున్నాడని తెలుచున్నది. అట్లే ప్రాక్తనమానవుడును భాషయందలి భిన్నభిన్నాంశములను గుర్తించి యుండును. నిజమున కిదియే వ్యాకరణము. ప్రాక్తనమానవు డీ విధ ముగా వ్యాకరణము ననుసరించె ననియే చెప్పవలయును.

ఈ మాట యనుసరికి, 'అప్పటికి వ్యాకరణ ముండెనా?' యన్న సందేహము కలుగును. ఈ సందేహము భ్రాంతిజన్యము. ఎందువలన ననగా, లిఖితవ్యాకరణమే వ్యాకరణ మన్న భ్రాంతి సామాన్యముగా చాలమందికి కలదు. భాష లిఖితరూపము పొందని కాలమునందు సైతము వ్యాకరణ మున్నది. అది లిఖితవ్యాకరణము కాదు. ఈనాడు కూడ లిఖితవ్యాకరణము మొగము నెరుగనివాడు కూడ తనకు కావలసి నన్ని వ్యాకరణాంశములను గ్రహించియే యుండును. అది యాతడు భాష నుపయోగించు రీతినిబట్టి మనము గ్రహింపవచ్చును. అతనికి వ్యాకరణపరిభాష యేమాత్రమును తెలియక పోవచ్చును. తనకు వ్యాక

రణాంశములు తెలియునన్న విషయమునుగూడ నెరుగక పోవచ్చును. అయినప్పటికి నతనికి వ్యాకరణాంశములు తెలియు నని, అందువలననే యాతడు భాషావ్యవహారమును సక్రమముగా సాగింపగలుగుచున్నాడని యనుట కాక్షేపము లేదు. ఈనాడు కూడ లిపి లేని భాష లెన్నోయున్నవి. భాషణము మూలముననే జీవించుచున్నవి. తద్భాషాసభ్యులుకూడ, తమకు తెలిసినను తెలియకపోయినను, అలిఖితవ్యాకరణము ననుసరించుచునే యున్నారు. వారి సంభాషణమును జాగరూకముగా పరిశీలించినయెడల, వ్యాకరణాంశములను మనము స్పష్టముగా గుర్తింపగలము. కావున, ప్రతిభాషకు ప్రారంభకాలమునుండియు వ్యాకరణ మున్నదని యంగీకరింపక తప్పదు. అట్లు వ్యాకరణమే లేనియెడల భాష పరస్పరావగాహనసాధకము కాజాలదు; భాష నొక వ్యవస్థగా పరిగణించుటకును వీలు కాదు. భాష యొక వ్యవస్థ యని యంగీకరించుటతోడనే, ఒక నియతిని, అనగా వ్యాకరణము నంగీకరించుట జరుగుచున్నది. ఆ వ్యాకరణమును ప్రాక్తనమానవులు భాషావ్యవహారకాలముననే, తమ యన్వేషణసామర్థ్యమువలన నలవరచుకొనుచుండిరి.

భాష లిపిబద్ధమైన పిమ్మటనే లిఖితవ్యాకరణము పుట్టును. అది భాషాధ్యయనమునకు ప్రముఖసాధనము. ఇచ్చట నొక ధర్మము నవగాహనము చేసికొనుట యవసరము. తొలుత లిపిబద్ధమైన భాష యథావ్యవహారముగనే యుండును. కాలము సాగుకొలది వ్యవహారమునందలి భాష మారుచుండును. అప్పుడు లిపిబద్ధభాషకు వ్యావహారిక భాషకు మధ్య కొంతి యంతరము కనిపించును. అట్టియెడల భాషాపరిశీలకులు లిపిబద్ధభాషయందలి విశేషాంశములను విశ్లేషించి వివరించుట జరుగును.అదియే లిఖితవ్యాకరణము. కావున లిఖితవ్యాకరణము లిఖితభాషనే లక్ష్యముగా చేసికొను నని నిశ్చయము చేయవచ్చును. వ్యావహారిక భాషను సమకాలమునందలి తద్భాషాభాగస్వాము లందఱును భాషించు

చునే యుందురు. వ్యవహారవశముననే వారి కా భాషయందలి వ్యాక రణాంశములు వశపడుచుండును. ఆంగ్లమునందున్న Grammar అను పదము వ్యాకరణమన్న యర్థమున వ్యవహరించును. 'Gram' అని యనగా లిఖితపదము. ధ్వనిరూప మైనది 'Phone' అని వాడబడును. ఈనాడు మనము Telegram, Telephone అనుచోట్ల నున్న ఆ యా పదములనుబట్టి వాని యాంతర్యమును గ్రహింపవచ్చును. కాబట్టి Grammar అనునది లిఖితభాషకు సంబంధించినదే కాని వ్యావహారిక మునకు సంబంధించినది కా దని నిశ్చయముగా నిర్ణయము చేయ వచ్చును. అంతే కాక, వ్యావహారికమునకు వ్యాకరణరచనము ప్రయో జనవంతము కా దనికూడ నిర్ణయము చేయవచ్చును.

భాష లిపిబద్ధ మైనప్పటినుండియు వ్యవహారమాత్రప్రయోజన ముతో సంతృప్తిచెందక, తదతిరిక్తభూములలో సైతము ప్రసరింపసాగి నది. ఆహారప్రయోజనము ఆకలిని తీర్చుకొనుట మాత్రమే. ప్రాక్తన మానవుడు పచ్చిమాంసముతోనే, కందమూలములతోనే ఆ ప్రయోజ నమును సిద్ధింపజేసికొనెను. కాని క్రమక్రమముగా వంట నేర్చుకొనుట, రుచులు పెంపొందించుకొనుట, క్రొంగ్రొత్త వంటకములకై ప్రయత్న ములు సాగించుట, లేహ్యచోష్యపానీయాదులను భోజనపదార్థము లందు చేర్చుకొనుట మున్నగునవి జరిగెను. అనగా భోజనము ఆకలి తీర్చెడి యావశ్యకదశనుండి భోగదశ నందుకొన్న దన్నమాట! అట్లే భాషయు సాహిత్యరూపమును సంతరించుకొనుట, శాస్త్రానురూప్య మును సాధించుకొనుట, సంగీతముతో చేతులు కలుపుట, అభినయము పదములో పదము కదపుట, అజ్ఞాతవిషయావగాహనమునకై యంత రిక్షయాత్రలు గావించుట - మున్నగు నెన్నింటినో చేసెను. వీనిలో దేని నభ్యసించినను భాష నధ్యయనముచేయుట జరుగును. భాషాధ్యయ నము తగినంత చేసినప్పుడు మాత్రమే ఆ యా విషయములందు తగి

నంత యభిజ్ఞత లభించును; అట్లు కానినాడు అట్టి యవకాశము లేదు. కావుననే వివిధశాస్త్రజ్ఞులు భాషావిషయమునుగురించి ప్రసంగించుట జరిగెను. అయినను [1] శాస్త్రపురుషునకు వ్యాకరణము ముఖస్థానముగా పరిగణింపబడుటచే దాని ముఖ్యస్థానము వెల్లడి యగుచున్నది.

పాశ్చాత్యదేశములందు ప్రాథమికపాఠశాలలను Grammar Schools అని వ్యవహరించుటనుబట్టి విద్యావిధానమునందు వ్యాకరణముస్థానమును గ్రహింపవచ్చును. భారతదేశమునందు సాంప్రదాయికముగా అమరకోశము, శబ్దమంజరి, బాలరామాయణము తొలుదొల్త చదివించెడివారు. అమరకోశము పదసామగ్రి నందింపగా, శబ్దమంజరి దాని నన్వయించు తీరును వాక్యనిర్మాణవైఖరిని తెల్పును. తరువాతిది లక్ష్యగ్రంథము. సిద్ధాంతరూపమైన వ్యాకరణముతోపాటు ఫలితార్థమైన సాహిత్యమునుగూడ నేర్పెడివారన్నమాట! తరువాత సాహిత్యగ్రంథములను వ్యాఖ్యానపూర్వకముగా చదివించెడివారు. ఈ వ్యాఖ్యాన సందర్భమున పదస్వరూపము, ఇతరపదములతోడి యన్వయము, వ్యాకరణవిశేషములు మున్నగునవి ప్రసక్తము లయ్యెడివి. ఇవి కాక యలంకారశాస్త్రము, తత్త్వశాస్త్రము, మనస్తత్త్వశాస్త్రము,తర్కశాస్త్రము, లోకప్రవృత్తి మున్నగు ననేకవిషయములుకూడ ప్రసక్తము లయ్యెడివి. ఇట్లు సాహిత్యవిద్యార్థికి సర్వశాస్త్రపరిచయము స్వల్పముగానైన నుండెడిది. వ్యాకరణమే అభిమానవిషయమైనవాడు కనీసము పండ్రెండేండ్లు చదువవలయునట! కావున, ప్రత్యేకముగా వ్యాకరణవిద్యార్థి సంగతి యటుంచినను తక్కినవారు కూడ వ్యాకరణమును చదివితీరుదురని తేలుచున్నది. [2] వ్యాకరణము సాధుత్వజ్ఞానమును కలిగించును. అందువలన లోకవ్యవహారము సక్రమముగా సాగుటయే కాక, భాషయు

---

1. ముఖం వ్యాకరణం తస్య.

2. సాధుత్వ జ్ఞానవిషయా సైషా వ్యాకరణస్మృతిః॥ (వాక్యపదీయము)

సౌష్ఠవమును గడించుకొనును. ప్రాచీనకాలమునందు విద్వాంసులు శిష్టులు. 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' అన్న సూక్తి దానినే బోధించును. [3] శిష్టులగువారు చేయు పనినే యితరు లనుసరింతురు. శిష్టుల వలె నుండుటకే యెల్లరును యత్నింతురు. వారి కేది ప్రమాణమో తక్కిన యెల్లర కదియే ప్రమాణము. అందువలననే, [4] విద్యావంతులు కొలదిమందియే యైనప్పటికిని వారి ప్రభావము తక్కిన సమాజము పైని పడుచున్నది. [5] విద్యావంతు లుపయోగించుభాష పుస్తకభాషకు సన్నిహితమై యుండును. ఆ భాషయే సరియైన దన్న భావముగల సామాజికులు దానినే యనుసరించుట సంభవించును. వ్యావహారికభాష తొలుత గ్రాంథికభాషకు జన్మ నిచ్చినప్పటికిని, గ్రాంథికభాష యనంతర కాలమున వ్యావహారికమునకు మూదల యగుననుట యథార్థము. అందరు ననుసరణమున విజయము నొకే విధముగా సాధింపలేక పోవచ్చును; అయినను చాలవరకు తదాసక్తి నంగీకరింపవచ్చును. అట్లు శిష్టుల ననుకరించుటవలన, తాము శిష్టులుగా పరిగణింపబడవచ్చు నన్న స్వార్థముకూడ నిచ్చట పనిచేయవచ్చును. ఈ మాదిరిగా సాధు భాషనే యుపయోగింపవలయు నన్న యభిప్రాయము విద్యావంతులనే కాక తదన్యులను సైతము తగినంత లోగొన్నది. దీనికి నిదర్శనములుగా కొన్ని సన్నివేశములను గమనింతము.

పెండ్లిచూపు లైపోయిన వెంటనే తల్లిదండ్రులు వరునిగూర్చి తన యభిప్రాయమును చెప్పు మని కన్య నడుగగా ఆమె యిట్లనెనట!

---

3. యద్య దాచరతి శ్రేష్ఠస్త త్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే। (భగవద్గీత)

4. The Upper Middle class of seventeenth-century France wished to imitate their "betters", in speech as well as in other matters ... (Robert A. Hall Jr.)

5. In eighteenth-century England, the middle classes were engaged in a similar process of social climbing, and were, like wise easily victimized by grammarians ... (Ibid)

'యస్య షష్ఠీ చతుర్థీ స్యా ద్విహాస్యచ విహాయ చ,
అహం కథం ద్వితీయా స్యా ద్ద్వితీయా స్యా మహం కథమ్?'

ఇది పూర్తిగా వ్యాకరణవిషయము. పెండ్లికూతురు పెండ్లికొడుకును కొన్ని ప్రశ్న లడిగినది. అందు కొన్నింటికి సమాధానము లివి. 'విహాస్య' యన్నది షష్ఠీవిభక్తిరూపము. 'విహాయ' యన్నది చతుర్థీ విభక్తిరూపము. అహం, కథం - అను రెండును ద్వితీయావిభక్తి రూపములు - ఇవి పెండ్లికొడు కిచ్చిన సమాధానములు. వీనిలో నే సమాధానమును సరియైనది కాదు. 'విహాస్య' యన్నది ల్యబంతము. కాని పెండ్లికుమారుడు 'రామస్య' అను రూపమువంటి దనుకొని షష్ఠి యని చెప్పుట తటస్థించినది. 'విహాయ' యన్నదియు ల్యంబతమే. 'రామాయ' అన్న రూపముతోడి పోలికనుపట్టి అతడు 'చతుర్థి' యని చెప్పెను. అహమ్, కథమ్ - అనువానిని 'రామమ్' అన్న రూపము తోడి పోలికనుబట్టి ద్వితీయారూపము లని చెప్పెను. నిజమునకు 'అహమ్' ప్రథమావిభక్తిరూపము; 'కథమ్' ప్రశ్నవాచకమైన యవ్యయము. శబ్దజ్ఞానముకూడ లేనివానికి భార్య యగుట తన కిష్టము లేదని చెప్పివేసినది. దీనినిబట్టి సంస్కృతభాషాలోకనమున వ్యాకరణ పాండిత్యమునందలి యభిమానమును గుర్తింపవచ్చును.

ఆంగ్లమునందలి యొకకథను చూతము. నలుగురు మనుష్యులు నదీతీరమున విహారము చేయుచున్నారు. ఇంతలో నదీమధ్యమున మునిగిపోవుచు నొకడు కేకపెట్టెను. ఆ కేక యిది 'I will drown; none shall save me'. ఈ కేక విని నలుగురిలో నొకడు నదిలోనికి దుముకబోయెను. వెంటనే యిద్దరు రెండు భుజములను పట్టుకొని యతని నాపుచేసిరి. నాలుగవవానికి చాల బాధ యనిపించినది. నదిలో మునిగి పోవువాడు మునిగిపోవుచుచే యున్నాడు. దానితో 'ఏమయ్యా! మీ రుపకారము చెయ్యరు. ఆయన సాహసించి చెయ్యబోగా మీ రాపుట

న్యాయము కాదు' అని యనెను. అప్పుడు వారు "ఆయన చేయబోయి నది యుపకారమే యైనచో మేము వారింతుమా? ఆయన చేయునది యుపకారము కాకపోగా, ఆయన కపాయము సంభవించెడి సందర్భ మగుటచేతనే మేము వారించితిమి" అని చెప్పిరి. మొదటివాడు కొంచె మాలోచించి, తల యూడించి, కృతజ్ఞతాపూర్వకముగా ధన్యవాద ములు చెప్పెను. నాలుగవ వాని కిదియేమియు నర్థము కాలేదు. వివర ముగా చెప్పు మని వేడుకొనెను. అప్పుడు మొదటివాడే యిట్లు చెప్పెను. "నేను మునిగిపోవుచున్న యతనిని చూచితిని. అత డన్న మాటలు వింటిని గాని, ఆ తొందరలో సరిగా పట్టించుకొనలేదు. కావున, అతనిని రక్షించుట యవసర మనుకొంటిని. మీ రాపుచేసిన పిమ్మట, వీరి మాటలు విన్న పిమ్మట, అతని అభిప్రాయము గాకు స్ఫురించినది. 'I will drown' అని యన్నప్పుడు నిశ్చితత్వ మున్నది. అతడు మునిగి పోవుటకు నిశ్చయించుకొనియున్నా డన్నమాట! ఎవ్వరైనను బ్రతికిం చుటకు యత్నింతురేమో యన్న సందేహము కలిగి, తన పూనికకు విఘాతము కలిగించుట కెవ్వరికిని సాధ్యము కా దన్న నిశ్చయమును 'non shall save me' అని ప్రకటించుచున్నాడు. అటువంటివాని దగ్గరకు వెళ్లినట్లయిన, వెళ్లినవారినికూడ ముంచునే కాని తాను బయ టికిరాడు. కాబట్టి వీరు నాకు నిజముగా ఉపకారము చేసిరి". మునిగిన వాడు మునుగవలయు ననియే మునిగెనో, ప్రమాదవశమున మునిగెనో తెలియదు కాని, ఆతని మాటలే యాతనిని ముంచివేసిన వనుట మాత్రము వాస్తవము నంగీకరించుటయే యగును.

తెలుగులో నైనట్లయిన 'నేను మునిగిపోతున్నాను' అని యనుట చేత నిశ్చయత్వమో, అసహాయత్వమో స్పష్టముగా చెప్పుటకు వీలు లేదు. తరువాత వచ్చు వాక్యాంశమునుబట్టియే ఆ విషయమును నిర్ధా రణము చేసికొనవలయును. 'నన్ను రక్షించండి' అని యన్నట్లయిన

అసహాయత్వము వెల్లడియగును. అట్లుకాక రక్షించవద్దు దగ్గరికి రావద్దు మరిచిపోండి – అన్నట్టుగా అన్నయెడల నిశ్చయత్వము వెల్లడియగును. భాష సుబోధమగుటకు, వ్యాకరణాంశములను గ్రహించుట యవసరము. అట్లు గ్రహించినప్పుడే పరస్పరావగాహనము సాధ్యపడును. కావున భాషాధ్యయనము భాషాజీవుల కవశ్యకర్తవ్యము.

ఒక భాషాసమాజము నందలి సభ్యులు యింకొక భాషాసమాజముతో వ్యవహరింపవలసి వచ్చునప్పుడు క్రొత్త సమస్యలు తల యెత్తును. పదునారు పదునేడు శతాబ్దములందు పాశ్చాత్యదేశీయులు వర్తకమునిమిత్తమై కాని, మతప్రచారమునిమిత్తమై కాని వేర్వేరు దేశములలో వేర్వేరు భాషాసమాజములలో సంచరించుట సంభవించినది. అట్టియెడల, తమభాషలో తామెంత పండితులైనను, తమ వ్యవహారక్షేత్రమునందలి భాష తమకు రాకపోయినచో, తాము మూకీభావము నొందక తప్పదు. కాని, మానవునైజ మట్టిది కాదు. అనుకరణము, ఆలోచనము, అన్వేషణము – అన్న మూడు శక్తులు మానవునకు జన్మసిద్ధములు. వాని నుపయోగమునకు తెచ్చి, క్రొత్త భాషను కొంచెము కొంచెముగా అధ్యయనము చేయును; కొలదికాలములోనే తత్సమాజసభ్యులతో వ్యవహరింపగల సామర్థ్యమును సంపాదించుకొనగలుగును. కాని, తన మాతృభాషావిషయమున తనకు కొన్ని యలవాటులేర్పడియున్నవి. ఆ యలవాటుల నాధారము చేసికొనియే క్రొత్త భాష నధ్యయనముచేయుట చాలవరకు జరుగును. ఇందువలన, తన భాషాంశములకంటె భిన్నముగానున్న భాషాంశములు పరభాషలో కనిపించినప్పుడు, వానిని వేరుగా గుర్తుపెట్టుకొనక తప్పదు. కాని, పెక్కురు అట్టి విశిష్టలక్షణములను గుర్తింపనే గుర్తింపరు. కొందరు గుర్తించినప్పటికిని, తమ భాషయం దట్టివి లేకపోవుటచేత, తదితరభాషయం దట్టి లక్షణము లనవసరముగా నున్నవనియు, వానిని వర్జింపవచ్చుననియు

నొక నిర్ణయమునకు వత్తురు. కొందరు విశిష్టలక్షణములను గుర్తించి, యొక విశిష్టస్థానము నొసగుదురు.

పాశ్చాత్యదేశములందు గ్రీకుభాషాప్రభావ మత్యధికము. లాటిను వ్యాకరణములు గ్రీకు వ్యాకరణపుబాటలో పయనించినవి. మధ్య యుగమునందు లాటినుభాషాపాండిత్యమే పాండిత్యమైనది. తరువాత హిబ్రూ, అరబ్బీ మున్నగుభాషలుకూడ పండితుల కుపాదేయములైనవి. ఆతరువాత, వ్యవహారమునందున్న యితరభాషలతో సంపర్కమునకు వచ్చుసరికి గ్రీకు లాటిను వ్యాకరణముల యొరవడి స్థిరమైపోయినది. అందువల్లనే, ఆ భాషలనుకూడ ఆ మూసలలోనే పోయుటకు యత్నములు జరిగినవి. ఏమైనను, నాటి వర్తకులును, మతప్రచారకులును తమ వ్యవహారక్షేత్రమునందలి భాషల పదసామాగ్రిని సేకరించుకొని వచ్చిరి. కొందరు ఆ యా భాషలకు వ్యాకరణములను, నిఘంటువులను కూడ రచించిరి.

భారతదేశమునందు సంస్కృతభాష సర్వప్రధానము. సంస్కృత భాషయందున్న శాస్త్రములే దేశభాషలలోని కనంతరకాలమున నవ తరించినవి. అట్లే వ్యాకరణముకూడ. సంస్కృతవ్యాకరణమునుబట్టియే దేశభాషావ్యాకరణము లేర్పడినవి. అందువలన భారతదేశప్రాచీన పండితులు సంస్కృతభాషను మాత్రమే చదివి సంపూర్ణ పండితులైనట్లు భావించెడివారు. కావున, దేశభాషలనుగూర్చి, నిశితముగా వారు వివేచనము చేయలేదు. సంస్కృతభాషాభ్యాసవశంవదులై యుండుట చేత వారి కట్టి యవకాశమే కలుగలేదు. మన దేశమునకు పాశ్చాత్యులు వచ్చిరి. ఇచ్చటి భాషలను నేర్చుకొనిరి. అట్లు నేర్చుకొనుటలో, తమ పూర్వవ్యాకరణాభ్యాసములు పనిచేయకుండ నుండవు కదా! కావున, ఇచ్చటి భాషల నిచ్చటి వ్యాకరణముల ననుసరించి కాక, తమ భాషావ్యాకరణముల ననుసరించి నేర్చుకొనుట జరిగినది.

అట్లే దేశీయభాషలకు తమ తమ భాషలలో వ్యాకరణములు వ్రాయుట, నిఘంటువులను సంతరించుట జరిగినది.

ఈ వ్యాకరణరములును, నిఘంటువులును తమకు, తమవంటి అన్యభాషీయులకు నుపయోగింపవలయు నన్నదే మొట్టమొదటి యాశయము కావచ్చును. ఆ యా గ్రంథముల యాధారముతో పలువురు పాశ్చాత్యులు దేశభాషల నధ్యయనముచేయుట జరిగినది. దేశీయులు కూడ ఆ గ్రంథముల ననుసరించుట తటస్థించినది. సాంప్రదాయికముగా వచ్చెడి పద్ధతినే కాక, భిన్నపద్ధతి ననుసరించియు భాష నధ్యయనము చేయవచ్చు నన్న యభిప్రాయము బలపడినది. ఇంతే కాక పద సామగ్రి భిన్నభిన్నముగా నున్నను, వ్యాకరణాంశములు దరిదాపుగా అన్నిభాషలకు సమానముగానే యుండునన్న భావ మొకటి ప్రభవించినది.

ఇదే సమయమున, పాశ్చాత్యులు కొందరు సంస్కృతభాషాధ్యయనము కావించిరి. వారు గ్రీకు, లాటిను ప్రభృతిభాషలందు తగినంత పాండిత్యము కలిగియుండిరి. అందువలన సంస్కృతమునందలి పదములకును, గ్రీకు మున్నగు భాషలలోని పదములకును సామ్య మున్నదన్న సంగతిని గుర్తించిరి. ఎన్నో వేలమైళ్ళదూరములో నున్న యీ భాషలకు సామ్య ముండుట చర్చనీయాంశ మైనది. అందువలన, పలువురు పండితు లింకను లోతుగా పరిశ్రమించి, ఆ యా భాషల పద సామగ్రులను సంతరింపసాగిరి. కొందరు సంస్కృతవ్యాకరణగ్రంథముల నధ్యయనము చేసిరి. అందు యాస్కుని నిరుక్తము, పాణిని అష్టాధ్యాయి చెప్పుకొనదగినవి. బ్లూంఫీల్డు 'పాణిని వ్యాకరణము మానవ మేధాశక్తికి మహత్తరగోపుర' మని ప్రశంసించెను. సూత్రరచనమందలి సూక్ష్మత నాన్యతోదర్శనీయము. భాషకు సంబంధించిన యల్పాల్పములైన యంశములనుగూడ వింగడించి, ప్రకృతి, ప్రత్య

యము, పదము, కృదంతము, తద్ధితము, సమాసము, క్రియ, వాక్య నిర్మాణము మున్నగు ననేకాంశములను వివరించెను. దీని నధ్యయనము చేసిన పాశ్చాత్యులకు భాషాధ్యయనమునకు నూతనజ్యోతి ద్యోతితమైనది. పలువురు పాశ్చాత్యుల పందొమ్మిదవ శతాబ్ది వచ్చు సరికి, తమ పాండిత్యమునకు సంస్కృతభాషాధ్యయనముకూడ వీడరాని యావశ్యకముగా గుర్తించి గ్రహించిరి. పాణిని వ్యాకరణము చూపినదే రాచబాట యైనది. [6] 'భారతీయవ్యాకరణము యూరోపియను నేత్రములకు మొట్టమొదటి మారుగా సరియైన సమగ్రమైన భాషావర్ణనమును ప్రదర్శించెను; అది సిద్ధాంతమును గాక, పరిశీలనము నాధారము గావించుకొన్నది. పైగా, సంస్కృతభాషావిష్కరణము తులనాత్మక భాషాధ్యయనమున కవకాశమును బయలుపరిచెను' అని బ్లూంఫీల్డు సంస్కృతభాషవలన భాషాధ్యయనక్షేత్రమునకు చేకూరిన ప్రయోజనమును కంఠోక్తిగా వెల్లడించెను. ఇట్లు భాషాధ్యయనవిధానము కాలముతోపాటుగా పయనించి, వేర్వేరు భాషల సంపర్కముచేత విస్తృతిని సంపాదించుకొన్నది.

అంతకు ముందు 'తప్పు' అని 'ఒప్పు' అని నిర్ధారించెడి దృష్టిలో కొంతమార్పు రా సాగినది. 'It's I' అనవలయునా? 'It's me' అనవలయునా? Often, Soften మున్నగు పదములలో 't' వర్ణమునకుచ్చారణ మున్నదా? లేదా? Honour, Labour మున్నగు పదములలో 'u' వ్రాయుట యవసరమా? కాదా? మున్నగు ప్రశ్నలు సాంప్రదాయికవ్యాకరణములందు ప్రముఖస్థానము నాక్రమించుకొన్నవి. 'ఏల' ద్రుతాంతమా? కళయా? గద్దియ, గద్దె – అనువానిలో ఒప్పేది?

---

6. The Indian grammar presented to European eyes, for the first time, a complete and accurate description of a language, based not upon theory, but upon observation. Moreover, the discovery of Sanskrit disclosed the possibility of a comparative study of languages. (—Language)

తప్పేది? జనము కర్తృవాచక మైనప్పుడు క్రియ ఏకవచనమున నుండునా? బహువచనముననుండునా? అన్నసందేహములు కలిగినప్పుడు వ్యాకరణగ్రంథములను, నిఘంటువులను సేవించుట జరిగెడిది. ఒక్కొక్కప్పుడు పాఠకుడు తాను చేసికొన్న నిర్ణయమే శాస్త్రముగా పరిగణించెడివాడు. పూర్వము చెప్పికొన్నట్లు వ్యాకరణములు లిఖితభాషావధిని దాటి బయటికి రాలేదు. అవియు సమగ్రావలోకనసమర్థములు కావు. శాస్త్రీయమైన దృక్పథముతో స్వీయభాషనే కాక, భాషాసామాన్యమునుగూడ పరిశీలించుట యావశ్యకమైనది.

నూత్నదృక్పథము ఆవశ్యక మన్నమాట నిజమే; దానికి కొన్ని యభ్యంతరములు కలుగుటకూడ నిజమే. ఒక పద్ధతి కలవాటు పడిన వారు క్రొత్తపద్ధతికి స్వాగతము పలుకుటకు కొంత కాలము పట్టును. వారి సందేహములు వారి కుండును. క్రొత్త పద్ధతిలో పయనించువారు కూడ తమ పద్ధతికి సైతము కొన్ని యవధు లుండునని గ్రహింపవలయును. వారి సందేహసంకోచములు వీరి యుత్సాహోద్రేకములు కొంత సరుదుబాటు నపేక్షించును. దాని నట్లుంతము. మొత్తముమీద భాషాధ్యయనమునందలి నూత్నదృక్పథము కారణముగా భాషాశాస్త్రము ప్రాదుర్భవించినది. చారిత్రకముగా భాషాధ్యయనప్రస్థానమం దిది పరమావధి.

## 1. ४ భాషాశాస్త్రము – నామరూపములు

భాషకు సంబంధించిన శాస్త్రము భాషాశాస్త్రము. ఈ యర్థమున 'Linguistics' అను పదము ఆంగ్లభాషావ్యవహారమున రూఢికెక్కినది. దీనికి ముందు Study of Language అని కొందరు grammar of language అని కొందరు, grammatics అని కొందరు, Philosophy of language అని కొందరు, Philology అని కొందరు,

Philosophy of grammar అని కొందరు, Glottology అని కొందరు, Science of langugage అని కొందరు, Linguistic science అని కొందరు - భిన్ననామములతో వ్యవహరించినట్లు కానన గును. కాని, వానిలో నేదియు స్థిరత్వము నొందలేదు.

Study of languge అని యనగా 'భాషాధ్యయనము' అని యనువదింపవచ్చును. వెనుకటి వ్యాసమునందు భాషాధ్యయన విధానములను పెక్కింటిని గుర్తించితిమి. చారిత్రకపరిణామరూపముగా రూపొందిన శాస్త్రీయవిధానము మాత్రమే ప్రకృతిభాషాధ్యయనమునందు పాటింపబడుచున్నది. కావున 'భాషాధ్యయనము' అన్నది అతివ్యాప్తిదోషదూషితమై యున్నది. కావుననే దానిని స్వీకరించుటకు వీలు కాలేదు.

Grammar of languge అని యనగా 'భాషావ్యాకరణము' అని యనువదింపవచ్చును. కొందరు ఇదే భావమున 'grammatics' అని యుపయోగించిరి. మొదటిది వివరణరూపమున నుండుటచే, దానికంటె సుఘటితరూపమయిన 'Grammatics' అన్నది యోగ్యతరముగా నుండు ననుటలో సందేహము లేదు. ప్రాచీనకాలమునందే పెక్కు భాషలకు వ్యాకరణము లున్నవి. సంస్కృతమునకు యాస్కుడు, పాణిని; గ్రీకుభాషకు డయోనిసియస్ త్రాక్సు, ఎపొలోనియస్ డైస్కోలసు; లాటిను భాషకు ఏలియస్ డోనాటసు, ప్రిస్కియను; అరబ్బిభాషకు సీబవాయ్‌హీ, అల్ ఖలీలు - అనువారు చక్కని వ్యాకరణములను వ్రాసి పెట్టిరి. అవి ఆ యా భాషల స్వరూపస్వభావములను సక్రమముగా వివరించుచునే యున్నవి. కావున వ్యాకరణ మన్నపదము పరిమితార్థములోనే కాని ప్రపంచపరివ్యాప్తమైన భాషాసామాన్యమునకు వాడుటకు వీలు కాదు. అట్లు వాడినయెడల ప్రాచీనతావాసనచేత నవీనశాస్త్రమును సైతము ప్రాచీనపరిధిలోనే బంధించెడి ప్రమాదము

కలదు. ఇంకొక విషయము పూర్వవ్యాకరణములు లిఖితభాషను మాత్రమే వ్యవహరించును. ప్రకృతశాస్త్రము భాషితభాషనే ప్రధానముగా గ్రహించి వ్యవహరించును. మొత్తముమీద దృక్పథము నందును వ్యవహారక్షేత్రమునందును మార్పుకలిగె ననుట వాస్తవము. దాని కనుగుణముగా నామధేయమునందు సైతము మార్పు కలుగుటయే సమంజసము. కావుననే, అదియు నిలువలేక పోయినది.

Philosophy of language అని యనగా 'భాషా తత్త్వశాస్త్రము' అని యనువదింపవచ్చును. నిజమున కిదియు వివరణముగానే యున్నది. కాని సుఘటితమైన ఏకపదముగా లేదు. జగత్తునకు సంబంధించిన సర్వవిషయములను ప్రత్యక్షముగా గమనించి, తార్కికముగా నాలోచించి, వాని తత్త్వమును నిరూపించుట తత్త్వశాస్త్రవిషయము. అదే సామ్యమున భాషకు సంబంధించిన సర్వవిషయములను ప్రత్యక్షముగా గమనించి, తార్కికముగా నాలోచించి, వాని తత్త్వమును నిరూపించుట యన్న విషయమునుబట్టి 'భాషా తత్త్వశాస్త్రము' అన్న నామధేయమును కల్పించుట జరిగి యుండును. నిజమునకు 'Philology' అన్న పేరుకూడ ఈ భావమునే ప్రకటించును. ఇది Philosophy అను పదముతో రూపసాదృశ్యమునుగూడ కలిగియున్నది. Philosophy అను పదమునకు 'Love of knowledge' అన్నది వ్యుత్పత్త్యర్థము. Philology అను పదమునకు 'Love of language' అన్నది వ్యుత్పత్త్యర్థము. ఇది సుఘటితమైన ఏకపదముకూడ నగుటచేత నామధేయముగా నుండుటకు సరిపడియున్నది. అయినప్పటికిని దీని వ్యవహారక్షేత్రము విస్తృతమై, విషయము విలక్షణ మగుటచేత భాషాశాస్త్రమునకు వేరు పేరు కావలసి వచ్చినది.

Philosophy of grammar అని యనగా 'వ్యాకరణ తత్త్వశాస్త్రము' అని యనువదింపవచ్చును. భాష యని యన్నప్పటికిని

భాషయందలి వ్యాకరణాంశములే యుద్దిష్టములు; స్థూలముగా చూచి నప్పుడు భాషయందలి వ్యాకరణాంశములే భాషాఘటకములు. కావున, ఈ పేరునకును భాషాతత్త్వశాస్త్ర మను పేరునకును భేదము లేదు. అయినను grammar అను సంజ్ఞ లిఖితభాషను మాత్రమే యన్వ యించును. ప్రకృతశాస్త్రము భాషితభాషను సైతమును లక్షణమును నిర్దేశించును. కావున, ఈ పదము అవ్యాప్తిదోషమునకు పాల్పడుచున్నది.

కొందరు ప్రకృతశాస్త్రము తులనాత్మక మగుటచేత, దానిని సూచింపవలయు నన్న యభిప్రాయముతో comparative grammar, comparative philology మున్నగు విధముగా నామకరణము చేసిరి. ఒక విధముగా నిది యుక్తియుక్తమే. పూర్వవ్యాకరణములు భాషాసామాన్యమును గాక, ఏదో యొక భాషను మాత్రమే విషయ ముగా స్వీకరించి వివేచన చేసినవి. ప్రకృశాస్త్రము అనేకభాషలను గాని, భాషాసామాన్యమును గాని విషయముగా స్వీకరించి వివేచన చేయును. అనగా వేరు వేరు భాషల నొకదానితో నొకదానిని పోల్చి భేదసాదృశ్యములను నిరూపించుట యిచ్చట జరుగును. కావున తుల నాత్మకత్వమును తెలియజేయుట ముఖ్యవిషయమే యనవచ్చును. శాస్త్రము అని యనుటచేతనే తులనాత్మకత్వము అవశ్యలక్షణ మగు చున్నది. అట్టియెడల పేరునందే ఆ లక్షణమును చేర్చి పలుకుట సిద్ధ సాధన మగుచున్నది. ఈ యభిప్రాయముతో కొందరు దీనిని పరిహ రించుచున్నను, కొంతకాలముపాటు పెక్కుడు శాస్త్రవేత్తలు 'comparative' అన్న విశేషణమును విశేషముగా ఆదరించి తమ గ్రంథ ములకు నామకరణము చేసిరి.

Glottology అన్నదికూడ అభిధానముగా వ్యవహృతమైనది. ఇది వర్తకులును, మతప్రచారకులును భిన్నభాషాక్షేత్రములలో వ్యవ హరించుటకై సిద్ధముచేసికొనిన పదపట్టికల నాధారము చేసికొని

యేర్పడియుండును. ఆ పదపట్టికలతోపాటు వారు కొంత వివరణము కూడ వ్రాసికొనెడివారు. Gloss అని యనగా వివరణ మని యర్థము. Glossary అని యనగా విశిష్టవివరణముతోడి పదముల పట్టిక యని యర్థము. ఇట్టి పట్టికలకుసంబంధించిన విషయము Glossology. దీనికి రూపాంతరమే Glottology. ప్రకృతశాస్త్ర మింతకంటెను విస్తృతము శాస్త్రీయము నగుటచే వ్యవహారమునుండి యీ పేరు పూర్తిగా పరిహృతమైనది.

Science of language అని యనగా 'భాషాశాస్త్ర' మనియే యర్థము. ఇచ్చట 'of' అన్నది సంబంధమును తెలుపుచున్నది. తక్కిన రెండు పదములును సమముగా నామవాచకములై యున్నవి. ఇందొకటి తక్కువ కాదు; మరొకటి యెక్కువ కాదు. పైగా, ఇది వివరణరూపమున నున్నదే కాని సుఘటితరూపమున లేదు. కావుననే కొందరు దీనిని కొంచెము మార్పుతో Linguistic science అని వ్యవహరించిరి. ఇచ్చట రెండవ పదము నామవాచకము; మొకటి పదము విశేషణము. నామవాచకమునందలి విశేషమును విశేషణము వెల్లడించును. Language అన్న పదమునకు విశేషణరూపము Linguistic అన్నది. ఇది యింతకు ముందున్న రూపముకంటె సౌష్ఠవము కలిగియున్న మాట వాస్తవము. ఇది శాస్త్రమన్న విషయముకూడ పేరుచేతనే తెలియు నన్నమాటయు వాస్తవమే.

శాస్త్రమును పేరునందు శాస్త్రపదమును జోడించి పిలుచుట మన కలవాటే. వేదాంతశాస్త్రము, తర్కశాస్త్రము, సాహిత్యశాస్త్రము మొదలైన రీతిగా వాడుట మన సంప్రదాయము. ఆంగ్లాది భాషలయందు అట్టి సంప్రదాయ మంతగా కానరాదు. క్వాచిత్కముగ నెప్పుడైనను కానవచ్చినను క్రమముగా అట్టిది యుపయోగము నుండి తొలగిపోవుటకూడ అంత తక్కువ కాదు. Physical science

అన్నది క్రమముగా వాడుకనుండి పోయి Physics అన్నది ప్రతిష్ఠితమైనది. Natural science అన్నది Biology అన్న పేర నిలద్రొక్కుకొన్నది. సాధారణముగా కొన్ని శాస్త్రముల పేరులకు చివర '— logy' అన్నది కనవచ్చును. Biology, Zoology, Physiology మొదలయినవి యిట్టివే. భాషాధ్యయనవిషయమునకైతము Philology, Phonology, Morphology మున్నగు పదములు ప్రతిష్ఠితములై యున్నవి. కొన్ని శాస్త్రముల పేర్లు '— ics' అన్న యంశము నంతమందు కలిగియుండును. నిజమునకు విశేషణరూపముపైని బహుత్వబోధకమైన '—s' చేరుటవల్ల ఈ రూపము లేర్పడును.

Economy కి విశేషణము Economic. దీనిపైని '—s' చేరగా Economics అనినదై శాస్త్రమునకు పేరైనది. Grammatics, Dramatics, Politics, Dynamics మొదలైన విట్టివే. ఇదే పద్ధతిలో Linguistic అను విశేషణరూపముపైని '—s' చేరగా Linguistics అనినదై భాషాసంబంధమైన శాస్త్రమునకు పేరైనది. ఇట్లు శాస్త్రసంజ్ఞితములైన పదముల తుదినున్న '—s' బహుత్వబోధకత్వమును విడనాడుకొనును.

శాస్త్రము పెరుగుకొలది వేరు వేరు శాఖలను విస్తరింపజేసికొనుట సహజమే. అట్లే భాషాశాస్త్రము ప్రధానముగా రెండు శాఖలను విస్తరింపజేసికొన్నది. వర్ణనాత్మక భాషాశాస్త్రము (Descriptive Linguistics), చరిత్రాత్మక భాషాశాస్త్రము (Historical Linguistics) అన్నవి ఆ శాఖలు. ఉభయసామాన్యముగా చెప్పుటకై కొందరు సామాన్య భాషాశాస్త్రము (General Linguistics) అని వాడుటకూడ రూఢముగా నేయున్నది. కొందరు దీని యాధునికత్వముననే అగ్రేసరత్వమును భావించుచు ఆధునిక భాషాశాస్త్రము (Modern Linguistics) అని పిలుచుచున్నారు. కొందరు తులనాత్మకత్వమును

తలపింపజేయవలయు నన్న తలంపుతో తులనాత్మక భాషాశాస్త్రము (Comparative Linguistics) అని పిలుచుచున్నారు. మొత్తము మీద పైనున్న యన్నింటిలోను Linguistics అన్నది అధిష్ఠితమై యున్నది. శాస్త్రనామముగా అదియే విశేషప్రసిద్ధిని పొందియున్న దనుటలో విప్రతిపత్తి లేదు.

శాస్త్రమునకు నామకరణము జరిగిన పిమ్మట, తచ్ఛాస్త్ర ప్రవీణునకు నామకరణ మెట్లు చేయవలయు నన్నది మరొక ప్రశ్న. Politics > Politician; Mathematics > Mathematician; Phonetics > Phonetician. ఇదే పద్ధతి ననుసరించి Linguistics అను శాస్త్రమునందు ప్రవీణుడైనవానిని Linguistician అని యనవలయును. కొందర ట్లే యనిరి; నిఘంటువులుకూడ ఆ పదమును గుర్తించి స్వీకరించినవి. కాని, ఆ పద మెక్కువగా వాడుక కెక్కలేదు. Linguist అను పదమే బహుళప్రచారము గాంచి ప్రతిష్ఠ నొందెనది. నిజమున కీ పదమునకు బహుభాషాభాషి (Polyglot) అనియే వ్యవహారము నందు రూఢి నొందిన యర్థము. కాని, Linguistics అను శాస్త్ర మేర్పడిన పిమ్మట తత్పూర్వపరిచితమైన Linguist అన్న పదమునే యేతచ్ఛాస్త్రప్రవీణు డన్న యర్థమున వాడుట జరుగసాగినది. తెలుగు నందు భాషాశాస్త్రజ్ఞుడు అనికాని, భాషాశాస్త్రవేత్త యనికాని యుపయోగించుట జరుగుచున్నది. కొందరు భాషాశాస్త్రి యనికూడ వాడుట జరుగుచున్నది. అదికూడ స్వీకారయోగ్యమే.

# 2 ఇతర శాస్త్రములతోడి సంబంధము

భాషాశాస్త్రస్వరూపమును స్పష్టముగా నవగాహనము చేసికొనుటకు దాని కితరశాస్త్రములతోడి సంబంధమును గుర్తించుట యవసరము. ఒక సమాజమునందలి వ్యక్తులు ప్రత్యక్షముగానో, పరోక్షముగానో సంబంధమును కలిగియుండక తప్పదు. అట్లే సమాజసముత్పన్నమైన భాష సమాజసంబంధు లగు నితరశాస్త్రము లన్నింటితోడను సంబంధము కలిగియుండక తప్పదు. అట్లే భాషాశాస్త్రముకూడ పెక్కు శాస్త్రములతో సంబంధము కలిగియున్న దనుట నిక్కువము. వాని సంబంధము నిప్పుడు స్థూలముగా గమనింతము.

## 2. ౧ వ్యాకరణ శాస్త్రము

* వేదాంగము లారింటియందును వ్యాకరణము ప్రధానమైనది. వేదపురుషునకు ముఖము వ్యాకరణ మని చెప్పుటచేత వ్యాకరణము యొక్క ప్రాముఖ్యము తెలియుచున్నది.

"ముఖం వ్యాకరణం తస్య జ్యౌతిషం నేత్ర ముచ్యతే
నిరుక్తం శ్రోత్ర ముద్దిష్టం ఛందసాం విచితిః పదే
శిక్షా ఘ్రాణం తు వేదస్య హస్తౌ కల్పాన్ ప్రచక్షతే"

వ్యాక్రియన్తే వ్యుత్పద్యన్తే శబ్దాః అనేన ఇతి వ్యాకరణమ్. ఈ శాస్త్రము చేత శబ్దములు వ్యుత్పన్నము లగును. కావుననే దీనికి 'శబ్దశాస్త్రము' అనుపేరుకూడ ప్రసిద్ధముగానే యున్నది. అనుశాసించుటయే శాస్త్రలక్షణము కావున 'శబ్దానుశాసనము' అన్నపేరు కూడ వాడుక కెక్కినది. 'లక్ష్య లక్షణే వ్యాకరణమ్' అని పతంజలిమహర్షి నిర్దేశము.

* షట్స్వంగేషు ప్రధానం వ్యాకరణం ప్రధానే చ కృతో యత్నః ఫలవాన్ భవతి - మహాభాష్యము.

లక్ష్యములను సేకరించుకొని, వాని నన్నింటిని వేరువేరు వర్గములుగా విభజించి, వాని లక్షణములను నిరూపించుటయే వ్యాకరణకర్తవ్యము. నిజమునకు భాషాశాస్త్రమునకు ఇదియే కర్తవ్యమై యున్నది. వ్యాకరణ భాషాశాస్త్రములకు ముడిపదార్థ మొక్కటియే. అది భాష. దాని నాశ్రయించుకొనియే రెండు శాస్త్రములును వ్యవహరించును. ఇంతవరకు నిది రెండింటికి గల సామ్యము. ఈ సామ్యమును పురస్కరించుకొనియే తొలిరోజులలో భాషాశాస్త్రమును Descriptive grammar, comparative grammar, Historical grammar మున్నగు విధముగా వాడుట తటస్థించినది. ఇప్పు డింక భేదములను చూతము.

భాషాశాస్త్రము భాషాసామాన్యము నాశ్రయించుకొని వ్యవహరించును. కావున నది విశ్వవ్యాప్తమై యుండును. భాషాశాస్త్ర నియమములు సర్వభాషలకు నన్వయించును. వ్యాకరణ మేదో యొక భాష నాశ్రయించుకొని యుండును. కావున దాని వ్యాప్తియు పరిమితమై యుండును.

భాషాశాస్త్రము లిఖితభాషను, భాషితభాషను కూడ గ్రహించును. అట్లే సారస్వతము గల భాషను, లేని భాషనుకూడ గ్రహించును, వ్యాకరణము లిఖితరూపము గలిగి సారస్వతముగల భాషను మాత్రమే గ్రహించును.

భాషాశాస్త్రము ఒకే కుటుంబమునందలి భిన్నభాషలనుగాని, భిన్నకాలములయందలి యొకే భాషనుగాని, ఒకే కాలమునందలి భిన్న మాండలికములనుగాని గ్రాంథిక వ్యావహారికములనుగాని పోల్చి కొన్ని నిర్ణయములను చేయును. వ్యాకరణ మిట్టి తులనాత్మక పరిశీలనము జోలికి పోదు.

భాషాశాస్త్రము సాధుశబ్దములను, అసాధుశబ్దములనుగూడ గ్రహించును. గ్రంథవ్యవహారమునందును, లోకవ్యవహారమునందును గల భాషాసర్వస్వమును భాషాశాస్త్రమునకు గ్రహణయోగ్యమే. వ్యాకరణము *సాధుశబ్దములను మాత్రమే యంగీకరించును.

వ్యాకరణము సిద్ధరూపనిష్పత్తి ప్రదర్శనమునందే శ్రద్ధ వహించును. భాషాశాస్త్రము ఒక రూపము నొందుటకు ముందు ఒక శబ్దమే యే రూపముల నొందెనో యోజించును. అట్టి మార్పులకు మూలకారణముల నన్వేషించును. ఆ సందర్భమున ఇతరభాషలనే కాక చరిత్ర, భూగోళము, వర్తకవ్యాపారములు, మతప్రబోధ రాజకీయదాత్యాదులు మున్నగువాని నెన్నింటినో గ్రహించి పరిశీలించును. ఇట్టియెడల భాషాశాస్త్రము మానవశాస్త్రమునందలి ప్రధానాంగముగా తోచునే కాని భాషాక్షేత్రమునకు పరిమితమై యున్నట్లు తోపదు.

వ్యాకరణము స్థిరమైనది (rigid). తాను తీసికొన్న భాషను శాస్త్రనియమములనుబట్టి విశ్లేషణచేసి లక్షణములను నిరూపించును. ఇంక వానికి సడలింపు నంగీకరింపదు. అందువలన కొందరు వ్యాకరణము నభివృద్ధినిరోధక మని భావించుటకూడ నున్నది. ఈ దృష్టితో చూచినప్పుడు భాషాశాస్త్రమునకు తన్యత (elasticity) యెక్కువ. చరిత్ర కందని కాలమునాటి భాషనుండి వర్తమానకాలపు భాషవరకు బారచాపుకొని యున్నది భాషాశాస్త్రము. కావుననే నిమ్నోన్నతముల నిశితపరిశీలనము జోలికి పోక స్థూలధర్మములను వర్ణించి నిర్ణయించుటతోనే భాషాశాస్త్రము తృప్తి వహింపక తప్పదు. ఈ గుణము అభ్యుదయహేతుకమే. విశిష్టభాషలలోని విశిష్టలక్షణములకు స్వాగతము పలికెడి సావకాశము తన కెప్పుడును మిగిలియే యుండును.

* సాధుత్వజ్ఞాన విషయా సైషా వ్యాకరణస్మృతిః - వాక్యపదీయము.

ఇప్పు డింకొక విషయము. వేరు వేరు యుగముల భాషకు వేరు వేరు వ్యాకరణము లవసరము. నన్నయకాలమునాటి భాషకంటె తరు వాతికాలమున భాష పెరిగినది; ప్రబంధకాలమున మరింత పెరిగినది. పదజాలమునందును, వ్యాకరణాంశములందును, అర్థబోధకత్వమునం దును గూడ ఈ పెరుగుదల ప్రభావము కనిపించును. ఆ యా యుగ ముల భాషకు ప్రత్యేకవ్యాకరణములు వెలయును. భాషాశాస్త్రము వాని నన్నింటి నుపయోగించుకొని సాధారణధర్మములను నిర్ణయము చేయును. ఈ విషయమున వ్యాకరణమునకు భాషాశాస్త్రము ఋణ పడి యుండును. వ్యావహారికభాషలను భాషాశాస్త్రము పరిగ్రహించి లక్షణనిరూపణము చేయును కాలక్రమమున నా భాషలు గ్రంథస్థములు కావచ్చును. అప్పుడు వ్యాకరణము భాషాశాస్త్రమునుండి మూలధన మును గ్రహింపవలయును. వేరువేరు దేశభాషల వ్యాకరణముల నుప యోగించుకొనియే విశ్వసామాన్యభాషకు శాస్త్రమును రచించుట సాధ్యపడును. కావున వ్యాకరణ భాషాశాస్త్రము లిచ్చిపుచ్చు కొనుట లచేత పరస్పరబద్ధములై యుండు ననుట వాస్తవము. లక్ష్యమును బట్టియు ప్రక్రియనుబట్టియు భిన్నత్వము కనబడినప్పటికిని పరస్పరసహ కారమునుబట్టి యివి విరుద్ధములు కా వనుట నిశ్చయము.

నిజమునకు భారతీయవ్యాకరణమునందే భాషాశాస్త్రీయధర్మము కూడ ఇమిడియున్నది. వ్యాకరణము నిర్ణయాత్మకము (Prescriptive) వర్ణనాత్మకము (descriptive) అని రెండు విధములు. పాణినిమహర్షి రచించిన అష్టాధ్యాయి నిర్ణయాత్మకవ్యాకరణము. పతంజలిమహర్షి రచించిన మహాభాష్యము వర్ణనాత్మకవ్యాకరణము. నిర్ణయాత్మకవ్యాక రణము సాధుశబ్దనిర్ణయము చేయును. రూపనిష్పత్తిని చూపును. వర్ణ నాత్మకవ్యాకరణము సాధుశబ్దములనే యుపయోగించుటవలనిలాభము, అసాధుశబ్దప్రయోగమువలని నష్టము తద్దృష్టాంతములు, శబ్దపరివర్త నము, తత్కారణములు-మున్నగువాని నన్నింటినో వివరణాత్మకముగా

నిరూపించును. ఈ వర్ణనాత్మకవ్యాకరణమే భాషాశాస్త్రమునకు మూల రూప మనుట సత్యము సంగీకరించుట.

## 2. ఎ. మానవశాస్త్రము

మానవుని గూర్చిన శాస్త్రము మానవశాస్త్రము. ఇది వ్యుత్పత్త్యర్థము. ఇంతమాత్రముచేత స్పష్టత యేర్పడుట కష్టము. మానవశాస్త్రము ప్రత్యేకవ్యక్తులనుగూర్చి కాక సమాజములను జాతులను తెగలను మున్నగువానిని గ్రహించి మానవుల ప్రవృత్తులను నిరూపించును. అట్లే మొత్తము మానవజాతినిగూర్చి కూడ వ్యవహరించును. మానవశాస్త్రము స్థూలముగా రెండు విధములు. మొదటిది భౌతికము. రెండవది సాంస్కృతికము. ఈ సాంస్కృతిక మానవశాస్త్రమునందు భాషాశాస్త్రము ప్రధానాంగము. మానవులు శారీరకధర్మములను బట్టి జంతుస్థితినే నిరూపించుచున్నను భాషవలన సామాజికజీవులై చరిత్రను సంస్కృతిని సాధించుకొన గలుగుచున్నారు.

సాధారణముగా మానవశాస్త్రజ్ఞులు భాషాశాస్త్రజ్ఞుల కడ ఒక ప్రశ్నకు సమాధానము నపేక్షింతురు. ఏవో కొన్ని భాషలను దెల్పి వానికి పరస్పరసంబంధ మున్నదో లేదో చెప్పవలసినదిగా కోరుదురు. భాషలు సజాతీయము లైనయెడల తద్భాషాభాషులకు జన్మసంబంధ ముండియుండు నని నిర్ణయించుట కవకాశము కలదు. దీనిని ధ్రువపరుచుట కితరసాక్ష్యముల యావశ్యకముకూడ కలదు. అట్లే శరీరనిర్మాణాది లక్షణములనుబట్టి మానవశాస్త్రము మానవజాతిని వేర్వేరు తెగలుగా విభాగము చేయును. ఆ తెగల భాషలను వేరువేరుగా వివేచన చేసి భాషాశాస్త్రము భాషాకుటుంబనిర్ణయము చేయగలుగును. ఈ విధముగా భాషాశాస్త్ర మానవశాస్త్రములు పరస్పరము సహకరించుకొనును.

ఇంతేకాక భాష నవగాహనము చేసికొనుటకు తద్వ్యవహార క్షేత్రమైన సమాజము నవగాహనము చేసికొనుట యవసర మగును. భాషయందలి వ్యాకరణాంశములు కాని, భాషయందలి అర్థబోధకత్వము గాని సామాజికప్రవృత్తి నాశ్రయించి, ఆచారవ్యవహారముల నాశ్రయించుకొని యుండును. కొన్ని భాషలయందు ధారాళముగా నుపయోగపడు కొన్ని పదములను భాషాంతరీకరింపవలయునన్న కొన్నియెడల అసాధ్యమే యగును; కొన్నియెడల ఒక్కమాటచేత బోధింపబడిన భావమును వివరణప్రాయముగా అనువదింపవలసివచ్చును. బంధుత్వబోధక వాచకము లీ విషయమును బాగుగా విశదీకరించును. తెలుగునందలి అక్క, చెల్లెలు, అన్న, తమ్ముడు మొదలైన మాటలు స్పష్టనిర్దేశము చేయుచున్నవి. ఆర్యభాషలయం దిట్టి నిర్దేశము కానరాదు. 'భగిని' అని యన్నప్పుడు అక్క కావచ్చును; చెల్లెలు కావచ్చును. 'భ్రాత' యని యన్నప్పుడు అన్న కావచ్చును; తమ్ముడు కావచ్చును. అనగా వయస్తారతమ్యనిరూపణములే దన్నమాట. అట్లే Uncle అను మాటకు మేనమామ యనియు, పినతండ్రి యనియు నర్థము చెప్పవచ్చును. తెలుగు సమాజము స్పష్టనిర్దేశము నపేక్షించుచుండగా, ఆంగ్లాదిభాషలయందు అట్టి యవసరము కానరాదు. అది ఆ యా సమాజముల దృక్పథమును బట్టియు, వ్యవహారవిధానమునుబట్టియు నుండు ననుట చాల వరకు సత్యము. ఈ విషయము మానవశాస్త్రజ్ఞుల కృషి ననుసరించి నిర్ణయింపబడును.

వేరువేరు తెగల జనులు వేరువేరు దేశములయం దుందురు. ఆ దేశముల వాతావరణపరిస్థితులనుబట్టి ఆ జనులభాష పరిణామము నొందుచుండును. ముఖ్యముగా ధ్వనివివర్త విషయమున వాతావరణ ప్రభావము నంగీకరింపక తప్పదు. ఏ జాతి జనులు ఏ ప్రాంతమునందున్నారో, అచ్చటి వాతావరణపరిస్థితు లెట్టివో నిర్ణయింపవలసినది మానవశాస్త్రము. ఆ జాతిజనులు మాటడుభాష యే కుటుంబమునకు

చెందినదో, మూలభాషకంటె ఆ భాషలో నేయే మార్పులు కలిగినవో, అవి యెప్పుడెప్పు డెందువలన కలిగినవో నిర్ణయింపవలసినది భాషా శాస్త్రము. అయినను నిర్ణయసమయమున రెండు శాస్త్రములు నేకాభిప్రాయము లైనప్పుడే ఆ నిర్ణయము దోషరహిత మగును.

భిన్నజాతులకు చెందిన జనులు ఒకే భాషను మాటాడుట ఒకే జాతికి చెందిన జనులు భిన్నభాషలను మాటాడుట కూడ మిక్కిలి యెక్కువగానే యుండును. ఇది కాలక్రమమున నేర్పడును. ఇట్లేర్పడుటకు సామాజిక రాజకీయ వాణిజ్యాదులు హేతువులు కానవచ్చును. ప్రకృతమున్న స్థితినిబట్టి జాతికిని భాషకును ముడివెట్టరాదు; కాని ఆదిమ కాలమున ఆ రెండింటికి సంబంధ ముండియుండు ననుట యుక్తిసంగతము.

మానవజాతి వ్యవస్థాత్మకము. మానవభాష వ్యవస్థాత్మకము. మానవజాతిని వివేచించి నిరూపించునది మానవశాస్త్రము. మానవ భాషను వివేచించి నిరూపించునది భాషాశాస్త్రము. జాతియందలి తెగలను, ఉత్థాన్న పతనములను, సంస్కృతి నాగరకతలను ఇతర జాతులతోడి సంబంధములను మానవశాస్త్రము నిరూపించుచుండగా, భాషా శాస్త్రము భాషయందలి భేదములను, ఆదాన ప్రదానములను, పరిణామ వివర్తములను నిరూపించును. ఈవిధముగా భాషాశాస్త్రము మానవ శాస్త్రమునందలి భాషేతరసంస్కృతిని గుర్తించుటకు సాధక మగుటయే కాక, తద్ద్వారమున తానుగూడ స్పష్టముగా లక్షణనిరూపణమునకు సామర్థ్యమును గడించుకొన్నది.

## 2. 3 శరీర శాస్త్రము

భాష శారీరకము మానసికము కూడ నై యున్నది. భాష ధ్వన్యాత్మకము. భాషాధ్వనులు రెండు విధముల ధర్మములను కలిగి యున్నవి. అందు మొదటిది ఉచ్చారణధర్మము, రెండవది శ్రావణ ధర్మము, ధ్వనివిజ్ఞానము (Phonology) ధ్వనుల ఉచ్చారణధర్మము

ననుసరించి ఉచ్చారణ ధ్వనివిజ్ఞానము (Articu'atory Phonetics) గాను, శ్రావణధర్మము ననుసరించి శ్రావణ ధ్వనివిజ్ఞానము (Aconstic Phonetics) గాను రెండు విధముల విభక్త మగుచున్నది.

ధ్వనుల యుచ్చారణ కుపయోగపడు సంగములను 'వాచికాంగ ములు' (Organs of speech) అని శాస్త్రజ్ఞులు పేర్కొందురు. నిజము నకు మానవశరీరనిర్మాణమునందు భాషాభాషణ కుద్దిష్టములైన యవ యవము లేమియు లేవు. అయినను మానవుడు తన ప్రయత్నముచేత, తన ధిషణావిశేషముచేత ఇతరప్రయోజనోద్దిష్టములైన యవయవము లను భాషాభాషణమునకై వినియోగించుకొన సాగెను. *కావున, ఆ యా యవయవముల నదనముగా నుపయోగించి, మానవు దాకాం క్షితప్రయోజనమును సాధించుకొనుట యదనపు లబ్ధియే.

శ్వాసకోశము, కంఠనాళము, తాలువు, జిహ్వ, దంతములు, ఓష్ఠములు, నాసిక - ఇవి యన్నియు భాషాభాషణమున భాగస్వాము లైన యవయవములే. కావున వీనిని వాచికాంగములుగా పేర్కొనుట సమంజసమే. శ్వాసకోశములోని వాయువు కంఠనాళము వెంబడి ప్రస రించి ముఖవివరమునుండి కాని నాసికావివరమునుండికాని వెలువడును. ఈలోపుగా నాదతంతులను ప్రకంపింపజేయును. జిహ్వాభాగము నోటి యందలి వేర్వేరు భాగములను వేర్వేరు ప్రయత్నములతో స్పృశిం చును. ఆ విధముగా ధ్వనుల యుత్పత్తి జరుగును. ఈ వర్ణనము ముఖ యంత్రమునకు సంబంధించినంతవరకు యథార్థమే. దీనికి వెనుక నాడీ మండలము చేయు కృషి మిక్కుటముగా కలదు. ఏ యవయవ మే చలనము నొందినను దానికి నాడీస్పందనమే కారణము.

* Physiologically, speech is an overlaid function, or, to be more precise, a group of overlaid functions—

— Language by Edward Spair.

ఇది యిట్లుంతము. మెదడునందు భాష స్థానికత్వము (locali-zation) పొందియుండు నని వైద్యశాస్త్రజ్ఞుల యభిప్రాయము. మెదడు పెక్కు భాగములుగా విభక్తమై యుండును. అం దొక్కొక్క విభాగ మునకు ఒక్కొక్క విశిష్టధర్మ ముండును. ఒక భాగము స్మృతికి, ఒక భాగము నిర్ణయమునకు, ఒక భాగ మవగాహనమునకు మున్నగు విధముగా కేటాయింపబడును. అట్లు కేటాయింపబడిన శ్రావణ మార్గము (auditory tract) నందో, మరొక భాగమునందో భాషా ధ్వనులు ప్రతిష్ఠితములై యుండును. శారీరక మానసిక సంబంధము గల భాషాంశములు మెదడుతో సంబంధము నేర్పరచుకొనును. మెదడు నందలి యీ భాగము సమర్థముగా లేనియెడల భాషను గ్రహించుట యందు, ప్రయోగించుటయందు అసమర్థత తప్పక వెల్లడి యగును. వాచికాంగములయందు ఏవిధమైన లోపము లేకున్నను కొందరు భాషా ర్జనప్రయోగములందు వెనుకబడియుండుటకు మెదడునందలి తత్ప్రత్యేక భాగస్థితిలోపమే కారణము.

ఒక దృశ్యమును చూచినప్పుడు, ఒక వాక్యమును విన్నప్పుడు దాని నవగాహనము చేసికొనుటలో, ప్రతిస్పందించుటలో మెదడు మిక్కిలి ప్రాధాన్యము వహించును. కన్నులు చూచును; చూచిన పదార్థమును చూచినట్లు గ్రహించునది మెదడే. చెవులు వినును; విన్న విషయమును విన్నట్లు గ్రహించునది మెదడే. ప్రతిస్పందనము నంద జేయునది మెదడే. మెదడులో కలిగిన సంకల్పమునుబట్టియే నాడీమండ లము స్పందించును; కండరములలో కదలిక పుట్టును. అప్పుడు వాగ్రూప మున గాని, చేష్టారూపమున గాని, ఉభయరూపమున గాని ప్రతిక్రియ జరుగును. కావున, ఇది యంతయు శృంఖలారూపమున జరుగు సంచో దనప్రక్రియ. దీనికి నియంత్రణపీఠము మెదడు.

భాషాధ్వనుల శ్రావణధర్మమునుబట్టి చెవులుకూడ భాషాపరి కరము లగుచున్నవి. ఉచ్చారితధ్వనులు తరంగములుగా కర్ణభేరిని

స్పృశించి, తద్ద్వారమున నచ్చటనున్న ద్రవపదార్థమును కదలించును. ఆ కదలిక శ్రావణమార్గముల (auditory tracts) వెంబడి మెదడును చేరుకొనును. *మొత్తముమీద భాష నోరు, చెవులు, మెదడు, నాడీ మండలము, కండరములు - అను నన్నింటిని వినియోగించుకొనును. లిపిరూపమైన భాష కన్నులనుగూడ వినియోగించుకొనును.

ఉచ్చారణధ్వనులు ముఖికధ్వను లని, నాసికధ్వను లని స్థూలముగా రెండు విధములు. కంఠ్యములు, దంత్యములు, తాలవ్యములు, ఓష్ఠ్యములు, మూర్ధన్యములు మున్నగువిధముగా మరల వర్గీకృతము లగును. ఈ పేరులనుబట్టియే తత్తదవయవముల కున్న ప్రాధాన్యము నూహింపవచ్చును. ఆ యా యవయవములను సమర్థముగా గుర్తించుకొని, తగినవిధముగా నభ్యసించినయెడల సముచితోచ్చారణ పాటవము సమకూరు ననుటలో సందేహము లేదు. అన్యభాషాధ్వనులను సాధన చేయుటలో ఈ గుర్తింపు మరింత సహకరించును. పైవివేచననుబట్టి భాషాశాస్త్రజ్ఞానమునకు శరీరశాస్త్రజ్ఞాన మావశ్యక మని యనలేము కాని, భాషకు శరీరాంగముల సహకారము తప్పనిసరి యని నిశ్చయింపగలము. అట్లే బౌద్ధిక మానసిక వినియోగముకూడ భాషావ్యవహారమున తప్పనిసరి యని యొప్పుకొనవలయును.

## 2. ౪ మనస్తత్త్వశాస్త్రము

భాషాసామాన్యమునుగూర్చి వివేచనచేయుట భాషాశాస్త్ర విషయము. భాషను ప్రజ లెట్లు వాడుచున్నారో, ఎట్లు అభ్యసించు

* 'Speech is not a simple activity that is carried on by one or more organs biologically adapted to the purpose. It is an extremely complex and ever-shifting network of adjustments — in the brain, in the nervons system, and in articulating and auditory organs - tending towards the desired end of communication.' — Ibid.

చున్నారో వివేచనచేయుట మనస్తత్త్వశాస్త్రవిషయము. భాష భావవాహకము; భావములు మనోజన్యములు. భాషయొక్క స్వరూపము భావములయొక్క స్వరూపము నావిష్కరించును. భావములు విషయము కాగా భాష విషయి యగునని తాత్పర్యము.

మానవుని ప్రవర్తనసాధనములలో భాష ప్రధానము. మనస్తత్త్వశాస్త్రవేత్తలు భాషాప్రయోగవైఖరి నాధారము చేసికొని ప్రవర్తన వైఖరిని నిర్ణయించుట సామాన్యముగా కనిపించును. మానసికముగా సమస్థితి కలిగినవాడు భాష నొక తీరుగా నుపయోగించును; సమస్థితి తప్పినవాడు మరొక తీరుగా నుపయోగించును. ఉన్మత్తులు కాని, త్రాగుబోతులు కాని మాటలాడునప్పుడు ఈ భేదము స్పష్టముగా గోచరించును. మిక్కిలి సంతోషమువల్ల గాని, విచారమువల్ల గాని మాటలలో తడబాటు కలుగును. సాధారణముగా నుండు భాషాపద్ధతిలో మార్పు వచ్చును. ఇది స్థూలదృష్టికి కూడ గోచరించును. శాస్త్రజ్ఞులింతకంటె సూక్ష్మముగా గ్రహింపగలరు. కావున, వారు భాషను సాధనముగా చేసికొని ఒక వ్యక్తియొక్క ప్రవర్తనమును పరిశీలింపగలరు. మానసికముగా ఆరోగ్యవంతుడో కాడో నిర్ణయింతురు. అతని జీవితమున నేమేని గోప్యములైన యంశము లున్నవేమో పరిశోధింతురు. నిజమున కిది యంతయు మనస్తత్త్వశాస్త్రవిషయమే యైనప్పటికిని భాషాశాస్త్రము దీనికి తోడ్పడుచున్నది.

సాధారణముగా ఒక వ్యక్తి భాషనుబట్టి ఆ వ్యక్తి గుణగణమును నిర్ణయించుట జరుగుచుండును. చదువు, సంస్కారము, జ్ఞాపకశక్తి, వివేచన, అవగాహన, భావుకత్వము, వైజ్ఞానికతత్త్వము మున్నగు ననేకాంశములు భాషాప్రయోగమువల్లనే ప్రతిబింబితము లగుచుండును.

నిజమునకు భాష ఆలోచనావిధానమునకు అత్యంతప్రధానము. భాష యని యన్నపుడు పదసామగ్రియు, వ్యాకరణవిధానమునుగూడ

గ్రహింపబడును. ఈ రెండు విధానములుగూడ ఆలోచనకు సహాక రించును. మొట్టమొదట ఆలోచన సాగవలయునన్న పదసామగ్రి కావలయును. కొన్ని వస్తువులను నిర్దేశించుటకు కొన్ని పదములు వ్యవ హరించును. వానికి గల సంబంధమును నిరూపించుటకు వ్యాకరణాంశ ముల యవసరము కలుగును. 'Where did you come from?' అన్న వాక్యమునందు చివరనున్న పదము మొదటి పదముతో సంబం ధమును కలిగియున్నది. ఈ విధమగు ప్రశ్నార్థకవాక్యము వాడుటకు వక్త ఎంతో సన్నద్ధుడై యుండవలయును. మొదటి మాటను వాడు సరికే చివరి మాట యాతని మస్తిష్కమునందు స్థిరపడి యుండవలయు నన్నమాట! అట్లు కానినాడు ఈ విధమగు వాడుక సాధ్యము కాదు. ఇది వ్యాకరణాంశము. ఇంక పదవిషయముకూడ నిట్టిదే. మనకు స్ఫురించిన అర్థములును భావములును మాటల రూపములోనే స్ఫురిం చును. అట్టి మాటలు లేనప్పుడు స్ఫురణ యాగిపోవును; అనగా ఆలో చన సాగదు. ఒకవేళ సాగునని యొప్పుకొన్నను నిర్దిష్టరూపమును గైకొనదు. కావున భావముల నావిష్కరించుటకే కాక, భావము లావిర్భవించుటకుకూడ భాష యవసర మన్న విషయము తేలుచున్నది.

ఆలోచించుట నభ్యసింపవలయునన్న ఆలోచన కాధార భూతమైన భాష నభ్యసింపవలయు నని యర్థము. పైని చెప్పినట్లు సమగ్రవాక్యమును భావింపగల దృష్టి ప్రవర్తనక్రమమునకు సహా కరించును.

కొందరు వాక్యములను ముక్క ముక్కలు చేసి మాటలాడు దురు. కొందరు ఒక్కొక్క ముక్కకు ముందుగాని వెనుకగాని అర్థ రహితమైన యుచ్చారణము చేయుదురు. ఆలోచనయందు అనుస్యూతి లేనియెడల వక్త ఒక ముక్కను పలికి, అక్కడ ఆలోచనకై ఆగిపోవును; తరువాత మరల కొంత చెప్పి యాగును. ఇది ఆలోచనలోని అంత

రాయములను వెల్లడించును. కొందరు తగినమాటను వెదకుకొనుటకై చేసెడి యత్నముచేత సైత మాగిపోవచ్చును. తగినంత పదసామగ్రి లేనప్పుడుకూడ ఈ చిక్కు తటస్థింపవచ్చును. ఇంతకు నిది భావ లోపమో భాషాలోపమో తెలిసికొనుటకు ఇతరేతరప్రవర్తనముల సహకార మవసరము. కొందరు అర్థరహితములైన యుచ్చారణముల నలవాటు చేసికొందురు. ఇదియు ఆలోచనలయందలి యంతరాయము లను కప్పిపుచ్చుకొనుటకు చేసెడి ప్రయత్నమే. కొంత నిర్లక్ష్యము కూడ కారణము కావచ్చును. భాషాప్రయోగరీతులనుబట్టి ప్రవర్తనను కొంత గుర్తింపవచ్చు ననుట కీ పాటి చాలును.

వ్యక్తిమనస్తత్త్వమునే కాక సామూహికమనస్తత్త్వమునుగూడ భాష యావిష్కరింపగలదు. వాక్యనిర్మాణగతక్లేశము జాతి మన స్తత్త్వగతక్లిష్టతకు సూచకము కావచ్చును. 'రాముడు రావణుని సంహ రించెను' అని యన్నప్పుడు కర్తకును క్రియకును నడుమ వ్యవధాన మున్నది. 'Rama killed Ravana' అని యన్నప్పుడు అట్టి వ్యవ ధానము లేదు. తెలుగువాక్యమునందు వ్యాపారముకంటె లక్ష్యము ముందున్నది. ఆంగ్లవాక్యమునందు లక్ష్యముకంటె వ్యాపారము ముం దున్నది. ఇది తత్తద్భాషాభాషుల సామూహికమనస్తత్త్వమునకు సూచక మనియే కొందరు శాస్త్రవేత్తలు భావింతురు.

మాతృభాషాశిక్షణ, అన్యభాషాశిక్షణ, విద్యావిధానము మున్నగు విషయములు మనస్తత్త్వశాస్త్రపరిధిలో ప్రవేశించి పరిశీల నార్హతను గడించుకొన్నవి. మనస్తత్త్వభాషాశాస్త్రము (Psycho-linguistics) అను విభాగము రెండు శాస్త్రముల ననుసంధించు చున్నది.

## 2. ఇ భౌతిక శాస్త్రము

ఘన ద్రవ వాయు రూపము లందున్న సర్వవస్తువులను, కాంతి శక్తి ఉష్ణము ధ్వని మున్నగువాని లక్షణములనుగూర్చి విశ్లేషించి

చెప్పునది భౌతికశాస్త్రము. ఇందు ధ్వనివిషయము భాషాశాస్త్రమును సన్నిహితముగా నాకర్షించుచున్నది. భాషాశాస్త్రమునం దొక ప్రధాన విభాగము ధ్వనివిజ్ఞానము. ఈ విజ్ఞానము శ్రావణ ధ్వనివిభాగము (Acoustic Phonetics) అని, ఉచ్చారణ ధ్వనివిభాగము (Articulatory Phonetics) అని రెండు విధములు. భౌతికశాస్త్రజ్ఞులు ధ్వని (Sound) ని గూర్చి యాలోచించునప్పుడు ఈ రెండు విధములయిన ధ్వనులనుగూర్చి కూడ ఆలోచించుట యావశ్యక మగును.

భాషానిర్మాణముయొక్క అభివ్యక్తి ధ్వనుల నాశ్రయించుకొని జరుగును. ధ్వని యని యన్నప్పుడు శ్రావణ లక్షణము (Acoustic character) కలదనియే యర్థము. అది భాషావిశ్లేషణమునకు సహాకరించు సాధనము. కొన్ని ధ్వనులు స్థూలముగా నొక విధముగనే వినిపింపవచ్చును. కాని యంత్రసాహాయ్యమున గమనించినప్పుడు వాని భేదము గోచరము కాగలదు. భౌతికశాస్త్రము Spectrograph అను యంత్రమును నిర్మించినది. ఈ యంత్రము ఒక ప్రత్యేక మయిన కాగితముమీాద ముద్రితసంగీతము (Printed music) రీతిగా రేఖాచిత్రమును చిత్రించును; ఈచిత్రణము వేర్వేరు కాలఘటకములందు, వేర్వేరు ధారాళతాస్థాయులయందు ధ్వనుల ఘనిష్ఠతలను (intensitics of sounds) నిరూపించును. ఇంతకు పూర్వమున్న kymogramsకంటె oscillograms కంటె ధ్వనిశాస్త్రవేత్తకు spectrograms అత్యధిక ప్రయోజనములుగా పరిణమించును.

మార్టిన్ జూస్ అను భాషాశాస్త్రాచార్యుడు తన యనుభవమును పురస్కరించుకొని sound spectrograph ధ్వనివిజ్ఞానములో చాల విశేషములను వెల్లడింపగలదని తెల్లము చేసెను.

పెక్కు సాధనములు నేడు భాషాధ్యయనసందర్భమున నుపయుక్తము లగుచున్నవి. ఉపాధ్యాయుడు పాఠము చెప్పుచున్నంతసేపు విద్యార్థుల కభిముఖముగా నుండి, బోర్డుపైని వ్రాయవలసినప్పుడు వెనుకకు తిరుగవలసి వచ్చును. ఇట్లు చేయుట ఏకాగ్రతకు కొంతవరకు భంజకము కాగలదు; ఇంతేకాక విద్యార్థుల ప్రతిక్రియ (response) ను గుర్తించు నవకాశము అధ్యాపకుని కంతగా కలుగదు. ఈ యిబ్బందిని తొలగించుటకై 'overhead projector' వాడుట ప్రారంభమైనది. ఉపాధ్యాయుడు వ్రాయవలసిన దెల్ల తన ముందున్న 'ప్లాస్టిక్ ఫిల్ము' మీద వ్రాయును. అది పారదర్శకము. ప్రొజెక్టరు సాహాయ్యమున నది బోర్డుస్థానమున నున్న తెరపై ప్రతిఫలించును. ఇట్లు చేయుటవలన విద్యార్థులు సమకాలమున దర్శన శ్రవణ శక్తులను వినియోగించుకొని, తమ యవగాహనశక్తి నభివృద్ధి పరుచుకొందురు.

Opaque Projector అను సాధనముకూడ మిక్కిలి యుపయోగించుచున్నది. దేశపటములు, రేఖాచిత్రములు, ఛాయాచిత్రములు మున్నగువానిని తరగతిగదిలో ప్రచర్శింపవలసిన యావశ్యక మెంతయో కలదు. అవి పెద్ద ప్రమాణములో నున్నప్పుడు మాత్రమే అందరకు దర్శనీయములై అనుకొన్న ప్రయోజనమును సాధించును. కొన్ని యెడల నట్లు పెద్ద ప్రమాణమున నిర్మించుట వీలగును; కొన్నియెడల నట్లు వీలుకాదు; కొన్నియెడల వీలున్నను ధన శక్తి యుక్తి కాలములు మిక్కిలిగా వ్యయమగును. భౌతికశాస్త్రము భాషాధ్యయనమునకు తోడ్పడి యీ యిబ్బందిని తప్పించుచున్నది. అచ్చుపుస్తకములయందు అల్పప్రమాణములో నున్న బొమ్మలను, అక్షరములను, దేశపటములను ప్రతికృతులను ఈ యంత్రమువలన తెరపై పెద్దవిగా ప్రదర్శింపవచ్చును. విద్యార్థులు వానిని స్పష్టముగా గుర్తించుటకు, ఉపాధ్యాయులు వానిని విశదీకరించుటకు ఈ పద్ధతి యెంతగానో యుపకరించును.

పై సాధనములు స్థితిప్రదర్శకములు మాత్రమే; గతిప్రదర్శకములు కావు. ఫిల్మును ప్రదర్శించునెడల చలనమును సైతము గుర్తింపవచ్చును. అక్షరోచ్చారణసమయమున ముఖయంత్రమునందలి కదలికలను 'ఫిల్మ్' తీసి, ప్రదర్శించినయెడల విద్యార్థులు స్పష్టముగా గుర్తించుకొనగలుగుదురు. ఇట్లే టేపురికార్డులు, గ్రామొఫోనుడిస్కులు మొదలయిన వానివలన సరియైన యుచ్చారణమును గమనించుట కవకాశము కలుగును. నిజమున కెవరి యుచ్చారణము వారికి తగినంత పరిచితము కాదనియే చెప్పవచ్చును. ఇతరుల యుచ్చారణమును టేపులపైని గాని డిస్కులపైని గాని భద్రముచేసి దాని ననుకరించుటకు భాషావిద్యార్థి యత్నముచేయును. అందెంత సఫలత నొందెనో తెలిసికొనుటకు, తన యనుకృతధ్వనులను రికార్డుచేసి వినవలయును. అప్పుడు రెండింట గల భేదమును గుర్తించుటకు, తన్ను దాను సవరించుకొనుటకు వీలు కలుగును. ఇట్లే రేడియో, టెలివిజను మున్నగునవి భాషాధ్యయనమునకు నుపకరించును.

Languge Laboratory, Linguistic clinic మున్నగుపేరులతో పెక్కుప్రవృద్ధదేశములందు భాషాప్రయోగశాలలు గలవు. అందు పైని చెప్పికొన్న యాంత్రికసాధనము లన్నియు నుపయుక్తము లగుచుండును. కాని వీని నన్నింటి నుపయోగించినయెడల ప్రయోగశాల యంతయు బహుళధ్వనికోలాహలముగ నుండును. అట్లు కాకుండుటకై ప్రతి పరిశోధకునకు earphones ఉండును. తనకు కేటాయించిన గదియందే అతడు పరిశోధన సాగించును.

కంప్యూటరు, టెలిప్రింటరు, టైపురైటరు మొదలయిన యంత్రములు భౌతికశాస్త్రవేత్త నిర్మించినవే యైనను, భాషాశాస్త్రజ్ఞునకు సైతము తన్నిర్మాణమునందు తగినంత స్వామ్యము లేకపోలేదు.

[10]

## 2. ౬. గణితశాస్త్రము

ప్రాచీనగ్రీకు తాత్త్వికులు, జ్ఞానమునంతను అంకెలు (numbers) అక్షరములు (letters) అని రెండంగములుగా విభాగించిరి. అంకెలు గణితశాస్త్రమునకు సంకేతము. అక్షరములు సాహిత్యమునకు సంకేతము. క్రమక్రమముగా గణితము వేర్వేరు శాస్త్రముల కుత్పత్తిస్థానమైనట్లే, సాహిత్యముకూడ వేర్వేరుకళలకు శాస్త్రములకు నుత్పత్తిస్థానమైనది. భాష శాస్త్రీయదృష్టితో పరిశీలితమై శాస్త్రీయముగా వర్ణితము కావలసినప్పుడు సూత్రపద్ధతి ననుసరించుట ప్రాచీనసంప్రదాయము. అష్టాధ్యాయి, ఆంధ్రశబ్దచింతామణి, బాలవ్యాకరణము మున్నగునవి యందులకు లక్ష్యములు. భాషాసామాన్యము భాషాశాస్త్రవిషయము. ఇట్టియెడల సూత్రపద్ధతికంటె సూక్ష్మతరపద్ధతి యావశ్యకము. సంజ్ఞలతో సంకేతములతో సాగెడి గణితశాస్త్రపద్ధతి ఆ యవసరమును తీర్పగలిగినది. భాషాశాస్త్రమునందు నవీనశాఖలుగా నున్న ఉత్పాదక వ్యాకరణము (generative grammar) నందును, పరావర్తన వ్యాకరణము (transformation grammar) నందును సంజ్ఞలును సంకేతములును సూత్రముల స్థానము నాక్రమించుకొని యున్నవి. వీనివలన విశ్వతోముఖవ్యాప్తి లభించినది. ఇంతేకాక నిశ్చయాత్మకత, నిర్దిష్టత యేర్పడినవి.

ఏ శాస్త్రమైనను శాస్త్ర మగుటకు నిర్దిష్టతను, నిశ్చయాత్మకతను సంపాదించుకొనవలయును. మొదటి దినములలో విషయమును సేకరించుట, వర్గీకరించుట, తులనాత్మకపరిశీలనము చేయుట, వర్ణించి చెప్పుట - యన్నవి శాస్త్రమున కంగములుగా వ్యవహరించును. కాని యీ పరిశీలనములవలన తెలిసిన వాస్తవములను సిద్ధాంతీకరించుట యవసరము. వానిని ఉపపత్తులు చూపి నిరూపింపవలయును. అట్లు

చేయుటకు గణితశాస్త్రపద్ధతి యుపాదేయము. అప్పుడు మాత్రమే వర్ణనాత్మకశాస్త్రము నిజమైన శాస్త్రముగా పరిగణిత మగును. ఈనాడు గణితశాస్త్రసహకారముచేత తర్కశాస్త్రము, తత్త్వశాస్త్రము, శరీరశాస్త్రము, మనస్తత్త్వశాస్త్రము మొదలయినవి నిజముగు శాస్త్రకక్ష్యలోనికి చేరుచున్నవి. అట్లే భాషాశాస్త్రముకూడ శాస్త్రత్వమును సాధించుకొనుచున్నది.

భాషాశాస్త్రము తనకు కావలసిన ముడిపదార్థము నెక్కువగానే సేకరించినది. కాని, దానిని విశ్లేషించుటకును వివరించుటకును సాధనమైన గణితశాస్త్రము నుపేక్షించినది. మార్సెల్ కోహెన్ అను ఫ్రెంచి విద్వాంసుడు *'భాషావాతావరణమును భావించునప్పుడు గణితము నలక్ష్యముచేయుట యింకను సాగుట యనగా భాషాశాస్త్రాభివృద్ధికి ప్రతిబాధనము నేర్పరుచుటయే'యని తెలిపెను. నవీనకాలమున యాంత్రికాభివృద్ధియధికముగా సాగుచున్నది. విస్తృతమైన విషయమునుసంక్షిప్తముగా చెప్పుట యావశ్యకమగుచున్నది. దీనికి సంకేతములు శరణ్యములు కాక తప్పదు. అట్లే దూరముద్రణము (Teleprinter) మొదలయిన యంత్రములు గణితశాస్త్రము నాధారముచేసికొని యున్నవి. అందువల్లనే గణితశాస్త్రము భాషాశాస్త్రపరిధిలోనికి చొచ్చుకొని వచ్చుచున్నది. గణితాత్మక భాషాశాస్త్రము (Mathematical linguistics) అను విభాగముకూడ ఆవిర్భవించినది.

ప్రాథమికవిద్యార్థులకు వాచకమును రచింపవలయునన్న గణితశాస్త్రావసరము తలయెత్తును. ఇది వినుటకు విచిత్రముగా నుండును; కాని ఆదర్శవంతమైన వాచకము నిర్మితము కావలెనన్నచో, అదితప్పదు.

---

*'...to continue to ignore numbers when considering linguistic phonomena would be tantamount to putting a brake on the development of linguistics.'

ఎన్నిమాటలను విద్యార్థులు గురుతుంచుకొనగలరో, ఏమాటలకు పిమ్మట ఏమాటలను చెప్పవలయునో, సాధారణసంభాషణను కొనసాగించుటకు గానిఒక చిన్నకథను సొంతముగా చెప్పుటకు గాని ఎన్ని మాట లవసర మగునో – ఈ విషయముల నన్నింటెని ముందు పరిగణించుట యవస రము. వయోజనుల కుద్దేశించిన పుస్తకముల రీతి వేరుగా నుండవల యును. చిన్నపిల్లల పుస్తకములు పదములను, పదార్థములనుగూడ బోధింపవలయును; అవి వారి పరిసరములను దాటి పోరాదు. వయో జనుల కీవరకే యనుభవ మున్నది. వారికి పద పదార్థముల బోధయు నుండును. కావున పిల్లల పుస్తకములు వారికి పనికి రావు. వారికి తగి నట్లు, వారి పరిసరములనుబట్టి, గ్రహణశక్తినిబట్టి, వ్యవహారక్షేత్రమును బట్టి గ్రంథములను రచింపవలయును. ఇట్లే అన్యభాషీయులకు వ్రాయు గ్రంథములు మరొక విధముగా నుండును. వారి కింతకు ముందే స్వభాషా సామర్థ్య మున్నది. భావములు తెలిసినవే; భాష క్రొత్తది. ఇందువలన కొంత సౌకర్య ముండును. స్వభాషాభ్యాసమువలన వచ్చెడి యిబ్బందులు కూడ కొన్ని యుండును. వీని నన్నింటిని గమనించి, యోగ్యవిధముగా గ్రంథరచన సాగించినపుడే యుద్దిష్టప్రయోజనము నెరవేరును.

నిఘంటునిర్మాణమునందు సైతము గణితశాస్త్ర మగణితప్రయో జనమును సాధించిపెట్టును. ఏ భాషయందైనను వేలకొలది పదము లుండును. అన్ని పదముల నందరు నుపయోగింపరు. వ్యవహర్తలను బట్టి పదముల యుపయోగము మారుచుండును. కావున పదప్రాచుర్యము (Word frequency) ను గుర్తించుట యవసరము. ప్రాథమికములు సంక్షిప్తములునైన నిఘంటువులందు ప్రాచుర్యముగల పదములను మాత్రమే చేర్పవలయును. అంతకంటె పెద్దవానియందు ప్రాచుర్యము తక్కువగల పదములనుగూడ చేర్పవలసి యుండును. అట్లే సాహిత్య

భాష కుద్దేశించిన నిఘంటువు, వ్యావహారికమున కుద్దేశించిన నిఘంటువు కంటె భిన్నముగా నుండవలయును. ఈ వ్యవహార మంతయు భాషా శాస్త్రజ్ఞుడే నిర్వహించినప్పటికి, గణితశాస్త్రవిధానము నవలంబించి నప్పుడే నిజమైన ప్రయోజనమును సాధింపగల్గును.

ఇట్లే Printing letters నిర్మాణమునందు, type writers నిర్మాణమునందు భాషాశాస్త్రవేత్త గణితశాస్త్రదృష్టిని ప్రదర్శింప వలయును.

## 2. ౭ తత్త్వశాస్త్రము

అత్యంతప్రాచీనకాలమునుండియు భాషాశాస్త్రమునకును తత్త్వ శాస్త్రమునకును మిగుల సంబంధము కలదు. నిజమునకు, భాషా శాస్త్రము వేరుగా రూపొందక పూర్వము తత్త్వశాస్త్రజ్ఞులే భాషా విషయమై యనేకవాదోపవాదములు సాగించి సిద్ధాంతములు చేసిరి. భాషాతత్త్వము నవగాహనము చేసికొనుటకై యనేకయత్నములు గావించిరి; అనేక మార్గముల ననుసరించిరి. నవీనకాలమున నేర్పడిన భాషాతత్త్వాన్వేషణమునకు క్రీస్తుపూర్వమే తాత్త్వికులచే బీజావాపము జరిగినది.

తత్త్వశాస్త్రి మనగా నేమి? యనున దొక ప్రశ్న. అసలు తత్త్వశాస్త్రిమే ప్రశ్నలమయము. పరబ్రహ్మ నుండి పరమా ణువువరకు గల సర్వవిషయములు తాత్త్వికుని కుపాదేయములే. *వాని స్వరూప స్వభావములను, వాని ప్రయోజన పరమార్థములను గ్రహిం చుటకై చేయు నిరంతరాన్వేషణమే తత్త్వశాస్త్రిము. ఆ ప్రశ్నలకు

* "Philosophy is concerned with everything, is a universal science." An Introduction to Philosophy by Jacques Maritain.

సమాధానములు భిన్నభిన్నములుగా నుండవచ్చును. *సమాధానముల కంటె సమాధానములను రాబట్టుటకై యవలంబించు దృక్పథమే తత్త్వశాస్త్రమందు ప్రధానము. అందువల్లనే సర్వశాస్త్రములకు తత్త్వశాస్త్రమే యుపజీవ్యమగుచున్నది. ముఖ్యముగా తర్కశాస్త్రము (logic), జ్ఞానశాస్త్రము (epistemology), సౌందర్యశాస్త్రము (aesthetics), ఆధ్యాత్మికశాస్త్రము (metaphysics), అర్థవిజ్ఞానము (semantics), శాస్త్రవిజ్ఞానము (Philosophy of science), నైతికశాస్త్రము (ethics) మున్నగునవి తత్త్వశాస్త్రముతో సంబంధించి యున్నవనుట నిర్వివాదము. అందువల్లనే కొందరు దీనిని సర్వశాస్త్రజననియనిగను, కొందరు *సర్వశాస్త్రసంగ్రహముగను సంభావించుట జరిగినది. పైని చెప్పిన తర్కశాస్త్రము, అర్థవిజ్ఞానము భాషాశాస్త్రముతో మిక్కిలి ముడిపడి యున్నవి.

ప్రాచీనభారతదేశమునందు వేదవాఙ్మయముతోనే భాషాన్వేషణము ప్రారంభమైనది. బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ప్రాతిశాఖ్యలు - అన్నవి ఆధ్యాత్మికవిషయబోధకములే యైనను భాషా విశ్లేషణముచేయుటలో భాగస్వాములైనవి. తర్కశాస్త్రజ్ఞులు, వేదాంతులు మొదలగు వారు శబ్ద మనగా నేమి? వాక్య మనగా నేమి? శబ్దార్థముల సంబంధ మెట్టిది? మున్నగు ప్రశ్నములనుగూర్చి మిక్కిలి లోతుగా ఆలోచించిరి. శబ్ద వర్ణ ధ్వనుల నుచ్చరించు రీతిని, స్వర

* 'Philosophy is essentially a spirit or method of approaching experience, rather than a body of conclusions about experience?' Introduction to philosophy by E.S. Brightman.

* 'Our subject (Philosophy) is a collection of sciences, such as theory of knowledge, logic, cosmology, ethics and aesthetics, as well as a universal survey.' —

The principles and problems of philosoghy by Roy Wood Sellers.

భేదములను, ధ్వని వివర్తనములనుగురించి విశదముగా నిరూపించిరి. నిరుక్తము శబ్దవ్యుత్పత్తులకు, అర్థవిజ్ఞానమునకు ఆశ్రయము. యాస్కాచార్యునకు ముందే కొందరు నిరుక్తకారు లున్నట్లు యాస్కునిబట్టియే తెలియుచున్నది. ఈవ్యుత్పత్తులను దెల్పు పద్ధతి తరువాతికాలమున మరింత వ్యాప్తి నొందినది.

గ్రీసుదేశమున క్రీ. పూ. ఐదవ శతాబ్దియందే తాత్త్వికులు భాషావిషయశోధనము చేసిరి. ప్లేటో తన "సంభాషణలు" అను గ్రంథములందు శబ్దార్థముల సంబంధమునుగూర్చి చర్చించెను. ప్లేటో నిశ్చయము ప్రకారము శబ్దార్థసంబంధము స్వాభావికము (phussei) పైథాగొరసు, క్రేటిలసు మున్నగువారు గూడ ఇదే యభిప్రాయమును కలిగియుండిరి. కాని అరిస్టాటలు దీనికి భిన్నముగా శబ్దార్థసంబంధము సాంకేతికము (tessei) అని చెప్పెను. డెమాక్రిటను, హెర్మోగెనిసు మున్నగువారు సాంకేతికవాదులు. సోక్రటీసు మధ్యస్థుడు. వస్తువుల పేర్లు స్వాభావికముగనే యేర్పడు ననియు, అయినప్పటికిని సంకేతముకూడ కొంతవరకు పనిచేయు ననియు ఆయన యభిప్రాయము. తరువాతికాలమునందు తాత్త్వికులు పెక్కురు పైవాదముల నాశ్రయించి పదముల వ్యుత్పత్తి నూహించిరి. కొన్నియెడల నీ యూహలు మిక్కిలి విపరీతముగా సాగినవి.

గ్రీకు తాత్త్వికులు జగత్తునందు కనుకొన్న ద్రవ్య, గుణ, చేష్టలనే భాష కన్వయించి పదములను ద్రవ్యము (substance) క్రియ (action), గుణము (quality) అను ధర్మమునుబట్టి విభాగించిరి. భారతీయుల కర్తృ కర్మ క్రియా విభాగముకూడ భారతీయదార్శనిక దృష్టికి నిదర్శనముగా నున్న దని యంగీకరింపవలయును.

తత్త్వశాస్త్రము తాను కనుగొన్న మహావిషయములనుగూడ భాషాసాహాయ్యము లేనియెడల బయలుపరుపలేదు. అంతటి ప్రాధా

న్యము కలది భాష. కావుననే తత్త్వశాస్త్రమునకు భాషనుగూర్చి నిశితముగా విస్తృతముగా ఆలోచించుట యావశ్యకమైనది. తర్కశాస్త్రము మున్నగు నితర శాస్త్రములకువలెనే భాషాశాస్త్రము కూడ బలపడినపిమ్మట తత్త్వశాస్త్రమునుండి వేరుపడిపోయినది.

భాషాశాస్త్రప్రారంభదినములలో వాడిన Philology అన్న పేరు Philosophy తో తనకున్న సన్నిహితత్వమును వెల్లడించుచునే యున్నది. కొందరు భాషాశాస్త్రజ్ఞులు Philosophy of grammar, Philosophy of language అను విధముగా తమ గ్రంథములకు నామకరణము చేయుటనుబట్టికూడ తత్త్వశాస్త్రప్రభావము నూహింపవచ్చును. తత్త్వశాస్త్రమువలెనే భాషాశాస్త్రముకూడ ఒక శాస్త్రము; దానివలెనే యిదియు అనేకశాస్త్రముల కాశ్రయము. *అనేకవిషయములను సేకరించుట, వానిని గురించిన జ్ఞానము సంపాదించుట శాస్త్రవిషయము. సంపాదించిన జ్ఞానమును వివేకము (wisdom) గా మలచుకొనుట తత్త్వశాస్త్రవిషయము. భాషలను గురించి తెలిసికొనుటయే కాక, వాని తత్త్వమును వివేకవంతముగా గుర్తించుటయు భాషాశాస్త్రవిషయమే. అది యప్పుడు మాత్రమే ఉపాదేయము కాగలదు.

## 2. ఆ సాహిత్యశాస్త్రము

సాహిత్యమును, సాహిత్యశాస్త్రమునుగూడ భాష నాధారము చేసికొనియే ప్రవర్తించును. శబ్దార్థముల సహితత్వమే సాహిత్యము; అనగా కేవలము శబ్దము కాని అర్థము కాని తనకు తానుగా సాహిత్యశబ్దమునకు సమర్థముకా దని తాత్పర్యము. శబ్దార్థములకున్న సాంగ

* "Science gives us knowledge, but only philosophy can give us wisdom"—The story of Philosophy by Will Durant.

త్యమే అట్టిది. నిత్యవ్యవహారమునందు సైతమట్లేకదా! నిత్యవ్యవహారమునందు వార్తాప్రేషణమాత్రప్రయోజనమునే భాష సిద్ధింపజేయగా, సాహిత్యభాష తదతిరిక్తముగా సైతము వ్యవహరించును. ఆవేశాత్మకముగా, అలంకారాత్మకముగా, రసాత్మకముగా, ధ్వన్యాత్మకముగా, ప్రతిధ్వన్యాత్మకముగా, ప్రతీకాత్మకముగా - ఇంకను పెక్కు విధములుగా వ్యవహరించి సాహిత్యభాష తన సార్వభౌమత్వమును స్థాపించుకొనును. సాహిత్యవిమర్శకులా యా పలుకుబడులలోని, ప్రయోగములలోని వైచిత్ర్యమును, వైశిష్ట్యమును గమనించి యావిష్కరింతురు. అనగా సాహిత్యశాస్త్రము భాషాప్రయోగవైఖరిని ముఖరితము చేయుచున్న దన్నమాట! భాషాప్రయోగనిర్ధారణము నిజమునకు భాషాశాస్త్రమునం దొక యంశము. సాహిత్యశాస్త్రమీ విషయమున భాషాశాస్త్రపరిధిలో ప్రవేశించును.

వాస్తవ మిట్లుండగా కొందరు సాహిత్యశాస్త్ర భాషాశాస్త్రములను పరస్పర విరుద్ధములుగా పరిగణింతురు. ఒకదానిని మెచ్చుకొనుటకై మరొకదాని నీసడించుటకూడ చేయుదురు. ఇట్లు చేయుట అతివాదమునో, అనభిజ్ఞతనో నిరూపించును. గ్రీకు సాహిత్యశాస్త్రజ్ఞులలో అగ్రస్థానము నలంకరించిన అరిస్టోటలు భాషాంశములనుగూడ వింగడించి భాషాశాస్త్రమునకును ప్రథమాచార్యు డయ్యె ననుట గమనార్హము. ప్రతి సాహిత్యశాస్త్రజ్ఞుడును భాషనుగూర్చి ముచ్చటించియే యున్నాడు. 'కవిత్వమునం దెట్టి భాషను వాడవలయు' నన్నది సాహిత్యమునందు పదేపదే ప్రత్యక్షమగుచు వచ్చిన పెద్ద ప్రశ్న. 'డ్రైడెను' మున్నగువారు యథోచితముగా తమ సమాధానమును వివరించిరి. కావున భాషాపరిగణనము సాహిత్యశాస్త్రమునకు బహిరంగవిషయము కాదు.

భారతీయసాహిత్యశాస్త్రము పదము, వాక్యము మున్నగునంశములను నిర్వచించి వివరించును. గుణము, రీతి, వక్రోక్తి, రసము,

ధ్వని, ఔచిత్యము - మున్నగువిషయముల ప్రస్తావమునందు ప్రాతిపదిక, ప్రత్యయము, క్రియ, సమాసము, లింగము, వచనము, కాలము మున్నగు వ్యాకరణాంశముల ప్రసంగమే ప్రాధాన్యము వహించును. శబ్దార్థ సంబంధ నిర్ధారణము సాహిత్యశాస్త్రమునందు విడువరాని విషయము. శబ్దశక్తికి సంబంధించిన విషయము భాషాశాస్త్రమునందలి అర్థవిజ్ఞానమున కాశ్రయము. ఇంక, సాహిత్యగ్రంథములకు సంతరించిన వ్యాఖ్యలయందును, భాష్యములందును సాహిత్యసౌందర్య వివేచనముతోపాటు భాషానిర్మాణవివేకముకూడ తగుమాత్రముగానే జరుగును. పదసార్థక్యము, వ్యుత్పత్త్యర్థము, సమాసరచనము, తత్సార్థక్యము, పదాన్వయము, సంధివిశేషము, కారకవిశేషము, నుడికారము, లోకోక్తి మున్నగు నంశము లావిష్కృతము లగును. ఇవన్నియు భాషాశాస్త్ర పరిధిలోని విషయములే.

ఇంకొక విషయము. ఆంగ్లాది భాషలందు అంత్యప్రాసము (Rhyme) చాలవరకు అవశ్యనియమముగా పాటింపబడును. అది సాహిత్యవిషయమే. కాని, దానినిబట్టి శబ్దస్వరూపోచ్చారణములను నిరూపించు సౌకర్యము కలదు. Read, Breath, Heard మొదలయిన మాటలను వానికి ప్రాసస్థానమున వాడిన పదములనుబట్టి యుచ్చరింపనగును. మొదటిపదము Dead అనుదానితో ప్రాసమైత్రి నొందవచ్చును; Deed అను దానితోను ప్రాసమైత్రి నొందవచ్చును. ఈ భేదము కాలభేదమును సూచించును. రెండవ పదము Death అను పదముతో మైత్రినొందిన నామవాచక మగును. Sheath మొదలయిన పదముతో మైత్రినొందిన క్రియాపద మగును. మూడవ పదము చూపులకు Beard అను పదముతో సాదృశ్యము వహించును. కాని, ఉచ్చారణముననున్న భేదము వాని మైత్రి నంగీకరింపదు. ఇట్లే ప్రాచీనకాలమునందలి యుచ్చారణరీతి నవగాహనము చేసికొనుట కానాటి సాహిత్య

గ్రంథములు చాలవరకు సహకరించును. తెలుగులో సైతము సబిందుక నిర్బిందుక శబ్దనిర్ధారణమునకు, శకటరేఫ సాధురేఫ నిర్ధారణమునకు ప్రాచీనసాహిత్యగ్రంథములే ప్రమాణములు. పదనిష్పత్తిని గుర్తించుటకు, అర్థమును నిర్ణయించుటకు ప్రాచీనసాహిత్యముమీద నాధారపడక తప్పదు. ఇంతే కాదు. ఆ యా పదముల ప్రయోగమునుబట్టి ఆ యా గ్రంథముల రచనాకాలమును నిర్ధారణము చేయవచ్చును; ఇతరభాషాప్రభావములను, ఇతరసంస్కృతులతోడి సంపర్కమును గుర్తింపవచ్చును. మూండు, వాండు మొదలయిన పదము లతిప్రాచీన పద్ధతికి గుర్తులు. ఖుసి, సురధాణి, పైదు, బందా మొదలైన పదములు మహమ్మదీయులతోడి పరిచితిని బయల్పఱుచును. కప్తాను, కలకటేరు మొదలయినవి ఆంగ్లేయసంబంధమును వెల్లడించును. భాషాదర్శనము సాహిత్యము తన సామగ్రియందు పరమోత్తమముగా పరిగణించును.

ఆంగ్లేయసాహిత్యవిమర్శకులలో ఆధునికులైన ఐ. ఏ. రిఛర్డ్సు తన Practical criticism (1929) అను గ్రంథమునందును, డబ్ల్యు. ఎంప్సను తన Seven types of Ambiguity (1930) అను గ్రంథమునందును భాషాశాస్త్రరీతులనుబట్టి సాహిత్యవిమర్శన గావించుటయందు సౌముఖ్యమును ప్రదర్శించిరి. డాక్టరు లియో స్పిట్జరు తన Linguistics and Literary History (1948) అను గ్రంథమునందు సాహిత్యభాష నధ్యయనముచేయుట కొక క్రొత్తపద్ధతిని సూచించెను. భాషాశాస్త్రసిద్ధాంతములను, భాషాశాస్త్రీయవిధానములను సూక్ష్మముగా నవగాహనము చేసికొనవలయు నన్నది ఆ క్రొత్తపద్ధతి. దీని ననుసరించి 'Stylistics' అను శాస్త్రమొకటి యవతరించినది. దీనిని విమర్శనలో ఒక ప్రభేదముగా మాత్రమే పరిగణించి ఆంగ్లేయులు 'Experimental criticism' అని పిలుచుచున్నారు. దీనివలన సాహిత్యగ్రంథమునందలి భాష ప్రత్యంశపరిశీలనపాత్ర మగును. సమగ్ర

సమీక్షణకంటె సాక్షికపరిశీలనమే యిందు ప్రధానము. దీనివలన సాహిత్యసౌందర్యము భగ్నమగు నన్న భయము కొందర కున్నది. ప్రత్యంగవిచ్ఛేదము సమగ్రసౌందర్యసాక్షాత్కారమునకే యన్నది తన్మార్గగాముల నిశ్చయము.

మొత్తముమీద సాహిత్యశాస్త్ర భాషాశాస్త్రములు, పరస్పర విరుద్ధములు కాకపోవుటయే కాక పరస్పర పరిపోషణబద్ధము లనికూడ స్పష్టపడుచున్నది.

## 2. ౽ భాషాదర్శనము

భాషాశాస్త్రమునకే దీనిని నామాంతరముగా కొందరు వాడుదురు; కొందరు దీనిని భాషాశాస్త్రమునం దొక యంగముగా పరిగణింతురు; కొందరు దీనికి భాషాశాస్త్ర మొక యంగ మైనట్లు వ్యవహరింతురు. భాషాదర్శనచరిత్రను పరిశీలించినయెడల ఇన్ని రకముల భావనకు తగిన యవకాశము స్పష్టగోచరము కాగలదు. ఇం దేదియు నసంభావ్యము కాదు; ఇం దేదియు సమగ్రసత్యము కాదు. ఏది యెటు లున్నను భాషాశాస్త్రముతో భాషాదర్శనమునకు అవినాభావసంబంధము కల దనుట సత్యసమ్మతము.

భాషాశాస్త్రప్రారంభకాలమునందు తచ్ఛాస్త్రమును comparative grammar అని కొందరు పిలువగా Philology అని కొందరు పిలువసాగిరి. నిజమునకు Philology అన్న పేరు సాహిత్యాధ్యయనమునకు అంతకుముందే వాడుకలో నున్నది. Philosophy అను పదమునకు love of knowledge అన్నది వ్యుత్పత్త్యర్థము. అట్లే Philology అను పదమునకు love of language అన్నది వ్యుత్పత్త్యర్థము. ప్రాచీనకాలమున భాషాధ్యయనముకూడ సాహిత్యద్వారముననే సాగెడిది. అందువలన సాహిత్యాధ్యయన భాషాధ్యయనము లొక్కటిగనే

భావింపబడెడివి. సాహిత్యవేత్తయే భాషావేత్త యయ్యెడివాడు. జర్మను విశ్వవిద్యాలయమునందు Klassische Philologen అని గ్రీకు సాహిత్యాధ్యాపకులను సంభావించెడివారు; నవీనసాహిత్యాధ్యాపకులను Romanischen Philologen అని సంభావించెడివారు. క్రమముగా ఆ స్థితి దాటిపోయినది. ఆంగ్ల దేశము భాషాశాస్త్రమునే Philology అనుపేరున వ్యవహరింపసాగినది. అప్పటికి భాషాశాస్త్రస్వరూపము కూడ ఇప్పటికంటె భిన్నముగా నున్నది. ఆనాడు భాషాశాస్త్రమునకు వ్యవహారక్షేత్రము లిఖితభాషాప్రపంచమే. *అనేకములైన గ్రంథములను, శాసనములను, లేఖలను పరిశీలించి వానియందలి లిపివిశేషములను భాషావిశేషములను వెల్లడించుటయే భాషాదర్శనమునకు స్థూల ప్రయోజనము.

ఇంకొక విషయము. ఆధునికభాషాశాస్త్రము ప్రధానముగా భాషితభాషనే లక్ష్యముగా చేసికొన్నది. Language అనికాని Lingua అనికాని యనప్పుడు భాషితభాషయే యుద్దిష్ట మగుచున్నది. భాషణమాత్రప్రయోజనము గల భాషలను పరిశీలించుట, వివరించుట, వర్గీకరించుట Linguistics కు కర్తవ్యములైనవి. కొందరు భాషాశాస్త్రివేత్తలు నాగరక భాషలను చిన్నచూపు చూచుచు, అనాగరక భాషలకే ఆధిపత్యము నంటగట్టిరి. అట్లే కొందరు గ్రంథస్థభాషల నావలకు నెట్టి వ్యావహారికభాషలకే పట్టము కట్టవలయు నన్న వ్యామోహము ప్రదర్శించుచున్నారు. ఇది భాషాశాస్త్రతత్త్వమును సక్రమముగా గ్రహింపకపోవుటవలన సంభవించిన దుష్ఫలము. సమ్యక్త్వా

* "In the narrower sense, Philology involves the detailed analysis of documents, primarily from the graphemic and linguistics points of view." Introductory Linguistics
— by Robert A. Hall Jr.

వగాహనము దానిని తొలగింపగలదు. అస్తు. భాషాశాస్త్రమునందు మూడు భేదములు గలవు. మొదటిదైన వర్ణనాత్మకభాషాశాస్త్రము ఒకే భాషను గ్రహించును. రెండవదైన చరిత్రాత్మకభాషాశాస్త్రము నందు వేర్వేరు కాలములయందలి భాషను గ్రహింపవలయును; అప్పుడు గ్రంథస్థభాషలను గ్రహింపకుండుట సాధ్యము కాదు. మూడవదైన తులనాత్మక భాషాశాస్త్రమునందు సైతము వేర్వేరు కాలములందలి యొకే భాషనుగాని, ఒకే కాలమునందలి వేర్వేరుభాషలనుగాని గ్రహింపక తప్పదు. ఇంతే కాదు. ధ్వనివివర్తము, అర్థవివర్తము మున్నగు ననేకవిషయములను నిరూపించుటకు ప్రాచీనభాషల యవసర మెంతయో కలదు. వానిని విడిచివేయుట నేల విడిచి సాముచేయుట. సిద్ధాంతమునుబట్టి భాషితభాషయే లక్ష్యమైనప్పటికిని లిఖితభాషకూడ భాషాశాస్త్రమున కుపాదేయమే యగుచున్నది. అయినప్పు డింక 'భాషాశాస్త్రమునకును భాషాదర్శనమునకును భేద మేమి?' యను ప్రశ్న తలయెత్తును. అది చూతము.

*భాషాదర్శనము లిఖితభాషను వింగడించి లిపిని, భాషను వివరించును. భాషాశాస్త్రము సర్వభాషను శాస్త్రీయముగా వివరించును. ఈ విషయమున భాషాశాస్త్రమే యుదారముగా గోచరించును. కాని భాషాదర్శనము సామాజిక, చారిత్రక, సాంస్కృతిక విశేషముల నెన్నింటినో గమనించి యనేకనిక్షేపములను వెలువరించును. ప్రాచీనచరిత్రను పునర్నిర్మాణముచేయు శ్రేయము భాషాదర్శనమునకే దక్కవలసి యున్నది. ఈ విషయమున నిది భాషాశాస్త్రముకంటె విస్తృతము.

* "The interpretation of old texts, a study known as **philology**, has a broader and a narrower aspect. In its broader aspect, it involves the investigation of the entire background, cultural and historical, out of which a document grew, and a reconstruction of a culture in the light of all the surviving evidence, linguistic and nonlinguistic." — Ibid.

కాబట్టి భాషాశాస్త్రము శాస్త్రధర్మమునుబట్టి అనేకవిషయములను విశ్లేషించి వివరించుచుండగా, భాషాదర్శనము భిన్న భిన్న విషయముల ననుసంధానముచేసి సమగ్రదర్శనమునకు యోగ్యతను సమకూర్చుచున్నది. కావుననే భాషాశాస్త్రమును Science of language అని భావించినయెడల, భాషాదర్శనమును Philosophy of language అని భావింపవచ్చును.

# 3. భాషాశాస్త్రచరిత్ర

ఆధునికభాషాశాస్త్రము రూపొందింది దాదాపు రెండు వందల యేండ్లయినది. ఇతరప్రకృతిశాస్త్రముల వలెనే యిదికూడ పాశ్చాత్య దేశములందే ప్రాదుర్భవించెను. భారతీయశాస్త్రముల పరిగణనమందు భాషాశాస్త్ర మన్నపేరు కానరాదు. కావున దీనిని ఆధునికశాస్త్ర మనియు, అన్యదేశోత్పన్న మనియు అంగీకరింపక తప్పదు. అయినను, తత్త్వమునుబట్టి చూచినప్పుడు భారతదేశమే భాషాశాస్త్రమునకు జన్మభూమి యనియు, వేదయుగమునందే యిది ప్రాదుర్భూత మయ్యె ననియు స్పష్టము కాగలదు. అయినను భారతీయులకు విస్మృతప్రాయమైపోయిన భాషాశాస్త్రము సంస్కృతభాషాభ్యాసముతో పాశ్చాత్య ప్రపంచమునందు నూతనశకోదయమునకు మూదలమైనది. భారతీయ విధానము ననుసరించి, పరిభాషను గ్రహించి భాషాన్వేషణము కొన సాగించుట, భాషాస్వరూపమును విశ్లేషించి వివరించుట జరిగినది. ఇతర శాస్త్రముల వలెనే భాషాశాస్త్రముకూడ అత్యధికమైన యభివృద్ధిని సాధించి ప్రపంచమునందు ప్రముఖస్థానము నాక్రమించినది. మొత్తము మీద భాషాశాస్త్రము భారతదేశమునందే పుట్టినప్పటికి, మధ్యకాలమున సంక్రమించిన పరిణామమువలన ఆధునికమై క్రొత్తరూపుతో, క్రొత్త పేరుతో, క్రొత్త పరిభాషతో భారతదేశపునఃప్రవేశము చేసినది. ప్రాచీనభారతదేశమునందు జరిగిన భాషాకృషిస్వరూపమును స్థూలముగా దర్శింతము.

## 3. ౧ ప్రాచీన భారతీయచరిత్ర

సర్వభారతీయవాఙ్మయమునందును వేదము ప్రాచీనతమము. వేదమునందు 'వాక్కు'ను దేవతగా భావించుట జరిగినది. వాగ్దేవత నుద్దే

శించి యనేకస్తోత్రములు ప్రవర్తించినవి. వాగ్దేవత సర్వవ్యాపినిగా వర్ణింపబడినది! [1] వాగ్దేవత తాను ప్రేమించినవానిని పరాక్రమవంతునిగను, బ్రహ్మభావము గలవానినిగను, ఋషిగను, మేధావంతునిగను చేయుదునని చెప్పినట్లు ఒక సూక్తమునందు కలదు. ఈ వాగ్దేవతయే ప్రజాపతికి సహచారిణి. వీరి కవినాభావసంబంధము కలదు. ఈ సంబంధమువలననే అర్థసృష్టి జరుగుచున్నది. ఇట్టి కల్పనములకు, భాషాతత్త్వమునందలి ఆసక్తియే మూలప్రకృతి. భాషాభావముల సంబంధమెట్టిది? ఏది పూర్వము? ఏది పరము? ఉచ్చారితములైన ధ్వనులకు స్థిరత్వము కలదా? లేదా? మున్నగు ననేకప్రశ్నము లానాడు తలయెత్తినవి. వానికి సమాధానరూపముగా ఎన్నో కథలు ప్రసక్తములైనవి.

అవన్నియు నట్లుండగా వేదముల సుస్థితికొరకై వేదాంగముల సృష్టి జరిగినది. వేదప్రతిపాదితవిషయ వివరణములుగా బ్రాహ్మణములు, ఆరణ్యకములు బయలుదేరినవి. ఆధ్యాత్మికము నలౌకికము నగు విషయములే బహుళము లైనప్పటికి, భాషావివేచనముకూడ ఆ యా గ్రంథములందు తగుమాత్రముగా కనుపట్టును. వేదాంగము లాఱింటియందును శిక్ష, నిరుక్తము, వ్యాకరణము నను మూడును పూర్తిగా భాషావివేచనపరాయణములు. పదపాఠములు, ప్రాతిశాఖ్యలుకూడ వేదభాషానిరూపణమే ప్రయోజనముగా వ్యవహృతములైనవి.

బ్రాహ్మణములందు భాషాధ్యయనవ్యవస్థ చాలవరకు గోచరము కాగలదు. ఇంద్రుడే దేవతలకోరిక ననుసరించి భాషను వ్యాకరించె నను కథ యొకటి శతపథబ్రాహ్మణమునందు కలదు. [2] ఇదే విష

---

1 'అహమేవ స్వయమిదం వదామి జుష్టం దేవేభి రుత మానుషేభిః, యం కామయే త ముగ్రం. కృణోమి తం బ్రాహ్మణం తం ఋషిం, తం సుమేధామ్.'

— ఋగ్వేదము.

2 "వాగ్వై పరాచ్య వ్యాకృతావదత్ తే దేవా ఇంద్ర మబ్రువన్నిమాం నో వాచం

యము తైత్తిరీయసంహితయందును గలదు. భండార్కరుమహాశ యుడు బ్రాహ్మణగ్రంథములలో వివరింపబడిన కొన్ని పదముల యర్థ ముల ప్రామాణికత్వము నంగీకరించుచు వానిని ప్రదర్శించెను. ఐతరేయ బ్రాహ్మణము పైశ్రివ, మానుష, జాయా శబ్దముల వ్యుత్పత్తులను వేరువేరుచోట్ల ప్రదర్శించెను. తైత్తిరీయము అశ్వ, నక్షత్ర శబ్దముల వ్యుత్పత్తిని ప్రదర్శించెను. వీనినిబట్టి బ్రాహ్మణగ్రంథములనాటికే శబ్ద వ్యుత్పత్తిని గూర్చిన చింతన ప్రారంభ మయ్యెనని స్పష్టముగా నిర్ణ యింపవచ్చును.

వైదికభాషాధ్యయనమునందు 'పదపాఠములు' ప్రముఖస్థానము వహించును. వేదసంహితలయందలి, మంత్రములయందలి పదములను వేరుచేసి చూపుట వీని లక్ష్యము. పదవిభాగము, సమాసనియమములు, సంధినియమములు, ఉచ్చారణస్వరభేదములు మున్నగు ననేకవిషయ ములు నిరూపితము లగును. నిజమున కివి యన్నియు భాషావివేచనము నందు ప్రధానములైన యంశములే. ఈ పదపాఠరచయిత శాకల్య మహర్షి.

వేదమంత్రముల యుచ్చారణను సమర్థముగా నుంచుటకై ప్రాతి శాఖ్యలు బయలుదేరినవి. వేదములయందలి ప్రతిశాఖకు సంబంధించిన శబ్దములను ధ్వనులను వివేచించి చూపుట లక్ష్యముగా ప్రవర్తించుట చేత ఈ గ్రంథములకు 'ప్రాతిశాఖ్యలు' అనుపేరు సార్థకమై యున్నది. ఆధునిక ధ్వనివిజ్ఞానమునకు సంబంధించిన యనేకాంశములు ప్రాతి శాఖ్యలయందు పొందుపడి యున్నవి. ధ్వనివిజ్ఞానమున ప్రప్రథమగ్రం థములుగా ప్రాతిశాఖ్యలను పరిగణింపవచ్చును. ప్రాతిశాఖ్యయందు

---

వ్యాకుర్వితి, సో బ్రవీద్వరం వృణం మహ్యంచైవేష వాయవే చ సహ గృహ్యాత ఇతి తస్మా దైంద్రవాయవః సహ గృహ్యత తా మింద్రో మధ్యతోఽవక్రమ్య వ్యాకరో త్తస్మాదియం వ్యాకృతా వా గుద్యతే" — తైత్తిరీయ సంహిత.

ధ్వనులయుత్పత్తి, ధ్వనులవర్గీకరణము, గణసూచికలు నిర్మించుట ముఖ్యవిషయములు. ప్రసంగానుప్రసంగముగా స్వరము, ఊనిక, మాత్రాకాలము మొదలయిన యుచ్చారణవిశేషములు వివరింపబడినవి. స్వర వ్యంజనముల యుచ్చారణస్వరూపము వివేచింపబడినది. మొత్తము మీద ప్రాతిశాఖ్యలు ధ్వనివిశ్లేషణవిషయమున సమర్థతను ప్రదర్శించి, ప్రముఖస్థానమును గడించుకొన్నవి. ఋగ్వేదమునందలి శాకలశాఖకు ఋక్ప్రాతిశాఖ్య, యజుర్వేదమునందలి తైత్తిరీయశాఖకు (కృష్ణయజుర్వేదమునకు) తైత్తిరీయప్రాతిశాఖ్య వాజసనేయశాఖకు (శుక్లయజుర్వేదమునకు) వాజసనేయప్రాతిశాఖ్య, సామవేదమునందలి మాధ్యందిన శాఖకు సామప్రాతిశాఖ్య, అథర్వవేదమునకు అథర్వప్రాతిశాఖ్య నేటికి నుపలబ్ధము లగుచున్నవి.

శిక్ష వేదాంగములలో నొకటి. శిక్షాగ్రంథములుగూడ ధ్వని విజ్ఞానమునే బోధించును. వేదధ్వనుల నుచ్చరించు విధానమునందు శిక్షణ నిచ్చుటయే వీని లక్ష్యము. ఉచ్చారణరీతిని దెలుపు భాగమునకు 'శిక్షాధ్యాయ' మని పేరు. [3] వర్ణము; స్వరము, మాత్ర, బలము, సామము, సంతానము – అను విషయములనుగురించి శిక్షాగ్రంథములు వివేచనచేయును. ఇవి యన్నియు నేటి ధ్వనివిజ్ఞానమునందు ప్రసక్తము లగు విషయములే. శిక్షాగ్రంథములు సంస్కృతమునందు ఏబదికి మించి యున్నట్లు చెప్పుదురు. అందు పాణినీయశిక్ష, ఆపిశలిశిక్ష, భారద్వాజ శిక్ష, కౌహలిశిక్ష, శైశిరీయశిక్ష, సర్వసమ్మతశిక్ష, వ్యాసశిక్ష, యాజ్ఞవల్క్యశిక్ష మున్నగునవి ప్రసిద్ధములు.

ఇంతవరకు ప్రధానముగా ధ్వనివిజ్ఞానమునే పైగ్రంథములు పరిశీలించినట్లు చూచితిమి. అచ్చటచ్చట కొలదిగా అర్థమును గూర్చిన

---

3 'అథ శిక్షాం వ్యాఖ్యాస్యామః వర్ణః, స్వరః మాత్రా బలం సామసంతాన ఇత్యుక్త శిక్షాధ్యాయః' — తైత్తిరీయారణ్యకము.

యాలోచన సాగిన సంగతినిగూడ గమనించితిమి. అర్థవిజ్ఞానమునకు ఆచార్యపురుషునిగా పేర్కొనదగిన వ్యక్తి యాస్కమహర్షి. ఈయన క్రీ. పూ. ఎనిమిదవ శతాబ్దియం దుండెనని కొందరి నిర్ణయము. ఈయన రచించిన గ్రంథము నిరుక్తము. వేదాంగము లాఱింటిలో నిరుక్త మొకటి. అందువలన దీనిని శాస్త్రవిభాగమునకు పేరుగానే గ్రహింప వలయును. యాస్కునికి పూర్వమే నిరుక్తగ్రంథము లుండియుండవల యును. కాని, అవి లుప్తప్రాయము లైపోవుటవలన నిరుక్త మన్న పేరు యాస్కుని గ్రంథమునకే రూఢమై పోయినది. నిఘంటువు లన్న పేరున వైదికపదముల పట్టికలను కొన్నింటిని వేర్వేరు ఋషులు వేర్వేరుగా సంక లనముచేసిరి. అటువంటి పట్టికలను గ్రహించి, ప్రతిపదమునకు విశదమైన వ్యాఖ్యానముచేసి, వేదమునందలి పంక్తి నుదహరించి, అర్థనిర్ణయము చేయుట యాస్కుని లక్ష్యము. తన లక్ష్యమున కనుగుణముగా యాస్క మహర్షి చేసిన వివేచనము శాస్త్రీయమై సమంజసమై యున్నది. ఎచ్చ టనైన తన నిర్ణయముపట్ల సందేహ మున్నయెడల, ఆ విషయమును గూడ యాస్కుడు దాపరికము లేకుండ చెప్పుకొనెను. శాస్త్రజ్ఞున కుం డవలసిన ఋజుత్వము దీనినిబట్టి సంకేతిత మగుచున్నది. ప్రసంగాను ప్రసంగముగా యాస్కుడు భాషాశాస్త్రవిశేషముల నెన్నింటినో బయ లుపరిచెను. భాషోత్పత్తివిషయమునందు యాస్కుడు ధాతువాదమునకు చెందినవాడు. శబ్దము లన్నియు మూలధాతువులనుండి యుత్పన్నము లగునని యాతని సిద్ధాంతము. తన కాలమున నున్న నైఘంటుకులు, వైయాకరణులు, ఐతిహాసికులు, కాల్పనికులు, నైదానులు మున్నగువారి వాదములనుగూడ నీయన ప్రదర్శించెను. తాను నైరుక్తుల వర్గములోని వాడు. గార్గ్యుడు, ఔపమన్యవుడు మున్నగువారు ధాతువాదము నంగీ కరింపలేదు. యాస్కుడు ధాతువాదియే యైనప్పటికి భాషయందు కితవ, కృకవాక, దుందుభి మున్నగు ధ్వన్యనుకరణశబ్దములు కలవన్న వాస్తవము నంగీకరించెను. ధాతువులనుండి శబ్దము లేర్పడునప్పుడు

జరుగు ధ్వనివివర్తములను శాస్త్రీయముగా గుర్తించెను. పదముల వ్యుత్పత్తులను తెలుపునపుడు మూలధాతువుయొక్క యర్థమునుగుర్తించి, దాని కనుగుణముగా పదముయొక్క యర్థమును నిర్ధారించుట, పదము నం దేర్పడు మార్పులను ధ్వనిసూత్రానురూపముగా నిరూపించుట, శబ్దముల చరిత్రను అనుశీలనముచేయుట, భాషల కుపభాషలతో నున్న సంబంధమును సంకేతించుట - భాషను శాస్త్రీయవిధానములో వివేచన చేయుట యాస్కుని కృషిపరమార్థము. యాస్కుడే మొట్టమొదటగా శబ్దములను నామములు, ఆఖ్యాతములు, ఉపసర్గములు, నిపాతములు - అని నాలుగు విధములుగా విభజించినవాడు.

యాస్కుని తరువాత చెప్పుకొనదగిన మహావ్యక్తి పాణిని మహర్షి. ఈయన 'అష్టాధ్యాయి' యనుపేరు గల వ్యాకరణగ్రంథమును రచించెను. ఈయనకు పూర్వముకూడ అనేకవ్యాకర్త లుండియుందురు. ఆపిశలి, కాశకృత్స్నుడు అనువారిని అనంతరవ్యాఖ్యాతలు పేర్కొనిరి. పాణినీయముయొక్క ప్రాచుర్యమువలన ఆ యా గ్రంథము లస్తమించి యుండును. వ్యాకరణశాస్త్రమునకు భాషావివేచనవిధానమునకు ఒక ప్రతిష్ఠను చేకూర్చినవాడు పాణిని. నాలుగు వేల సూత్రములలో సంస్కృతభాషాస్వరూపము నావిష్కరించిన మహత్త్వము పాణినికి దక్కక తప్పదు. 'అల్పాక్షర మసందిగ్ధమ్' మొదలయిన విధముగా నున్న సూత్రలక్షణము పాణినిసూత్రములకు నూటికి నూఱు పాళ్లు న్వయించును. పాణిని వర్ణసమామ్నాయమును చెప్పుచు మహేశ్వర సూత్రములనుపేరు గల పదునాలుగు సూత్రములను దెలిపెను. అచ్చట నుపయోగించిన ప్రత్యాహారపద్ధతి యెంతో ప్రక్రియాలాఘవము చేకూర్చినది. కొందరు మహేశ్వరసూత్రములను పాణిని కల్పింపలే దనియు, పూర్వవ్యాకర్త లెవరో కల్పింపగా, తాను గ్రహించి, వాడుకొనెననియు నందురు. అది సత్యమే యైనప్పటికిని పాణిని గొప్పతనమునకు

లోపము రాదు. ప్రత్యాహారపద్ధతిని మొత్తము గ్రంథ మంతటిలోను సమర్థముగా, ప్రయోజనవంతముగా ఉపయోగించుకొన్న శ్రేయము పాణినిదే. పూర్వులు వైదికభాషను మాత్రమే వ్యాకరింపగా, పాణిని వైదిక లౌకిక భాషలను తులనాత్మకముగా పరిశీలించి వ్యాకరించెను. పాణినికూడ యాస్కునివలె ధాతువాదియే. అందువలన శబ్దము లన్నియు ధాతువులనుండియే యుత్పన్నము లయ్యె ననుట ఆయన కభిమతము. అయినను శాకటాయనాదుల వలె మొండిపట్టుదల గల వాడు కాడు. భాషయందు అవ్యుత్పన్నపదములుకూడ కలవన్న వాస్తవమును గుర్తించి సమన్వయదృష్టిని ప్రదర్శించెను. 'ధాతుపాఠము' లను పేర వైదిక లౌకిక భాష లందున్న ధాతువుల నెన్నింటినో సంగ్రహించెను. నిజమున కివి యీనాటికి సైతము పెన్నిధానములై వర్తిల్లుచున్నవి. ఉత్తర భారతీయభాషలను తులనాత్మకముగా పరిశీలింపవలసినప్పుడు, వాని మూలరూపములను వాని మౌలి కార్థములను గ్రహించుటకు, శాబ్దికార్థిక వివర్తములను గుర్తించుటకు ధాతుపాఠము లాధునిక పరిశీలకులకు సైత మెంతో సహకరించును. యాస్కుడు పదములను నాలుగు విధములుగా విభజింపగా పాణిని సుబంతములు, తిజంతములు, అవ్యయములు – అని మూడు విధములుగా విభజించెను. భాషయందు చరమ ప్రమాణము (ultimate unit) వాక్య మన్నది అయన యభిప్రాయము. ఆధునికభాషా శాస్త్రజ్ఞులు పెక్కు విషయములలో వలెనే, యీ విషయములో కూడ పాణినిమహర్షి కనుచరులే. ధ్వనులను వ్యాకరించుటలో స్థాన కరణప్రయత్నముల స్థానమును గుర్తించి పాణిని చక్కగా వర్గీకరించెను. ఆ విధాన మంతయు దాదాపుగా యథాతథముగా ఆధునిక భాషాశాస్త్రము స్వాయత్తము చేసికొన్నది. ఈవిధముగా ధ్వని విజ్ఞానము, అర్థవిజ్ఞానము, తులనాత్మకవివేచన – అనువానికి పాణిని మహర్షియే మార్గదర్శి యయ్యెను.

వ్యాకరణము షడంగములలో నొకటి. దీనిని వేదపురుషునకు ముఖస్థానీయముగా పరిగణింతురు. అటువంటి వ్యాకరణమును రచించినవాడు పాణినిమహర్షి. ఆధునికప్రమాణముల ననుసరించి 'అష్టాధ్యాయి' నిర్ణయాత్మకవ్యాకరణము (Prescriptive grammar); ఆ తరువాత క్రీ. పూ. రెండవ శతాబ్దిలో పతంజలిమహర్షి రచించిన 'మహాభాష్యము' వర్ణనాత్మకవ్యాకరణము (Descriptive grammar). ఈ వర్ణనాత్మకవ్యాకరణమే భాషాశాస్త్రమునకు మూలరూపము.

పాణిని పతంజలులకు నడుమ నాలుగైదువందల యేండ్ల దూరమున్నది. ఈ నడిమికాలమున పాణినిపై నెన్నో విమర్శలు వెలువడియుండును. వరరుచి 'వార్తికములు' అనుపేర పాణిని సూత్రములను కొన్నింటిని విమర్శించెను. పతంజలిమహర్షి వార్తికములను ఖండించి, యితరవిమర్శనముల నపాకరించి పాణినితత్త్వమునే సముద్ధరించుట లక్ష్యముగా తన గ్రంథమును నిర్వహించెను. విషయగౌరవమునుబట్టి, శైలీరామణీయకమునుబట్టి మహాభాష్యము మహాప్రశస్తిని సంపాదించుకొనెను. 'మహాభాష్యం పాఠయేద్వా మహారాజ్యం పాలయేత్' అన్న యాభాణకము పండితలోకమునందు ప్రామాణికమైనది.

పతంజలి మహాభాష్యమునందు ఏమి, ఎట్లు, ఎందులకు – మున్నగు ప్రశ్నలను కల్పించుకొని, సమాధానములను తానే తెల్పెను. శాస్త్రగ్రంథమునకు ముఖ్యములైన ఆకాంక్ష, అన్వేషణ, సేకరణ, నిర్ణయము – అన్నవి పతంజలిరచనమందు పుష్కలముగా గోచరించును. భాషకు లోకమే ప్రమాణమైనప్పుడు వ్యాకరణమువలన నింక ప్రయోజన మేమి? అని మొదలుపెట్టి వ్యాకరణప్రయోజనమును నిరూపించును. అట్లే వ్యాకరణస్వరూపమును దెల్పుచు లక్ష్యలక్షణములే వ్యాకరణ మని నిర్ణయముచేయును. శబ్దార్థసంబంధము సిద్ధమే యనియు, లోకప్రయుక్తియే ప్రమాణ మనియు నిర్ణయముచేయును. మౌలికము

లయిన యనేకాంశములు మహాభాష్యమునందు ప్రసక్తములయినవి. సుశబ్దప్రయోగమువలని లాభములు, అపశబ్దప్రయోగమువలని నష్టములు, మాండలికముల తీరుతెన్నులు, శబ్దవివర్తములు, అర్థవివర్తములు, తత్కారణములు మున్నగు పెక్కువిషయములను మహాభాష్యము మూాదలించినది. 'దీని నిట్లు చేయవలయును, ఇది యిట్లగును' అని యనుట వ్యాకరణపద్ధతి. దానికంటె భిన్నముగా కార్యకారణ సంబంధనిరూపకముగా, సమన్వయమార్గమున సాగినది మహాభాష్యము. భాషాతత్త్వమును దార్శనికపద్ధతిలో సర్వోత్తమముగా వివేచించి, యావిష్కరించిన ఘనత పతంజలికి దక్కినది. అందువలననే ఆయనను సంప్రదాయజ్ఞులు శేషుని యవతారముగా పరిగణింతురు. మహాభాష్యము నాటి భారతదేశసంస్కృతికి దర్పణము పట్టుచున్నది.

ఆ పిమ్మట భర్తృహరి రచించిన వాక్యపదీయము ప్రశంసాపాత్రము. ఆ తరువాత అష్టాధ్యాయిని సులభముగా అవగాహనము చేసికొనుటకై సిద్ధాంతకౌముది మొదలయిన గ్రంథము లవతరించినవి. భాషాశాస్త్రచరిత్రలో వానిని ప్రత్యేకముగా పేర్కొనదగినంత యవసరము కానరాదు. ప్రాకృతభాషావ్యాకరణములలో తులనాత్మకత్వము కానవచ్చును. దేశభాషావ్యాకరణములు ప్రాయికముగా సంస్కృతవ్యాకరణానుసారములే. [4] తమిళవ్యాకరణమైన 'తొల్కాప్పియమ్' ఐంద్రవ్యాకరణసంప్రదాయము ననుసరించె నని చెప్పుదురు.

## 3. ౨ ప్రాచీన పాశ్చాత్యచరిత్ర

బైబిలునందలి యుత్పత్తిప్రకరణములోని బేబెలుగోపుర ప్రసంగము ప్రాచీనపాశ్చాత్యలోకమున భాషావిషయమునందున్న యభిప్రాయములకు తారకాణ. ప్రాచీనమానవు లందరు నొకే భాష మాట

4 'ఐన్దిరమ్ నిఱైన్ద తొల్కాప్పియన్.' — తొల్కాప్పియమ్.

లాడెడివా రనియు, సామరస్యపూర్వకముగా సంచరించెడివా రనియు, భగవంతుని యాదేశములను తిరస్కరించి బేబెలుగోపుర నిర్మాణమునకు సన్నద్ధులై రనియు, భగవంతుడు వారికి గర్వభంగము చేయనెంచి భాషావైవిధ్యమును కల్పించె ననియు, అందువలన మానవులలో వివిధ భాష లేర్పడి యంతకుముందున్న సామరస్యము చెడిపోయె ననియు, బేబెలుగోపురనిర్మాణము పూర్తి కాలేదనియు పై ప్రసంగసారము. దీనినిబట్టి భాష పరస్పరావగాహనమునకు తోడ్పడు ననియు, భాషావైవిధ్యము వైమనస్యమును కలిగించుననియు, ఆనాటి యభిప్రాయమైనట్లు గ్రహింపవచ్చును. అంతేకాదు. భాష భగవత్సృష్టి యన్న యభిప్రాయముకూడ బోధపడును. బైబిలునుబట్టి సృష్టి సాగుటకు ముందే భాష యున్న దనికూడ అనిపించును.

నిజమునకు గ్రీకుతాత్త్వికులు భాషాతత్త్వమునుగురించి యాలోచనలు సాగించునంతవరకు పాశ్చాత్యలోకమునందు ఆసక్తిపూర్వకమైన భాషావివేచన లేనేలే దని చెప్పవచ్చును. గ్రీకుతాత్త్వికుల చర్చలు తరువాతికాలమునందలి భాషావిషయికచర్చలకు ప్రాతిపదికలైనవి. భాషోత్పత్తినిగురించి, శబ్దార్థముల సంబంధమునుగురించి వారు వివిధరీతులలో విపులముగా వివేచనచేసిరి. అట్లే భాషాభాగములను వేరువేరుగా గుర్తించుట, వాక్యనిర్మాణవిశేషములను గుర్తించుట, పదముల ప్రయోగప్రయోజనములను గుర్తించుట ఆనాటి గ్రీకుతాత్త్వికుల ఆలోచనాక్రమమునందలి ఆదిమఫలములే. వారి కృషిని కొంచెము వివరముగా గమనింతము.

గ్రీకుతాత్త్వికులలో మొదట చెప్పుకొనదగినవాడు సోక్రటీసు. ఇతడు క్రీస్తుపూర్వము నాలుగైదు శతాబ్దులయం దుండెను. ఇతనికి పూర్వమే పైథాగొరసు మున్నగువారు కొందరు కలరు; కాని వారు వ్రాసిన భాషావిషయగ్రంథము లేమియు లభింపలేదు. అందువలన

భాషావివేచనయందు సోక్రటీసునకే అగ్రతాంబూల మందవలసి యున్నది. ఇతడు శబ్దార్థసంబంధమునుగూర్చి చర్చించుచు, అది సాంకేతికమే కాని స్వాభావికము కాదని నిర్ణయించెను. స్వాభావికమే యైన యెడల ఒకపదమున కొకే యర్థ ముండవలయును; అట్లే ఒక యర్థము నొకే పదము బోధింపవలయును. అట్లుకాక యొకే యర్థమును భిన్న భాషలలో భిన్నపదములు బోధించుచుండుటయు, ఒకే పదమునకు భిన్నభాషలలో భిన్నార్థము లుండుటయు స్పష్టముగా గోచర మగుచున్నది. కావున స్వాభావికవాదమును నిరాకరించుట తర్కసంగతమై యున్నది.

సోక్రటీసు శిష్యుడు ప్లేటో భాషావివేచనయందు ఇంకను ముందునకు సాగెను. ఇతడు రచించిన 'సంభాషణలు' అన్న గ్రంథములయందు భాషావిషయికచర్చలు పలుచోట్ల స్థానము గడించుకొన్నవి. ప్లేటో శబ్దార్థసంబంధవిషయమున తన గురువు మార్గమునే యనుసరించెను. అయినను విస్తృతపరిధిలో శబ్దమనుటకు బదులుగా భాష యనియు, అర్థ మనుటకు బదులుగా భావ మనియు వాడెను. భాషాభావములు రెండు నొక్కటే యన్నది యీతని యభిప్రాయము. అభివ్యక్తమైన భావమే భాష; అభివ్యక్తముకాని భాషయే భావము. ధ్వనులను ఘోషములు (voiced), అఘోషములు (unvoiced) అని రెండు విధములుగా విభజించెను. ప్లేటో వ్యుత్పత్తుల విషయమున సైతము కొంత యుత్సాహమును ప్రదర్శించెను. ఆధునికప్రమాణములనుబట్టి వాని నంగీకరించుటకు వీలుకాదు. ప్రకృతిప్రత్యయవిభాగజ్ఞానము లేకుండ కేవలము పైపై పోలికనుబట్టి యొకమాటతో మరొకమాటకు సంబంధమును గల్పించి, వ్యుత్పత్తులను వివరించుట ప్లేటో యనుసరించిన మార్గము. ఒక్కొక్కప్పుడు విరుద్ధార్థబోధకపదములకు సంబంధమును స్థాపించుటకు సైతము ఈతడు సంకోచింపలేదు.

ఆ తరువాత చెప్పుకొనదగినవాడు అరిస్టోటలు. ఇతడు క్రీస్తు పూర్వము నాలుగవ మూడవ శతాబ్దులకు చెందినవాడు. అరిస్టోటలు 'కావ్యశాస్త్రము' (Poetics) అను తనగ్రంథమునందు భాషాశాస్త్రవిషయముల నెన్నింటినో ప్రస్తావించెను. ఇది ఆనుషంగికముగానే జరిగినప్పటికి తన ప్రాధాన్యమును తాను నిల్పుకొనుచున్న దని అంగీకరింపక తప్పదు. పదముల నన్నింటిని ఎనిమిది భాషాభాగములలోనికి పంచి పెట్టినవా డీతడే. ఈ విభాగమును రోమనులు మొదలుకొని యీనాటి వరకు పాశ్చాత్యు లెల్లరు అంగీకరించుచున్నారు. భారతీయవ్యాకరణములందుకూడ ఆధునికకాలమున ఈ విభాగమునకే ఆసనము లభించుచున్నది. ఈతడు సాధారణపదములు, జంటపదములు, సార్థకపదములు, నిరర్థకపదములు – అన్న విభాగమునుగూడ ప్రదర్శించెను.

డయోనిసియస్ థ్రాక్స్ అను నతడు క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దికి చెందినవాడు. ఈతడు మొట్టమొదటి గ్రీకువ్యాకరణగ్రంథ నిర్మాత. ఆనాటి గ్రీకుభాషకు అనువైనట్లు సర్వసమర్థమైన విశ్లేషణ మీ గ్రంథమున కనిపించును. కర్త, క్రియ, లింగము, వచనము, విభక్తి, కాలము, పురుషము – మున్నగు ననేకాంశము లిందు ప్రసక్తములైనవి. మొత్తముమీద క్రీస్తుశకము ప్రారంభ మగుటకు ముందే గ్రీకుభాష యెన్నెన్నో అంచెలను గడచి వ్యాకరణమును నిర్మాణము చేసికొనగలిగినది. గ్రీకుసభ్యత రోము దేశముపై తన ప్రభావమును ప్రసరింపజేయుటతో గ్రీకుభాష రోముదేశమును కైవశము చేసికొన్నది. రోమనులు తమ లాటినుభాషను గ్రీకువ్యాకరణప్రణాళిక ననుసరించి అధ్యయనముచేయుట మొదలుపెట్టిరి. క్రైస్తవమతవ్యాప్తివలన హిబ్రూ భాషకు ప్రాధాన్యము లభించినది. హిబ్రూభాషయే దైవభాష యని, యితరభాషల కన్నింటికి అదియే మూల మని నమ్మి వ్యుత్పత్తులను చెప్పుటలో విచిత్రమార్గముల ననుసరించుట ఆనాటివారికి పరిపాటియై

నది. హిబ్రూభాషను కుడినుండి యెడమవైపుగా వ్రాయుదురు. కావున గ్రీకు, లాటినుపదములను తలక్రిందులుచేసి హిబ్రూపదముతో అర్థసామ్యమును సమర్థించుటకు యత్నించెడివారు. ఏమైనను, ఈ మూడు భాషలును కలిసి యొక తులనాత్మకదృష్టిని కలిగించుటకు దోహదము చేసిన వనుట వాస్తవము. గ్రీసుదేశీయులు తామెంతో నాగరకులని, యితరు లెల్లరు అనాగరకులని తలచి చాలకాలము బయటిప్రపంచమున కంధులై యుండిరి; ఇతరభాషలపట్ల బధిరులై యుండిరి. తమ చుట్టును తాము కట్టుకొన్న గోడ క్రమముగా కూలిపోయినది. ఇతరభాషలతోడి సంబంధమువలన దృక్పథము విశాలము కాసాగినది. సాంస్కృతికముగా గ్రీకుభాషకే ప్రాధాన్యమున్నను, రాజకీయముగా లాటినుభాషకు, ధార్మికముగా హిబ్రూభాషకు ప్రాధాన్యము లభించినది. ఇతరభాషలు లాటినుభాష నాదర్శముగా గ్రహించి అభివృద్ధిని గడింపసాగినవి.

రోమనుసామ్రాజ్యపతనము లాటినుభాషావిషయమున పెక్కుమార్పులకు కారణమయ్యెను. పూర్వమున్న ప్రామాణికత్వము దిగజారిపోయెను. వాడుకయందున్న భాషలు లిఖితరూపమును గడించుకొనెను. అంతకు ముందు తప్పని, ఒప్పని లాటినుభాషగురించి నిర్ణయించుట జరిగెడిది. కాని, ఆనాటికి రోమాన్సుభాష లనబడు వ్యావహారిక మాండలిక భాషలు లాటినుభాషకు ప్రతిస్పర్థులైనవి. పండితవ్యవహారమునందును, మతవ్యవహారమునందును సజీవమై యున్నప్పటికిని లాటినుభాష కృత్రిమప్రాయముగా పరిగణింపబడినది. వ్యావహారిక భాషలు అభివృద్ధి నొందుచున్న మధ్యవర్గీయుల కాదరపాత్రములైనవి. అయినను, పదవ శతాబ్ది పూర్తియగు నంతవరకు ఆంగ్లోసాక్సను లాటినుభాషావ్యాకరణము ఆవిర్భవింపలేదు. పదునాలుగవ శతాబ్దిలోనున్న 'డాన్టే' తానువాడుచున్న వ్యావహారిక (Volgare) భాషను వ్యాకరణని

యమములు లేని లాటినుభాషగానే భావించెను. అనగా, అప్పటికి వ్యావహారికము నందున్న రోమాన్సుభాషలకు వ్యాకరణములు రచింపబడలేదనియే యర్థము. అప్పటికి భాషల మార్పులను గమనించుట, భాషా విషయిక వ్యాకరణాంశములను వివేచనచేయుట పూర్తిగా లేనేలే పని యనుట కవకాశము లేదు. బైబిలుగ్రంథము పెక్కుభాషలలోనికి పరివర్తితమైనది. యాత్రికులు, మతప్రచారకులు, వర్తకులు ఇతరభాషా పదసూచికల నెన్నింటినో సంతరించిరి. ఇదంతయు భాషాశాస్త్రీయముగా మిక్కిలి ప్రయోజనవంతమైన సామగ్రియే.

ఇదంతయు నొక యుగము. ఇందు శాస్త్రీయమైన వివేచనకంటె ఊహాపోహలకే తావెక్కువ. కొందరు సరియైన శిరోధార్యము లయిన నిర్ణయములను చేసిన మాటయు వాస్తవమే. అయినను వారు శాస్త్రీయప్రక్రియనుబట్టి కాక అదృష్టము (Chance) నుబట్టి అట్టి నిర్ణయములను చేయగలిగిరి. గ్రీకు లాటిను భాషల సంబంధమును 'వారో' (Varro) అను రోమనువ్యాకర్త ప్రదర్శింపదలచెను. కాని అది యంతయు తప్పులతడక యయ్యెను. ఆ యుగమునందు వివరణాత్మకభాషాశాస్త్రముగా పరిగణింపదగినది కొంతయైన కనిపించును; చరిత్రాత్మక తులనాత్మక భాషాశాస్త్రముల విషయమున చెప్పుకొనదగిన దేమియు లేదనియే యనవచ్చును.

## 3. 3 పదునెనిమిదవ శతాబ్దిచరిత్ర

పూర్వానుభవమునుబట్టి సర్వభాషలకు సమానముగా వర్తించునట్టి విశ్వవ్యాకరణ మొకటి యుండవలయున్న యభిప్రాయము బలపడజొచ్చినది. ఇది నిజమునకు ప్రాచీనాభిప్రాయమునకు పరిణామరూపమే కాని క్రొత్తది కాదు. గ్రీకు లాటిను భాషావ్యాకరణములనే యితర భాష లనుకరించినవి. అట్లే, ఒకే వ్యాకరణవిధానము సర్వభాషలకు

సమన్వయించు నన్న విశ్వాస మేర్పడినది. కొన్ని కొన్ని భాషలపట్ల చిన్న చిన్న సరదుబాటు లవసరమన్న సంగతినికూడ వా రంగీకరించిరి. ఉన్నతస్థానమున నున్న గ్రీకు, లాటిను, హిబ్రూ మున్నగుభాషలతోనే కాక అపరిచితములైన మూలమూలల నున్న ఎన్నో క్రొత్తభాషలతో పరిచయము కలుగజొచ్చెను. అయినప్పటికి విశ్వవ్యాకరణదృష్టి చెదరి పోలేదు.

అనేకక్షేత్రములలో అనేకపరిశోధనలు సాగజొచ్చెను. క్రొత్త క్రొత్త భాషలు వెలుగులోనికి రాసాగినవి. వేరువేరు భాషలకు, క్రొత్త వానికి పాతవానికి కూడ వివరణాత్మకవ్యాకరణములు బయలువెడల సాగినవి.

'లీబ్నిజ్' అను తత్త్వవేత్త ప్రోత్సాహముచేత 'పీటర్ ది గ్రేట్' అను రాజు తన రాజ్యములోని వివిధభాషలయందలి సమానార్థక శబ్ద ములను సేకరింపజేసెను. లీబ్నిజ్ హిబ్రూభాషయే తక్కిన భాషలకు మూలమన్న ప్రాచీనవిశ్వాసమును ఖండించి యూరేషియాఖండము నందలి భాషలన్నియు నొకే వర్గమునకు సంబంధించిన వన్న యభి ప్రాయమును వ్యక్తముచేసెను. కేథరిన్‌రాణికూడ పదపట్టికల విషయ మున శ్రద్ధ వహించెను. పి. యస్. పల్లస్ అనునతడు ఆమె యాదేశ మునుబట్టి వివిధభాషలలోని 285 శబ్దములను తులనాత్మకముగా ప్రదర్శించు పట్టికను క్రీ. శ. 1786 లో సంతరించెను. ఐదేండ్లు గడచిన పిమ్మట దానిని సంస్కరించి వృద్ధిపరిచెను. 'హెర్వాస్' అనునతడు పద సామగ్రికంటె వ్యాకరణవిధానమే వివిధభాషల సంబంధమును నిర్ణయించు సాధన మని వెల్లడించెను. 'అడెలంగ్' అనునతడు తొలుదొల్త ఇండోయూరోపియను భాషాకుటుంబమును ప్రత్యేకముగా గుర్తించి పరిగణించెను.

ఈ యుగమునందు పెక్కురు యూరోపువిద్వాంసులు భాషోత్పత్తినిగురించి పునర్విమర్శన చేయసాగిరి. ఫ్రాంసుదేశమునకు చెందిన ప్రసిద్ధతత్త్వవేత్త 'రూసో' భాషోత్పత్తివిషయమున చిత్రమైన యభిప్రాయమును వ్యక్తముచేసెను. ఒక వర్గమునకు చెందిన జను లొకచోట సమావేశమై పరస్పరసమ్మతివలన భాష నేర్పాటుచేసికొని రని ఆయన యభిప్రాయము. అసలు భాషయే లేనినాడు సంప్రదింపులకు, సంభాషణలకు అవకాశము లేదు. కావున, ఆయన చెప్పిన విధానము భాషాసంస్కరణమునకు వీలు కావచ్చును గాని తొలుదొల్త భాషోత్పత్తి కెంతమాత్రము వీలు కాదు. 'కాండిలాక్' అను విద్వాంసుడు భావావేశమువలన వెలువడిన ధ్వనుల నాధారముచేసికొని భాష యేర్పడుచున్నదని నిశ్చయించెను. 'హెర్డర్' అను పండితుడు 'భాషోత్పత్తి' అనుపేర నొక వ్యాసమును రచించి 'బెర్లిన్అకాడమీ'కి సమర్పించెను. అతడు భాష దైవదత్త మన్న ప్రాచీనవిశ్వాసమును తర్కసంగతముగా ఖండించి వేసెను. తన మట్టుకు తాను క్రొత్తసిద్ధాంతమును ప్రతిపాదించెను. మనుష్యులయొక్క యావశ్యకతనుబట్టి స్వాయముగా భాష యేర్పడి వికాసము నొందు నన్నదియే ఆ సిద్ధాంతము.

జెనిష్ (Jenisch) అనునతడు 'ఆదర్శభాష' అన్న శీర్షికతో ఒక పెద్దవ్యాసము రచించెను. అది తరువాత పుస్తకరూపముగా ప్రకటితమయ్యెను. ఆదర్శభాషయందు నాలుగంశము లావశ్యకము లని ఆయన యభిప్రాయము. సంపన్నత (richness) శక్తిమత్త (energy or emphasis), స్పష్టత (clarity), సుస్వరత (enphony) అను నాలుగంశములను కొలమానముగా తీసికొని ఐరోపియాభాషల నెన్నింటినో పాండిత్యపూర్వకముగా విమర్శించెను. ఆ యా భాషల తులనాత్మక పరీక్షయందు తానవలంబించిన నిష్పక్షపాతవైఖరి అభినందనార్హము

ఇచ్చటనే యింకొక్క యిరువురనుగూర్చి చెప్పికొనుట యవస రము. ఈ యిరువురును యూరోపుఖండమునకు చెందినవారే. అయి నప్పటికి వారి కార్యక్షేత్రము భారతదేశము. వారు తెలిసికొన్న మహ త్త్వాంశము భారతదేశమునందే. ఫ్రెంచిపండితుడైన కోర్డో (Coeur-doux) క్రైస్తవమతప్రచారమునకై భారతదేశమునకు వచ్చెను. ఆ సం దర్భమునందే ఆయన సంస్కృతము నభ్యసించెను. అప్పు డాతడు ఫ్రెంచి, లాటిను, గ్రీకుభాషలతో సంస్కృతభాష కెంతో సామ్య మున్నట్లు కనిపెట్టెను. సంస్కృతశబ్దములను కొన్నింటిని గ్రహించి యూరోపీయభాషాశబ్దములతో వానికి సామ్యమును నిరూపించుచు నొక వ్యాసమును వ్రాసి 'ఫ్రెంచి ఇన్స్టిట్యూటు'నకు ప్రకటనార్థమై పంపించెను. ఇది క్రీ. శ. 1767 లో జరిగిన విషయము. దురదృష్టవశ మున ఆ వ్యాసము నలువదియేండ్లపాటు ప్రకటనభాగ్యమునకు నోచు కొనక అట్లే పడియుండెను. 'సర్ విలియం జోన్సు' సంస్కృతభాషా ప్రచారమునకు మిక్కిలి దోహదము చేసిన మహావ్యక్తి. ఈయన 'అభి జ్ఞానశాకుంతలము'ను ఆంగ్లభాషలోని కనువదించెను. ఈ యనువాద ముతో ఐరోపాఖండము సంస్కృతమువైపునకు, భారతసంస్కృతివైపు నకు మొగ్గుచూపుట మొదలుపెట్టినది. క్రీ.శ. 1786 లో జోన్సు మహా శయుడు 'రాయల్ ఏషియాటిక్ సొసైటీ' అను సంస్థను స్థాపించి ప్రారంభోత్సవమునందు సంస్కృతభాషాప్రాశస్త్యము నెంతగానో కీర్తించెను. సంస్కృతభాషను గ్రీకు లాటిను భాషలతో పోల్చి గ్రీకు కంటె పరిపూర్ణమని, లాటినుకంటె సుస్పష్టమని, ఆ రెండు భాషలకంటె సమగ్రముగా పరిష్కృతమని [5] ఆయన తెలిపెను. మొదటిమారుగా గ్రీకు లాటిను సంస్కృతములకు సామ్యమును ప్రదర్శించి, యివన్నియు

5. 'The Sanskrit language, whatever be its antiquity, is of wonderful structure, more perfect than Greek, more copious than Latin and more completely refined than either.'

ఒకే మూలభాషనుండి పుట్టియుండు నన్న యభిప్రాయమును దెల్పిన శ్రేయము జోన్సుమహాశయునకే దక్కినది. గోథిక్, కెల్టిక్ భాషలకు వీని మూలభాషకును సంబంధ మున్నదని యూహించినదికూడ ఈయనయే.

మొత్తముమీద ఈ యుగము మిక్కిలి ఫలవంతమనియే చెప్ప వచ్చును. ఆనాటికి ఆవిష్కృతములైన భాషల కన్నింటికి వివరణాత్మక వ్యాకరణములు విరచితములైనవి. భాషలను సేకరించుటయే కాక, సంబంధమును గుర్తించి వర్గీకరించుటకూడ ఆరంభమైనది. భాషల వికాసమును చారిత్రకముగా గుర్తించుటకు అనువైన లిఖితప్రమాణసామగ్రి సేకరింపబడినది. భాషాత్మకచైతన్యము పూర్వయుగములలోకంటె నెక్కువగా, ఈ యుగమున సాక్షాత్కరింపసాగినది. కాని, యీ కృషియంతయు కేవలము వ్యక్తిగతములైన యాసక్తులనుబట్టి, యభిలాషలనుబట్టి సమకూరినదే. సరియైన శాస్త్రీయమైన విధానము నాటికి పొడచూపలేదు. ఈ యుగాంతమున వెలసిన సంస్కృతభాషాజ్ఞానము భాషాశాస్త్రచరిత్రలోనే విద్యుద్వేగమును విస్తరింపజేసినది. ప్రకాశమానమైన నవ్యోదయమునకు నాంది పలికినది.

## 3. ౪ పందొమ్మిదవ శతాబ్దిచరిత్ర

సర్ విలియం జోన్సు రంగస్థలమును ప్రవేశించుటతో భాషాశాస్త్రము రక్తి కట్టసాగినది. ఆయన చేసిన తులనాత్మకపరీక్ష తరువాతి వారికి మార్గదర్శకమైనది. ప్రాచీనలిఖితప్రయోగములను పదములను సేకరించి, యొకదాని ప్రక్క నొకదాని నుంచి సామ్యభేదములను వివరించి, అందు సంఖ్యాధిక్యమునుబట్టి మూలభాషారూపమును నిర్ధారించుట తులనాత్మకపరీక్షవలన నేర్పడు ప్రయోజనము. ఒకే కుటుంబమునకు చెందిన భాషల నడుమ మాత్రమే యీ పరీక్ష జరుగవలయును. జోన్సు సంస్కృతభాషను ప్రాచీనపారశీకముతో లాటిను గ్రీకు కెల్టికు

జర్మానికు భాషలతో పోల్చి పరీక్షచేసెను. ఆయన యవలంబించిన విధానము నిశ్చితము నిర్దిష్టము నగుటచేత, అనంతరు లా మార్గముసే యవలంబించిరి; ఆ మార్గమును విస్తరింపజేసిరి. కేవలము ప్రాచీనభాషలను లిఖితభాషలను పోల్చుటయే కాక, వ్యావహారికము నందున్న యనేకభాషలను, అప్రసిద్ధములైన భాషలనుగూడ పోల్చుట ప్రారంభమయ్యెను. [6] దీనినిబట్టి తులనాత్మకవిధానము సంస్కృతభాషాపరిచయముతో సముజ్జీవిత మయ్యెనని యంగీకరింపవలయును.

[7] సంస్కృతభాషాపరిచయమువలననే ధ్వనివిజ్ఞానము సరియైన మార్గమును సాక్షాత్కరించుకొనసాగినది. స్థాన కరణ ప్రయత్నముల నాధారము చేసికొని ధ్వనులను గుర్తించుట, వర్గీకరించుట సంస్కృత వ్యాకరణము పెట్టిన భిక్షయే. ధ్వనులను నాదము లని శ్వాసము లని విభాగముచేయుట మొదలయిన దంతయు సంస్కృతవ్యాకరణప్రభావమునకు సాక్ష్యము. సంస్కృతధ్వనివిజ్ఞానము క్లిష్టమన్న యపోహ యొకటి లోకమున నున్నది. దానిని గుర్తించుటకే ప్రయత్నమును లేకుండగనే, అది దుర్గమ మని, గ్రహణసులభము కాదని యనెడువారు పెక్కురు కలరు. కాని, అది యనుసరించిన శాస్త్రీయవిధానమువలన, ప్రత్యాహారప్రక్రియవలన సుస్పష్టము, సుగ్రహము నని తద్వేత్తలకు

6. 'Comparative philology was born on the day when Sanskrit was opened to the eyes of the Western World. The enthusiasm that stirred the hearts of those first pioneers into the realm of India's sacred language and India's ancient lore still throbs in the veins of their followers today and will quicken the pulse-beat of inspired workers for generations to come.' — Jackson.

7. 'Without the Indian grammarians and phoneticians whom he (Sir William Jones) introduced and recommended to us, it is difficult to imagine our nineteenth century school of phonetics.'

— J. R. Firth.

స్పష్టముగా తెలియును.[8] దానినే యనుసరించియు, కొంత స్వాతంత్ర్యమును చూపించుటచేత ఆధునిక భాషాశాస్త్రమునందలి ధ్వని విజ్ఞానమే కొంత అస్పష్టతకు, అసమర్థతకు లోనయ్యె నన్నచో సాహసముకాదు. ఈ యుగమునందలి ధ్వనివేత్తలుకూడ తలదాల్పవలసినంత శాస్త్రీయముగా క్రీస్తుపూర్వమే వింగడించి చూపుట విశేషము. ఆ విశేషమే పాశ్చాత్యుల మన్ననకు పాత్రమైనది; ఆ విశేషమే ఆనాటి భాషాశాస్త్రజ్ఞుల నెందరనో సంస్కృతవిద్యార్థులను గావించినది. యూరపునందలి యనేక విశ్వవిద్యాలయములలో సంస్కృతపీఠములు నెలకొల్పబడినవి. సంస్కృతమును బోధించుటయే కాక, పరిశోధనములుకూడ విరివిగా చేపట్టుట నాటి విద్యాలయముల విశిష్టకార్యక్రమము.

ఈ యుగమున జోన్సు తరువాత చెప్పుకొనదగిన భాషాశాస్త్ర పండితుడు ఫ్రెడెరిక్ ఫోన్ ష్లెగెల్ (Friederich Von Schlegel). ఈయన జర్మనీదేశస్థుడు. జర్మనీదేశపు భాషావేత్తల కీయన సంస్కృత భాషాసాహిత్యములపట్లఎంతో యభిరుచిని కలిగించెను. ఈయన జర్మను భాషలో [9] 'భారతీయభాష – విజ్ఞానము' అనుపేర నొక గ్రంథమును రచించి క్రీ. శ. 1808 లో ప్రకటించెను. ఇందు సంస్కృతమును ఐరోపీయభాషలతో పోల్చి పరిశీలించుట జరిగినది. గ్రీకు, లాటిను, జర్మను, సంస్కృతభాషలకు చెందిన అనేకశబ్దములను శాబ్దికార్థికదృష్టులతో పరిశీలించుట జరిగినది. ఈ గ్రంథమునం దీతడే తొలుదొల్తగా 'తులనాత్మక వ్యాకరణము' అన్న అర్థము నిచ్చు పదమును ప్రయోగించెను.

---

8. 'The wonder is, not that they (Indian grammarians) should be indistinct, but that they should have been so much more distinct than the host of European grammarians and orthoepists who succeeded them.' — A. J. Ellis.

9. Uber die Sprache und Weishiet der Indier.

ఈయన సోదరుడు ఎడోల్ఫ్ ష్లెగెల్ (Adolf Schlegel) కూడ భాషాశాస్త్రవిషయమున పర్యాప్తమైన కృషిచేసెను. సంస్కృత భాషయందు సమర్థమైన పాండిత్యమును సంపాదించుకొనెను. శ్లిష్ట భాషలను సంయుక్తభాషలు, అసంయుక్తభాషలు అని తిరిగి రెండు విధములుగా విభజించి యొక సౌకర్యమును సాధించెను.

చారిత్రకదృక్పథమునుబట్టి భాషాధ్యయనము చేసినవాడు విల్హెల్మ్ ఫోన్ హంబోల్ట్ (Wilhelm Von Humboldt). ఈయన కూడ జర్మనీ దేశీయుడే. భాషలను వర్గీకరించుటలో ఈయన శ్లిష్టభాష లని, అశ్లిష్టభాష లని రెండు విధములైన విభాగము ననుసరించెను. శబ్దము లన్నియు ధాతువులనుండియే యుత్పన్నమయ్యె నని యీయన యభిప్రాయము; అనగా, ఈయన ధాతువాది యన్నమాట. ప్రత్యయములు కూడ తొలుదొల్త పదములుగానే యుండెననియు, అర్థవిశేష సాధకములుగా అవి పదములకు చేర్పబడుచుండెడి వనియు ఆయన నిశ్చయము. జావాయందలి కవిభాష (Kawi language) యీయన ప్రధానపరిశోధనక్షేత్రము.

డెన్మార్కు దేశీయుడైన రాస్మస్ క్రిష్టియన్ రాస్కు భాషాశాస్త్రచరిత్రలో అగ్రశ్రేణిలో పేర్కొనదగినవారిలో నొకడు. ఈయన యనేకవిశేషములను తెలియజేసి, వినూత్నక్షేత్రములందు విశేషకృషి జరుగుటకు బీజావాపనము చేసినవాడు. ఈయన ప్రపంచమునందు చాల భాగము పర్యటనముచేసి అనేకభాషలతో ప్రత్యక్షపరిచయమును సంపాదించుకొనెను. క్రీ. శ. 1818 లో ఐస్లాండునందలి ప్రాచీననోర్సు భాషను గురించి తాను చేసిన పరిశోధనాంశముల [10] నొక గ్రంథముగా ప్రకటించెను. శాస్త్రీయవిధానము ననుసరించి రాస్కుపండితుడు నోర్సుభాషను వివేచనచేసెను. 'ఆంగ్లోసాక్సను వ్యాకరణము'ను

10. Investigation on the origin of the Old Norse or Islandic Language.

గూడ రాస్కు పండితుడు రచించెను. దైనందినోపయోగి వస్తువులను దెలుపు శబ్దములు, సర్వనామములు, సంఖ్యావాచకములు కుటుంబనిర్ణయమునకు సహకరించు సాధనములు. వేర్వేరు భాషలలో నున్న యీ శబ్దములు సామ్యమును ప్రదర్శించునెడల, ఆ యా భాషల నేక కుటుంబ జనితములుగా నిర్ణయము చేయవచ్చును. అప్పుడుకూడ ఒకే శబ్దము వేర్వేరు భాషలందు వేర్వేరు ధ్వనులను కలిగియుండవచ్చును; అనగా, శబ్ద మొక్కటే యయ్యు భాషాస్వభావమునుబట్టి ఒకటి రెండు ధ్వనులు మార్పు పొందియుండవచ్చును. అట్టివానిని గమనించి సూత్ర పట్టినచో అవియే ధ్వనిసూత్రములు (Phonetic laws) అగును. ఈ మార్గము ననుసరించి యూరోపుభాషలను పరిశీలించి భిన్నకుటుంబము లను నిర్ణయించి చూపినవాడు రాస్కుమహోదయుడు. తన ఆంగ్లో స్కాగ్జనువ్యాకరణమునందే యీ వివేచన మంతయు సాగినది. భాషల పరస్పరసంబంధమును నిర్ణయించుటలో ఈయన ప్రతిభ యపూర్వము. ఇతరసహకారము లేని సమయమున భాష నాధారముగా గ్రహించి తద్భాషాసమాజముయొక్క చరిత్రను నిర్మింపవచ్చు నన్నది ఆయన దృఢవిశ్వాసము. ఒక సంఘమునందలి ఆచారవ్యవహారములు మారవచ్చును; సంస్కృతిసంప్రదాయములుకూడ మారవచ్చును. భాష అంత తొందరగా మారదు. అంతేకాక, ఆనాటి ఆచారాదికమును తనయందు భద్రపరుచుకొని యుండును. కావున భాషనుబట్టి చరిత్రను నిర్మించుట సంభావ్యమే. ఒక భాషయందలి పదములు మరొక భాషలో ప్రవేశింప వచ్చును; వ్యాకరణాంశము లట్లు మారవు. కావున భాషల సంబంధ మును నిశ్చయింపవలసినప్పుడు పదసామగ్రికంటె వ్యాకరణాంశములకే ప్రాధాన్యము నంగీకరింపవలయును. ఇది రాస్కు చేసికొన్న నిర్ణయము. ఈ నిర్ణయము ననుసరించి యీయన 'ఫిన్నో - ఉగ్రియన్' భాషలను చక్కగా వర్గీకరించెను. పారశీకభాషను, అవెస్తాభాషను వివేచించి ఆర్యభాషాకుటుంబములోనివిగా నిర్ణయించెను. భారతదేశమునకు

వచ్చి మలబారిక్ భాషలు సంస్కృతభాషావర్గమునకు చెంద వని, అవి భిన్నకుటుంబజనితము లని నిర్ణయించెను. ఆ మలబారిక్ భాషలే తరువాతికాలమున బిషప్‌కాల్డ్వెల్‌చేత ద్రావిడభాషలుగా ప్రతిష్ఠితము లైనవి.

ఈ తరువాత, చెప్పుకొనదగినవాడు జేకబ్ గ్రిమ్ (Jacob Grimm) ఈయన న్యాయశాస్త్రవిద్యార్థి యైనను భాషాశాస్త్రము నందలి యభిరుచిచేత, తదధ్యయనాధ్యాపనములందే తన జీవితమును గడపెను. చిన్నపిల్లల కాసక్తిని కలిగించు [11] కల్పనాకథలు వ్రాసి వాసి గడించినప్పటికి భాషాశాస్త్రమునందు 'ధ్వని సూత్రములు' కల్పించి తన పేరునకు శాశ్వతత్వమును చేకూర్చుకొనెను. ఈయన తొలుదొల్త వ్యుత్పత్తివిషయమున (Etymology) ఆసక్తి కనబరిచెడివాడు. ష్లెగెల్, రాస్కుల ప్రభావమువలన, ఈయన తన యాసక్తిని చారిత్రకభాషాధ్యయనముమీదికి మరలించుకొనెను. తత్కృషిఫలితముగా క్రీ. శ. 1819 లో [12] 'జర్మనుభాషావ్యాకరణము'ను ప్రకటించెను. క్రీ. శ. 1822 లో ఈ గ్రంథమునకు పరివర్ధితసంస్కరణమును ప్రకటించెను. మొదటి సంస్కరణమునందు లేని ధ్వనిసూత్రములు పరివర్ధితసంస్కరణమునందు ప్రవేశించినది. అవియే గ్రిమ్ ధ్వనిసూత్రములు (Grimm's laws) అనుపేరున ప్రసిద్ధినందినవి. ఇక్కడ ఒక సంగతిని చెప్పుకొనుట యసంగతము కాదు. గ్రిమ్ గ్రంథము మొదటిమాటు ముద్రితమైన పిమ్మట రాస్కు రచించిన 'ఆంగ్లోసాగ్జను వ్యాకరణము' వెలువడినది. అందు ధ్వనినియమవివేచన యున్నది. గ్రిమ్ రాస్కుగ్రంథమునందలి వివేచనను గ్రహించి, దానిని తన గ్రంథముయొక్క పునర్ముద్రణమునందు వినియోగించుకొనెను. రాస్కు సూత్రప్రాయముగా చెప్పిన

11. Grimm's Fairy Tales.

12. Duetsche Grammatik.

దానిని, గ్రిమ్ సమగ్రముగా నిర్వహించి సూత్రములుగా వింగడించి ప్రదర్శించెను. బీజావాపము చేసినవాడు రాస్కు కాగా, అంకురితమై పల్లవితమైన ఆ లతకు పందిళ్లు చేసినవాడు గ్రిమ్‌పండితుడు. ధ్వని సూత్రముల విషయ మిట్లుండగా వాక్యవిజ్ఞానమునందు కూడ చారిత్రకపద్ధతిని ప్రవేశపెట్టి మహత్తరఫలితమును సాధించిన శ్రేయము కూడ గ్రిమ్‌పండితునకే చేకూరినది.

ఈ తరువాతి స్థానమును చేజిక్కించుకొన్నవాడు ఫ్రాంజ్ బాప్ (Franz Bopp). ఈయనకూడ జర్మనుదేశీయుడే. ఈయన క్రియానిర్మాణము నాధారము చేసికొని ఒక తులనాత్మకవ్యాకరణమును క్రీ.శ. 1816 లో ప్రకటించెను. గ్రీకు, లాటిను, పారశీక, జర్మానికు భాషలతో పోల్చి సంస్కృతక్రియానిర్మాణరీతిని బాప్ తన గ్రంథమునందు వివేచన చేసెను. దీనితో తులనాత్మకభాషాశాస్త్రమునకు దార్ఢ్యము కలిగినది; తత్ఫలితముగా బాప్‌మహాశయునకు తులనాత్మకభాషాశాస్త్రపిత (Father of comparative philology) యన్న ప్రసిద్ధి లభించినది. ఈయనకు మరింతకీర్తిని చేకూర్చిన మహత్తరగ్రంథము క్రీ.శ. 1833 లో ప్రకటితమయ్యెను. సంస్కృతము, జెందు, గ్రీకు, లాటిను, లిథువేనియను, గోథికు, జర్మనుభాషలకు తులనాత్మకముగా రచించిన వ్యాకరణ మిది. క్రీ. శ. 1854 లో సంస్కృతగ్రీకుభాషలలోని స్వరము (Accent) ను వివేచనచేయుచు నొక గ్రంథమును వెలువరించెను. ఈయనకు ధ్వనిసూత్రముల విషయమున నాసక్తి లేదు; తన యాసక్తి నంతను పదనిర్మాణము, వాక్యనిర్మాణము మొదలయినవానిని తులనాత్మకముగా పరిశీలించుటకే ప్రదర్శించెను. గ్రీకు మున్నగుభాషలను సంస్కృతముతో పోల్చి చూచి, సంస్కృతముతోపాటుగా గ్రీకుప్రభృతి భాషలుకూడ వేరే యొక భాషనుండి యుత్పన్నము లయ్యెనని నిర్ణయించెను. ఇతరసోదరభాషలలో కంటె సంస్కృతములోనే మూల

భాషాలక్షణము లెక్కువగా నిల్చియున్న వనియు, మూలభాషకు సంస్కృత మత్యంతసన్నిహిత మైయున్న దనియు నిర్ణయించెను. అయినను గ్రీకు లాటిను భాషాలక్షణములు కొన్ని మూలభాషను సూచించుచున్న వనియు అవి సంస్కృతములో లుప్తమై పోయెనని కూడ ఆయన యభిప్రాయము. హంబోల్డుపండితునివలెనే యీాయనకూడ ప్రత్యయములు తొలుత స్వతంత్రపదములుగానే యుండెడివనియు, క్రమముగా పదత్వమును గోల్పోయియుండె ననియు నిర్ణయించెను. బాప్ ఇండోయూరోపియను భాషాధాతువులకంటె హిబ్రూ, అరబ్బీ మున్నగుభాషల ధాతువులు భిన్నములని నిరూపించెను; అనగా అవి భిన్నకుటుంబములకు చెందినవని నిర్ణయించె నని యర్థము. పరిమితమైన పరిధిలోనే భాషాశాస్త్రనియమములు ప్రవర్తించునని యీాయన యభిప్రాయము. ఈయన మొత్తము భాషలను మూడు వర్గములుగా విభజించెను. (1) ధాత్వాది వ్యాకరణనియమ రహితభాషలు. చీనాభాష మొదలయినవి యుదాహరణము. (2) ఏకాక్షర ధాతుక భాషలు. సంస్కృతము మున్నగునవి యుదాహరణము. (3) ద్వ్యక్షర (త్రివర్ణ) ధాతుక భాషలు హిబ్రూభాష మున్నగునవి యుదాహరణము.—ఇవి ఆ మూడు వర్గములు.

రాస్క్, గ్రిమ్, బాప్ - అను నీ ముువ్వురను భాషాశాస్త్రప్రవక్తృత్రయముగా భావించి సంభావింతురు.

జర్మానిక్ భాషలకు గ్రిమ్ ధ్వనిసూత్రములను సిద్ధముచేసిన ట్లింతకుముందు చెప్పుకొంటిమి. అదే మార్గమున ఇండోయూరోపియను భాషల కన్నింటికి అన్వయించునట్లుగా అగస్టు ఫ్రెడరిక్ పాట్ (August Friederich Pott) అను జర్మనీదేశీయుడు ధ్వనిసూత్రములను సిద్ధముచేసెను. వ్యుత్పత్తికి శాస్త్రీయమైన వ్యవస్థ కల్పించుచు [13] ఈయన యొక గ్రంథమును రచించెను. అనేకములయిన శబ్దములకు

13. Etymologische Forschungen.

శాస్త్రీయమైన వ్యుత్పత్తిని విశదముగా నిరూపించెను. ఆకాలమున గణింపబడుచున్న ఇండోయూరోపీయభాషల కన్నింటికి సామ్యభేదములను పరిగణించి, ధ్వనిసూత్రముల నేర్పరిచెను.

గ్రిమ్‌మహాశయుని కృషిని వ్యతిరేకించిన వ్యక్తి రాప్ (K. M. Rapp). ఈయన తన సమకాలికుడైన గ్రిమ్ నిర్ణయములను వ్యతిరేకించుచు క్రీ. శ. 1836 నుండి 1841 వరకు అనేక గ్రంథములను రచించి ప్రకటించెను. వ్యావహారికభాషల విషయమున ప్రత్యేకమైన ఆసక్తిని ప్రదర్శించెను. వ్రాతకు ఉచ్చారణమునకు నడుమనున్న భేదమును గమనించి, ఆ భేదమును తొలగించుటకై లిపియందు మార్పులను గావించెను. అనగా తరువాతికాలమున వాడుకలోనికి వచ్చిన ధ్వనిలిపి (Phonetic Script) కి పూర్వపీఠమును సిద్ధముచేసె నన్నమాట.

సెయింట్ పీటర్సుబర్గ్ నిఘంటునిర్మాణము భాషాశాస్త్రచరిత్రయం దొక మహత్తరసన్నివేశము. ఇది బృహత్పరిమాణముగల సంస్కృతనిఘంటువు. ఇందు ప్రతిశబ్దమునకు మూలధాతువును ప్రదర్శించుచు వ్యుత్పత్తి వివరింపబడినది. దీనిని రుడోల్ఫ్ రాత్ (Rudolf Roth), ఆటో బోట్‌లింక్ (Otto Boutlingk) అను నిరువురు కలసి నిర్మించిరి. ఈ గ్రంథము వారి అనుపమానసంస్కృతపాండిత్యమునకు పరమప్రమాణము. రాత్ అవెస్తాభాషయందు కూడ పర్యాప్తమైన పాండిత్యమును సంపాదించెను. అవెస్తాభాషను అధ్యయనము చేయవలయునన్న ముందుగా వేదాధ్యయనము చేయవలయునని, అట్లు కాకున్నయెడల సక్రమముగా అవెస్తా యర్థముకా దని యీాయన నిశ్చయము.

అగస్టు ష్లైచర్ (August Schleicher) మౌలికమైన విశేషముల నందించిన మహనీయులలో చెప్పుకొనదగినవాడు. ఈయన ధ్వనిసూత్రముల నాధారముగా చేసికొని, ఇండోయూరోపీయనుభాషలకు

మూలరూపమయిన భాషను కనుగొనవలయునని యత్నించెను. మూల భాషను కనుగొన్న యెడల, దానినుండి పుట్టిన యితరభాషలలో ఏర్ప డిన మార్పులను, తత్కారణములను గ్రహింపవచ్చుననియు, తత్సా హాయ్యమున నా యా భాషల చారిత్రకవ్యాకరణములను రచింపవచ్చు ననియు ఈయన విశ్వాసము. ఆ విశ్వాసమున కనుకూలముగా ఇండో యూరోపియను భాషావంశవృక్షమును నిర్మించెను. అట్లే మూలభాష నూహించి, ఆ మూలభాషలో పూర్తిగా ఒక కథను రచించెను. మూల భాషలో అచ్చులును హల్లులును కొలదిసంఖ్యలోనే యున్నవనియు, సంస్కృతమునందలి వర్ణములే మూలభాషావర్ణములకు సన్నిహితములై యున్నవనియు ష్లైచర్ భావించెను. పైభావముల కన్నింటికి ప్రతిబింబము గా క్రీ.శ. 1861 లో [14] ఒక తులనాత్మకవ్యాకరణగ్రంథమును రచించి ప్రకటించెను. ఈయన భాషలను అసంయుక్తభాషలని, అశ్లిష్టసంయుక్త భాషలని, శ్లిష్టసంయుక్తభాషలని మూడు విధములుగా విభజించెను.

ఫ్రెడరిక్ మాక్సుమూలర్ (Friederich Max Muller) జర్మనీ దేశీయుడైనప్పటికి భారతీయుల కాత్మీయుడై 'మోక్షమూల' పండితు నిగా భావింపబడి సంభావింపబడినవాడు. సంస్కృత మన్నను, భారత దేశ మన్నను చెప్పరాని మమకారము కలిగి జీవితమంతయు సంస్కృత భాషావరివస్యలోనే గడపిన మహావ్యక్తి మాక్సుమూలరు. ఈయన చరిత్ర కందని కాలమునాటి విశేషములను గుర్తింపవలయు నన్న యభి లాష కలవాడు. భాషాశాస్త్రము నాధారము చేసికొని ఆర్యుల జన్మ భూమిని మధ్యాసియా యని యీయన నిర్ణయించెను. నిజమునకు వేద వాఙ్మయము నాశ్రయించుకొనియే యీయన పరిశోధన చాలవరకు ప్రవర్తించినది. అర్థవిజ్ఞానము (Semantics) ను గూర్చి కూడ ఈయన తగినంత యాసక్తిని చూపకపోలేదు. భాషాశాస్త్రమునకు సంబంధించి

14. Compendium der Vergleichen den Grammatic der Indo-germanischen Sprachen.

నంతవరకు ఈయన మౌలికవిశేషముల నేమియు తెలుపలేదు. కాని ఇంత వరకు జరిగిన భాషాశాస్త్రీయమైన కృషిని సర్వజనసుబోధకముగా వెల్ల డించి అనన్యసాధ్యప్రచారము గావించిన ఘనత యీయనకు లభింపక తప్పదు. 'భాషాశాస్త్రము' అనుపేరున క్రీ. శ. 1861 లో ఈయన యొక గ్రంథమును రచించి వెలువరించెను. ఇందు భాషోత్పత్తి, భాషా స్వరూపము, వికాసము, తత్కారణములు - మున్నగు భాషాశాస్త్రీయ ములైన అనేక ప్రధానాంశములు ప్రసక్తములైనవి.

మాక్సుమూలరుమహోదయునకు ప్రతిపక్షియై వ్యవహరించిన వాడు విలియం డ్వయిట్ విట్నీ (William Dwight Whitney). భాషాశాస్త్రరంగమున అడుగుపెట్టిన మొట్టమొదటి అమెరికాదేశీయు డీయన. మాక్సుమూలరునకు విట్నీకి నడుమ విమర్శప్రతివిమర్శలు సాగు చుండెడివి. మాక్సుమూలరుకు సమాధానముగా విట్నీ 'మాక్సు మూలరు - భాషాశాస్త్రము' అనుపేరున ఒక గ్రంథమునే రచించెను. విట్నీ ప్రధానముగా వైయాకరణుడు; సంస్కృతభాషలో విశేషమైన కృషి చేసినవాడు. ఈయన క్రీ. శ. 1879 లో [15] 'సంస్కృతవ్యాకర ణము' ను గూర్చి గ్రంథమును రచించి ప్రకటించెను. ఇం దీయన కావ్యభాషతోపాటు వైదికభాషనుకూడ వ్యాకరించి చూపెను. ఈ గ్రంథము మిక్కిలి ప్రసిద్ధిని సంపాదించుకొన్నది. [16] 'భాష - తదధ్య యనము' అనుపేరున క్రీ.శ. 1867 లో ఒక గ్రంథమును రచించి భాషా శాస్త్రరంగమునందు తన యభినివేశమును ప్రకటించుకొనెను. [17] క్రీ.శ. 1875 లో 'భాష - తజ్జీవనవికాసములు' అనుపేర నింకొక భాషా శాస్త్రీయగ్రంథమును వెలువరించెను. ఈ రెండు గ్రంథములవల్ల భాషా

15. A Sanskrit Grammar, including both the classical language and the Older Dialects of Veda and Brahmana.

16. Language and its Study.

17. Life and Growth of Language.

చరిత్రలో స్థానమునుసంపాదించుటయే కాక, భాషాశాస్త్రప్రధాన సిద్ధాంతములను ప్రజాసముదాయమున కందజేసిన కీర్తినిగూడ పంచుకొనెను.

హెర్మన్ స్టెయిన్టహాల్ (Herman Steinthal) రంగమునందు ప్రవేశించుటతో భాషాశాస్త్రగతి క్రొత్తమలుపు తిరిగినది. ఈయన భాషావివేచనమునకు తర్కశాస్త్ర మనస్తత్త్వశాస్త్రములతో సంబంధమున్నదని తెలిపెను. మనస్తత్త్వశాస్త్రమును విడనాడి భాషావివేచనము చేయుట నేల విడిచి సాముచేయుట వంటిదని యీాయన నిశ్చయము. ఇంతవరకు భాషావివేకులలో నెవ్వరు నీ విషయమును ప్రస్తావింపలేదు. ఈ విధముగా చూచినప్పు డిది యపూర్వమే. పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్ధమునందలి భాషాశాస్త్రగవేషణమునకు లక్ష్యభూతమైన దిది. కాని, ష్లైచర్ మహాశయునకు ఈ సంబంధము సమ్మతము కాలేదు. స్టెయిన్టహాలుప్రభృతులను మిక్కిలి పరిహసించెను; పైగా వారికి యువవ్యాకర్తలు (Jung Grammatiker) అని బిరుదప్రదానము చేసి తిరస్కరించెను. కాని, తరువాతికాలమున స్టెయిన్టహాలు సిద్ధాంతమున కనుకూలముగానే భాషాశాస్త్రము పురోగమించినది.

హెర్మన్ఓస్తోఫ్ (Herman Osthoff), కార్ల్బ్రుగ్మన్ (Karl Brugmann), హెర్మన్పాల్ (Herman Paul) అను ముప్వురు కలిసి చేసిన పరిశోధన కార్యక్రమము [18] 'శబ్దవిజ్ఞానసమీక్ష' అను మహత్తరగ్రంథముగా రూపుదాల్చినది. ఇది ఐదు ఖండములుగా ముద్రితమైనది. మొట్టమొదటి ఖండము క్రి. శ. 1878 లో ప్రారంభమైనది; తక్కిన ఖండములు తరువాత క్రమముగా వెలువడినవి.

పై ముగ్గురిలో బ్రుగ్మన్ గొప్పపేరు గడించెను; ఆ యుగమునందలి భాషాశాస్త్రజ్ఞులలో సర్వోత్తముడుగా పరిగణింపబడెను.

---

18. Morphologische untersuchungen.

[19] ఇండోయూరోపియనుభాషల తులనాత్మకవ్యాకరణమును పంచ ఖండాత్మకముగా రచించుటకై ఒక ప్రణాళికను సిద్ధము చేసికొనెను. తదనుకూలముగా రచన సాగించి మొదటి ఖండమును క్రీ.శ. 1886 లో వెలువరించెను. తరువాతి ఖండమునుకూడ తానే రచించెను. చివరి మూడు ఖండములు తులనాత్మకవాక్యవిజ్ఞానమునకు సంబంధించినవి. వీనిని డెల్‌బ్రూక్ (Delbruck) అను నాయనతో కలిసి రచించెను. డెల్‌బ్రూక్ 'తులనాత్మకవాక్యవిజ్ఞానపిత' యన్న ప్రసిద్ధికి పాత్రుడై యుండెను. ప్రాచీన నూతన గ్రీకుభాషనే కాక లాటిను సంస్కృతాది భాషలయందు కూడ ఈయనకు పర్యాప్తపాండిత్యము గలదు.

పై ముగ్గురిలో నొకడైన పౌల్ [20] 'భాషాచారిత్రక సిద్ధాంతములు' అనుపేరున నొక గ్రంథమును ప్రత్యేకముగా రచించెను. నేటికిని సిద్ధాంతగ్రంథముగా దీనికి విశిష్టమైన స్థానము కలదు.

ఈ సమయముననే గ్రిమ్ ధ్వనిసూత్రములను పునరాలోచనము చేసి, కొన్ని యపవాదములకు సమాధానముగా గ్రాస్మన్ (Grassmann) కొన్ని నియమములను కల్పించెను. ఇవి 'గ్రాస్మన్ నియమములు' అనుపేర వ్యవహృతము లగుచున్నవి. ఇట్లే, యింకను మిగిలి యున్న యపవాదములకు కార్ల్ వెర్నర్ (Karl Verner) కొన్ని నియమములను సమాధానముగా కల్పించెను. ఇవి యీాయనపేరనే 'వెర్నర్ నియమములు' అని ప్రసిద్ధి కెక్కినవి.

క్రీ.శ. 1870 లో ఆస్కోలీ (Askoli) అనునతడు ఒక మహత్తరవిషయమును వెల్లడించెను. అది ఇండోయూరోపియను భాషలను స్థూలముగా రెండు వర్గములలోనికి విభజించుటకు సహాకరించినది.

---

19. Grundriss der Vergleichen den Grammatik der Indogermanischen Sprachen.

20. Prinzipien der Sgrachgeschichte.

మూలభాషయందలి 'క' ధ్వని కొన్ని భాషలలో నట్లే యుండగా, కొన్నింటియందు 'స' ధ్వనిగానో 'శ' ధ్వనిగానో మారును. అట్లు మారకయున్న భాషలన్నియు 'కెంతుమ్' వర్గములోనికి, మారిన భాషలన్నియు 'సతెం' వర్గములోని చేరిపోవును. సంస్కృతమునందు 'శతమ్' అను శబ్దమునకు రూపాంతరములే పైనున్న 'కెంతమ్, సతెం' అనునవి.

బ్రీల్ (Breal) అను నొక ఫ్రాంసుదేశీయుడు 1897 వ సంవత్సరమున [21] 'అర్థవిజ్ఞానము' పై నొక గ్రంథమును రచించి ప్రకటించెను.

మొత్తముమీద పందొమ్మిదవశతాబ్దము భాషాశాస్త్రపరిధిని బహుముఖములుగా విస్తరింపజేసిన దని యంగీకరింపవలయును. శాస్త్రీయవివేచనకు 'శంకుస్థాపన' జరిగిన దీ యుగముననే. పూర్వార్థమందు - సంస్కృతభాష సర్వప్రాధాన్యము వహించినది. ప్రాచీనలిఖితభాషలకే వివేచనయోగ్యత కలదు. వాడుకభాషలను వివేచించుట యెప్పుడేని జరిగినప్పటికి, ప్రాచీనభాషతో పోల్చుటకే కాని స్వతంత్రప్రతిపత్తిని కల్పించుటకు మాత్రము కాదు. తులనాత్మకవివేచన, చారిత్రక వివేచన యాదృతము లైనవి; ఐనప్పటికిని సామాన్యలక్షణములను సమీక్షించుటయందే ఆసక్తి ప్రసరించెడిది. భాషాకుటుంబములను గూర్చిన భావము స్పష్టాస్పష్టముగా పొడచూపినది. పదనిర్మాణమునుబట్టి భాషలను వివేచించుటకు సైతము స్థూలముగా ప్రాతిపదిక యేర్పడినది. ఉత్తరార్థమందు - ప్రాచీనభాషలవలెనే వ్యావహారికభాషలను వివేచనయోగ్యతను గడించుకొన్నవి. భాషయందలి యనేకాంశములను గమనించుటకు మనస్తత్త్వశాస్త్రముయొక్క సహకార మవసరమని నిశ్చితమయ్యెను. భాష యభివృద్ధి నొందుటలో సామ్యము (Analogy) యొక్క పాత్ర గుర్తింపబడెను. ధ్వనిని భాషకు బహిరంగముగాను,

21. Essai de Semmantique.

అర్థము నంతరంగముగాను గుర్తించుట జరిగెను. వాక్యవిజ్ఞానమునకు తగినంత విశిష్టత లభించినది. ధ్వనిసూత్రములు నిరపవాదములుగా పరిగణితములైనవి.

ఇంతవరకు పాశ్చాత్యదేశములందు జరిగిన కృషిని స్థాలీపులాకముగా గుర్తించితిమి. ఇంక భారతదేశమునందలి కృషిని గుర్తింతము. ఆధునికభాషాశాస్త్రమార్గము ననుసరించి కృషిచేసినవారిలో మొట్ట మొదటివాడు బిషప్ రాబర్ట్ కాల్డ్వెల్ (Robert Caldwell). ఈతడు దక్షిణభారతదేశమున నున్న తమిళ మలయాళాది భాషలు సంస్కృత భాషకంటె భిన్నము లని, సంస్కృతజన్యములైన ఉత్తరభారతభాష లతో వీనికి సోదరసంబంధము లే దనియు నిర్ణయించెను. ఈ నిర్ణయ మింతకు ముందే ఎలిస్, కాస్ట్, మాక్సుమూలర్ మున్నగువారు చేసియే యుండిరి. మలబారిక్ భాషలు, తములిక్ భాషలు, కోర మాండల్ భాషలు మున్నగు వివిధవ్యవహారము గల భాషలకు 'ద్రావిడ భాషలు' అను నామమును స్థిరీకరించెను. ఫ్రాంజ్ బాప్ ఇండోయూరో పియన్ భాషలకు వ్రాసినట్లుగా కాల్డ్వెల్ ద్రావిడభాషల కొక [22] తుల నాత్మకవ్యాకరణమును రచించెను. ఇది క్రీ.శ. 1856 లో మొదటిమాటు ముద్రితమయ్యెను. దీనిని సంస్కరించి పరివర్థితసంస్కరణమును క్రీ.శ. 1875 లో రెండవమాటు ముద్రించుట జరిగెను. ద్రావిడభాషావాద మున కిప్పటికి నిదియే సిద్ధాంతగ్రంథము.

ఇక్కడ నింకొక విషయమును చెప్పుకొనుట యవసరము. కాల్డ్వెల్ గ్రంథము వెలువడిన పిమ్మట దేశీయులలో పెక్కురు తదను కూలముగా కృషి సాగించుటయు, గ్రంథరచన గావించుటయు జరిగినది. కాని అంతకుముందుగా, అదే సిద్ధాంతమున కనుకూలముగా గ్రంథ

---

22. A Comparative Grammar of the Dravidian or South-Indian Family of Languages.

రచన గావించుట విశేష మనక తప్పదు. అట్టి విశేషమును సాధించిన వారిలో అగ్రగణ్యుడు శ్రీరంగపట్టణాద కృష్ణమాచార్య. ఈయన తన 'హొసగన్నడ నుడిగన్నడ' అన్న వ్యాకరణగ్రంథమునందు ద్రావిడ భాషల గురించి కొంచెముగా ప్రస్తావించెను. దీని మొదటిముద్రణ క్రీ.శ. 1838 లో జరిగినది. కాల్డ్వెల్ గ్రంథముకంటె పదునెనిమిది సంవత్సరములకు ముందుగానే యిది ప్రభవించిన దన్నమాట. భాషాచారిత్రకదృష్టితో చూచినప్పుడు దీని విశిష్టత స్పష్టము కాగలదు. సంస్కృతముకంటె ద్రావిడభాషలు భిన్నములనియు, అవి వేర్వేరు కుటుంబములకు చెందినవనియు రచయిత యిందు తన అభిప్రాయమును వెల్లడించెను. ఇదొక విశేషము. గ్రాంధిభాషారూపములను కాక, వ్యావహారికభాషారూపములనే ప్రదర్శించుట యిందు మరొక విశేషము. ఈ గ్రంథము నొరవడిగా గ్రహించి రామస్వామిశాస్త్రి 'వాగ్విదాయిని' అనుపేర నొక వ్యాకరణగ్రంథమును వ్రాసెను.

క్రీ. శ. 1836వ సంవత్సరమున రావిపాటి గురుమూర్తిశాస్త్రి రచించిన 'తెనుగు వ్యాకరణము' వెలువడినది. తెనుగునందు విశేష కృషి చేసిన పాశ్చాత్యవిద్వాంసుడు ఏ. డి. కేంప్‌బెల్లున కీ గ్రంథము అంకిత మీయబడినది. ఇందు ద్రావిడభాషాప్రసంగము లేదు; కాని గ్రాంథికభాషాప్రయోగములతోపాటు వ్యావహారికభాషాప్రయోగములనుకూడ పేర్కొని ప్రదర్శించుట జరిగినది.

నిజమునకు పాశ్చాత్యవిద్వాంసులుకూడ అప్పటికి ప్రాచీనరూపములనే, గ్రాంథికరూపములనే పరిశీలించుచుండగా, దేశీయులు వ్యావహారికరూపములను గ్రహించి విశ్లేషించి చూపుటన్నది సామాన్యవిషయము కాదు. తత్తద్రచయితల భాషాతత్త్వావగాహనమున కది యొక ప్రబలనిదర్శనము.

డాక్టర్ ట్రంప్ (Dr. Ernst Trunpp) అను నాయన [23] 'సింధీ భాషావ్యాకరణము'ను రచించి క్రీ; శ. 1872 లో ప్రకటించెను. ఇం దీయన సింధీభాషతో సంస్కృత, ప్రాకృతములనే కాక నాటి ఉత్తర భారతీయభాషలనుకూడ పోల్చి రచించెను. ఇట్లే యీయన 'పస్తోభాషా వ్యాకరణమును'ను రచించి క్రీ. శ. 1873 లో ప్రకటించెను.

కాల్డ్వెల్ దక్షిణభారతీభాషలకు రచించినట్లే జాన్‌బీమ్స్ (John Beams) [24] ఉత్తరభారతీయభాషల కొక తులనాత్మకవ్యాకరణమును రచించెను. ఇది మూడు భాగములుగా ప్రకటితమైనది. ఇందు మొదటిదైన 'ధ్వనిభాగము' క్రీ. శ. 1872 లోను, రెండవదైన 'నామవాచక సర్వనామభాగము' క్రీ.శ. 1875 లోను, మూడవదైన 'క్రియాభాగము' క్రీ.శ. 1879 లోను ముద్రితములయ్యెను. ఈ గ్రంథమునందు హిందీ, పంజాబీ, సింధీ, గుజరాతీ, మహారాష్ట్రి, ఒరియా, బెంగాలీ భాషలు తులనాత్మకముగా సమీక్షితములైనవి. వాని వ్యాకరణవిశేషములను చారిత్రకదృష్టితో సమీక్షవేసి, అనేకాంశముల ననువుగా ఆ యా విభాగములకు సరిపడినట్లుగా సమకూర్చుట జరిగినది. మొదటిభాగము నందే అనేకోదాహరణములతో ఆసక్తిప్రదముగా సాగిన పెద్దపీఠిక చేర్పబడినది.

కెలోగ్ (S. H. Kellogg) అనునతడు 'హిందీభాషావ్యాకరణము'ను రచించి క్రీ.శ. 1876 లో ప్రకటించెను. ఇం దీయన సాహిత్యకభాషను మాత్రమే కాక వ్రజభాష, రాజస్థానీ, బిహారీ, అవధీ మున్నగుభాషలను గూడ గ్రహించి తులనాత్మకవివేచన చేసెను. ప్రతి పరిచ్ఛేదమునకు

---

23. Grammar of the Sindhi Language compared with the Sanskrit, Prakrit and the Cognate Indian Vernaculars.

24. Comparative Grammar of the Modern Aryan Language of India.

చివరి వ్యాకరణాంశములకు సంబంధించిన చారిత్రకసమీక్ష కూడ సంగ్రహముగా రచించెను.

డాక్టర్ హార్న్‌లీ (Dr. A. Rudolf Hoernle) అను జర్మనీ దేశీయుడు 'పూర్వహిందీ'ని ప్రధానముగా గ్రహించి ఉత్తరభారతీయ భాషలతో తులనాత్మకపరిశీలనము చేయుచు, ఒక వ్యాకరణమును రచించి క్రీ. శ. 1880 లో ప్రకటించెను. అందు ఆధునికభాషలయిన అవధీ, బీహారీ, పూర్వహిందీ యనుపేర సమీక్షితము లైనవి.

వీని యన్నింటియందును ప్రధానముగా నొక్కొక్క భాషయే గ్రహింపబడినది. అయినను, ఆధునికభాషాశాస్త్రరీతి కనుకూలముగా తులనాత్మకవివేచన సాగినది. ఇటుకాక, ఒకే భాషను గ్రహించి, కేవలము వర్ణనాత్మకముగా రచించిన వ్యాకరణములు పెక్కులు గలవు. క్రీ. శ. 1807 వ సంవత్సరమున డబ్ల్యు. బ్రౌన్ అనునాయన A grammar of the Gentoo Language అనుపేరున తెలుగుభాష కొక వ్యాకరణమును వ్రాసెను. 1814 లో కేరీ అనునాయనయు, 1816 లో కేంప్‌బెల్ అనునాయనయు తెలుగుభాషకు వ్యాకరణగ్రంథములను రచించిరి. ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ అనునాయన తెలుగువ్యాకరణమును, తెలుగునిఘంటువును రచించెను. క్రీ.శ. 1868లో డాక్టర్ గుండెర్ట్ మలయాళభాషావ్యాకరణమును రచించెను. క్రీ.శ. 1872 లో 'బ్రిగెల్' అనునాయన తుళుభాషావ్యాకరణమును రచించెను. మేజర్ కోల్ కొడగు భాషకు వ్యాకరణమును వ్రాసెను. తమిళభాషకు డాక్టర్ పోప్, కన్నడ భాషకు కిట్టెల్ వ్యాకరణగ్రంథములను సంతరించిరి. దేశీయులుకూడ పెక్కురు వ్రాయుచునే యుండిరి. పాశ్చాత్యులు తమ వ్యాకరణసంప్రదాయములతో దేశీయభాషలను సమీక్షించుట యొక విశిష్టవిషయము గానే పరిగణితము కావలసియున్నది. ఏమయినను, వీనియందు చారిత్ర

కదృష్టి కాని, తులనాత్మకదృష్టి కాని కానరాదు. భిన్నవ్యవస్థల నొకచోట చేర్చుటకు చేసిన యత్నము మాత్ర మున్నదని యంగీక రింపక తప్పదు.

దేశీయపండితులలో టి. యం. శేషగిరిశాస్త్రి భాషాశాస్త్రీయ మార్గమునందు ప్రవర్తించినవారిలో మొదటివాడు. ఈయన చిన్నతన మునందే తెలుగు, తమిళము, కన్నడము, మహారాష్ట్రము నేర్చియుం డెను. భాషాశాస్త్రమునం దాసక్తి కలిగిన పిమ్మట ఓఢ్ర మలయాళ హిందూస్తానీ బెంగాలీభాషల నధ్యయనము చేసెను; గ్రీకు లాటిను భాషలందు సైతము కృషిచేసెను. పెక్కురు భాషాశాస్త్రవేత్తలకు లేని బహుభాషాపాండిత్య మీయనకు పుష్కలముగా నున్నది. ఈ సామర్థ్యముతో నీయన క్రీ. శ. 1884 లో Notes on Aryan and Dravidian Philology అనుగ్రంథమును రచించి ప్రకటించెను. ఆంధ్ర శబ్దతత్త్వము, అర్థానుస్వారతత్త్వము, తమిళశబ్దతత్త్వము అను గ్రంథ ములను సైతము రచించెను. ఈయన పైగ్రంథము లన్నింటియందును ద్రావిడభాషలను పరస్పరము పోల్చి వాని సాజాత్యమును, వ్యాకరణ సామ్యమును చక్కగా ప్రదర్శించెను. అయినను ద్రావిడభాషలుకూడ ఆర్యభాషోత్పన్నము లన్న నిశ్చయముతో రూపనిష్పత్తిని ప్రదర్శించు టకే ప్రయత్నించుటచేత, ఆయన ప్రయత్నము అశాస్త్రీయముగా మిగిలిపోయినది. కాల్డ్వెల్ ప్రభృతుల వాదము నపాకరించి, తన వాద మునకు బలము చేకూర్చుకొనుటకై మిక్కిలి యత్నముచేసెను. అం దీయన వ్యక్తిత్వము బాగుగా వెల్లడి యగును.

డాక్టర్ భండార్కర్ (Dr. Ramakrishna Gopal Bhandarkar) అనేక క్షేత్రములందు కృషిచేసి కీర్తి నార్జించిన మహావిద్వాం సుడు. ఈయన బొంబాయి విశ్వవిద్యాలయములో క్రీ. శ. 1877 లో ఆర్యభాషలనుగూర్చి ఏడుపన్యాసములు చేసెను. అందు ప్రాచీనకాలీన,

మధ్యకాలీన భారతీయార్యభాషలను గురించి యనేకాంశములను విమర్శనపూర్వకముగా వెల్లడించెను. ఆధునిక భారతీయార్యభాషలను గురించి కూడ ప్రసంగానుప్రసంగముగా వివేచనచేయుచు జోడించెను. మొత్తముమీద ఆ యుపన్యాసము లుత్తరభారతీయభాషల వివేచనమందు పర్యాప్తసాఫల్యమును సంపాదించుకొన్నవి. పందొమ్మిదవ శతాబ్దిలోని యీ యుపన్యాసపరంపర యిరువదవ శతాబ్దివరకు ముద్రణసౌభాగ్యము నొందలేదు. క్రీ. శ. 1914 లో Wilson Philological Lectures అనుపేర నొక గ్రంథముగా రూపుదాల్చి ప్రకటితమయ్యెను.

భాషాశాస్త్రప్రస్థానములో భారతక్షేత్రమునం దొక హిమాచలము వంటివాడు సర్ గ్రియర్సన్ (Sir George Abraham Grierson). ఈయన బీహారులోని భాషలనుగూర్చి ఏడు వ్యాకరణములను రచించి క్రీ.శ. 1883 నుండి 1887 వరకు ప్రకటించెను. ఈతని కీర్తి కాలంబన మైనది [25] 'భారత భాషాత్మక సర్వేక్షణ' అన్న మహత్తర గ్రంథరాజము. భారతదేశము నాసేతుశీతాచలము భాషాదృష్టితో పరిశీలనముచేసి పన్రెండు బృహత్సంపుటములుగా తత్పరిశీలనాఫలమును ప్రకటించెను. క్రీ.శ. 1894 లో ప్రారంభమైన యీ సర్వేక్షణ కార్యక్రమము 1927 లో సమాప్తమయ్యెను. భారతదేశమునందలి సర్వ భాషలను, మాండలికములను సంగ్రహించి సోదాహరణముగా వివేచనచేయుటయే కాక, పీఠికారూపమున చారిత్రకసమీక్ష కూడ జతచేయబడినది. భారతదేశమున, భాషాపరముగా కృషిచేయు నెవ్వరికైనను దీని సాహాయ్యము అవశ్యస్వీకార్యము.

## 3. ౩ ఇరువదవ శతాబ్దిచరిత్ర

పందొమ్మిదవ శతాబ్ది తుది దినములలో అంకురించి, ఈ శతాబ్దికి పల్లవించినది భాషాత్మకభూగోళము (Linguistic Geography)

25. Linguistic Survey of India.

[26] 'భాషాశాస్త్రవిద్యార్థి దృష్టిలో, అన్నింటిని గ్రహించినప్పుడే దేని నైనను సమగ్రముగా అవగాహనముచేసికొన నగును. కాబట్టి ప్రతి భాషయొక్క ప్రతియంశము పరిశోధనీయమే' అని విట్నీ 1867 లోనే ప్రవచించెను. దాని కనుకూలముగానే మాండలికభాషల పరిశీలనము వృద్ధిపొందినది. [27] జార్జ్ వెంకర్ 1876 లోనే జర్మనీదేశమునందలి భాషాత్మకదేశపటమున కై కృషి మొదలుపెట్టెను. ఎడ్మండ్ ఎడ్మంట్ సంకలనముచేసిన సామగ్రిని పురస్కరించుకొని [28] యూల్స్ గిలిరన్ అనునతడు ఫ్రాంసుదేశభాషల భాషాత్మకదేశపటమును సన్నద్ధము (1902-1908) చేసెను. కె. జాబర్గ్, జె. జుడ్ అనువారు [29] ఇటలీభాషా దేశపటములను 1928 లో ప్రకటించుట మొదలుపెట్టిరి. అప్పుడే అమెరికాసంయుక్తరాష్ట్రములందును కెనడాయందును భాషాదేశపటముల నిర్మాణమునకై సామగ్రిని సేకరించు ప్రయత్నములు ప్రారంభమైనవి. భాషాదేశపటముల వలన మాండలికముల స్థితిని, పరస్పరవిభేదములను ప్రామాణికభాషాస్థితిని, తత్కారణమును - ఇంక నిట్టివానిని గుర్తించుట ఎంతో సులభమగును. ఈవిధముగా ఇవి భాషాచరిత్రాధ్యయనమునకు, స్పష్టావగాహనమునకు ఎంతో సహకరించును.

పూర్వయుగమునందు పొడచూపియు, నిశ్చితరూపమును దిద్దుకొనక యుండిపోయిన ధ్వనిలిపి యిరువదవ శతాబ్దియందే స్థిరరూపమును సంతరించుకొని వాడుకకెక్కినది. జాన్‌హార్ట్ అనునతడు 1551 లోనే ఆంగ్లలిపియందున్న అసందర్భములనుగురించి ప్రస్తావించెను. అతడే 1569 లో తాను వ్రాసిన 'Orthographia' అను గ్రంథమునందు క్రొత్తరకముగ్రాత నుపయోగించెను. 1570 లో పఠనబోధన

---

26. Lauguage and the study of language. — Whitney
27. Sprachatlas des deutschen Reichs.
28. Atlas linguistique de la France.
29. Sprash-und Sashatlas Jtaliens und Siidschweiz.

మం దుపయోగింపదగిన క్రొత్త ధ్వనిలిపిని ప్రత్యేకముగా ప్రకటించి ప్రయోగించెను. ఇట్లే పదునారవ శతాబ్దియందు, సర్ థామస్ స్మిత్, విలియం బులోకర్, ఎడ్మండ్ కూట్ అనువారును; పదునేడవ శతాబ్ది యందు అలెగ్జాండర్ గిల్, ఛార్లెస్ బట్లర్, జాన్ విల్కిన్స్ అనువారును; పదునెనిమిదవ శతాబ్దియందు బెంజమిన్ ఫ్రాంక్లిన్ అనునతడును ధ్వన్యక్షరములను వాడుకచేసిరి. పందొమ్మిదవ శతాబ్దియందు ఎ. జె. ఎలిస్, ఐజాక్ పిట్మన్ అనువారు నిట్టి ప్రయత్నములు గావించిరి. క్రీ.శ. 1886 లో స్థాపింపబడిన International Phonetic Association మరల ధ్వనిలిపివిషయమున కృషి చేయసాగినది. ఆటో ఎస్పర్సన్ సూచనలనుబట్టి 1888 లో అన్ని భాషలకు నుపయోగ్యమైన, నిజముగా అంతర్జాతీయ మనిపించుకోదగిన అక్షరములను నిరూపణముచేసెను. అప్పటినుండియు, ఆ సంస్థకు చెందిన Maitre Phonetique అను పత్రిక యందు ఆ నూతనలిపినే వాడుట జరుగుచున్నది. నడుమ నడుమ ఆవశ్యకానుసారముగా మార్పులును చేర్పులునుకూడ జరిగినవి. 1912 లో ధ్వన్యక్షరముల పట్టికను ప్రకటించుట జరిగినది. సమగ్రమైన వర్ణనతో అచ్చులకు ఇరువదియారు సంకేతములను, హల్లులకు ఏబదిరెండు సంకేతములను ఆ పట్టికయందు నిరూపించిరి.

వేర్వేరు భాషలను వర్ణించుటయందు, ముఖ్యముగా ఉచ్చారణానుకూలముగా వర్ణించుటయందు ధ్వనిలిపి ఎంతో సహకరించు ననుట వాస్తవము. మాండలికభేదములను గుర్తించుటలోను, అనాగరకభాషలను వర్ణించుటలోను ధ్వనిలిపి మిక్కిలి యావశ్యకము. ఈ యావశ్యకమునుబట్టియే ధ్వనిలిపి ప్రతిష్ఠ నార్జించుకొన్నది.

ఆటో ఎస్పర్సన్ ధ్వనిలిపినిర్మాణమునకు సూచన లిచ్చినట్లు పైని చెప్పుకొంటిమి. ఈయన డెన్మార్కు దేశీయుడు. ఈతని మొదటి

రచన 1886 లోనే ప్రకటితమయ్యెను. తరువాత 'Progress in Language' అను గ్రంథమును 1894 లో ప్రకటించెను. వీనినిబట్టి ఎస్పర్సన్ పందొమ్మిదవ శతాబ్దియందే పరిగణింపబడవలయును. కాని 1922 లో ఈతడు ప్రకటించిన Language - Its Nature, Development and Origin అను గ్రంథము మహత్తరమై మిక్కిలికీర్తి నార్జించిపెట్టినది. ఇందు పిల్లల భాషకు ప్రత్యేకస్థానము నిచ్చుట జరిగినది. పిల్లల భాషను సూక్ష్మముగా పరిశీలించుటచేత భాషయందలి అనేక క్లిష్టసమస్యలకు మూలమును కనిపెట్టవచ్చు నని ఎస్పర్సను నమ్మకము. 1924 లో The Philosophy of Grammar అను గ్రంథమును, 1933 లో The Essentials of English Grammar అను గ్రంథమును రచించెను. 1937 లో వాక్యవిజ్ఞానమునకు సంబంధించిన Analytic Syntax అను గ్రంథమును రచించెను. ప్రధానముగా వ్యాకరణవేత్తయే యైనను భాషాతత్త్వమును గ్రహించి, అనుశీలనము చేసినవారిలో అన్యతమునిగా నీతనిని గ్రహింపవలసియుండును.

హెన్రీ స్వీట్ వ్యావహారిక భాషల విషయమున మహత్తరకృషిని సాగించెను. ఈతడు ఇంగ్లాండు దేశీయుడు. క్రీ॥ శ॥ 1900 లో The History of Language అను గ్రంథమును రచించెను. భాషోత్పత్తి విషయమున నీతడు సమన్వయవాద ప్రతిపాదకుడు. ప్రకృతగ్రంథము నందే సమన్వయవాదమును సమర్థముగా ప్రతిపాదించుట జరిగినది. 1906 లో A Primer of Phonetics అను గ్రంథమును, 1910 లో The Sounds of English అను గ్రంథమును రచించెను. ఈ విధముగా ధ్వనివిజ్ఞానమునందు సైతము స్వీట్ సముచితస్థానమును సంపాదించుకొనగలిగెను.

ధ్వనివిజ్ఞానమునందు ఆంగ్లదేశీయుడైన డేనియల్ జోన్సు విశిష్ట స్థానమున కర్హుడు. ఈయన 1917 లో An English Pronouncing

Dictionary అను గ్రంథమును రచించెను. ఇందు సంప్రదాయికలిపిలో ముందుగా పదములను పరిగణించి, వానికి ఉచ్చారణానురూపమైన లిపిని ప్రదర్శించెను. ఇది ధ్వనివిజ్ఞానములో ఆచరణాత్మకమైన యభ్యుదయ మును సాధించె ననుట సత్యము. ఈయనయే Outline of English Phonetics అనుపేరున 1922 లో ఒక గ్రంథమును రచించెను.

1924 లో హోల్గెర్ పెడెర్సన్ Linguistic Science in the Nineteenth Century అను గ్రంథమును రచించెను. ఇది ముఖ్య ముగా పందొమ్మిదవ శతాబ్దమునందు జరిగిన భాషాశాస్త్రకృషిని సమీక్షించుటయే ప్రధానలక్ష్యముగా ప్రవర్తించినది. లియోనార్డ్ బ్లూంఫీల్డ్ 1927 లో 'On Recent Work in General Linguistics' అను పేర నొక వ్యాసమును ప్రకటించెను. ఇంతవరకు ఇరువదవ శతాబ్దియందు మొదటి ఘట్టము. పందొమ్మిదవ శతాబ్దియందు మొదలు పెట్టిన యంశములకు ఒక పరిపూర్ణత, ఒక నిశ్చయత్వము కలుగుటయే యింతవరకు గోచరించును. ఇప్పు డింక రెండవ ఘట్టమును సమీ క్షింతము.

ఇరువదవ శతాబ్ది రెండవ ఘట్టమునందు ఫెర్డినాండ్ దే ససూర్, ఫ్రాంజ్ బోఆస్, ఎడ్వర్డ్ సపీర్, లియొనార్డ్ బ్లూంఫీల్డు - అను నల్వురును నాలుగు స్తంభముల వంటివారు.

ఫెర్డినాండ్ దే ససూర్ (Ferdinand de Saussere) : ఈయన వర్ణనాత్మకభాషాశాస్త్రమునకు శాస్త్రీయవిధానమును కల్పించిన వారిలో అగ్రగణ్యుడు. పందొమ్మిదవ శతాబ్దియందు ఎన్నో భాషలను వర్ణించుట జరిగినది. అయినను, ఎవరికి తోచినట్లు వారు వర్ణించుటయే కాని, ఒక నిశ్చితమైన నిర్దుష్టమైన విధాన మేర్పడలేదు. ససూర్ తా నొక నిశ్చితవిధానమును నిర్ణయింపగలిగెను. జినీవా విశ్వవిద్యాలయ

మందు జోసఫ్ వర్డీమర్ స్థానమున నియమితు డైనపిమ్మట వరుసగా ఆరు సంవత్సరములపాటు (1906-11) విద్యార్థిదశములకు మూడింటికి తాను 'సామాన్యభాషాశాస్త్రము' ను బోధించెను. ఇందు సగము కాలము ఇండోయూరోపియనుభాషల చరిత్రకు, వివరణమునకు, చెల్లి పోగా, మిగిలిన సగముకాలము తన ప్రణాళిక కనుగుణముగా భాషా శాస్త్రవిధానమున కై వినియోగించెడివాడు. ఈ బోధనతరగతులు అత నికి తగిన దిశనుచూపి, ప్రోత్సాహమును కలిగించియుండవచ్చును. బ్లూంఫీల్డు చెప్పినట్లు ససూర్ [30] భాషాశాస్త్రమునకు సైద్ధాంతికాధా రమును సమర్పించెను. తాను జినీవాయందు విద్యార్థిగా నుండగనే, తన యిరువదవ యేటనే ఇండోయూరోపియను మూలభాషలయందలి స్వరవిధానమునుగూర్చి ఒక యుత్తమపరిశోధనగ్రంథమును రచించెను. ఆ విషయమున, ఆ గ్రంథమున కిప్పటికిని గౌరవస్థానము లభించు చున్నది.

క్రీ॥శ॥ 1881 నుండి 1891 వరకు ఈయన పారిస్సునందుండి సంస్కృతభాషను బోధించెను. ఆ కాలమునందే అచ్చటి భాషావిజ్ఞాన సంఘమునకు కార్యదర్శిగా వ్యవహరించెను. అచ్చటి భాషాశాస్త్రజ్ఞుల మీాద ఆతని ప్రభావమెంతో పనిచేసెను. శాస్త్రీయమైన యే సమస్య వచ్చినను శాస్త్రజ్ఞులు ససూర్ నిర్ణయమునకు స్వాగతము చెప్పెడి వారు. ఆతని యభిప్రాయమునకు అంతటి విలువయుండెడిది. ఫ్రిజియను శాసనములను, లిథు వేనియనుమాండలికములను ప్రత్యక్షముగా పరిశీ లించుట యీాయన నిశితదృష్టికి నిదర్శనము. భాషావిషయమున ససూర్ అనితరసాధ్యమైన అంతర్దృష్టిని కనబరిచెను. అది యానాటి ఆలోచనావిధానమునకు, నిరంతర పరిశీనమునకు, నిశితదర్శనమునకు సక్రమముగా సహకరించినది.

---

30. ......he has given us the theoretic basis for a science of human speech ? — Leonard Bloomfield, Modern Language Journal (1924).

ససూర్ జినీవా విశ్వవిద్యాలయమునం దిచ్చిన ఉపన్యాసములు గాని, నిర్దిష్టప్రణాళిక గాని గ్రంథరూపమును పొందకముందే ఆయన మరణించెను. భాషాశాస్త్రమున కదియొక ప్రబలనష్టము. ఆ నష్టమునకు పరిహారముగా, తదభిమానులు కొందరు ఒక ప్రయత్నముచేసిరి. ససూర్ దగ్గర చదువుకొన్న విద్యార్థుల నోట్సుపుస్తకములనుబట్టి పునర్నిర్మాణము గావించి Cours de Linguistic Generale అను గ్రంథమును 1916 లో ప్రకటించిరి. ఆ ఫ్రెంచిభాషాగ్రంథమునకు, ఆ వెంటనే జర్మనుభాషానువాదమును, స్పానిషుభాషానువాదమును ప్రకటితములైనవి. 1960 లో Wade Baskin అనునతడు ఆంగ్లములోనికనువదించెను. ససూర్ భాషాశాస్త్రసిద్ధాంతములతో సమకాలికులకు పరిచయ మున్నమాట వాస్తవమే. అనంతరకాలికులకు సైతము అట్టి సౌకర్యమును ఆంగ్ల భాషానువాదము కలిగించినది.

ససూర్ యువవ్యాకర్త లని పేరు వహించిన ఓస్తోఫ్, లెస్కియన్ అనువారికి శిష్యుడు. అయినను, వారి ఆంశికమైన పరిశీలనవిధానమును నిరసించెను. వారి దృష్టిలో భాష మాటలాడుట కుపయోగించు అంశముల మొత్తముగానో, అటువంటి అంశముల ఉత్పత్తిస్థానముగానో భావింపబడెడిది. అంతకు మించి వారి దృష్టి ప్రసరింపలేదు. ససూర్ భాషను స్వయంసమర్థకముగా భావించెను. భాషయందలి వేర్వేరంగములు ఒకదానిపై నొకటి ఆధారపడుటయే కాక సమగ్రతతోడి సంబంధమునుబట్టియే పనిచేయు నని ఆతని నిశ్చయము. ఈయనయే Synchronic Linguistics, Diachronic Linguistics అను మాటలను తొలదొల్త వాడినవాడు.

ధ్వనివిశ్లేషణమునుగూర్చి ముందే చూచితిమి. ప్రతి ధ్వనికిని లిపిని ప్రదర్శింపవలయు ననుట ఆచరణాత్మకము కాదు. అందువల్ల వర్ణము (Phoneme) అన్న కల్పనము ఆవశ్యకమయ్యెను. 1881 లోనే

బోడోయిన్ డి కోర్టినాయ్ అనునతడును, క్రుస్జేవిస్కీ అను నతని శిష్యుడును వర్ణకల్పనము గావించిరి. ఇర్వురును రష్యాదేశీయులే. ప్రేగ్ భాషాశాస్త్ర శాఖకు చెందిన యాకోబ్సన్, ట్రుబెట్స్కాయ్ అనువారు దానిని గ్రహించిరి. ససూర్ తన యుపన్యాసములలో వర్ణము (Phoneme) ను తానుకూడ స్వీకరించెను. మొత్తముమీద ససూర్ వర్ణనాత్మకభాషాశాస్త్రమునకు పటిష్ఠమైన పునాదిని నిర్మించెను.

అమెరికాదేశమునందు ఆధునికభాషాశాస్త్రమున కారంభకుడు ఫ్రాంజ్ బోఆస్. (Franz Boas). కొలంబసు విశ్వవిద్యాలయము నందు ఆచార్యుడుగా పనిచేసెను. 1897 వ సంవత్సరము నుండి 1908 వ సంవత్సరము వరకు అమెరికనిండియన్ భాషలగురించి కృషిచేసి 1911 లో Handbook of American Indian Languages అను గ్రంథమును ప్రకటించెను. ఈ గ్రంథము వెలువడినపిమ్మట, దాదాపుగా అమెరికాయందలి ప్రతి భాషాశాస్త్రజ్ఞుడును ఏదో యొక అమెరికనిండియన్ భాషపైని కృషిచేయుట పరిపాటియైనది. ఇంతకుముందు గుర్తింపబడని వందలాది భాషలు వెలుగులోనికి వచ్చినవి. అందు పెక్కుభాషలు అత్యల్పసంఖ్యాబలముకలవి; కొలదికాలములోనే అవి అంతరింపవచ్చును. కావున, వానినిగురించి వెనువెంటనే కృషిచేసి ఆ యా విశేషములను గుర్తించి భద్రపరచుట ఆవశ్యకమయ్యెను. అటువంటి పరిస్థితులలో అమెరికాయందలి భాషాశాస్త్రజ్ఞులు 'క్షేత్రపద్ధతులు' (Field methods) వివరించుటలోనే ఎక్కువ శ్రద్ధచూపుట జరిగెను. తమ కజ్ఞాతములైన భాషలను తాము విశ్లేషించి వర్ణింపవలయును. కావున భాషాక్షేత్రమునందు వ్యవహర్తలతో వ్యవహరింపవలసిన విధానములను, వారినుండి సమాచారమును రాబట్టుటకు అవలంబించు మార్గములను, సేకరించిన సామగ్రిని విశ్లేషించు సాధనములను నిర్ణయించుకొనుట ఆవశ్యకమయినది. ఈ యావశ్యకము ననుసరించియే అమెరికనుభాషాశాస్త్రసిద్ధాంతము ఆచరణ

ముఖముగా విస్తృతినొందినది. ఫలితముగా భాషాశాస్త్రమనగానే 'వర్ణనవిధానముల పుట్ట' యన్న అపప్రథ కలిగినది. బోఆస్ తన గ్రంథముసందలి పీఠికలో తా నవలంబించిన విధానమునుగురించి వివరించెను. ఒక భాషకంటె నొకభాష ఊహింపలేనంత భిన్నముగా నుండవచ్చు ననియు, పరిచితభాషలయందలి వ్యాకరణాంశములనే భావించుచు, పరిచితవర్ణనవిధానమునే అనుసరించుట తగదనియు నిర్ణయించెను. చాలభాషలలో ప్రసిద్ధభాషలలోనుండి సాంప్రదాయికవ్యాకరణములలో గుర్తింపబడిన అనేకాంశములు రేఖామాత్రములుగా కూడ కానరావు. అందువలన వర్ణనవిధానమును సాధారణీకరించుట సాధ్యము కాదు. ప్రతి భాషకు తన ప్రత్యేకమైన వ్యాకరణనిర్మాణ ముండును. భాషాశాస్త్రజ్ఞుడు ఆ ప్రత్యేకవ్యాకరణనిర్మాణమును గుర్తించి, తదనుకూలముగా విశ్లేషణమును, వర్ణనమును గావింపవలయును. ఇది బోఆస్ సిద్ధాంతము. దీనిని నిర్మాణాత్మకదృష్టి (Structuralist view) అని యనవచ్చును. తరువాతికాలమున రూపు దిద్దుకొని యేపు వహించిన Structural Linguistics అను శాస్త్రమునకు మూలబీజ మిచ్చుట నిక్షిప్తమై యున్నది.

కాని, ఒక్క విషయమును గుర్తుంచుకొనుట అవసరము. బోఆస్ చేసినది సరిక్రొత్త నిర్ణయము మాత్రము కాదు. ఇంతకుముందే, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధమునందే 'హంబోల్టు' ఇటువంటి అభిప్రాయములను వెల్లడించెను. బోఆస్‌పండితునకు సమకాలికులలో యూరోపియను శాస్త్రజ్ఞులు కొందరు ఇటువంటి అభిప్రాయములనే కలిగియుండిరి. 'నిర్మాణాత్మకత్వము' ఆవశ్యకానుకూలముగా కాలధర్మమై భాషాశాస్త్రమునందు పట్టము నొందినది.

ఆ తరువాత ఎడ్వర్డ్ సపీర్ అమెరికాభాషాశాస్త్రచరిత్రయందు ప్రసిద్ధి వహించెను. సపీర్ 1884 లో జర్మనీదేశమునందు జన్మించెను.

తన నాలుగవయేట తన కుటుంబము అమెరికాసంయుక్తరాష్ట్రములకు తరలిపోయి స్థిరపడినది. సపీర్ అచ్చటనే జర్మానిక్ భాషలందు ఎం. ఏ. పట్టమును సంపాదించుకొనెను. బోఆసునకు శిష్యుడై, ఆతని పరిచయమువల్ల మిక్కిలి ప్రభావితుడయ్యెను. ఆతని ప్రభావమువల్లనే అమెరికనుభాషాశాస్త్రప్రవేశమును కలిగించుకొనెను. వాడుకభాషలను ధ్వనిలిపియందు రచించుకొని అభ్యసించుట యావశ్యకమని యాయన యభిప్రాయము. తన దృష్టిపథమునందు పడిన ప్రతిశాస్త్రము నతడు చదివెడివాడు. అతని పఠనప్రీతికి హద్దులు లేవు. భాషాశాస్త్రము మొదలుకొని సంగీతశాస్త్రమువరకు అన్నియు నతని కభిమానవిషయలే. అన్నింటినిగురించి ఎన్నో వ్యాసములను రచించెను. అతని విస్తృత పాండిత్యమునకు ఆ వ్యాసములే నిదర్శనము. పుస్తకరూపములో 'Language – An Introduction to the Study of Speech' అనుపేర ఒకేయొక పుస్తకమును రచించెను. అది 1921 లో ప్రకటితమయ్యెను. మానవశాస్త్రమును, మనస్తత్త్వశాస్త్రమును భాషాశాస్త్రముతో ముడిపెట్టి పరిశీలించుట యిందు విశేషము. ఆ యాశాస్త్రములమీద ఆసక్తివల్లనే భాషలనుకూడ ఆతడు మానవీయ దృక్పథముతో పరిశీలించెను. భాష పూర్తిగా మానవీయ మనియు, సహజాతము కాదనియు నతని విశ్వాసము. అందువల్లనే అతడు భావావేశమునకుగాక హేతుసంగతికే ప్రాధాన్య మొసగెను. అట్లే భాషాపరిశీలనమున సాంస్కృతికప్రాధాన్యమును గుర్తించెను.

తన గ్రంథమునందలి మూడవ యధ్యాయమున భాషాధ్వనులను గురించి 'నిర్మాణాత్మకత్వము'ను గురించి వెల్లడించెను. అమెరిక నిండియన్ భాషలలోని అతబాస్కను కుటుంబభాషలనుగురించి కృషి చేయునప్పుడు తనకు గలిగిన యనుభవమును పురస్కరించుకొని

[31] 'చారిత్రికసంబంధముగల రెండు భాషలు గాని, రెండు మాండలిక ములుగాని ఒకే ధ్వనిని సమానముగా కలిగియుండక పోవచ్చును; కాని వాని యాదర్శ ధ్వనివిధానములు మాత్రము సదృశరీతులు కావచ్చును' అని నిర్ణయించెను.

1925 లో 'Sound Patterns in Language' అనుపేరున అమెరికాభాషాశాస్త్రసమితి అధికారికపత్రికయైన Language మొదటి సంచికయందొక వ్యాసమును వ్రాసి ప్రకటించెను. దీనితో 'Structural Linguistics' అను విభాగమునకు గట్టిపునాది ఏర్పడినది. రెండు భాషలలో సదృశధ్వను లుండవచ్చును; అయినప్పటికి ధ్వనిరీతులు (Phonetic Patterns) పూర్తిగా భిన్నములు కావచ్చును. ఒక్కొక్కప్పుడు ధ్వనిరీతులలో సాదృశ్య ముండవచ్చును; కాని ధ్వని విధానములు పరస్పర భిన్నములుగా నుండవచ్చును. తమ భాషలోనే యున్న కొన్ని ధ్వనులు ఇతరభాషలో నున్నపుడు కొందరు వానిని సక్రమముగా పలుకలేరు. నూత్క ఇండియన్ ఇంగ్లీషునందలి Sing, style అను పదములందలి చివరియంశమును 'n' వర్ణముతో సమానముగనే పలుకును. నిజమునకు తన మాతృభాషలో ఈ ధ్వనులు లేక పోలేదు. అందువానిని సక్రమముగానే పల్కును. కాని తన భాషయందలి భావావేశము కలిగినప్పుడు మాత్రమే యుపయోగింపబడును. పాటలను పాడునప్పుడు సహజముగానే వాని కుచ్చారణము గలదు; కేవల సంభాషణమునందు వాని కుపయోగము లేదు. అందువల్లనే ఇంగ్లీషునందుకూడ వానిని పరిహరించుట జరుగుచున్నది. [32] దీనినిబట్టి

31. 'Two historically related Languages or dialects may not have a sound in comman, but their ideal sound-systems may be identical patterns' —Language.

32. 'Here again we see that a speech sound is not merely an

భాషాధ్వని ఉచ్చారణమాత్రమే కాని శ్రుతబింబముమాత్రమే కాని కాదనియు, సముచితభాషాత్మకసన్నివేశమునందు సాంకేతికాభివ్యక్తికి సామగ్రికూడ అగు ననియు సపీరు నిర్ణయించెను. క్రమబద్ధమైన నిర్మాణములరీతులే భాషాభ్యాసములకు ఆశ్రయము లనియు, భాషాంశములు భాషాంశములుగా ఈ యభ్యాసములకు ఆశ్రయములు కా వనియు రూఢియైనది. కావున ధ్వనులకంటె, ధ్వనుల విధానముకంటె, నిర్మాణముల రీతులే భాషాభ్యాసమునందు ప్రధానము లని స్పష్టపడినది.

సపీరు ప్రభావము పాఠప్రవచనముల మూలముగా బాగుగా వ్యాపించినది. అమెరికాయందలి అనేకవిశ్వవిద్యాలయములలో అతని విద్యార్థులే ఆచార్యపీఠముల నధివసించియున్నారు. సపీరు తన యేబది యారవ యేట 1939 లో మరణించెను.

లియొనార్డు బ్లూంఫీల్డు (Leonard Bloomfield) ఇరువదవ శతాబ్దియందలి భాషాశాస్త్రజ్ఞులలో మిక్కిలి పేరెన్నిక గన్నవాడు. ఈతడు 1887 లో జన్మించెను. 1906 లో భాషాశాస్త్రమునందు కృషిచేయుటకై నిర్ణయించుకొనెను. 1909 లో చికాగో విశ్వవిద్యాలయమునుండి డాక్టరేట్‌పట్టమును సంపాదించుకొనెను. 1914 లో An Introduction to the Study of Language అనుపేరున నొక గ్రంథమును రచించెను. విట్నీ రచించిన Language and the Study of Language (1867) అను గ్రంథమును, The Life and Growth of Language (1874) అను గ్రంథమును తన కాదర్శముగా నుంచుకొని బ్లూంఫీల్డు తన గ్రంథమును రచించినట్లు పీఠికయందు చెప్పెను. ఆ గ్రంథము లప్పటికి ఏబదియేండ్ల క్రితమున్న భాషాశాస్త్రి

---

articulation or an acoustic image, but material for symbolic expression in an appropriate linguistic context.'

— Sound Patterns in Language.

వికాసమునకు దర్పణములు. మరి, తన కాలమునాటికి భాషాశాస్త్రము మరింత ప్రగతిని సాధించినది. కావున దానినికూడ నిరూపించుటయే ప్రధానలక్ష్యముగా నుంచుకొని బ్లూంఫీల్డు తన గ్రంథమును రచించెను. ఈ గ్రంథమును మిక్కిలి పెంచి 1933 లో Language అనుపేరున ప్రకటించెను. మొదటి గ్రంథమునకు రెండవ గ్రంథమునకు నడుమ దరిదాపుగా ఇరువదియేండ్ల యెడ మున్నది. ఈ నడిమికాలములో భాషాశాస్త్రము అద్భుతమైన ప్రగతిని సాధించెను. అంతే కాదు. శాస్త్రవేత్తలు, విద్యావేత్తలు కూడ భాషాశాస్త్రవిశేషములను అవగాహనము చేసికొనుటకు, అంతకుముం దెన్నడును లేనంత ఆసక్తిని కలిగించుకొనసాగిరి. అందువలన బ్లూంఫీల్డు గ్రంథమును పెంచి, తన కాలమువరకు నున్న సర్వవిషయములకు స్థానమును కల్పించెను. భాషావిషయములం దాసక్తి గల సామాన్యపాఠకుడు, భాషాకృషియందు ప్రవేశింప నెంచు భాషాశాస్త్రవిద్యార్థి - యీ యిర్వురకు తన గ్రంథము ప్రయోజనవంతము కావలయు నన్నది యీయన లక్ష్యము. అందువలన క్రమబద్ధముగా భాషాశాస్త్రమునకు సంబంధించిన సర్వవిషయములను, ఉదాహరణములతో పాటుగా వివరించుట ఆవశ్యకమైనది. ఇట్టి వివరణము లేనియెడల గ్రంథము సుబోధము కాదు. కొందరు ప్రత్యేకించి కొన్ని విశిష్టవిషయములనే వ్రాయుదురు, అవి విశిష్ట విద్యార్థులకు విద్వాంసులకు నుపయోగపడవచ్చును. కాని సామాన్య పాఠకుడు వాని జోలికి పోలేడు. కావున క్రమబద్ధముగా, అవసరమైన యెడల పూర్వపీఠికను చేర్చి చెప్పుట పాఠకుని సౌలభ్యమునకు సహకరించును. బ్లూంఫీల్డు ఇదే క్రమమును పాటించెను.

ఇంతకుముందే Language – An Introduction to the Study of Speech (1921) అని సపీరు ఒక గ్రంథమును రచించినట్లు చూచితిమి. పరిమాణమున అది బ్లూంఫీల్డు గ్రంథముకంటె చాల

చిన్నది. అయినను, భాషాశాస్త్రాధ్యయనమున కావశ్యకము లగు విషయములన్నియు అందున్నవి. అందువలన విషయావగాహనమునకు అది విలువైనదే. కాని బ్లూంఫీల్డు వివరణల తీర్పు, ఉదాహరణల కూర్పు అందులో కానరావు; అందువల్ల అచ్చటచ్చట అస్పష్టత సందు చేసికొన్నది. బ్లూంఫీల్డుగ్రంథము కొందరి దృష్టిలో జటిలము. అది విషయపౌష్కల్యమువల్ల సంభవించినదే కాని అస్పష్టతవల్ల సంభవించినది కాదు. అంతవరకు నున్న భాషాశాస్త్రవికాసమును ప్రదర్శించుటయే కాక భవిష్యత్పథప్రదర్శనము చేయుటకు సైతము బ్లూంఫీల్డు గ్రంథము సమర్థమై యున్నది.

బ్లూంఫీల్డు ఈ రెండు పుస్తకములకు నడుమ పెక్కు వ్యాసములను రచించెను. తొలిపుస్తకమునందలి యభిప్రాయములు కొన్ని మార్పాటు నొందుటయు జరిగినది. నడుమ సాగిన భాషాశాస్త్రకృషియు అందులకు హేతువు కావచ్చును. 1914 నాటికి బ్లూంఫీల్డు మనస్తత్త్వశాస్త్రమునందు Wilhelm Wundt సమర్థించిన మానసిక వాదమునే యాధారముగా చేసికొని భాషాప్రవర్తనములను వివరించెను. కాని 1933 నాటికి ఆతని దృష్టి మానసికవాదమునుండి యాంత్రిక వాదము (mechanism) మీదికి మరలినది. మనస్సును కల్పించుకొని మానసికవాదులు, ఆ యాధారముతో భాషాంశములను నిరూపించుటకు పూనుకొందురు. యాంత్రికవాదులు అటువంటి అనుబంధముల నూహించుట చేయరు; సరాసరి భాషాంశములను సేకరించి వానినే వివరింతురు. ఇట్టి మార్పు బ్లూంఫీల్డునందు వచ్చినను, ఇది యింతటితో ఆగలేదు. భాషాధ్యయనమును ఏ యొక్క మనస్తత్వశాస్త్రవాదముతోను సంబంధము లేకుండగనే కొనసాగింపగల మని, అట్లయినప్పుడే ఫలితములను సంరక్షించుకొని అనుబంధశాఖలలో కృషిచేయువారికి మరింత విశిష్టత నందింపగల మని ఆతడు నిశ్చయించుకొనెను. ఈ నిశ్చయమే బ్లూంఫీల్డు

గ్రంథమునందు విస్తరించుకొనియున్నది. దీనివల్లనే భాషాశాస్త్రము నకు 'స్వయంస్వామికత్వము' (autonomy) ను సంపాదించుటకు యత్నించెను.

అర్థము విషయమునందును బ్లూంఫీల్డు స్వయంస్వామికత్వమునే ప్రదర్శించెను. భాషాశాస్త్రమునందు అర్థవివరణ మన్నది బలహీన విషయముగా నతడు భావించెను. అర్థముతో సంబంధము పెట్టుకొన కుండగనే భాషాంశములను వివరించుట అతని అభీష్టము. అందువల్లనే అతని అనుయాయులు అర్థవిజ్ఞానముపట్ల అశ్రద్ధను చూపుట తటస్థించి నది. అంతే కాదు. అర్థవిజ్ఞానము భాషాశాస్త్రమునకు బహిరంగవిష యముగా నిర్వచించుటకూడ జరిగినది. అయినప్పటికిని, వర్ణనిర్ణయము నందు కాని వాక్యవిజ్ఞానమునందు కాని అర్థముతో పనిలేకుండ వర్ణన సాగు నని బ్లూంఫీల్డు చెప్పలేదు. భాషాంశములు ప్రధానము; అర్థము గౌణము. అందువలన భాషాంశములను వివర్ణించు సందర్భమున, దాని నట్లుంచి అర్థవివరణమందు మునిగిపోయినచో, ప్రధానవిషయము భగ్న మగును. కావున వ్యవహారరూఢమైన అర్థమును గ్రహించి భాషాంశ వర్ణనమును నిర్వహింపవలయు నన్నదే బ్లూంఫీల్డు అభిప్రాయము. కాని ఆతని అనుయాయియైన జెలిగ్ హారిస్ (Zellig Harris) అనునతడు 1951 లో Methods in Structural Linguistics అను గ్రంథమును ప్రకటించెను. అర్థముతో సంబంధము లేకుండగనే భాషావిశ్లేషణము చేయుప్రయత్నము పరాకాష్ఠ నందుకొన్నది. ఇదే పుస్తకము తిరిగి Structural Linguistics అనుపేరుతో ప్రకటితమైనది.

అమెరికాయందలి 'భాషాశాస్త్రసమితి' స్థాపకులలో బ్లూంఫీల్డొ కడు. అతని ప్రభావము ముఖ్యముగా తన రచనలవల్లనే వ్యాప్తమైనది. నిజమున కతనికి శిష్యులు లేరు; కాని తన రచనలవల్లనే ఎందరో అను యాయు లేర్పడిరి. పైని చెప్పికొన్న హారిస్ మాత్రమే కాక పైక్,

హాకెట్ మున్నగు ప్రసిద్ధు లెందరో అతనిమార్గమునే అనుసరించి, అతనికి అనుయాయు లయిరి. అతని విధానమును Bloomfieldian School అను పేరున వ్యవహరించుట జరుగుచున్నది. బ్లూంఫీల్డు ఇండో యూరోపియను భాషలనుగూర్చియే కాక మలయోపాలినీషియను భాషలనుగూర్చికూడ కృషిచేసెను. భాషాశాస్త్రమునకు వ్యావహారిక ప్రయోజనము కల దని, ఇతరభాషలను అతిస్వల్పకాలములో అభ్య సించుటకు భాషాశాస్త్రము సహకరించు నని అతని విశ్వాసము. 1942 లో Outline Guide for the Practical Study of Foreign Languages అను గ్రంథమును ప్రకటించెను. అట్లే డచ్చిభాషకు, రష్యనుభాషకు స్వబోధినులను రచించెను. అతడు 1946 లో మర ణించెను. మొత్తముమీద ఇరువదవ శతాబ్దమందలి యీ రెండవ ఘట్టము నిర్మాణాత్మక భాషాశాస్త్రమునకు జన్మభూమి యైనది.

వర్తమానయుగమును, అనగా ఇరువదవ శతాబ్ది ఉత్తరార్ధమును మూడవ ఘట్టముగా గ్రహింపవచ్చును. దీనికి నాయకుడు నోమ్‌ఛోంస్కీ (Noam Chomsky). ఇతడుకూడ Bloomfieldian School కు చెందినవాడే. జెలిస్ హారిస్సునకు శిష్యుడై, అతని పర్యవేక్షణమున The Logical Structure of Linguistic Theory అను పరిశోధన గ్రంథమును వ్రాసి 1955 లో డాక్టరేట్‌పట్టమును సంపాదించుకొనెను. ఆ గ్రంథమునందలి కొన్ని విషయములను సంగ్రహించి Three Models of Grammatic Description అనుపేర 1956 లో ఒక వ్యాసముగా ప్రకటించెను. ఇంతవరకు ఛోంస్కీ బ్లూంఫీల్డు, హారిస్సుల విధానము ననుసరించుచునే యుండెను. కాని 1957 లో ప్రకటించిన Syntactic Structures అను పుస్తకము అతని విశిష్టతను వెల్లడిం చెను. పరిమాణమున చిన్నదైనను, ప్రభావమున పెద్దదై యీ గ్రంథము భాషాశాస్త్రపరిశోధనలకు పరిశీలనపాత్ర మైనది. ఇంతవరకు

నున్న పరిశోధనప్రక్రియలు (discovery procedures) పరిత్యక్తము లైనవి. అర్థవిజ్ఞానముతో సంబంధములేకుండగనే భాషాంశములను విశ్లేషింపవలయు నన్న నిశ్చయ మేర్పడినది.

ఛోంస్కీ మానవభాష. యితరసంకేతముల వంటిది కా దనియు, దీనికి ప్రత్యేకత కల దనియు స్పష్టము చేసెను. ముఖ్యముగా రెండు లక్షణములు మానవభాషకు ప్రత్యేకతను ప్రసాదించును. అందు మొదటిది ద్వంద్వాత్మకత్వము. నిర్మాణాత్మకముగా ప్రతిభాషయందు రెం డంతస్తు లుండును. మొదటిది వాక్యనిర్మాణము; రెండవది పద నిర్మాణము. ఇట్లు ద్వంద్వాత్మక నిర్మాణముగల భాషను వర్ణించుటకు పరస్పరసంబంధముగల మూడంగము లవసరము. ఈ మూడింటిని ఛోంస్కీ 'వ్యాకరణము' అనుపేరనే వ్యవహరించెను. ఇందు మొదటి అంగము వాక్యనిర్మాణము; రెండవ యంగము అర్థవిజ్ఞానము; మూడవ యంగము ధ్వనివిజ్ఞానము. ఇతర భాషాశాస్త్రజ్ఞులు వాక్యవిజ్ఞానమును, శబ్దవిజ్ఞానమును కలిసి 'వ్యాకరణము' అనుపేర వ్యవహరించిరి. ఛోంస్కీ మాత్రము విస్తృతమైన అర్థములో వ్యాకరణపదము నుపయోగించెను. మానవభాషయందలి మరొక లక్షణము సృజనాత్మకత (creativity). ఒక భాషాసమాజమునందలి ప్రజలు తాము మాటలాడు వాక్యముల కంటె ఎక్కువ వాక్యములను నిర్మాణము చేయగలరు. తా మెన్నడు వాడని, తా మెన్నడు వినని వాక్యములను తాము నిర్మాణము చేయ గల రనుట నిస్సందేహము. ఇట్లు ఒకడు నిర్మించిన వాక్యములను తద్భాషాసామాజికుడు సరియైనవిగానే అంగీకరించి అర్థము చేసికొనును. ఏవంవిధసృజనాత్మకత్వము మానవభాషకు మాత్రమే యున్నది. కావు ననే దీనిని జాతిప్రత్యేకలక్షణము (species-specific) గా గ్రహింప వలసి యుండును. విషయప్రేషణమున కుపయోగించు ఇతరసంకేత ములు మానవభాషవలె వివృతాంతములు (open-ended) కావు.

అందువల్లనే వానియందు సృజనాత్మకత్వమున కవకాశము లేదు. ఇంకొక విషయము. ఒక భాషావ్యవహర్త యుపయోగించిన వాక్యము లన్నియు సరియైనవే యగుననియు, కానియెడల స్వాభావికముగా వాని నోట అవి వెలువడనే వెలువడవనియు కొందరు భాషాశాస్త్రజ్ఞులు భావింతురు. ఛోంస్కీ యీ విషయమున కొంచెము విశిష్టదృష్టిని ప్రదర్శించును. ముడిసామగ్రిని సేకరించిన భాషాపరిశీలకుడు దేశీయ భాషావ్యవహర్త వ్యాకరణవిరుద్ధము (ungrammatical) లని గుర్తించి పేర్కొనినవానిని తొలగింపవలయు నని, అప్పుడే సరియైన రూపములు నిల్చు ననియు నతని నిశ్చయము. అట్టి వ్యాకరణవిరుద్ధరూపములను గుర్తింపగల అర్హత (competence) భాషాభాషుల కుండును. దీనిని బట్టి సంప్రదాయవ్యాకరణములలోని వర్ణనాత్మకత (description), నిర్దేశాత్మకత (prescription) అనువాని ననుసరించుచున్నా డన్న భ్రాంతి కలుగవచ్చును. ఛోంస్కీ వ్యాకరణాంశములను గుర్తించు సాధన సామగ్రిలో దేశీయుల సహజావబోధములను (intuitions) కూడ చేర్చుకొనెను. క్రమక్రమముగా సహజావబోధములపై నాధారపడుట యెక్కువయయ్యెను. అట్లే పరిశోధనప్రక్రియయందు ఊహకు, అనుభవమునకు, పాక్షికపద్ధతులకు కూడ స్థాన మిచ్చెను.

ఛోంస్కీకి తర్క, తత్త్వ, గణిత, మనస్తత్త్వ శాస్త్రములందు ఎంతో పాండిత్యము కలదు. బ్లూంఫీల్డు వరకున్న భాషాశాస్త్రజ్ఞులు ఇతరశాస్త్రములకు ఋణపడియుండగా, ఛోంస్కీ తన ప్రభావముతో ఇతరశాస్త్రములను భాషాశాస్త్రమునకు ఋణపడునట్లు చేసెను. ఛోంస్కీ వ్యాకరణసిద్ధాంతము మిక్కిలి చైతన్యవంతము, ప్రభావవంతము ననుటలో సందేహము లేదు. అతని ఉత్పాదకవ్యాకరణము (Generative Grammar), పారరూపణవ్యాకరణము (Transformational Grammar) అనునవి అతని ప్రతిష్ఠకు ధ్వజస్తంభములుగా

నిల్చినవి. భాషతో మనస్తత్వమునకు, తత్వశాస్త్రమునకు గల సంబంధమును తిరిగి స్థాపించిన గౌరవము ఛోంస్కీకే దక్కవలయును. భాషాశాస్త్రప్రక్రియలు వైద్యశాస్త్రమునకు సహితము సహకరించుచున్నవి. గణితశాస్త్రమునం దున్నంతటి నిశ్చితత్వము భాషాశాస్త్రమునందు కూడ నెలకొన్నది. 1969 లో ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమునందు ఛోంస్కీ The Philosophy of Language and Mind అను విషయముపై ప్రసంగములు చేసినప్పుడు విశ్వవిద్యాలయవిద్యార్థులు, అధ్యాపకులు సహస్రాధికముగా వచ్చి ఎంతో ఆసక్తితో వినిరట! ఈ విధమైన ఆసక్తి కలుగుటకు ఛోంస్కీ విశిష్టతయే కారణము.

భారతదేశమున సునీతికుమారచటర్జీ మున్నగువారు భాషాశాస్త్రమునందు ప్రశంసనీయమైన కృషిచేయుచున్నారు. భారతీయుల కృషి వేర్వేరు భాషల వర్ణనయందే యిప్పటికిని పరిమితమై యున్నది. మాండలికములను సేకరించి వర్ణించుట, అనాగరక భాషలను వర్ణించుట కూడ జరుగుచున్నది. తులనాత్మకభాషాశాస్త్రమునందును, చరిత్రాత్మకభాషాశాస్త్రమునందును కృషి సాగుచున్నది. సామాన్యభాషాశాస్త్రవిషయమున పాశ్చాత్యుల అడుగుజాడలే అనుసరణీయములుగా నున్నవనుట వాస్తవము.

# 4. భాషాశాస్త్ర ప్రభేదములు

భాషాశాస్త్రచరిత్రపరిశీలనమునందే భాషాశాస్త్రము వేర్వేరు దెసలలో ఎట్లు పరిణామము నొందినదో చూచితిమి. [1] భాషను కేవలము వ్యవహారపరికరముగా మాత్రమే భావించిన కాలము గడచిపోయినది. అట్లు భావించువారీనాడు కూడ అధికసంఖ్యాకముగానే యుండవచ్చును; అయినను భాషావిశిష్టతను గుర్తించి, శాస్త్రీయముగా పరిశీలించి, అనేకనూతనవిషయముల నావిష్కరింపగల శాస్త్రజ్ఞుల తోడ్పాటుతో, అవిరళకృషితో భాషాశాస్త్రము ప్రతిష్ఠనొందినది; ఇతరక్షేత్రముల పైని కూడ భాషాశాస్త్రము తన ప్రభావమును కనబరుపసాగినది.

నిజమునకే శాస్త్రమునకైనను విషయసంగ్రహణము, విషయ విశ్లేషణము, తారతమ్యపరిశీలనము, వర్గీకరణము, నిర్ణయము - అను నైదు విషయము లత్యావశ్యకములు. భాషాశాస్త్రమునకు సైతమీ విషయపంచకమే ఆధారభూమిక. కొన్ని యంశముల కున్న యత్యధిక ప్రాముఖ్యమువలన భాషాశాస్త్రము పొందిన భిన్న పరిణామములు భిన్న విభాగములుగా రూపొందినవి. విషయసంగ్రహణము, విషయ విశ్లేషణము, వర్గీకరణము ప్రధానస్థానమును గడించిన ప్రభేదము 'వర్ణనాత్మక భాషాశాస్త్రము' (Descriptive Linguistics) అనుపేరున స్థిరపడినది. ఒకే కాలమునందున్న ఒకే భాషను విశ్లేషించి వర్ణించుట యిందు జరుగును. కావుననే దీనిని ఏకకాలిక భాషాశాస్త్రము (Synchronic Linguistics) అనికూడ పిలుతురు. భిన్నకాలముల యందలి భాషాభేదములను తారతమ్యపరిశీలనముచేసి, వర్గీకరించి, వర్ణించిన

1. 'For most people language is primarily a tool to be used, rather than a subject for close and critical attention.'

— H. A. Gleason, Jr.

యెడల ఆ ప్రభేదము 'చరిత్రాత్మక భాషాశాస్త్రము' (Historical Linguistics) అను ప్రతిష్ఠ నొందును. ఇందు ఒకే భాషయొక్క స్వరూపస్వభావములు చారిత్రికముగా సమీక్షితము లగును. వేర్వేరు కాలముల యందలి భాషనుగురించి ప్రవర్తించున దగుటచేత దీనికి 'బహుకాలిక భాషాశాస్త్రము' (Diachronic Linguistics) అను పేరుకూడ అన్వర్థ మగుచున్నది. ఈ రెండు ప్రభేదములందును తులనాత్మకత్వము లేకపోలేదు. అయినప్పటికి, ఇతరధర్మప్రాధాన్యమునుబట్టి యితరనామములకు పాత్రములైనవి. ఏకకాలమునందలి భిన్నభాషలను, ముఖ్యముగా వ్యావహారికభాషలను, ఒకదానితో నొకదానిని పోల్చి పరిశీలనముచేసి వర్ణించుట 'తులనాత్మక భాషాశాస్త్రము' (Comparative Linguistics) నందలి విషయము.

పైని చెప్పుకొన్న మూడు ప్రభేదములనుగూర్చి మరికొంత విశదముగా తెలిసికొందము.

## 4. ౧ వర్ణనాత్మక భాషాశాస్త్రము

ఏ భాషయైనను వాక్యరూపముననే వ్యవహృత మగును; శాస్త్రజ్ఞుడా వాక్యములను వింగడించి, తదంశీభూతములయిన పదములను పదాంశములను గుర్తింపవలయును. వానిని మరల వింగడించి తదంశీభూతములయిన ధ్వనులను వర్ణములను గుర్తింపవలయును. ఇంతచేయుట సులభము కాదు. భాషాపరిశీలకుడు వ్యవహర్తల (Informants) వాక్యములను ఉచ్చారణవిధేయముగా వ్రాసికొనవలయును. పెక్కు భాషల కున్న లిపి ఉచ్చారణవిధేయము కాదు; పెక్కు భాషలకు లిపియే లేదు. అట్టియెడల ధ్వనివిజ్ఞానమునందు ప్రత్యేకశిక్షణ నొందిన పరిశీలకుడు మాత్రమే వ్యవహర్త లందిచ్చు వాక్యసామగ్రిని సమర్థ

ముగా సముచితముగా ననుసరింపగలుగును. అప్పుడే ధ్వనుల పరిగణనము, వర్గీకరణము మొదలయినవి సాధ్యమగును. అట్లే శబ్దవిజ్ఞానము నందును, వాక్యవిజ్ఞానమునందును విద్వాంసుడైనవాడే క్రొత్తభాష విషయమునందు నా యా యంశములను బాగుగా గుర్తించి వివరింపగలుగును. క్షేత్రప్రవర్తకుడైన భాషాపరిశీలకు డవలంబించు విధానములను గమనింతము.

పరిశీలకుడు తన వ్యవహారక్షేత్రమునందు సామగ్రిని సంపాదించుకొనుటకై కొందరు వ్యవహర్తలను సంపాదించుకొనవలయును. తనకు కావలసిన సామగ్రిని వారివలన రాబట్టవలయును. చాలవరకు బొమ్మల మూలముననో, అన్యభాషావ్యవహారముచేతనో పరిశీలకుడు తనకు కావలసిన విషయమును సూచింపవలయును. అట్లుకాక వారి భాషయందే తానుసైతము వ్యవహరించుట జరిగినయెడల, పరిశీలకుని ప్రభావమునకు లొంగి వ్యవహర్తలు వాని ననుసరించుటకు యత్నించుట జరుగవచ్చును అప్పుడు వాస్తవస్వరూపము కొంచెము చెదరవచ్చును. పరిశీలకుడు వ్రాసికొనుట కాని, టేపుపైనో డిస్కుపైనో రికార్డుచేయుట కాని యవసరమే. అట్లని వ్యవహర్తల యెట్టయెదుట ఈ ప్రయత్నములు చేసినచో వారు సహజత్వమును విడనాడు ప్రమాదము కలదు. కొందరు నోరు విప్పనే విప్పలేక పోవుదురు. కాబట్టి క్షేత్రప్రవర్తకుడు మిక్కిలి నేర్పుతో జాగరూకతతో వ్యవహర్తలనుండి సామగ్రిని గ్రహింపవలయును.

మానవుని ముఖయంత్రము లెక్కకు మిక్కిలియైన ధ్వనుల నుచ్చరింప సమర్థమై యున్నది. కాని యే భాషకును అన్ని ధ్వనుల యావశ్యకము కానరాదు. ప్రతిభాషయు ధ్వనులను పరిమితముగానే యుపయోగించుకొనును. పరిశీలకుడు సాధారణముగా తన భాషాధ్వనులను బట్టి యితరభాషలయందు సైతము ధ్వనులను గుర్తింపబోవును. ఆ

ప్రభావమును తప్పించుకొనుట కష్టమే. అయినను, పరిశీలకుడు తగిన జాగరూకత వహించి తటస్థుడై ప్రవర్తించుట యవసరము. అటువంటి సమయమున జరుగు పొరపాటులను శాస్త్రజ్ఞులు గుర్తించియేయున్నారు; అవి జరుగకుండ వారించుటకు తగిన యుపాయములనుగూడ సూచించి యున్నారు. ఆ యా యుపాయములనుబట్టి ఫలితములను సరిచూచుకొనవలయును. ఈ సరిచూచుకొనుట (Verification) యన్న లక్షణమే దీనికి శాస్త్రీయతను కల్పించుచున్నది. తగినంత సామగ్రిని సంగ్రహణము చేసినపిమ్మట పరిశీలకుడు దానిని విశ్లేషించుటయు, వర్గీకరించుటయు, వ్యవస్థీకరించుటయు నొనరింపవలయును.

మొదట ధ్వనుల విషయమును గమనింతము. అత్యల్పభేదము గల రెండు పదములను పోల్చి అర్థభేద మున్నదో లేదో గమనింపవలయును. తెలుగునందలి అలుక, ఎలుక అను రెండు పదములను తీసికొందము. మొదటి ధ్వని కాక, తక్కిన యన్ని ధ్వనులును సమానముగా నున్నవి. ఇట్టి జంటలను కనిష్ఠయుగళములు (Minimal pairs) అని యందురు. మొదటి పదమున [అ] అన్న ధ్వని యున్నది. రెండవ పదమున [ఎ] అన్న ధ్వని యున్నది. మొదటి పదమున కర్థము కోపము. రెండవ పదమున కర్థము మూషికము. అర్థభేదమున కిచ్చట కారణమైనది ఆ అత్యల్పభేదమే, కావున భేదకారకములైన ఆ రెండును రెండు వర్ణములు. కంప, గంప; కలిమి, బలిమి; పేరు, వేరు; అట్టు, అడ్డు మున్నగు కనిష్ఠయుగళములు ధ్వని వర్ణ నిర్ణయమునకు తోడ్పడును. [క్], [గ్]; [క్], [బ్]; [ప్], [వ్]; [ట్] [డ్] - అను ధ్వనులకు భేదము కలదు. ఈ భేదము అర్థభేదమునకు కారణ మగుచున్నది. కావున నిచ్చటి భేదమును ప్రయోజకభేదము (Distinctive or Functional difference) అని యందురు. కొన్నియెడల ధ్వనిభేద మున్నప్పటికిని అర్థభేదము కానరాదు. అట్టియెడల ఆ భేదమును నిష్ప్రయోజకభేదము

(Non-distinctive or non-functional difference) అని యందురు. తెలుగువ్యవహారమునందు గట్టిగా, కారము, చంపేశాడు, పో - మొదలయినచోట్ల మొదటి యక్షరమును మహాప్రాణముగా ఘట్టిగా, ఖారము, ఛంపేశాడు, ఫో - మొదలయిన విధముగా వాడుట కలదు. ఇక్కడ [గ్], [ఘ్]; [క్], [ఖ్]; [చ్], [ఛ్]; [ప్], [ఫ్] అన్నవి భిన్నధ్వను లన్నమాట వాస్తవమే. కాని యివి అర్థభేదకసమర్థములు కావు. కావున నిచ్చటిది నిష్ప్రయోజకభేదము. ఇట్లు నిష్ప్రయోజక భేదము గల రెండు ధ్వనులు స్వచ్ఛందపరివర్తనము (Free variation) నొందుచున్న వని యందురు.

ఆంగ్లమునందుండి కొన్ని యుదాహరణములను చూతము. pit, fit; sip, lip అను రెండు కనిష్ఠయుగళములందు [p], [f] అను రెండును భిన్నధ్వనులు; ఇవి అర్థభేదకములు కూడ అగుచున్నవి. కాన వీనిని భిన్నవర్ణములుగా గణింపవలయును; అట్లే [s], [l] అను రెండును గూడ భిన్నవర్ణములే. Pit, spit, tip అను మూడు పదములందు [p] మూడు భిన్నస్థానములందు వచ్చుచున్నది. మొదట నున్నది మహాప్రాణము [ph]; రెండవ చోట నున్నది అల్పప్రాణము [p]; మూడవ చోట నున్నది సంవృతహల్లు (closed consonant). అయినను, ఒక దాని స్థానమున మరొకదాని నుచ్చరించినయెడల వినువానికి వింతగా నుండవచ్చును గాని అర్థభేదము మాత్రము కలుగదు. కావున, ఈ మూడు ధ్వనులను ఒకే వర్ణముయొక్క పర్యాయధ్వనులుగా గ్రహింపవలయును. ఈ మూడింటికి వైరుధ్యము (contrast) లేదు. ఒకదాని స్థానమున నొకటి రాదు. నిర్దిష్టపరిస్థితులందే వాని కుపయోగము కలదు. కావున, అవి పూరకవ్యాప్తి (complementary distribution) యందున్న వని యందురు. ఆంగ్లమునందలి with అను పదమునందలి చివరి ధ్వనిని కొందరు నాదముగాను, కొందరు శ్వాసముగాను

ఉచ్చరింతురు. అనగా, ఇచ్చట నాదశ్వాసములు స్వచ్ఛందపరివర్తన మొందుచున్న వని యర్థము. మెనొామినిభాషయందు 'పీరు' అన్న యర్థమున nipew అన్న పదము కలదు. కొందరు దీనిని nibew అని యుచ్చరింతురు. ఇక్కడకూడ [p], [b] లు స్వచ్ఛందపరివర్తన మొందుచున్న వని యర్థము. స్వచ్ఛందపరివర్తనకు పరిస్థితుల నియమము కాని, అర్థమున భేదము కాని యుండ వన్నది గమనింపవలసిన విషయము.

తెలుగునందు వంక, పంచ, వంట, సంత, కంప అన్న మాటల యందలి పూర్ణబిందు వొక్కొక్కచోట ఒక్కొక్కవిధముగా వినిపించును. తరువాత వచ్చెడి ధ్వనినిబట్టి దీని యుచ్చారణ ముండును. కంఠ్యవర్ణమునకు ముందు కంఠ్యానునాసికముగాను, తాలవ్యవర్ణమునకు ముందు తాలవ్యానునాసికముగాను మారును. అట్లే తక్కినవర్ణములకు ముందు వాని కనుగుణముగా మారును. కావున ఇక్కడి బిందువు నిర్దిష్టపరిస్థితియందు నిర్దిష్టోచ్చారణము కలిగియున్నది. అనగా, ఇచ్చటి ధ్వనులు ఒకే వర్ణముయొక్క పర్యాయధ్వనులనియు, పూరక వ్యాప్తియం దున్నవనియు నర్థము. తమిళమునందు శ్వాసనాదములు ఉచ్చారణయం దున్నవి కాని వ్రాతయందు లేవు. పదప్రారంభమునం దున్నచో శ్వాసముగను, తక్కినచోట్ల నాదముగను పలుకుట యచ్చటి యలవాటు. 'దీపము' అను నర్థమున 'తీబమ్' అని తమిళమున పలుకుదురు. 'గణపతి' తమిళోచ్చారణము 'కణబది' అని యగును. కావున [క], [గ]; [ప], [బ]; [త], [ద] యనునవి యొకేవర్ణమునకు చెందిన పర్యాయధ్వనులుగా వ్యవహరించుచున్నవి.

నిజమునకు వర్ణ మన్నది ఒక ధ్వని కాదు. అది కొన్ని ధ్వనులకు మూలస్థానము. వెనుక చూచినట్లు మెనొామినిభాషయందు [p],

[b] అన్నవి స్వచ్ఛందపరివర్తనము నొందుచుండుటచేత, ఆ రెండింటిని ఒకే వర్గమునకు చెందినట్లుగా భావింపవలయును. అనగా, ఆ రెండును ఒకే వర్ణముయొక్క పర్యాయధ్వను లని యర్థము. అట్లే ఆంగ్లము నందలి [Ph], [P] అను రెండును పూరకవ్యాప్తి నొందుచుండుటచేత ఆ రెండును ఒకే వర్ణముగా పరిగణితము కావలయును. వర్ణమును సమరేఖల // నడుమ వ్రాయుదురు. ధ్వనిని చతురస్రికల [ ] నడుమ వ్రాయుదురు.

ఇంతవరకు చూచిన దానినిబట్టి ధ్వనివర్ణవిశ్లేషము చాల సులభ మనియే అనిపించును. కాని, ఆచరణమునం దంత సులభము కాదు. పరిశీలకుడు భాషను విశ్లేషించుట ప్రారంభించుసరికి, తప్పుద్రోవల కీడ్చు నెన్నో సమస్యలు తలయెత్తును; సందేహముల సందడి ముందు నిర్ణయ బుద్ధి తలవంచుకొనును. కొన్నింటిని చూతము. కొన్ని భాషలందు హ్రస్వదీర్ఘములకు ప్రయోజక భేదము లేదు; కొన్నింటికి కలదు. ఆంగ్ల మునందలి live, leave మొదలయిన కనిష్ఠయుగళములనుబట్టి, ఈ రెండును భిన్నవర్ణములుగా నిర్ణయింపవలయును. కొన్ని భాషలందు ద్విత్వము ప్రయోజనసాపేక్షము. కొన్ని భాషలయం దట్లు కాదు. ఇటాలియనుభాషయందు eco, ecco అన్న పదములందు అర్థభేదము కలదు. మొదటి పదమునకు 'ప్రతిధ్వని' యర్థము; రెండవదానికి 'ఇక్కడ నున్నాడు' అని యర్థము. కావున ద్విత్వ మిచ్చుట అర్థభేదక మని యంగీకరింపక తప్పదు. పైని చూచినట్లు పర్యాయధ్వనులు స్థానకరణప్రయత్నసంబంధమును చాలవరకు కలిగియుండును. ఇట్లుండుటయే సాధారణధర్మము. కాని, కొన్నియెడల దీనికి భిన్నమగు ధర్మముకూడ గోచరించును. ఉదాహరణార్థము చారిత్రకపరిణామమును గ్రహింతము. లాటినుభాషయందలి aqua, lingua అను పదములు రుమేనియను భాషలో apa, limba అని యైనవి. అనగా కంఠ్యములు ఓష్ఠ్యము

లుగా మారిన వన్నమాట! కావున, ఇట్టివానిని గుర్తించుటలో పరిశీల కుని కెంతో జాగరూకత యవసరము.

ఆంగ్లమువందున్న n/, /n/ అనునవి రెండు ననునాసిక ములే; కొన్నియెడల పూరకవ్యాప్తి నొందుచుండుట కూడ కలదు. anchor అని యన్నప్పుడు / n / ఉచ్చారణమే కలదు. కావున ఈ రెండింటిని పర్యాయధ్వనులుగా నిర్ణయింపవలయు నని యనిపించును. కాని కనిష్ఠయుగళములను గ్రహించి పరిశీలించినయెడల అట్టి నిర్ణయము సరికా దని తేలిపోవును. sin, sing; win, wing అను వానియందు వైరుద్ధ్యము స్పష్టముగా కలదు. కావున ఈ రెండును రెండు భిన్న వర్ణము లన్నది నిశ్చయము. ఇటాలియనుభాషలో ఈ రెండు ధ్వను లును వినిపించును. కాని, వైరుద్ధ్యముకల కనిష్ఠయుగళములు గోచ రము కావు. అందువలన అవి పర్యాయధ్వనులుగా మాత్రమే అచ్చట వ్యవహరించుచున్న వనవలయును.

కొన్నిచోట్ల పరిశీలకుడు తన వాచికాభ్యాసము (speech habit) ననుసరించి అదిభేదనము (over differentiation) కాని అధోభేద నము (under differentiation) కాని చేయవచ్చును. అరబ్బీభాష యందు [k], [q] అని రెండు ధ్వనులు కలవు. ఒక ఆంగ్లేయుడు పరిశీ లకు డైనచో వాని భేదమునే గుర్తింపక పోవచ్చును. గుర్తించినయెడల ఆంగ్లమునందున్న king, cool అను పదములందలి తొలిధ్వనులతో సమానముగా నిష్ప్రయోజకభేదముగల ధ్వనులుగా, అనగా పర్యాయ ధ్వనులుగా గుర్తించుట జరుగును. కాని, కనిష్ఠయుగళముల నాశ్ర యించి యీ పొరపాటును సవరించుకొనవచ్చును. kalb, qalb అను రెండును వైరుద్ధ్యముగల రెండు పదములు. ఈ రెండింటియందు మొదటి ధ్వని మాత్రమే భేదించుచున్నది; అందువలన అర్థభేదము

కలుగుచున్నది. కావున /k/, /q/ అన్నవి పరస్పరము మార్పు నొందుటకు వీలు లేని రెండు భిన్నవర్ణములుగా స్థిరపడుచున్నవి. అరబ్బీభాషీయుడు ఆంగ్ల భాషను పరిశీలించునెడల, తన వాచికాభ్యాసము ననుసరించి king, cool అను వానియందలి మొదటిధ్వనిని రెండు భిన్నవర్ణములుగా పరిగణించుట చేయవచ్చును. కాని, ఆంగ్లమునందు వానిని భిన్నవర్ణములుగా స్థాపించు కనిష్ఠయుగళములు లభింపవు. అప్పుడు తన నిర్ణయమును సవరించుకొనుట యవసర మగును.

కొన్నియెడల రెండు ధ్వనులు అన్ని విధముల సమానముగానే యుండును. అట్టియెడల ఒకే ధ్వనిగా పరిగణింపవచ్చునో, రాదో స్పష్టము కాదు. పర్యాయధ్వను లని యనిపించవచ్చును. ఇట్టివానిని సందిగ్ధయుగళములు (suspicious pairs) అని యందురు. కొన్ని భాషలలో తానము (tone) ఉపరిఘటకము (supra segment) గా వర్తించుచుండగా, కొన్నియెడల ప్రయోజకమైన వర్ణముగా వర్తించును. తెలుగు వాడుకలో 'వస్తాది' అని అన్నప్పుడు నడిమియక్షరముపై పతత్తానము (falling tone) ఉన్నప్పుడు 'వచ్చును' అన్న యర్థమును మాత్రమే తెలుపును. అట్లుకాక ఉద్యత్తానము (rising tone) ఉన్నప్పుడు 'వచ్చునా?' అన్న ప్రశ్నను సూచించును. ఇది మూలార్థమునకు భిన్నము కాదు. కావున, తెలుగునందు తానము ఉపరిఘటకము మాత్రమే యనవచ్చును. చైనాభాషాయందు అర్థభేదకమైన వర్ణముగా వ్యవహరించుట కానవగును. పరిశీలకు డీ విషయములను బాగుగా గుర్తుంచుకొనవలయును.

ఇంత చేసినపిమ్మట పరిశీలకుడు తాను తెలిసికొన్న భాషాంశములను లిపిబద్ధము చేయవలయును. ఆ యా భాషల కున్న లిపులు చాలవరకు అసమగ్రములు, అసమర్థములు. అంతేకాక, ప్రస్తుతము వాడుకయందున్న లిపుల నన్నింటిని ఎంతటి సమర్థుడైనప్పటికి నేరిగి

యుండుట శక్యముకాదు. కావున, ఒకే రకమైన లిపి నన్ని భాషలకు ననుకూలముగా ఉపయోగించుట యవసరము. ధ్వనుల ననుసరించి వ్రాయు లిపిని 'ధ్వని లిపి' (Phonetic script) అని యందురు. వర్ణముల ననుసరించి వ్రాయు లిపిని 'వర్ణలిపి' (Phonemic script) అని యందురు. ధ్వనిలిపి ఉచ్చారితధ్వనులకు వాస్తవప్రతిచిత్రణము (objetcive transcription). వర్ణలిపి కర్తృభావజన్యము లయిన యాచర్యములకు ప్రతిచిత్రణము. పూర్వము చెప్పుకొన్నట్లు వర్ణమే వాస్తవము కానప్పుడు వర్ణలిపియు వాస్తవ మగుటకు వీలులేదు. అయినను ధ్వనుల కన్నింటికి లేఖనచిహ్నములను కల్పింపవలయు నన్న మిక్కిలి కష్టము; అసాధ్య మన్నప్పటికి నంత దోషము కాదు. వర్ణములకు లేఖనచిహ్నములను కల్పించుకొనుట ఆచరణాత్మకముగా నుండి అభిలషిత ప్రయోజనమును సిద్ధింపజేయును. పరిశీలకుడీ వర్ణలిపిని వాడినప్పటికి, వ్యవహర్తల భేదమునుబట్టి కాని తన వాచికాభ్యాసమునుబట్టి కాని తప్పుగా గుర్తించుట జరుగవచ్చును. leave అని యన్నప్పుడు ఆంగ్లేయుడు [li:v] అని వ్రాయును. అమెరికాదేశీయు డైనచో [lijv] అని వ్రాయును. ఇట్టిచోట్ల మరింత జాగరూకత వహించుట, సరిచూచుకొని సవరించుకొనుటకంటె వేరే మార్గములు లేవు.

ఒక భాషయొక్క వ్యాకరణ మంతయు శబ్దవిజ్ఞానము, వాక్యవిజ్ఞానము అని రెండు భాగములుగా నుండును. పదనిర్మాణమును వివరించుభాగము శబ్దవిజ్ఞానము. పదముల పరస్పరసంబంధమును, పదబంధ సమాస వాక్య వాక్యకాది నిర్మాణమును వివరించునది వాక్యవిజ్ఞానము. శబ్దవిజ్ఞానము ధ్వనివిజ్ఞానము వంటిదే. ధ్వనివిజ్ఞానమునందు ధ్వనులను, పర్యాయధ్వనులను, వర్ణములను నిర్ణయించినట్లుగానే శబ్దవిజ్ఞానమునందు శబ్దములను, పర్యాయశబ్దములను, పదపదాంశములను నిర్ణయింపవలయును. ఆచరణమునందు ధ్వనివిశ్లేషణము, పదవిశ్లేష

ణము నొకదాని తరువాత నొకటిగా కాక సమకాలముననే ఒకదాని ప్రక్క నొకటిగా సమీక్షిత మగును.

అర్థవంతమైన కనిష్ఠధ్వనిప్రమాణమును పదాంశ మని యందురు. బయలు' అని యున్న దనుకొందము. దీని కర్థము కలదు. కావున, ఇది పదాంశము. దీని నింతకంటెను ముక్కలు చేసినచో అర్థము నష్టమగును. ధ్వనివిజ్ఞానమునందు అట్లు చేయవచ్చును. శబ్దవిజ్ఞానమునందు అర్థవంతమై యుండుట ముఖ్యలక్షణ మగుటచేత అట్లు చేయుటకు వీలుకాదు. 'తలలు' అని యున్న దనుకొందము. అర్థము చెడకుండ 'తల' యని 'లు' అని రెండు ముక్కలు చేయవచ్చును. 'లు' బహుత్వబోధకము. తల యన్నది స్వతంత్రముగా ఉపయుక్తము కాగలదు. కావున స్వతంత్రపదాంశము అని యందురు. స్వతంత్రముగా నుపయోగించుటకు వీలుకాని "లు" మున్నగువానిని నిబద్ధపదాంశ మని పిలుతురు. నెయ్యురు, నృపాలురు మున్నగుచోట్ల నున్న 'రు' పర్యాయశబ్దము. పరిశీలకుడు పదములను, పదాంశములను, పర్యాయశబ్దములను బాగుగా గుర్తించి నప్పుడే భాషానిర్మాణమును సక్రమముగా గుర్తించుట జరుగును.

ఆంగ్లమునందలి భూతార్థకమైన పదాంశమును గమనింతము. **pulled, stopped, ended** అనుచోట్ల వ్రాతయందు '**– ed**' చేరుట కనిపించును. కాని ఉచ్చారణమందు చివరి పదాంశము **–d, –t, –id** అన్న క్రమములో వినిపించును. **bend** అనుదానికి భూతార్థకము **bent**. **bind** అనుదానికి **bound**. **cut** అనుదానికి **cut** అనునదియే భూతార్థకము. ఇక్కడ భూతార్థకపదాంశము స్పష్టముగా కనిపించుట లేదు. సంకీర్ణత చెంది, ఆంతరికవివర్తము నొంది, శూన్యపదాంశ ముగా ఆ రూపము లందున్నది. ఇట్టియెడల భాషాపరిశీలకుడు మూల రూపమును నిర్ణయించుకొనవలయును. తక్కినవానిని దానికి పర్యాయ శబ్దములుగా గ్రహింపవచ్చును. అవిరళప్రయోగప్రవృత్తియే మూల

రూపనిర్ణయమునకు మూలాధారము. కొన్నిచోట్ల సమీకరణము, పృథక్కరణము మొదలయిన సంధివిశేషములు పనిచేసి శబ్దవిశ్లేషణమును క్లిష్టతరము చేయును. వెనుకముందుల నున్న వర్ణములవల్ల శబ్దము కొంత మార్పునకు లోను కావలసివచ్చును. ఆంగ్లమునందు వ్యతిరేకార్థమును సూచించుటకుగాను 'in-' అన్నది చేరును. 'intransitive' అని యన్నప్పు డున్న యుచ్చారణము 'incomplete' అని యన్నప్పుడు మారినది. కంఠ్యసాహచర్యముచేత [ n ] మార్పునొంది [n ] అయినది. అదే 'impossible' అని యన్నప్పుడు ఓష్ఠ్యసాన్నిహిత్యముచేత ఓష్ఠ్యమైనది. దానిని వ్రాతలోకూడ సూచించుట జరుగుచున్నది. సుస్థిరప్రతిష్ఠ నొందిన భాషలలో వీనిని గమనించుట అంతకష్టము కాకపోవచ్చును. కాని, అజ్ఞాతభాషలలో వీని స్వరూపమును గమనించి, పర్యాయశబ్దములను భ్రమప్రమాదములు లేకుండ నిర్ణయించుటకు కడు జాగరూకత యవసరము.

సామాన్యపదములను, సంశ్లిష్టపదములను, సంయుక్తపదములను స్పష్టముగా గుర్తింపవలయును. అట్లే పదబంధములను గుర్తింపవలయును. ఉత్పాదకముల నిర్మాణమును, నిష్పాదకముల నిర్మాణమును సక్రమముగా అవగాహనము గావించుకొనవలయును.

ఇంక ఈ వివరణమందు వాక్యనిర్మాణవిధులను నిర్ణయించుట యన్నది ప్రధానాంశము. పరిశీలకుడు తాను పరిశీలించుచున్న భాషయందలి రూపవర్గములను (form classes) నిశ్చయము చేయవలయును. ఆంగ్లమునందు ఎనిమిదివిధము లయిన భాషాభాగములను (parts of speech) సాంప్రదాయికవ్యాకరణములు నిశ్చయించినవి. తత్ప్రభావమునకు లొంగిన యితరభాషావ్యాకరణములుకూడ అదే మార్గము ననుసరించుచున్నవి. nouns, pronouns, adjectives, verbs, adverbs, prepositions, conjunctions, interjections అను ఈ

భాషాభాగములు అన్ని భాషలకు నన్వితములు కావు. టర్కీభాష యందు నామములు, క్రియలు - అన్న రెండు భాగములే కలవు. అందు సర్వనామములనుగూడ ప్రత్యయముల మూలముగానే సూచించుట జరుగును. ఇట్లే యితరభాషలలో పెక్కింటియందు పైని చెప్పినకంటె ఎక్కువగా కాని తక్కువగా కాని భాషాభాగము లుండవచ్చును. నిజమునకు కొన్ని పదములను కొన్ని భాషాభాగములలో నిమిడించి వ్యవహరించుట భాషాశాస్త్రజ్ఞులకు సమ్మతముకాదు. వాక్యమునం దున్న స్థానమునుబట్టి, యుపయోగమునుబట్టి పరిశీలకుడు వాస్తవము (objective) గా రూపవర్గములను నిర్ణయింపవలయును. కొన్ని వాక్యములను స్థిరీకరించుకొని, అందు ప్రతిపదమును అన్యపదములతో తొలగించుటకు వీ లున్న దేమో చూడవలయును. అట్లు వీ లున్నపదము లన్నియు ఒకే వర్గమునకు చెందును. ఇట్లు కొన్ని వర్గము లేర్పడును. వీనికే రూప వర్గము లని యందురు. ఇట్లు రూపవర్గము లేర్పడ్డపిమ్మట పదముల యొక్క క్రమమును, అనుగతిని, పరస్పరాన్వయమును గుర్తింపవలయును. సన్నిహితాంశీభూతములను తెలిసికొనవలయును. వాక్యముల యందలి భేదమును గమనింపవలయును. ప్రధానవాక్యకముతో ఉపవాక్యకముల సంబంధమును గుర్తింపవలయును, ఊనిక, స్థాయి, తానము మొదలయినవి వాక్యమునం దెట్టి స్థానమును గలిగియున్నవో తెలిసికొనవలయును. ఒక వాక్యమునుండి ప్రశ్నార్థక వ్యతిరేకార్థకాది వాక్యములను సాధించుటకు వీలుగా పారరూపణ నియమములను (rules of transformation) నిర్ణయింపవలయును.

వ్యాకరణాంశము లన్నియు సుస్పష్టముగా తెలిసినప్పటికి పదసామగ్రి (vocabulary) తెలియనియెడల భాష తెలిసినట్లు కాదు. పరిశీలకుడు తాను పరిశీలించిన భాషయందలి పదాంశముల నన్నింటిని సేకరింపవలయును. అవి యే యే పదాంశములతో ఎట్లు కలియునో వివ

రింపవలయును. అట్లే శబ్దపల్లవములు, జాతీయములు మున్నగువానిని గూడ నిరూపింపవలయును. ఇంతేకాక, ఆ భాషకు విశిష్టములైయున్న అంశముల నన్నింటిని గుర్తించి పేర్కొనుట ఎంతో యవసరము.

ఇంత శ్రమపడి, యిన్ని విశేషములను గుర్తించిన పిమ్మట పరిశీలకుడు వర్ణనాత్మకవ్యాకరణము (descriptive grammar) ను రచింపవలయును. అప్పుడుమాత్రమే అతని కృషికి పరిపూర్ణత లభించును; అప్పుడుమాత్రమే అతని కృషికి సఫలత్వము సిద్ధించును. పైని చెప్పిన కొన్ని వివరములన్నియు వర్ణనాత్మకవ్యాకరణమునందు స్థానము గడించుకొనును. ఇచ్చట, ఒక విషయమును గమనింపవలయును. భాషాసామాన్యమును వివరించు శాస్త్రము (గ్రంథము) వర్ణనాత్మకభాషాశాస్త్రము అనిపించుకొనును. ఏదో యొక భాషను వివరించు శాస్త్రము (గ్రంథము) వర్ణనాత్మకవ్యాకరణము అనిపించుకొనును. వర్ణనాత్మకభాషాశాస్త్రమునం దనుసరించు విధానమునే, వివేచనరీతినే వర్ణనాత్మకవ్యాకరణమునందుకూడ అనుసరించుట జరుగును. కొందరు వర్ణనాత్మకవ్యాకరణము సర్వసమర్థము కావున భాషాభ్యాసమునకు అదియే తగిన దని భావించుట అచ్చటచ్చట గోచరించును. నిజమునకు వర్ణనాత్మకవ్యాకరణము స్వయంపాకము వంటిది. ఉపయోగవ్యాకరణము వంటకము వంటిది. పాకక్రియయందు ప్రవేశమును, ప్రావీణ్యమును గలవారు స్వయంపాకముగా సమర్పించిన భోజనద్రవ్యములను స్వాదువైన వంటకముగా సమకూర్పగలరు. అది అప్పుడు సర్వగ్రాహ్యము కాగలదు. వర్ణనాత్మకవ్యాకరణమునే పాఠ్యము కావింపవలయు ననువారికి, శిక్షణతత్త్వము తెలియ దన్నప్పటికిని సాహసము కాదు. విశిష్టాధ్యయనము చేయు విద్యార్థులకు, పరిశోధకులకు మాత్రమే వర్ణనాత్మకవ్యాకరణ ముపకరించును. [2] దాన్నిపై నాధారపడి, దానికి సారభూతముగా రూ

2. "It must be stressed that the descriptive grammar is not a

పొందిన యుపయోగవ్యాకరణము భాషార్థుల కెల్లరకు పాఠ్యముగా ఉపయోగించును. దీని నిట్లుంతము. భాషాదేశపటము (Linguistic Atlas) ను నిర్మించుటకూడ వర్ణనాత్మకభాషాశాస్త్రజ్ఞుని బాధ్యతయే. పరిశీలకుడు తన భాషాక్షేత్రము ఎంతవరకు విస్తరించియున్నదియు దేశ పటమందు గుర్తింపవలయును. ఆ భాషయం దున్న మాండలికముల విస్తరణభూమినికూడ వేరుగా గుర్తింపవలయును. కీలకములయిన పద ములను కొన్నింటిని నిశ్చయించుకొని, అవి యే విభాగమునం దెట్లు ప్రయుక్తము లగుచున్నవో గుర్తించి ప్రదర్శింపవలయును. ఇట్లు నిర్మిత మైన భాషాదేశపటము వర్ణనాత్మకవ్యాకరణమునం దొక యంగమై భాషావగాహనకు మిక్కిలి సహాకరించును.

ఒక కాలమునందున్న ఒక భాషయొక్క స్వరూపస్వభావము లను పరిశీలించి, నిరూపించుటయే వర్ణనాత్మకభాషాశాస్త్రముయొక్క పరమలక్ష్యము. ఈ నిరూపణము పెక్కురకు పెక్కు విధములుగా నుప యోగపడవచ్చును. అది ఆయా శాస్త్రజ్ఞుల దృష్టి విశిష్టతనుబట్టియు, ప్రావీణ్యమునుబట్టియు నుండును.

## 4. ౨ చరిత్రాత్మక భాషాశాస్త్రము

భాషలో మార్పు సహజ మనియు, ఒక భాష కాలక్రమమున పలుభాషలుగా విడిపోవుట తటస్థించు ననియు గుర్తించుటతోడనే చరిత్రాత్మకభాషాశాస్త్రము జన్మించినది. పరిశీలకుడు తన సమకాల మునందలి భాషను పరిశీలించునెడల, ఆతనికి, లిఖితభాష యావశ్యకము

---

'use' grammar in the ordinary school text sense of the word, but rather a reference grammar on which a use grammar can be scientifically based."

— Inivitation to Linguistics by Mario Pei.

కాకపోవచ్చును. తాను తద్భాషాభాషుల సమాజమునుండి ఆ యా విశేషములను గుర్తింపగలుగును; వ్యవహర్తల ద్వారమున తత్తద్విశేష ములను సేకరింపగలుగును. తనకు పూర్వమున్న యే కాలమునందలి భాషనో పరిశీలింపవలయు నన్న లిఖితభాషయే శరణ్యము కాక తప్పదు. ఏదయినను, ఏకకాలిక మైనప్పుడు వర్ణనాత్మకభాషాశాస్త్రమునం దం తర్భవించును. ఒక భాష వేర్వేరుకాలములయందు పరిణామమును పొందును; దానిని గుర్తించి వివరించునది చరిత్రాత్మకభాషాశాస్త్రము. వేర్వేరుకాలము లని యనుటతోడనే లిఖితభాష యావశ్యక మగు చున్నది. పరిశీలకుడు తనకు పూర్వయుగములందున్న భాషను ప్రాచీన శిథిలములనుండి, నాణెములనుండి, తాళపత్రగ్రంథములనుండి, శాసన ములనుండి గ్రహింపవలసియుండును. ఆరంభకాలమునుండి ఆధునిక కాలమువరకు నున్న భాష స్వరూపము నవగాహనము చేసికొనుటకు పరిశీలకు డా యా లిపులయందు ప్రవీణుడై యుండవలయును. ఉదా హరణమునకు తెలుగుభాషనే తీసికొందము. అతిప్రాచీనకాలమునం దున్న తెలుగులిపికిని, నేటి లిపికిని ఎంతో యంతరము గలదు. ఎంతటి పండితుడైనను ప్రత్యేకశిక్షణ లేకుండ శాసనలిపిని చదు వలేడు. అట్లే తాళపత్రగ్రంథముల లిపి, యెంత యిటీవలిదైనను తడుముకొనకుండ చదువుటసాధ్యము కాదు. నన్నయభట్టారకుని స్వహస్తలిఖితభారతము మనచేతి కందిన దనుకొందము. అది మన పాలిటికి పూజార్హమేకాని పఠనార్హము కాజాలదు. ఆనాటి చాళుక్యలిపి అనంతరకాలమున మార్పుపొందుటయే దీనికి కారణము. ఇట్లే ప్రపంచ మునందు చిత్రలిపి, భావలిపి, వర్ణలిపి అక్షరలిపి మున్నగు లిపులు పరిణామక్రమములో కనుపట్టును. ఆ యా లిపులయందు నేర్పు కలిగి నప్పుడే ఆ యా భాషలను పరిశీలించుట కర్హత యేర్పడును. అట్లు కానియెడల, ఆ యా కాలములందలి భాషాస్వరూపమును వివరించు వర్ణనాత్మకవ్యాకరణములపై నాధారపడుట తప్పనిసరి యగును.

ద్రావిడభాషలకు సంబంధించిన చారిత్రకభాషాశాస్త్రమును పరిశీలకుడు వ్రాయగోరె ననుకొందము. అట్టియెడల తెలుగు, తమిళము, కన్నడము, మలయాళము మున్నగు లిపులను క్షుణ్ణముగా చదువగలిగిన నేర్పు పరిశీలకుని కుండుట యెంతో యవసరము. కాని, తాను వ్రాయు గ్రంథమున ఆ యా లిపులను వాడుటకు వీలు కాదు. వాడినయెడల ఆ గ్రంథమే వాడుకనుండి తప్పుకొనవలసి వచ్చును; పాఠకులలో బహుసంఖ్యాకులు అంతటి భారమును మోయుటకు సన్నద్ధులు కారు. [3] కావున గ్రంథకర్త సరియైన లిప్యంతరీకరణము నుపయోగింపవలయును. ఇట్టియెడల అంతర్జాతీయధ్వనిలిపి (I P A) నుపయోగించుట ప్రశస్తముగా నుండును. కావున, పరిశీలకుడు ధ్వనిలిపియందు ప్రవీణుడై యుండవలయు నని తేలినది.

భాషాచరిత్రను గుర్తించుటకు లిఖితాధారములు చాలనప్పుడు తులనాత్మకపద్ధతి వరప్రసాదముగా వ్యవహరించు ననుటలో సందేహము లేదు. వేర్వేరు కాలము లందలి భాషాభేదములను సరిపోల్చి అందున్న పోలికలను భేదములను గుర్తుపట్టవలయును. అట్లే యేకకాలమునందు వ్యవహారమునందున్న వేర్వేరుభాషలను తులనాత్మకముగా పరిశీలింపవలయును. ఇట్లు చేసినప్పుడు పరిశీలకుడు ముఖ్యముగా రెండు విషయములను గమనింపగలుగును. వేర్వేరు కాలములయందలి భాషాభేదములను పోల్చుటచేత భాషయందు కలుగు వివర్తములను గుర్తింపగలుగును. ఈ వివర్తములు ధ్వనులను, శబ్దములను, వాక్యములను, అర్థములను గూడ ఆశ్రయించుకొని యుండును. వ్యాకరణనిర్మాణవిషయమున గూడ వివర్తములు గానవచ్చును; కాని ఇతరాంశములందు

3. Accordingly one of the first tasks of a historical linguist is to master the writing systems of the languages with which he is concerned and their standard transliterations.'

— Historical Linguistics by W. P. Lehmann.

వచ్చినంత వేగముగా వ్యాకరణాంశముల విషయమున మార్పు రాదు. వేర్వేరుభాషలను పోల్చుటచేత, ఆ యా భాషలకు సంబంధ మున్న యెడల, దానిని గుర్తించుట కవకాశము కలుగును. ఆ సంబంధమును బట్టి వాని నేకకుటుంబజనితములుగా నిర్ణయింపవచ్చును. ఇట్టియెడల, ఆ సంబంధము యాదృచ్ఛికముగా కలిగినదో యథార్థముగా నున్నదో గట్టిపరుచుకొనవలయును. పదసామగ్రియందలి సామ్యముమాత్రమే కాక వ్యాకరణసామ్యముగూడ బలముగా నున్నప్పుడే యిట్టి నిర్ణయ మును అబాధితముగా నంగీకరింపవచ్చును. ఇట్లు ఒక కుటుంబమును నిర్ణ యించినపుడు మూలభాషను నిర్ణయించు బాధ్యతకూడ భాషాశా స్త్రజ్ఞుడే వహింపవలసియుండును. నిజమునకు మూలభాషాస్వరూప మును గుర్తించుట సులభము కాదు. పరిశీలకుడు తన యూహనే సాధ నముగా చేసికొని సముద్యమింపవలయును. ఏకకుటుంబజనితము లైన భాషలలోని ప్రాథమికవ్యవహారపదములను గ్రహించి, అందలి భేదము లను గుర్తింపవలయును. అట్లు చేసినపుడు, ఆ భేదములుకూడ నియమ బద్ధము లై గోచరించును. ఆ భేదములు కలుగుటకు ఆశ్రయమైన రూప మునే మూలభాషారూపముగా నిర్ణయింపవలయును. ఫ్రెంచి, ఇటాలి యను, రుమేనియను, స్పానిషుభాషలను పోల్చి చూతము. గడ్డి యను యర్థముగల పదము పొందిన మార్పు లివి.

ఫ్రెంచి foin ఇటా fieno, రుమే fin స్పానిషు **heno** పైపట్టికనుబట్టి ఫ్రెంచిప్రభృతిభాషలందు /f/ ఉన్న చోట స్పానిషునందు /h/ కలుగునని నిర్ధారింపవచ్చును. పెక్కుభాషలందున్న వర్ణమే మూలభాషావర్ణ మని యనవచ్చును. ఏమైనను, ఏదోయొక పదమును బట్టి కాక పదసామగ్రి నంతటిని దృష్టిలో నుంచుకొని యిట్టి నిర్ణయము చేయవలయును. ఇతరపదములలో ఈ వర్ణ మిదే మార్పును పొందు చున్నదో లేదో నిర్ణయించుకొనవలయును. కావున / f / ఆదిమవర్ణ

ముగా గల మరిరెండు పదములనుకూడ సమర్థకను లగునో, కాదో పరిశీలింతము.

ఫ్రెంచి fils ఇటా figlio రుమే fin స్పానిషు hijo
fer ferro fier hierro

ఈ రెండు వరుసలనుబట్టి కూడ మూలభాషావర్ణము / f / అనియు స్పానిషుభాషయందు అది / h / గా మార్పు చెందుచున్న దనియు నిర్ణయ మొనరించుట సమర్థనీయమే యగుచున్నది.

ఇట్టియెడల పరిశీలకు డింకొక ప్రమాదమునకు పాల్పడు నవకాశము కలదు. దానిని గుర్తుంచుకొనుట శ్రేయము. భాషలు సాధారణముగా పొరుగుభాషలనుండియు, సాహిత్యసంపన్నములైన భాషలనుండియు మాటల నెరవు తెచ్చుకొనుచుండును. వీనిని ఆదేయపదములు (Loan/Borrowed Words) అని యందురు. ఇవి కొన్నియెడల యథాతథముగా నుండును; కొన్నియెడల చిన్న చిన్న మార్పుల నంగీకరించును. పరిశీలకుడు కుటుంబనిర్ణయసందర్భమున దేశ్యములపయినే ఆధారపడవలయును. తుర్కీభాషలోని futboi అను పదము జపానీ భాషలో futoboru అని యున్నది; కాబట్టి యీ రెండు భాషలకు జన్మసంబంధము కలదని యనిపించును. కాని వాస్తవమును గుర్తింపగా ఈ రెండింటికి మూలరూపము ఆంగ్లమునందున్న football అని తేలును. కావున తుర్కీ జపానీ భాషలలోనిది ఆదేయమే కాని స్వీయము కాదు. పరిశీలకుడు ఆదేయములను వేరుగా గుర్తించి చూపుటకూడ అవసరమే. మొత్తముమీద తులనాత్మకపద్ధతి ననుసరించుటవల్ల వివర్తములను గుర్తించుట, భాషాకుటుంబనిర్ణయము గావించుట, మూలభాషానిరూపణము చేయుట సాధ్యము కాగలవు.

ఇట్లే నిర్మాణము ననుసరించియు భాషలను వర్గీకరింతురు. ఇదియు తులనాత్మకపద్ధతివల్లనే సిద్ధించును. ప్రపంచమునందలి భాషల నన్నింటిని అయిదు వర్గములుగా విభాగింతురు. అవి 1. ప్రతిపదాత్మక

భాషలు 2. సంయోగాత్మక భాషలు 3. ప్రత్యయాత్మక భాషలు 4. సమ్మిశ్రణాత్మక భాషలు 5. బహుసంశ్లిష్టభాషలు. కొందరు చివరనున్న రెండు వర్గములను కలిపి ఒకే వర్గముగా పరిగణింతురు. కొందరు విశ్లేషాత్మకభాషలు, సంశ్లేషాత్మక భాషలు అని స్థూలముగా రెండు వర్గములనే పరిగణింతురు. అప్పుడు పైనున్న మొదటివర్గమొక్కటియు విశ్లేషాత్మకభాషావర్గముగను, తక్కిన నాలుగు వర్గములును సంశ్లేషాత్మక భాషావర్గముగను వ్యవహృతము లగును. కొందరు రెండు వర్గములనే గుర్తించినను, మధ్యస్థముగా సంయోగాత్మక భాషలనుగూడ అంగీకరించిరి. ఇట్లు శాస్త్రజ్ఞులలో కొంత దృష్టిభేద మున్నప్పటికిని వర్గీకరణావశ్యకత విషయమున భేదము కానరాదు. వర్గీకరణమువల్ల భాషాపరిశీలనప్రక్రియలలో అవలంబింపవలసిన మార్గములు సుబోధములగును. కాలగతి ననుసరించి కొన్ని కొన్ని భాషలు సంశ్లేషాత్మకత్వమును విడిచి, విశ్లేషాత్మకత్వము వైపుగా మొగ్గుటకూడ గోచరించును. కావున, ఆ యా భాషలను, ఆ యా సమయములలో నిర్మాణమునుబట్టి పరిశీలనచేయుట వల్ల చారిత్రకపరిణామమును సక్రమముగా గుర్తించుట కవకాశము కలుగును. నిజమునకు కుటుంబనిర్ణయమునకు రూపాశ్రితవర్గీకరణము కూడ సహాకరించును. ఒక కుటుంబమునందలి భాషలు ఒకే వర్గమునకు చెందియుండును. ఒకే వర్గమునందు భిన్నకుటుంబము లుండుట కాక్షేపము లేదు. ఇట్లు చరిత్రాత్మకభాషాశాస్త్రము భాషలను జాతి నాశ్రయించి కుటుంబములుగాను, రూపము నాశ్రయించి వర్గములుగాను విభజించి చూపును. పరిశీలకుడా యా ప్రక్రియల నవగాహనము చేసికొని తాను పరిశీలించుభాష యే కుటుంబమునకు చెందినదో యే వర్గమునకు చెందినదో నిర్ణయింపవలయును.

ఈపిమ్మట పరిశీలకునిపైని మరొక బాధ్యత పడును. తాను పరిశీలించు భాష యెప్పుడు పుట్టినదో, మూలభాషనుండి యెప్పుడు విడి

వడినదో, యే యే మార్పుల కెప్పుడెప్పుడు లోనయినదో తెలిసికొన వలయును. చరిత్ర యనుసరికే పుట్టుక, బ్రతుకు, అంతము అనువాని ప్రసక్తి రాకతప్పదు. వర్తమానభాషల విషయమున సాధారణముగా అంతమునుగూర్చిన ఆలోచన యవసరము కాదు. బ్రతుకు నిమ్నోన్నత ములతో కూడియుండును. భాషావిషయమున సైతము వాని నన్నింటిని గమనించుట యావశ్యకమే.

ఒక భాష సోదరభాషనుండి కాని, మూలభాషనుండి కాని యెప్పుడు విడివడినదో తెలిసికొనుట కుపయోగించు విధానమును Glottochronology అని యందురు. ఇంకను కొంచెము విస్తృతపరిధిలో Lexico Statistics అని వాడుదురు. రోమాన్సుభాషల పుట్టుక కాలమును నిర్ణయింపవలయునన్న వాని మాతృభాషయైన లాటినుతో పోల్పవచ్చును. కాని ఇండోయూరోపియనుభాషలకు గాని ద్రావిడ భాషలకు గాని మాతృభాష యని చెప్పదగిన ప్రాచీనభాష యీనాడు లేదు. కావున, ఆ భాషతో పోల్చి యీ భాషల ఆవిర్భావకాలమును నిర్ణయించుట కవకాశము లేదు. కావున సోదరభాషలను పరస్పరము పోల్చి అవి విడిపోయిన కాలమును తెలిసికొనవచ్చును; మాండలికావస్థనుండి భాషావస్థను పొందిన కాలమును గుర్తింపవచ్చు నని యర్థము. భాషాశాస్త్రజ్ఞులు వివిధభాషలపట్ల సాగించిన కృషివల్ల వెయ్యి సంవత్సరములలో ఒక భాష సాధారణముగా 15% పదసామగ్రిని కోల్పోవు నని నిర్ణయమైనది. అనగా ప్రతిభాషయందును వెయ్యేండ్లవరకు 85% పదసామగ్రి నిశ్చలముగా నుండు నని యర్థము. [4] ఆంగ్లోశాగ్జనుభాషకును నేటి ఆంగ్లభాషకును మూలభూతపదసామగ్రియందు వెయ్యి సంవత్సరములలో [illegible]% నిలిచియే యున్నది. 215 సాధారణనిత్యోపయోగి పదములను తీసికొని పరిశీలింపగా 190 పదములు నిశ్చలములై యున్నట్లు

4. Sounds and signs — A. Kondratov.

పరిశీలకులు కనుగొనిరి. ఇట్లే లాటినుభాషనుండి పుట్టిన రుమేనియను 77 శాతమును, ఫ్రెంచిభాష 79 శాతమును, పోర్చుగీసు 82 శాతమును, ఇటాలియను 85 శాతమును, స్పానిషు 85 శాతమును మూల భూతపదసామగ్రిని నిల్పుకొనియున్నవి. ప్రాచీనజర్మనుభాషయందలి నిశ్చితపదసామగ్రి నవీనజర్మనుభాషయందు 78% ఇది యూరోపియను భాషలలో మాత్రమే యథార్థమేమో యనిపింపవచ్చును. కాని ప్రాచీన చైనాభాష నవీనచైనాభాషయందు 79%, ఈజిప్షియనుభాష కోప్టు భాషయందు 76% సగటున వెయ్యి సంవత్సరముల కాలమున నిలిచి యున్నట్లు తేలినది. మొత్తముమీద నిలుకడరేటు 76 – 85 నడుమ తిరుగుచున్నది. ఏమైనను నూటికి తొమ్మిదివంతున నున్న భేదము గణింపదగినంత పెద్ద భేదము కాదు. అయినను, కొంత సరుదుబాటు నపేక్షించు ననుట వాస్తవము.

Lees అనునతడు కాలప్రమాణమును కనుగొనుటకు ఒక సూత్రమును సిద్ధముచేసెను. ఇందు t అనునది కాలప్రమాణము. c మార్పు పొందని పదసామగ్రిశాతము. r భాషాసామాన్యమునందు నిశ్చితపదసాగ్రిశాతము. r అన్నది పైని చేసిన పరిశీలనమునుబట్టి 85% గా నిర్ణీతమైనది. ఆ సూత్ర మిది –

$$t = \frac{\log c}{2 \log r}$$

ఇప్పుడు తమిళమును తెలుగును విడివడిన కాలమును నిర్ణయించుటకు మాదిరిప్రయత్నము చేయుదము. తెలుగునందు మూల భూతములైన పది మాటలను తీసికొని, తమిళమునందు తత్సమాన పదములను చూతము.

| | తెలుగు | తమిళము |
|---|---|---|
| 1. | తల | తలై |
| 2. | వీపు | ముదుగు |

| | తెలుగు | తమిళము |
|---|---|---|
| 3. | పాలు | పాల్ |
| 4. | పెరుగు | తయిర్ |
| 5. | మగడు | కణవన్ |
| 6. | పెండ్లము | మనైవి |
| 7. | పూవు | పూ |
| 8. | పిండి | మావు |
| 9. | వాన | మళై |
| 10. | బంగారము | తజ్గమ్ |

పై పట్టికలలో 1, 2, 7 వరుసలందు సాదృశ్యము గలదు. తక్కిన వరుసలలో సాదృశ్యము లేదు. పదింటిలో మూడు పదములు మాత్రమే నిల్చియున్న వని నిర్ధారణచేయవచ్చును. నిశ్చితపదసామగ్రి 30 శాతము. పై సూత్రమునుబట్టి కాలప్రమాణమును కనుగొందము.

$$t = \frac{\log 30\%}{2 \log 85\%} = \frac{-\cdot 5229}{2 \times -\cdot 0706} = 3703$$

పై రెండు భాషలును 3703 సంవత్సరములక్రితము విడిపోయిన వని తేలినది. దోషపరిహారమునకుగాను 10 శాతము కలుపుకొనుట గాని తీసివేయుట గాని చేయవలయును. 3703 ± 370 అగును. 3400 సంవత్సరములనుండి 4000 సంవత్సరముల లోపుగా ఆ భాషలు విడి పోయె నని స్థూలముగా నిర్ణయము చేయవచ్చును.

పైది మాదిరికి మాత్రమే ప్రదర్శింపబడినది. పది మాటలనుబట్టి నిర్ణయించుట సాధ్యము కాదు. నిత్యోపయోగములైన మూలభూతపద ముల నన్నింటిని పరిగణించినప్పుడే సరియైన నిర్ణయమునకు వీలు కలుగును. ఏమయినను, చారిత్రకులకు, పురావస్తుతత్త్వజ్ఞులకు రేడియో ధార్మిక కర్బనవిధానము కాలనిర్ణయమున కుపయోగించుచున్నట్లే

Glottochronology భాషాశాస్త్రజ్ఞుల కుపయోగించుచున్న దనుట నిర్వివాదము.

ఇప్పు డింక నవీనపదసృష్టిని గమనింపవలయును. సాధారణపద ములు ఎక్కువగా సృష్టి నొందవు; ఎక్కువగా నష్టము కావు. కాని, ఒక్కొక శాస్త్రీయప్రకల్పన (scientific invention) వల్ల ఒక్కొక విధమైన పదసామగ్రి సృష్టింపబడి స్థిరపడిపోవును. అట్లే ఒక్కొక శాస్త్రము మరుగున పడిపోయినపుడు తత్సంబంధిపదసామగ్రియు మరు గున పడి క్రమముగా నశించిపోవును. రేడియో, పెన్సిలిన్, స్పుట్నిక్, ప్లాస్టిక్ మొదలయిన పదములు ఆధునికయుగమునందు వైజ్ఞానికప్రగతి ననుసరించి పుట్టినవి. సాంస్కృతిక, రాజకీయ, వాణిజ్యాది కారణముల వలన ఒక భాష మరియొక భాషను ప్రభావితము గావింపవచ్చును. ఒక మాండలికము మరియొక మాండలికమును ప్రభావితము గావింప వచ్చును. వీని నన్నింటిని చరిత్రాత్మకభాషాశాస్త్రమునందు కృషి చేయువాడు గమనింపవలయును. ఈ విషయమందే భాషాశాస్త్రిము నకు చరిత్రకు గల సంబంధము నిరూపిత మగును.

పరిశీలకుడు అర్థమునందు గలుగు వివర్తములను గూడ గమనింప వలయును. ఒకప్పుడు ఒక పదమున కొక యర్థ ముండగా, తరువాతి కాలమున మఱొక యర్థ మేర్పడవచ్చును. కొన్ని యెడల క్రొత్తయర్థము పూర్వార్థమునకు అనుబంధి కావచ్చును; కొన్ని యెడల ప్రతిబంధి కావ చ్చును. కొన్ని యెడల మూలభాషయందలి పదము జన్యభాషలయందు అర్థమును మార్చుకొనవచ్చును. వీని నన్నింటిని గమనించి వివరింపవలసిన బాధ్యత పరిశీలకునిది.

పైని చెప్పుకొన్నట్లు పరిశీలనసామగ్రిని సేకరించుకొని, ఆ యా లిపుల నవగాహనము చేసికొని, వర్ణలిపి మూలముగా లక్ష్యములను ప్రద

ర్శించి, తులనాత్మకవిధానము ననుసరించి భాషాకుటుంబములను, భాషా వర్గములను నిర్ణయించి, వర్ణ పద వాక్య నిర్మాణములందు కలిగిన మార్పులను అర్థములందు కలిగిన మార్పులను నిరూపించి, ఇతరభాష లతో గల సంబంధబాంధవ్యములను స్పష్టముచేసి, మూలభాషాస్వ రూపవివేచనము చేయుట చారిత్రకభాషాశాస్త్రజ్ఞుని కర్తవ్యము. ఇంత చేయవలయు నన్న, ఆ యా భాషల వర్ణనాత్మకవ్యాకరణములు సమర్థ ములై యుండవలయును. అప్పుడు మాత్రమే పై లక్ష్యము సిద్ధించును. కేవల వ్యావహారికభాషల విషయమున చారిత్రకాన్వేషణము ఆకాశ మున హర్మ్యనిర్మాణము చేయుట వంటిదని చెప్పనవసరము లేదు.

## 4. 3 తులనాత్మక భాషాశాస్త్రము

భాష ప్రవాహము వంటిది. ఇది కాలము, దేశము నను రెండింటి నాశ్రయించుకొని ప్రవహించును. ఇంతకుముందు చెప్పికొన్నట్లు ఏక కాలమునం దున్న భాషాస్థితిని వర్ణించునది ఏకకాలిక భాషాశాస్త్రము; దీనికే వర్ణనాత్మకభాషాశాస్త్రమని నామాంతరము. భిన్నకాలములం దున్న భాషాభేదములను వర్ణించునది బహుకాలికభాషాశాస్త్రము; దీనికే చరిత్రాత్మకభాషాశాస్త్రమని నామాంతరము. ఏకకాలము నందున్న సోదరభాషలను గాని మాండలికములను గాని పరిశీలనము చేయవలయునన్న తులనాత్మకత్వ మవసరము. అట్లే భాష యొక్కటే యైనను భిన్నకాలములందలి యవస్థలను పరిశీలింపవలయు నన్న తుల నాత్మకత్వ మవసరము. కాలమునుబట్టి పొందిన పరిమాణమును చరి త్రాత్మకభాషాశాస్త్రము వివరింపగా, దేశమునుబట్టి పొందిన పరిణా మమును వర్ణనాత్మకభాషాశాస్త్రము వివరించు నన్న మాట.

తులనాత్మకభాషాశాస్త్రము నిజమునకు భాషాశాస్త్రమునకు మాతృ స్థానీయము. సంస్కృతము, గ్రీకు, లాటిను మున్నగు భాషలకున్న పరస్పర

సంబంధమును పసిగట్టుటతోనే తులనాత్మకభాషాశాస్త్రము ప్రారంభ మయ్యెను. పందొమ్మిదవ శతాబ్దమున నీ శాస్త్రము మిక్కిలి పరిపుష్టి నొందినది. వర్ణనిర్ణయము మొదలుకొని వాక్యనిర్మాణము వరకు గల సర్వాంశములందును తులనాత్మకపరిశీలనము తప్పనిసరియే. అట్లే చారిత్రక పరిశోధనమందును తులనాత్మకత్వము విడువరానిదే. భాషాశాస్త్రము శాస్త్రముగా నిలుచుటకు తులనాత్మకత్వమే మొట్టమొదటి పునాది. అందువల్ల, తులనాత్మకభాషాశాస్త్రము ఒకవంక వర్ణనాత్మక భాషాశాస్త్రముతోను, మరొక వంక చరిత్రాత్మకభాషాశాస్త్రము తోను చేతులు కలుపుచున్న దనుట సర్వథా సత్యము. ఆ యా విషయములను ఆవశ్యకానుసారముగా అచ్చటచ్చట గుర్తించుకొంటిమి. ఇప్పు డిచ్చట ప్రధానములైన విషయములను మాత్రమే పరిగణింతము.

ఒక భాష విస్తృతభూభాగమున వ్యాపించియున్నయెడల, అది ప్రాదేశికములయిన మార్పులకు కొన్నింటికి లోనగును. అట్టి మార్పులు ఆ యా వ్యవహారక్షేత్రములందు సర్వసాధారణములై యుండెనేని, ఆ భాషాభేదములను మాండలికము లని యందురు. వీనియందు భేదము లున్నమాట వాస్తవమే. కాని, ఆ భేదములు అవగాహన కడ్డురావు. అట్లు కాక, ఆ భేదములవల్ల ఒకభాషావ్యవహర్త అన్యభాషా క్షేత్రము నందలి వ్యవహారమును గ్రహింపజాలనిస్థితి యేర్పడిన దనుకొందము. అప్పు డవి మాండలికావస్థను దాటి స్వతంత్రభాషలుగా పరిణమించిన వని యర్థము. ఒకే మాతృభాషనుండి యుత్పన్నములైనవి కావున వీనిని సోదరభాష లని యందురు. మూలభూతమైన మాతృ భాషను, స్వతంత్రములైన యీ సోదరభాషలను కలిపి ఒక కుటుంబ ముగా పరిగణింతురు. సంస్కృతము, గ్రీకు, లాటిను మున్నగుభాషలు ఇండోయూరోపియను కుటుంబమునకు చెందినవి. వానికి మూలభూత మైన భాష యీనాడు కానరాదు. ఇందు సంస్కృతము మూలభూత

ముగా ప్రాకృతములు, తత్పరిణామరూపములుగా హిందీ, బెంగాలీ, గుజరాతీ మున్నగు భాషలు ప్రభవించినవి. ఈ ఉపకుటుంబమునకు మూలము సంస్కృతము. ఇందు ప్రాచీన ఇండోయూరోపియను భాష యందు లేని విశిష్టలక్షణములు కొన్ని కానవచ్చును. ఇట్టివానిని భాక్త ప్రక్షిప్తములు (Shared Innovations) అని యందురు. కొన్ని లక్షణములు మూలభాషనుండి యథాతథముగా సంక్రమింపవచ్చును. వానిని భాక్తప్రస్థితములు (Shared Retentions) అని యందురు. ఉపకుటుంబములను నిర్ణయించునప్పుడు విశిష్టలక్షణములైన భాక్తప్రక్షిప్తములనే గ్రహింపవలయును. ఇట్లు తులనాత్మకభాషాశాస్త్రము కుటుంబములను, ఉపకుటుంబములను నిర్ణయము చేయును.

ఇట్లు చేయుటలో ధ్వనులయందు కలుగుమార్పులను గమనించుట అనివార్యము. ఇంగ్లీషునందు పదారంభమునందలి [t-] జర్మను భాషలో పదారంభమున [z-] సమకక్ష్యకు చెందినవి. ఇట్లే ఇంగ్లీషు జర్మనుభాషలందున్న [b], సంస్కృతమునందలి [bh], గ్రీకు లాటిను భాషలందలి [ph] సమకక్ష్యకు చెందినవి. ఇట్లు ఆ యా భాషలలోని ధ్వనులను గుర్తించుట వస్తుస్థితిని గ్రహించుటకు సహకరించు ననుటలో సందేహము లేదు. అది యొక ప్రయోజనము. అంతేకాక, తెలిసిన యీ భాషలనుబట్టి తెలియనికాలమునందలి మూలభాషను నిర్మించుట మరియొక ప్రయోజనము. మూలభాషాపునర్నిర్మాణమే తులనాత్మక భాషాశాస్త్రమునకు పరమప్రయోజనము అని చెప్పుట సాహసము కానేరదు. ఇట్లే నేటి భాషనుబట్టి ప్రాచీనభాషాపునర్నిర్మాణము చేయుట కూడ దీనికి అనుబంధ విషయమే. మూలభాషాపునర్నిర్మాణమునకు శాస్త్రజ్ఞులు మూడు పద్ధతుల నవలంబించుచున్నారు. మొదటిది తులనాత్మకపునర్నిర్మాణము, రెండవది ఆంతరికపునర్నిర్మాణము; మూడవది అంతర్వర్తి పునర్నిర్మాణము. ఇప్పుడీ మూడింటిని కొంచెముగా గమనింతము.

1. తులనాత్మక పునర్నిర్మాణ పద్ధతి (Comparative Method): పోల్చి చూచుటచేత మూలభాషాస్వరూపము నిర్ణీత మగుటచేత దీని కీపేరు తగియున్నది. సోదరభాషలలోని సమానపదములను గ్రహించుట యిందు జరుగును. ఇట్టియెడల ఆదేయపదములను గ్రహింపరాదు. అవి ఆ యా భాషాలక్షణములను కలిగియుండును; పరిశీల్యమాన భాషాలక్షణములు వాని కన్వితములు కాకపోవచ్చును. కావున, ఈ పరిశీలనకు దేశ్యములను మాత్రమే గ్రహింపవలయు నన్నది ముఖ్యాంశము.

| | తెలుగు | కన్నడము | తమిళము | మలయాళము |
|---|---|---|---|---|
| 1. | కన్ను | కణ్ | కణ్ | కణ్ |
| 2. | కాలు | కాల్ | కాల్ | కాల్ |
| 3. | తెర | తిరె | తిరై | తిర |
| 4. | తేలు | తేళ్ | తేళ్ | తేళ్ |

మొదటిరెండు వరుసలలోను ఆద్యక్షరము కకారము; అది యన్ని భాషలలో నున్నది. అట్లే తరువాతి రెండు వరుసలలోను ఆద్యక్షరము తకారము; అదియు నన్ని భాషలలో నున్నది. ఇట్లు అన్ని సోదరభాషలలోని సమానపదములందు నున్నవర్ణములు మూలభాషలో నుండియున్న వనుట నిశ్చయము. ఇట్లే వేర్వేరు వర్ణములస్థితిని తులనాత్మకపద్ధతి ననుసరించి నిర్ణయించుకొనవలయును.

సోదరభాషలలోని సమానపదములను పోల్చి చూచినపుడు కొన్ని వర్ణములు కొన్నియెడల భిన్నముగా నుండును. అట్టియెడల మూలభాషావర్ణమును నిర్ణయించుట యావశ్యకము.

| | తెలుగు | కన్నడము |
|---|---|---|
| 1. | కన్ను | కణ్ |
| 2. | కాలు | కాల్ |

| | తెలుగు | కన్నడము |
|---|---|---|
| 3. | చిఱు | కిఱు |
| 4. | చిన్న | చిక్క |
| 5. | చెన్ను | చెన్ను |
| 6. | చెవి | కివి |

మొదటి రెండు వరుసలలోను మొదటివర్ణము కకారము; తెలుగు కన్నడములలో తుల్యముగానే యున్నది. నాలుగవ, ఐదవ వరుసలలో తొలి వర్ణము చకారము; ఇదియు రెండు భాషలందు సమానముగానే యున్నది. కావున క, చ - అను రెండును మూలభాషావర్ణములే యని నిర్ణయింపవచ్చును. మూలభాషారూపములనుగాని, ఊహాజన్యరూపములనుగాని ప్రదర్శించినపుడు వానికి పూర్వమందు నక్షత్రచిహ్నమును నిల్పుట శాస్త్రపద్ధతి. ఉదాహరణమునకు *క, *చ. ఇంకె మూడవ, ఆరవ వరుసలలో భేదము కలదు. తెలుగునందు చకార మున్నచోట కన్నడమునందు కకారమున్నది. ఇందేది మూలభాషావర్ణమన్నది ప్రశ్న. తెనుగునందలి చకారము కన్నడమునందు కకారముగా మారినదను భావమున (తె) చ > (క) క అని నిర్ణయించితి మనుకొందము. కాని నాలుగవ, ఐదవ వరుసలు దానికి భిన్నముగా సాక్ష్యమిచ్చుచున్నవి. కన్నడమునందు పైతము చకారమున్నట్లు తెలియుచున్నది. (క) క > (తె) చ అని యందమా? మొదటి రెండు వరుసలు దానికి ఎదురు తిరుగుచున్నవి. మరింత పరిశీలింపగా అగ్రిమస్వరములతోడి *కకారము తెలుగునందు చకారముగా మారుచున్నదని నిర్ణయించుటకు వీలగును. అనగా, మూల ద్రావిడమునందలి చకారముతోపాటు కకారపరిణతమైన చకారముకూడ తెలుగునం దున్నదని తేలుచున్నది. దీని నితర సోదరభాషాపదములతో సరిచూచుకొనవచ్చును.

| | తెలుగు | హాళగన్నడము | హొసగన్నడము |
|---|---|---|---|
| 1. | పాము | పావు | హావు |
| 2. | పిడి | పిడి | హిడి |
| 3. | పులి | పులి | హులి |
| 4. | పూవు | పూ | హూ |

పై వరుసలలో తెలుగునందును, హాళగన్నడమందును 'ప' కార ముండగా హొసగన్నడమందు 'హ' కార మున్నది. ఇందు పకారము మూలద్రావిడవర్ణము. హొసగన్నడమందు మాత్రమే పకారస్థానమున హకారము నిల్చుచున్నది. ఇదియు తులనాత్మక పరిశీలనము వల్లనే దెలియుచున్నది.

ఒక భాషలో నొక వర్ణముండగా, సోదరభాషలో రెండు భిన్న వర్ణములుగానుండవచ్చును. కాని ధ్వనులమార్పు నియమబద్ధమై యుండు ననుట మరవరాని సిద్ధాంతము. అట్టియెడల ఒకే వర్ణము రెండు భిన్నవర్ణములుగా నగుటకు పరిసరములు భిన్నము లగుటయే కారణము కావలయును.

| | తమిళము | తెలుగు |
|---|---|---|
| 1. | కఴువు | కడుగు |
| 2. | నీఴల్ | నీడ |
| 3. | పొఴుదు | ప్రొద్దు |
| 4. | పొఴుల్ | ప్రోలు |

పై పట్టికయందు మొదటిరెండు వరుసలలోను తమిళ ఴకారమునకు తుల్యముగా తెలుగున డకారమున్నది. తరువాతి రెండు వరుసలలోను రేఫమున్నది. ఇంకను పరిశీలింపగా పరిసరముల భిన్నత గోచరము కాగలదు. మొదటి రెండు వరుసలలోను రెండచ్చుల నడుమ డకారము

వచ్చుచున్నది. తరువాతి రెండు వరుసలలోను వర్ణశ్రుతి కారణముగా ఴ క్రిందటి హల్లుతో సంయోగము నొందుచున్నది. అప్పుడది రేఫముగా మారుచున్నది. మూలభాషయందలి ఴ తమిళమున నట్లేయుండగా, తెలుగున అచ్చుల నడుమ డ వర్ణముగాను – హల్సంయోగమున ర వర్ణముగాను మారుచున్నదని సిద్ధాంతము. ఉదాహరణ బాహుళ్యమువలన దీనిని సరిచూచుకొనుట మంచిది. అట్లే రెండు మూడు సోదరభాషలనేకాక, వీలయినన్ని సోదరభాషలను వినియోగించుకొనుట నిర్ణయమునకు మరింతబలమును చేకూర్చును.

2. ఆంతరిక పునర్నిర్మాణ పద్ధతి (Method of Internal Reconstruction): ఒక భాషయొక్క ప్రాచీనస్థితిని తెలిసికొనుటకు ఆంతరిక పునర్నిర్మాణపద్ధతి నుపయోగింతురు. దీనియందు సోదరభాష లలోని రూపములుగాని, ప్రాచీనగ్రంథప్రయోగములుగాని వినియోగ పడవు. ప్రకృతము భాషలోనున్న రూపమును గ్రహించి, యితర పరిస రములందు దానికున్న రూపవైవిధ్యమును గ్రహించి, తన్మూలముగా ప్రాచీనరూపమును నిర్ణయించుట యిందలి విధానము. నీరు తోడు సాధనమునకు 'చేద' యనిపేరు. నీరు తోడుట యను నర్థమున 'చేదు' ధాతువుకూడ కలదు. చేదకు కట్టు త్రాటికి వ్యావహారికమందు 'చేన్తాడు' అను రూపము ప్రచురముగా కలదు. 'చేద+తాడు' అని యున్నప్పుడు వ్యావహారిక సంధినియమమునుబట్టి 'చేత్తాడు' అని కావలసియుండును. ఈదుతాడు> ఈత్తాడు; అది తెలుసు> అత్తెలుసు; బాదుతూ> బాత్తూ అన్నవి అట్టిరూపములు. ఈ దృష్టితో చూచినపుడు 'చేత్తాడు' అని కావలసియుండును. 'చేన్తాడు' అన్న రూపమునుబట్టి రేంకాయ, వంకాయ మున్నగు రూపములలో నున్నట్లుగా శబ్దగతముగా నకారముండి తీరవల యును. అందువలన *చేన్ద అన్నది ప్రాక్తనరూపమని నిర్ణయింపనగును. తెలుగువాడుకలో ఈనాడు 'రాస్తున్నాడు, రాత' మొదలయిన ప్రయో

గాలు వినిపించును. వీనియందు ధాతువు 'రాయు'. కాని వ్రాలు, చేవ్రాలు మొదలయిన రూపములలో తొలుత వకారముకూడ నియతముగా వినిపించును. దీనినిబట్టి 'వ్రాయు' అన్నది ప్రాచీనధాతువని నిర్ణయింపనగును. ఇతరాధారములు లేకుండ, ప్రకృతమున్న రూపములనుబట్టియే ప్రాచీనరూపములను నిర్ణయించుటకు ఈ పద్ధతి యెంతో యోగ్యమైనది.

ఇంకొక ఉదాహరణమును చూతము. తెలుగునందు 'ఐదు' అను సంఖ్యావాచకమును వాడుకయందు మిక్కిలి ప్రచురముగా వాడుచున్నాము. రూపాంతరముగా 'అయిదు' అన్నదియు నున్నది. ఇదియే పూర్వమునుండియు నున్నదా? ఈ ప్రశ్నకు సమాధానముగా సమాసాంతర్గతశబ్దములను చూడవలయును. వాడుకయందు 'పదిహేను' అను రూపమే ప్రచురముగా నున్నది. మాండలికముగా 'పదైదు' అను రూపము పరిమితప్రయోగము కలిగియున్నది. పరిమితమో, ప్రచురమో ప్రయోగమన్నది యున్నది. కావున, ఇచ్చట మనకు సాహాయ్యము లభింపదు. ఏభై, ఏనూరు మొదలయిన రూపములందు ఐదుశబ్దము కానరాదు. ఏనుశబ్దమే పూర్వస్థానమున నిలిచినది. వ్యస్తరూపముకంటె సమస్తరూపము పూర్వకాలికత్వమును వ్యక్తముచేయును. కావున 'పదిహేను' అను రూపమునుబట్టియు, 'ఏభై' మున్నగురూపమును బట్టియు 'ఏను' అన్నదే ప్రాచీనరూప మని నిర్ణయింపవచ్చును.

గ్రాంథికమునందే యుష్మదర్థకైకవచనము నీవు, ఈవు - అని రెండు విధములుగా నున్నది. ఇందేది ప్రాథమికము? దీనిని గుర్తించుట కితరవిభక్తిరూపములు సహకరించును. ద్వితీయావిభక్తి 'నిన్ను'. తృతీయమొదలు సప్తమివరకు తటము 'నీ'. 'ఈవు' అనుదానికి బహుత్వమునందు 'మీరు' అను రూప మున్నది. ద్వితీయాది విభక్తులందు

దీని కుపయోగము కానరాదు. కాబట్టి 'నీవు' అన్నదే ప్రాథమికరూప మన్నది నిశ్చితము.

సంస్కృతమునందు ధనవాన్, విద్వాన్ - అన్నవి ప్రథమా విభక్తిరూపములు. ఈ రెండింటికి తుదిప్రత్యయ మొక్కటిగానే అని పించును. అగునో కాదో తేల్చుకొనుటకు ఆ యా శబ్దముల యితర రూపములను గమనించుట యవసరము. మొదటి శబ్దమునకు ద్వితీయా విభక్తిరూపము 'ధనవతమ్'; రెండవ శబ్దమునకు 'విద్వాంసమ్'. ఇట్లే యితరరూపములందును భేదము గోచరము కాగలదు. కాబట్టి ప్రథమా విభక్తియందు సదృశములే కాని అవి సమానములు కా వని స్పష్టముగా నిర్ణయింపవచ్చును. 'ధనవాన్' అన్నది తకారాంతము. 'విద్వాన్' అన్నది సకారాంతము.

తెలుగులో తత్సమశబ్దములు వాడుక ఎక్కువగా కలదుకదా! విష్ణుడు, కృష్ణుడు అను రెండు శబ్దములనుగూర్చి చూతము. ఈ రెం డును సదృశము లనుటలో సందేహము లేదు. సమానములా? అన్నది యాలోచింపవలయును. ఇతరవిభక్తులనుబట్టి చూచినను భేద మున్నట్లు గోచరము కాదు. విష్ణుని, కృష్ణుని మున్నగువిధముగా సమాంతర రూపములే కానిపించును. అందువల్ల, అవి మనకు సహకరింపవు. సంబోధనమందు మొదటిది 'విష్ణూ' అని కాగా, రెండవది 'కృష్ణా' అని యగును. దీనినిబట్టి రెండింటికి స్వరూపమున భేద మున్న దని తేలు చున్నది. సంబోధనమున దీర్ఘము చేరుచున్న దని అనుకొందము. అప్పుడు మొదటిది 'విష్ణు' అనియు, రెండవది 'కృష్ణ' అనియు నుండును. అవియే ప్రాతిపదికలు. ఇదే విషయమును మరొక విధముగా సాధింతము. ప్రథమావిభక్తియందు "కృష్ణుడు" ఒకే రూపముతో "కృష్ణుడు" అని మాత్రమే యుండగా "విష్ణుడు" రూపాంతరమును దాల్చి "విష్ణువు" అని కూడ కనిపించును. తెనుగున ఉదంతములకు

మాత్రమే 'వు' ప్రత్యయము చేరును. కాబట్టి 'విష్ణు' అన్నది ఉదంత మని "కృష్ణ" అన్నది అదంత మని నిర్ధారణమగును. సమాసములుకూడ ఈ నిర్ణయమునకు సహకరించును. విష్ణుచక్రము, కృష్ణలీలలు - మున్నగు సమాసములు పూర్వశబ్దముల స్వరూపమును పట్టి యిచ్చు చున్నవి. తెలుగుభాషాభాషి సంస్కృతము నెంతమాత్రము నెరుగక పోయినను, తన వాడుకనుబట్టియే సంస్కృతమునందలి ప్రాతిపదికను నిర్ణయించుకొనుట కీ పద్ధతి సహకరించును.

3. అంతర్వర్తి పునర్నిర్మాణము పద్ధతి (Method of Inverted Reconstruction): ఇంతకుముందు చెప్పుకొన్న తులనాత్మక పద్ధతియు, ఆంతరికపద్ధతియు ఒకదాని కొకటి సహకారకముగా ఈ పద్ధతి యందు ప్రవర్తించును. ఆంతరికపద్ధతిచేత ఒక నిర్ణయమును చేసి తుల నాత్మకపద్ధతిచేత దానిని సరిచూచుకొందుము. అట్లే తులనాత్మకపద్ధతి చేత ఒకనిర్ణయమునుచేసి ఆంతరికపద్ధతిచేత దానిని సరిచూచుకొందుము. ఇట్లు ఒకే నిర్ణయమునకై రెండుపద్ధతులను వినియోగించుకొనుటచేత దీనికి అంతర్వర్తిపునర్నిర్మాణపద్ధతి యనుపేరు సరిపడుచున్నది ఆంతరికపద్ధ తినిబట్టి ఒక్క భాషనుమాత్రమే పరిశీలింతుము; తులనాత్మకపద్ధతినిబట్టి సోదరభాషలను పెక్కింటిని పరిశీలింతుము. అంతర్వర్తిపద్ధతివల్ల ఒక భాషను, (ఒక భాషాకుటుంబమును పరిశీలించుట మాత్రమే కాక ఉపకుటుంబములను పరిశీలించుటకు నిర్ణయించుటకు కూడ వీలు కలుగును.

వెనుకటి ఉదాహరణములనే తీసికొన్న సంగ్రహణమునకు తోడ్పడును. తెలుగువాడుకలోని 'రాత, రాస్తున్నాడు' మున్నగు రూపములకు మూలధాతువు "వ్రాయు" అన్న నిర్ధారణ ఆంతరికపద్ధతి ననుసరించి చేసితిమి. "వ్రాత" అన్న యర్థమున కన్నడమునందున్న బరవిగె, బరహికె, బరావు - అన్నపదములు పరిశీలనార్హములు. ఇచ్చటి

రూపము లన్నింటియందును ద్వితీయస్థానమున రవర్ణమున్నది; ప్రథమస్థానమున బవర్ణ మున్నది. 'వేగ' యన్నది కన్నడమున 'బేగ' అని యగును; వేసగి యన్నది 'బేసిగె' అని యగును. కావున తెలుగున 'వ' ఉన్నచోట కన్నడమున 'బ' యుండునని పై యుదాహరణముల వల్ల సిద్ధించినది. 'వ్రాయు' ధాతువులోని ప్రథమాంశమును కన్నడములోని 'బర – ' యు సమానము లని తేలినది. కాబట్టి 'రాయు' ధాతువునకు పూర్వరూపము 'వ్రాయు' అనియు అందు వకారము రకారముతో కూడి యున్నదనియు నిశ్చితముగా నిరూపితమైనట్లే.

పదిహేను, ఏన్బై – అన్న రూపములనుబట్టి 'ఏను' అన్నదే ప్రాచీన మనియు, ఐదు అన్నది అనంతరకాలిక మనియు నిర్ణయించితిమి. ఇప్పుడు సోదరభాషలతో పోల్చి చూతము. తమిళమున ఐన్దు, అఞ్జు – అని రెండు రూపములు కలవు. మలయాళమున అఞ్జు, కన్నడమున ఐదు, తుళునందు ఐను – అను రూపములు గలవు. నిజమున కివి యేవియు 'ఏను' రూపముతో సామ్యమును చూపుట లేదు. ఐదు రూపముతోనే యెక్కువ రూపములు సామ్యమును చూపుచున్నవి. ఇంత మాత్రముతో మన పరిశీలన మాగిపోయినయెడల మనము పైని చేసిన నిర్ణయము తప్పనవలయును. కాని, తెలుగునందున్న స్థితినిబట్టి దానిని తప్పనుట సమంజసము కాదు. మరి దానిని సమర్థించుట యెట్లు? ద్రావిడభాషయందలి ఐకారమునకే ఒక విలక్షణమైన ఉచ్చారణ ఉన్నదన్న సంగతిని గుర్తు చేసుకొనుట యవసరము. తల మున్నగు శబ్దములు తెలుగు మలయాళములందు అదంతములుగాను, కన్నడ తుళు లందు ఎదంతములుగాను పరిణతిచెందును. మూలభాషయందు ఐదంతములై యుండి, తమిళమున నట్లే నిలుచును. ఇది ద్రావిడభాషా శాస్త్రవేత్త లంగీకరించిన విషయమే. 'ఐన్దు' లోని 'ఐ' కూడ ఇట్టి మార్పులకు లోనగుటచేతనే 'ఏ' వర్ణము కలుగుట. చివరి సంయుక్త

వర్ణము రెండుగా విడి ఏను, ఇను, ఐదు అను రూపములలోనికి వ్యాపించినది. కావుననే తెలుగులోని 'ఏను' అను రూపమునకు 'ఐదు' అను రూపమునకు కూడ 'ఇన్దు' అన్నదే మూలరూపము. తెలుగున మాత్రము 'ఏను' ముందుగను 'ఐదు' తరువాతను వ్యాప్తిని గడించుకొన్నవి.

నీవు, ఈవు - అను రూపములలో 'నీవు' అన్నదే ప్రాథమికమని నిర్ణయించితిమి. దీనికి ద్వితీయాదివిభక్త్యంగముగా 'నీ' యని యుండుట ప్రోద్బలకమైనది. ఇప్పు డితరసోదరభాషలతో తులనాత్మక పరిశీలనముచేసి చూతము. తమిళ మలయాళ కోత తోద బ్రాహు ఈ భాషలందు యుష్మదర్థకైకవచనము 'నీ' అనియే కలదు. కువి కన్నడములందు 'నీను' అని కలదు. కోయ నాయకీభాషలందు 'నీవ్' అని, కొండ కురుఖ్ మల్తోభాషలందు 'నీన్' అని కలదు. ఈ రూపములనుబట్టి నకారాదియైన రూపమునకే ప్రాథమ్యము కలుగుచున్న దనుట తథ్యము. కాని, మరికొంత పరిశీలింపగా మరొక విధమైన రూపము కూడ గోచరించును. తుళుభాషయందు 'ఈ' అని, పర్జి గదబలందు 'ఈన్' అని, కుయియందు 'ఈను' అని కలదు. తుళు తప్ప తక్కిన వన్నియు మధ్యద్రావిడభాషలు. ఇవి తొలుత నున్న 'న' కారమును విడిచిపుచ్చియుండును. సాధారణముగా మూలభాషయం దున్న వర్ణము తొలగిపోవుట సాధ్యమే కాని, లేని వర్ణము కలిసివచ్చుట సాధ్యము కాదు. దీనిని సాధారణనియమముగానే గ్రహింపవలయును. ఇతరకారణముల ప్రభావమువలన అదనపువర్ణము కలియుట అరుదుగా కనిపింపవచ్చును. మధ్యద్రావిడభాషలం దీ నియమము సార్వత్రికము కాదు. కావున, సన్నిహితమైన తెలుగుభాషనుబట్టియే దక్షిణమున నున్న తుళుభాషయు, ఉత్తరమున నున్న కుయి పర్జి గదబలు ఆదిమ నకారమును విడిచియుండును. కావున 'ఈవు' అను రూపము తెలుగు

వారి సృష్టియే కావచ్చును. అయినను 'నీవు' అను రూపముకూడ ప్రచురముగా ప్రయుక్తమయ్యె ననుట యథార్థము. అస్మదర్థకముకూడ తెలుగున నేను, ఏను అని రెండు రూపములు దాల్చినది. దీనినిబట్టి తెలుగున కిది స్వాభావిక మని, తక్కినభాషలు పాక్షికముగా ప్రభావితము లయ్యెనని నిశ్చయింప నగును.

ఇట్లే ఉపకుటుంబములం దున్న విశిష్టలక్షణములను గమనించి నిర్దేశించుటయు, మూలభాషకంటె ఉపకుటుంబభాషలలోని భేదములను నిరూపించుటయు, అట్లే సోదరభాషల సామ్యములను గమనించి మూలభాషను పునర్నిర్మాణము చేయుటయు ఈ పద్ధతులవల్లనే సాధ్యమగును. ప్రాచీనభాషనుండి పుట్టిన భాషలను చూపుచు వంశవృక్షమును నిరూపించునట్లే, ఉపభాషాకుటుంబమును నిరూపించుచు అందలి భాషలను వేరువేరుగా గుర్తించుట అవసరము. వృక్షము శాఖోపశాఖలతో విస్తరించునట్లుగానే, మూలభాషయు శాఖోపశాఖలతో విస్తరించును. ఇందు శాఖలు గ్రీకు, లాటిను, సంస్కృతము మొదలయిన సోదరభాషలు కాగా ఫ్రెంచి, ఇటాలియను, రుమేనియను, స్పానిషు మొదలయినవియు హిందీ, బెంగాలీ, గుజరాతీ, మహారాష్ట్రీ మొదలయినవియు ఉపశాఖలుగా వ్యవహరించును. వీని నన్నింటి నొక్కచోట వంశవృక్షముల రూపమున చూపుట సత్వరావగాహనమునకు సహకరించును.

పునర్నిర్మాణ పరిమితి ప్రయోజనములు : అగస్టు ష్లైచర్ అను భాషాశాస్త్రవేత్త ఇండోయూరపియనుమూలభాష నూహించి, ఆ భాషలో ఆసాంతము, ఒకకథను రచించినట్లు చెప్పుకొంటిమి. నిజమునకు పునర్నిర్మాణప్రక్రియ అందుల కుద్దిష్టము కాదు. పరిచితములయిన భాషలనుబట్టి, అజ్ఞాతయుగమునందలి అపరిచితభాష నూహించుట యిచ్చట జరుగుచున్నది. పద్ధతు లెంత శాస్త్రీయములై యున్నప్పటికిని, ఊహా

శక్తికే యిచ్చట బల మెక్కువ యున్నది యొప్పుకొనవలసిన వాస్తవము. పునర్నిర్మాణరూపములు అప్పుడప్పుడు మారుపాటు నపేక్షింపవచ్చును. సంస్కృతమునందలి 'అశ్వః' అనుదానికి, లాటినునందు equos అనునది సమానార్థకము. ప్రాచీనభాషాపునర్నిర్మాణరూపము *ekwos. సంస్కృతమునందు 'దదాతి' యను రూపము గలదు. గ్రీకునందలి 'దిదోసి' దానికి సమానార్థకము. పునర్నిర్మాణరూపము *దిదోతి. వీనినిబట్టి ప్రాచీన ఇండోయూరోపియను భాషయందలి 'ఇ -' గ్రీకునం దట్లే యుండునని సంస్కృతమున 'అ -' యగునని తెలియును. అట్లే *'ఎ' లాటినునందు 'ఎ' గా నుండి సంస్కృతమున 'అ' యగును. ఇట్లు ధ్వనుల మార్పులను నియతముగా గుర్తించుటకు పునర్నిర్మాణప్రక్రి అవసరము. దీనివలన భాషాసంబంధములయిన పెక్కు విషయములను గుర్తించుటకు, సులువుగా వెల్లడించుటకు వీలు కలుగును. వర్ణనాత్మకభాషాశాస్త్రమునకు, చరిత్రాత్మకభాషాశాస్త్రమునకు సమానముగానే దీని ఆలంబన మావశ్యకము.

పునర్నిర్మాణము వల్లనే వర్ణములను, వర్ణసముచ్చయములను గుర్తించుటకు వీలు కలుగుచున్నది. అట్లే వర్ణములరీతిని నిర్ధారణచేయుటకు వీలు కలుగుచున్నది. అట్లే ప్రత్యయములను, సంధికార్యములను గుర్తించుటకు సైతము పునర్నిర్మాణప్రక్రియ యెంతో తోడ్పడును.

రోమాన్సుభాష లనుపేర వ్యవహృతములగు ఫ్రెంచి, ఇటాలియను, రుమేనియను, స్వీడిషు ప్రభృతిభాషలను పరిశీలించి మూలభాషాపునర్నిర్మాణము చేయుటకు శాస్త్రజ్ఞులు కృషి సలిపిరి. వారి కృషిఫలముగా నిర్మింపబడిన భాషకును, రోమాన్సుభాషలకు మాతృస్థానీయమైన లాటినుభాషకును భేదము చెప్పుకొనదగినంతగా కన్పింపలేదట! యథార్థమైన మూలభాష యున్నది కావున ఊహానిర్మితమూలభాషతో పోల్చుటకు వీలు కలిగినది. ఇచ్చట లభించిన సత్ఫలితమువల్ల పునర్నిర్మాణ

ప్రక్రియపట్ల విశ్వాసము ప్రబలినది. ఇది మిక్కిలి ప్రయోజనవంత మున్నవిషయముకూడ ఋజువైనది. వేరువేరు భాష లున్నవనియు, అవి ఒక కుటుంబమునకు చెందుననియు నన్నప్పుడే వాని కొక మూలభాష నంగీకరించుట జరుగుచున్నది. అట్టిభాషను అందుభాషలో నున్న సామగ్రితో పునర్నిర్మాణము గావించుకొనుట మూలభాషాతత్త్వావ గాహనమునకు మేలిబాటను ప్రదర్శించును. అప్పుడు మాత్రమే అవాం తరభేదములను గమనించుట, ఆ యా విశేషములను గుర్తించుట సాధ్యము కాగలదు.

# 5. భాషల వర్గీకరణము

భాషాశాస్త్రజ్ఞుల పరిగణనమునుబట్టి యీనాడు ప్రపంచము మొత్తము మీద 2796 భాషలు గలవు. తొలుదొల్త ఒక్కటే భాషయయ్యును క్రమముగా పెక్కుభాషలు వాడుకలోనికి వచ్చినవి. మానవజాతి పెరిగి పెద్దదై ప్రపంచమున విస్తరించుకొన్నట్లే భాషలును విస్తరించుకొన్నవి. ఒకభాష మాటాడువారికి మరొకభాష యేమాత్రము నర్థముకానంతగా అనిపించును. భిన్నభిన్నములుగా అనుపించునట్టి యీభాషలలో కొన్నింటికి ఆంతరికమైన సంబంధమేదోయున్నట్లు పరిశీలననేత్రములతో చూచిన వారికి తప్పక గోచరించును. భాషలయొక్క రూపమునుబట్టి కాని, పుట్టుకనుబట్టి కాని వానికి పరస్పరసంబంధమును స్థాపించు నవకాశము కలదు. రూపమునుబట్టి చేయు వర్గీకరణమునకు రూపాశ్రిత వర్గీకరణము (Morphological classification) అని యందురు. పుట్టుకనుబట్టి చేయు వర్గీకరణమునకు జాత్యాశ్రిత వర్గీకరణము (genealogical classification) అని యందురు.

జాత్యాశ్రితవర్గీకరణమునే కొందరు చారిత్రకవర్గీకరణము (Historical classification) అనియు వ్యవహరించుచున్నారు. ఇందు కొన్ని భాషలను కలిపి ఒక కుటుంబముగా పరిగణించుట జరుగును. ఒక ప్రాచీనభాష ఆ యా భాషలకు మూలమనియు, మాతృస్థానీయమైన ఆ భాషనుండి వెలువడిన భాషలన్నియు సోదరభాషలనియు, అందు జన్మసంబంధమైన సామాన్యలక్షణములు కలవనియు ఈ కల్పనలోని పరమార్థము. ఈ విధముగా జాత్యాశ్రితవర్గీకరణము అనుపేరు సార్థకమే. సోదరభాషలకు మూలభూతమైన భాష ప్రాచీనకాలమునకు చెందినది. ఆ ప్రాచీనకాలమునుండి ఆధునికకాలమువరకు నున్న భాష

లకు ముడివేయుట యిందు జరుగుచున్నది కావున చారిత్రికవర్గీకరణము అన్నది కూడ సమంజసమే యనిపించును. నిజమునకు ప్రతిజాతికి, ప్రతి దేశమునకు చరిత్ర యున్నట్లే ప్రతి భాషకు చరిత్ర యున్నది. అయినను, చారిత్రక కారణములవల్ల కొన్ని భిన్నభాషలు సన్నిహితము లగుటయు, పరస్పరము ప్రభావితము లగుటయు సంభవించును; ఒక భాషలోని పదములు మరొకభాషలో ప్రవేశించును. ఇట్టి పరిణామములు చారిత్రకముగా కలుగును. చారిత్రకవర్గీకరణము అని యన్నప్పుడు ఈ చారిత్రక పరిణామముల ప్రసక్తి రావలసివచ్చును. అది జన్మసంబంధమును నిరూపించునది కాదు. కావున, భ్రాంతి కవకాశము కల్పించు చారిత్రకవర్గీకరణము అన్న పేరుకంటె సస్వరూపావిష్కారసమర్థమైన జాత్యాశ్రిత వర్గీకరణము అన్నపేరే పలువురు శాస్త్రజ్ఞుల మన్ననకు పాత్రమైనది.

భాషాకుటుంబములను నిర్ణయించునపుడు మిక్కిలి జాగరూకుడై పరిశీలకుడు వ్యవహరింపవలయును. వీలునుబట్టియు విశ్వాసమును బట్టియు కాక శాస్త్రీయవిధానమునుబట్టియే నిర్ణయ కార్యక్రమమును నిర్వహింపవలయును. భౌగోళికముగా రెండు భాషలు సన్నిహితములుగా నున్న యెడల, ఆ రెండు భాషలకును పరస్పరసంబంధము కల దనిపించును. తెలుగు, కన్నడము, తమిళము, మలయాళము మొదలయిన భాషలు పరస్పరము భౌగోళికముగా సన్నిహితములై యున్నవి. నిజమునకు వానికి జన్మసంబంధము కూడ నున్నది. తెలుగు కన్నడములకు సమీపముగా మహారాష్ట్రభాష యున్నది. కొన్నికొన్ని పదములు సామ్యమునుగూడ ప్రదర్శించును. అయినప్పటికిని, పరిశీలనము చేసిన పిమ్మట మహారాష్ట్రము భిన్నకుటుంబమునకు చెందినదని స్పష్టమగును. బెలూచీస్తానులో బ్రాహుయీ అను భాషకలదు. దానికి చుట్టును ఇండో యూరోపియను కుటుంబమునకు చెందినభాషలే కలవు. వాని నడుమునున్న యీ భాషయు నట్లే యనిపించును. కాని, పరిశీలకులు దానిని ద్రావిడభాషగా

నిర్ణయించిరి. కావున, భౌగోళికసాన్నిహిత్యముతో సంబంధము లేకున్నను భాషలకు జన్మసంబంధ ముండవచ్చు నని నిశ్చితమైనది. అట్లే బహిరంగసాదృశ్యము లేకపోయినప్పటికిని, అంతరంగ సాదృశ్యముచేత ఏక కుటుంబత్వము స్థిరీకృతమగును. బహిరంగసాదృశ్యము కలదను కొన్నప్పుడు, అది బదులు తెచ్చుకొన్న సాదృశ్యమేయైన యెడల ఏకకుటుంబత్వము అంగీకార్యము కాదు.

కుటుంబనిర్ణయమునందు మూడు విధములైన సమానత్వమును ముఖ్యముగా గ్రహింపవలయును. 1. పదసామగ్రి 2. ధ్వనిరీతి 3. వ్యాకరణ విధానము.

1. పదసామగ్రి యన్నప్పుడు భాషలకు స్వతస్సిద్ధములైన పదములనే గ్రహించుట యవసరము. అన్యదేశ్యము లిట్టియెడల అక్కరకు రావు. ఇంతేకాక నాగరకులు, సంపన్నులు, శాస్త్రజ్ఞులు, విద్వాంసులు, కళాకారులు మున్నగువారు విశిష్టముగా నుపయోగించు పదములుకూడ కుటుంబనిర్ణయవిషయమున కూడనివే. సామాన్యప్రజలు దైనందిన వ్యవహారమున నుపయోగించు పదములే యిట్టి నిర్ణయమునందు మిక్కిలి యుపకరించును. బంధుత్వబోధకములు, అవయవబోధకములు, వ్యక్తిబోధక సర్వనామములు, సంఖ్యావాచకములు, అనుదినావశ్యక క్రియాబోధకములు, నిత్యోపయోగి వస్తుబోధకములు కుటుంబ నిర్ణయ విషయమున నిర్ధారకములుగా గ్రహింపదగినవి.

ఈ పదములను పోల్చి చూచునప్పుడు కొన్ని భేదములు కూడ గోచరింపవచ్చును. మూలభాషనుండి వేరుపడుట యనగానే, కొంత భేదము కలిగినట్లు అంగీకరింపవలయును. ఈ భేదములు నియమబద్ధములై యుండునన్నది గమనార్హము. పైకి భేదమున్నట్లు గోచరించినను, ఆ నియమము నర్థము చేసికొన్నప్పుడు సమానత్వమే స్పష్టగోచరమగును.

తండ్రి, తల్లి – అను నర్థముగల రెండు పదములను వివిధభాషలనుండి గ్రహించి పరిశీలింతము.

| | | |
|---|---|---|
| సంస్కృతము | పితృ | మాతృ |
| పారశీకము | పిదర్ | మాదర్ |
| గ్రీకు | Pater | meter |
| లాటిను | Pater | mater |
| ఇటాలియను | Padre | madre |
| స్పానిషు | Padre | madre |
| ఫ్రెంచి | Pere | mere |
| డేనిషు | fader | moder |
| స్వీడిషు | fader | moder |
| జర్మన్ | vater | mutter |
| పురాతనాంగ్లము | faeder | modor |
| ఆధునికాంగ్లము | father | mother |

పై రూపములందు ధ్వనిభేదములు కొలదిగా కాన్పించుచున్నను సమానత్వముకూడ స్పష్టముగా నున్నదనుట నిర్వివాదము. కొన్ని యెడల ధ్వనిభేదములు మరింత యెక్కువగా నుండి సామ్యము స్పష్టము కాకపోవచ్చును. ఉదాహరణమునకు 'ఆవు' అను నర్థముగల పదమును పరిశీలింతము. సంస్కృతము 'గౌః' గ్రీకు bous లాటిను bos ఫ్రెంచి vache జర్మను kuh పురాతనాంగ్లము cw ఆధునికాంగ్లము cow. ఇట్టియెడల వీనికి సామ్యమున్నదా? లేదా? అన్న సమస్య యుత్పన్నమగును. దీనికి పరిష్కారము ధ్వనిసూత్రముల నాశ్రయించుటయే. అప్పుడు సమస్యకు చక్కని పరిష్కారము లభ్యమగును; సామ్యము సుస్థాపితమగును. అందువల్ల ఏకకుటుంబత్వము నిర్ధారిత మగును.

కొన్ని భాషలయందు ఒకే యర్థమున రెండేసి పదము లుండ వచ్చును. అట్టియెడల సామ్యముగల పదములనే గ్రహించి పోల్చుట యవసరము. ఆంగ్లమున dog, hound అను రెండు పదములు 'కుక్క' యన్న యర్థమున నున్నవి. ఇందు dog అనుదానితో సామ్యము గల పదము సంస్కృతమునందు కానరాదు. కాని hound అనుపదముతో సామ్యముగల పదములు పురాతనాంగ్లమున hund గ్రీకులో kyo:n లాటినులో canis సంస్కృతమున 'శ్వన్' అని యున్నవి. కావున సామ్యములేని పదమును వాడుట సాధకము కాదు.

కొన్ని భాషలందు సామ్యముండును, కాని ఆ భాషలకు పరస్పర సంబంధమును నిరూపించెడి యాధారము కనిపింపదు. ఆంగ్లమునందలి neat, prop, yean అను మాటలకు సమానముగా అదే యర్థమున నీటు, ప్రాపు, ఈను అను మాటలు తెలుగులో కలవు. ఈ సామ్యమును యాదృచ్ఛికముగానే కాని నియతముగా పరిగణించుటకు వీలుకాదు.

ఇంకొక విషయము. పైనిచూచిన ప్రయోగము లన్నింటియందు శబ్దసామ్యమే కాక అర్థసామ్యముకూడ నున్నది. కొన్నియెడల ఒకే పదము భిన్నభాషలలో భిన్నార్థములందు స్థిరపడవచ్చును. దానిని గుర్తించి కారణము నూహించుట పరిశీలకుని కర్తవ్యము. సంస్కృతము నందు 'అసుర' శబ్దము కలదు. దీనికి 'రాక్షసుడు' అని యర్థము. అవెస్తా భాషయందు 'అహుర' శబ్దము కలదు. దీనికి 'దేవత' యని యర్థము. అర్థము విరుద్ధమేయైనను శబ్దసామ్యము జన్మసంబంధమును సూచించు చున్నది. సంస్కృతమునందలి 'దేవ' శబ్దము అవెస్తాయందు 'దఏవ' అని యుండి రాక్షసబోధక మగుచున్నది.

ప్రపంచమునందలి చాల భాషలలో rice అను పదము కాని సమాన పదములు కాని కలవు. ఆ భాషల కన్నింటికిని జన్మసంబంధము

చెప్పుటకు అవకాశము చాలదు. తమిళమునందలి 'అరిసి' వీని కన్నింటికి మూలము. కావున, ఆ రూపములు ఆ యా భాషలకు అన్యదేశ్యములే కాని ఆత్మీయములు కావు చాయ్, టీ - అను పదములలో నేదో యొకటి దాదాపు ప్రపంచభాష లన్నింటియందు నున్నది. ఇందు మొదటి పదము పికింగ్ మాండలికమైన 'మందారిన్' భాషనుండి గ్రహింపబడి నది. రెండవపదము దక్షిణచీనా మాండలికమైన 'అమోయ్' భాష నుండి వ్యాపించినది. ఫ్రెంచి, ఇటాలియను, స్పానిషు మున్నగు భాష లందు 'టీ' అను పదము 'తే' యైనది. తెలుగు 'తేనీరు' కూడ అచ్చటిదే. కావున నిత్యోపయోగివస్తువులకు సైతము అన్యదేశ్యములనే వినియోగించుట జరగవచ్చును. కుటుంబనిర్ణయవిషయమున అట్టివానిని గమనించి, పరిహరించుట యవసరము.

2. ధ్వనిరీతి అని యన్నప్పుడు భాషలకు స్వతస్సిద్ధమైన ధ్వనుల ప్రణాళిక యని యర్థము. మన ముఖయంత్రము వందలకొలది భిన్న ధ్వనుల నుచ్చరింప సమర్థమై యున్నది. కాని, యే భాషయు అన్ని ధ్వనుల నుపయోగింపదు. అట్లే ప్రతి భాషయు నియతము లైన ధ్వని సముచ్చయములను మాత్రమే వాడును. ఈ ధ్వనులును, ధ్వని సముచ్చయములును గూడ ఒక నియమము ననుసరించి యుపయుక్తము లగును. సోదరభాష లనగా ఒకే కుటుంబమునందు పుట్టినవని యర్థము. అందువలన ఆ భాష లన్నింటిలోను మూలభాషయందలి ధ్వని ప్రణాళికయే ప్రవర్తించును. ద్రావిడభాషలలో వర్గయుక్కులు లేవు. సంయుక్తాక్షరములుకూడ చాలనియతములు. సంయుక్తాక్షరము పదారంభమున నసలేయుండదు. తెలుగున క్రావడితోడి సంయుక్తాక్షరములు పదారంభమున నున్నవి. వీనికి తగినకారణము లున్నవి. పరిశీలకులు వీనిని గుర్తించి యిచ్చటి ధ్వని విశేషములను నిరూపించిరి. పదసామగ్రి విషయమున చెప్పికొన్నటు వివిధభాషాపదములలో ధ్వనులు భేదించి

సట్లు కనిపింపవచ్చును. కాని, ఆ భేదము ఆంతరంగికము కాదని సామ్య నిరూపకమైన నియమమును ప్రదర్శించునదే యని నిశ్చయము.

భాషలు సాధారణముగా అన్యభాషాపదములను ఆదేయము ములుగా స్వీకరించునపుడు రెండు మార్గముల ననుసరించును. విద్యావంతులు సాధారణముగా తత్సమములనే వాడవచ్చును. కాని, అధిక సంఖ్యాకులు తమ ధ్వని విధానమున కనుకూలముగా మార్చుకొనినయే అన్యదేశ్యములను వాడుదురు. Hospital > ఆసుపత్రి; Lantern > లాంతిరు; Button > బొత్తాము; Road > రోడ్డు మున్నగునవి యుదాహరణములు. నిజమునకు పై ఆంగ్లపదములందలి ధ్వనులలో చాల భాగము తెలుగుభాషలో కూడ నున్నవే. అయినప్పటికిని మార్పుకలిగినది. ధ్వనులలో సామ్యముండుట కాక ధ్వనిప్రణాళికలో సామ్య ముండుట యుద్దిష్టము.

3. వ్యాకరణవిధానమని యన్నప్పుడు క్రియాపదనిర్మాణము, నామపదనిర్మాణము, వాక్యనిర్మాణము మొదలయిన విషయములను గ్రహించుట యవసరము. పదసామగ్రిని బదులు తెచ్చుకొన్నట్టుగా వ్యాకరణ విధానమును బదులు తెచ్చుకొనుట జరుగదు. పదసామగ్రి యందు చారిత్రక రాజకీయాది కారణములవల్ల తొందర తొందరగా మార్పులు రావచ్చును. కాని వ్యాకరణవిధానమునం దట్టి మార్పులు రావు. తెలుగునందు 'పోవుచున్నాడు' అని యున్న సమాపకక్రియ అరవమందు 'పోగిఱాన్' అని యుండును. ఇదే అర్థమున ఆంగ్లమందు '—is going' అనియు, హిందీయందు 'జా రహా హై' అనియు నుండును. తెలుగులో, అరవములో నున్న రూపములు ఏకపదములుగా నున్నవి. ఆంగ్ల హిందీభాషలలో పదబంధములుగా నున్నవి. ఈ పద్ధతి నియతము; మార్పులేనిది. ఇట్లే నిషేధార్థమునందు తెలుగులో రాకు, పోకు - అనియుండగా తమిళమున వరాదే,

పోగాదే- అని యుండును. ఇవి యేకపదములు. ఆంగ్లమున don't come, don't go అనియు హిందీలో మత్ ఆఓ, మత్ జావో అనియు నుండును. ఆంగ్లహిందీభాషలలో నిషేధార్థకము అదనముగా మరొక పదమును ముందుచేర్చుటచేత ఏర్పడుచున్నదనుట స్పష్టము. వాక్య నిర్మాణక్రమముకూడ ఇట్లే భిన్నకుటుంబములకు భిన్నముగా నుండును. కావున కుటుంబనిర్ణయమునకు వ్యాకరణాంశముల సామ్యమును సైతము గ్రహింపవలసియుండును. ఇన్ని విషయములను సమాలోచించినప్పుడే జాత్యాశ్రితవర్గీకరణము సమర్థముగా జరుగును.

## 5. ౧. జాత్యాశ్రిత వర్గీకరణము

జాత్యాశ్రిత వర్గీకరణమునుబట్టి ప్రపంచభాషల నన్నింటిని కొన్ని కుటుంబములలో ఇమిడింపవచ్చును. అనేకత్వమునందలి యేకత్వమును గుర్తించి, సముచితముగా సంభావించుట మానవసామాన్య ధర్మము. ఈ ధర్మమును పురస్కరించుకొనియే పెక్కురు భాషాశాస్త్రజ్ఞులు అనేక భాషలను పరిశీలించి సామ్యములను గుర్తించి కుటుంబములుగా వింగడించిరి. ఇట్లేర్పడిన కుటుంబములు దూరదూర మానవజాతుల ప్రాచీనసంబంధ బాంధవ్యములను బయటపెట్టినవి. మానవశాస్త్రజ్ఞుల మేధాశక్తికి మించిపోయిన అనేకప్రశ్నలకు అపూర్వసమాధానములను భాషాశాస్త్రము అందజేయగలిగినది. అయినను, అన్నిభాషలను సక్రమముగా పరిశీలించుట జరిగినప్పుడుగాని సమగ్రఫలము చేతికి రాదు. కొందరు పరిశీలకులు ఇండో యూరోపియను భాషల నొకకుటుంబముగాను, మిగిలిన ప్రపంచభాషల నన్నింటి నొక కుటుంబముగాను పరిగణించిరి. కొందరు ఆరేడు కుటుంబములుగా పరిగణించి తృప్తిచెందగా, కొందరు నలువది యేబది కుటుంబములవరకు పరిగణించుట కుత్సహించిరి. ఇట్టి యీ భేదములకు పరిగణనములోని క్లేశమే కారణము. మిక్కిలి

వ్యాప్తిని పొంది, అధికసంఖ్యాకులవాడుకకు సాధనములై స్పష్టమైన విశిష్టతను చూపగలవి పంద్రెండు కుటుంబములు గలవు. అవి యివి: 1. ఇండో యూరోపియను 2. సెమిటో హెమిటిక్ 3. సీనో టిబెటను 4. జపానీ కొరియను 5. ఆఫ్రికను నీగ్రో 6. ద్రావిడ 7. మలయో-పోలినీషియను 8. ఊరల్ ఆల్టాయికు 9. అమెరికనిండియను 10. కకేసియను 11. బాస్కు 12. ఇతరభాషలు. ఇందలి ఒక్కొక్క కుటుంబము యొక్క విశేషములను సంక్షేపముగా సమీక్షింతము.

1. ఇండో యూరోపియను కుటుంబము : ప్రపంచమంతటిలోను అత్యధిక సంఖ్యాకులచేత మాటాడబడు భాషలు ఈ కుటుంబమునకు చెందినవే. యూరోపు, ఈశాన్యభారత నైరృతాసియాల నడిమిప్రదేశము, ఆస్ట్రేలియా, న్యూజీలాండు, తాస్మానియా, దక్షిణాఫ్రికాలయందు ఈ భాషలు వాడుకలో నున్నవి. ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, డచ్చివారు, పోర్చుగీసువారు తాము వ్యాపించినంతమేర ఆయా వలసరాజ్యములలో తమ భాషలను నెలకొల్పుట జరిగెను. సాధారణముగా ఈ భాషలన్నియు ప్రత్యయాత్మకము లగుటచేత సంశ్లిష్ట భాషావర్గమునకు చెందును. కాని, కాలక్రమమున కొన్నిభాషలు సారళ్యము నపేక్షించి కొంతమార్పునకు లోనగుచున్నవి.

ఇండో యూరోపియను కుటుంబము జర్మానిక్, ఇటాలిక్ (రోమాన్సు), కెల్టిక్, బాల్టొస్లావిక్, గ్రీకు, ఆల్బేనియను, ఆర్మీనియను, ఇరానియను, ఇండో ఆర్యను- అనుపేరులతో తొమ్మిదిశాఖలుగా నున్నది. ఇందు ప్రతిశాఖయందును మరల భిన్నభిన్న భాషలు గలవు.

ఇండో యూరోపియను భాషలు ధ్వనులనుబట్టి రెండు వర్గములుగా విభక్తములైనవి. ఇండో ఆర్యనుభాషలకు మూలభాషయని తలపబడుచున్న ప్రాచీన ఇండో ఆర్యనుభాషయందలి చవర్గము గ్రీకు

లాటిను మున్నగుభాషలందు కంఠ్యముగా మారుచుండగా, సంస్కృతము ఇరానియను మున్నగుభాషలందు ఊష్మముగా మారుచున్నది. 'వంద' యను నర్థమున *'చంతోమ్' అన్నది మూలభాషాపదమని శాస్త్రకారుల కల్పనము. దీనికి లాటినుభాషయందు 'కెంటుమ్'అనియు, జర్మనుభాషయందు 'ఖుంద్' అనియు రూపములు గలవు. ఈ రెండు చోట్లను కంఠ్యవర్ణమే యున్నది. సంస్కృతమునందు 'శతమ్' అనియు ఇరానియనునందు 'సతెమ్' అనియు రూపములు గలవు. ఈ రెండుచోట్ల నూష్మమేయున్నది. కావున 'కెంటుమ్' మున్నగురూపములను కలభాషలను కెంటుమ్ వర్గమనియు 'శతమ్' మున్నగురూపములను కల భాషలను శతమ్వర్గమనియు వ్యవహరింతురు.

ఈ విభాగము ననుసరించి కెల్టిక్, జర్మను, లాటిను, గ్రీకు, మున్నగుభాషలు కెంటుమ్వర్గమునకు చెందును. ఆల్బేనియను, ఆర్మీనియను, బాల్టోస్లావిక్, ఇరానియను, ఇండోఆర్యను– మున్నగుభాషలు శతమ్వర్గమునకు చెందును. మొత్తముమీద దాదాపు వందకోట్లమంది ఈ కుటుంబమునకు చెందిన భాషలను మాటలాడుచున్నారు.

2. సెమిటో హెమిటిక్ కుటుంబము : అరేబియా, ఇరాక్, పాలస్తీను, సిరియా, ఉత్తరాఫ్రికా, అబిసీనియా, ఎతియోపియా, ఎరిట్రియా, సోమాలీలాండు, జాంజిబారు, మడగాస్కరు, మాల్టా– మున్నగుచోట్ల ఈ కుటుంబమునకు చెందినభాషలు వ్యాపించియున్నవి.

ఈ భాషలుకూడ ప్రత్యయాత్మకములే. ఇందలి ధాతువులు సాధారణముగా మూడు హల్లులను కలిగియుండును. వీనిలో వలయు నెడల అచ్చులు ప్రవేశించి రూపము నర్థమును సమకూర్చును. 'వ్రాయు' అనునర్థమున 'క్ త్ బ్' అను మూడు హల్లులు కలవు. 'కతబ' అని యున్నప్పుడు 'అతడు వ్రాసెను' అని యర్థము. 'కుతిబ' అని యనగా

'అది వ్రాయబడెను' అని యర్థము. 'యుక్తుబు' అని యనగా 'అతడు వ్రాయును' అని 'యుక్తబు' అని యనగా 'అది వ్రాయబడును' అని 'కితాబున్' అని యనగా 'పుస్తకము' అని 'కాతిబున్' అని యనగా 'లేఖకుడు' అని అర్థములు. ఇట్లు స్వరములు మధ్యలో ప్రవేశించి వేర్వేరుపదముల నేర్పాటుచేయుట యీ భాషలయందు కలదు. ఇట్లు ప్రవేశించు నీస్వరములే అంతఃప్రత్యయములుగా వ్యవహరించి వ్యాకరణ కార్యమును నిర్వహించుచున్నవి. ఇవి సంశ్లిష్టభాషావర్గమునకు చెందినవి.

ఇందు సెమిటిక్ శాఖ, హెమిటిక్ శాఖ- అని రెండుశాఖలుకలవు. ఈరెండు శాఖలమూలముననే కుటుంబమునకు సెమిటోహెమెటిక్ కుటుంబము అనుపేరు వచ్చినది. సెమిటిక్ శాఖయందు హీబ్రూ,అరబ్బీ, ఎతియోపియో భాషలు ప్రధానములు. హెమిటిక్ శాఖయందు లిబికో బెర్బల్, కుషితిక్, కోప్టిక్ భాషలు ప్రధానములు.

ఈ భాకులను మొత్తమీద ఏడుకోట్ల యేబదిలక్షలమంది మాటలాడుచున్నారు.

3. సీనో టిబెటను కుటుంబము : టిబెట్టు, బర్మా, సయాము, ఇండోచైనా ఉత్తరభాగము, మంచుకూవో, సింకియాంగు మున్నగు చోటులందు మాటలాడు భాషలు సీనోటిబెటను కుటుంబమునకు చెందినవి.

ఇందు చైనావిభాగము, టిబెటను బర్మావిభాగము, సయామీ విభాగము- అని మూడు ముఖ్యశాఖలు కలవు. అందు నలువదియైదు కోట్లమందికి వ్యవహారభాషయై ప్రాధాన్యము గడించినది చైనావిభాగము. ఇందు మాండలికవిభేదములనేకముగా కలవు. అందు 'మందారిన్' అన్నది అధికారభాషగా వ్యవహరించుచున్నది.

రెండవ శాఖయందు టిబెట్టుదేశమునందలి భాషలును, బర్మాదేశమునందలి భాషలును చేరును. మూడవ శాఖయందు సయామునకు చెందిన సయామీయే ప్రముఖభాష. ఈశాఖకుచెందిన శాన్, అహోమ్, ఖామతీ భాషలు బర్మాయందును, అస్సామునందును కూడ వ్యాపించి యున్నవి.

ఇవి యేకాచ్కవిభాగమునకు చెందినవి. అనగా ప్రతిపదాత్మక వర్గమునకు చెందిన విశ్లిష్టభాషలని యర్థము. ఈభాషలు చిత్ర (బొమ్మల) లిపిలో వ్రాయబడును. ఒక్కొక్క బొమ్మయు ఒకధ్వనికి కాక ఒకపదమునకే గుర్తుగా వ్యవహరించును. ఈ పదములు పరిమితములేయైనను తానభేదమువల్ల వేర్వేరర్థముల నిచ్చును. అట్లే స్థానభేదముచేతనే అన్వయభేదమును సాధించుకొనును. ఇందు ప్రత్యయములవంటి వేమాత్రమును లేవు. ఇతరభాషలలో కనిపించు వ్యాకరణాంశములు ఈ భాషలలో కానరావు.

ఈ భాషలను దాదాపుగా ఏబదికోట్లమంది మాటలాడుచున్నారు. జనసంఖ్యనుబట్టి చూచినయెడల ఇండోయూరోపియను భాషాకుటుంబము తర్వాత నిలువదగినది సీనో టిబెటను కుటుంబమే.

4. జపానీ కొరియను కుటుంబము : జపాను, కొరియాదేశములు ఈ భాషాకుటుంబ వ్యవహారమునకు ప్రధానరంగములు. ఫార్మోజా, మంచుకూవో, కెరోలిన్ మార్షల్ దీవులు, చైనాలో చాల భాగము, డచ్ ఈస్టిండీసు, ఫ్రెంచ్ ఇండోచైనా, సయాము, మలయా, బర్మా, ఫిలిప్పీనులయందు కూడ ఈ భాషలకు కొంత వ్యవహారము కలదు.

ఇవి సంయోగాత్మక భాషలు. ఈ భాషలయందు లింగభేదము కాని వచనభేదము కాని కానరాదు. ఒకే అర్థమునందు వినయుగౌర

వాదులను వెల్లడించుటకు వేరువేరు మాటల నుపయోగించుట యీ భాషలయందు కలదు.

జపాను విభాగము, కొరియను విభాగము - అని రెండు శాఖలు కలవు. కొందరు వీనిని ఊరల్ ఆల్టాయిక్ కుటుంబమునందే అంతర్భావింపజేయుట కిష్టపడుదురు. ఆ యిష్టము చాలవరకు ఊహాజన్యసామ్యమునే ఆశ్రయించుకొని యున్నదని కొందరు పరిశీలకులు భావించుచున్నారు.

మొత్తముమీద జపానీ కొరియను కుటుంబమునకు చెందిన భాషలను పదికోట్లమంది మాటలాడుచున్నారు.

5. ఆఫ్రికను నీగ్రో కుటుంబము : ఆఫ్రికాయందును, సహారాకు దక్షిణభాగమునను, ఎతియోపియాకు పశ్చిమ భాగమందును ఈ కుటుంబమునకు చెందిన భాషలు వ్యవహృతము లగుచున్నవి.

సూడానీ గినియను విభాగము, బంటూ విభాగము, హాటెన్‌టాట్ బుష్మను విభాగము - అని యీ కుటుంబమును మూడు ముఖ్యశాఖలుగా విభాగింపవచ్చును. వీని నన్నింటిని ఒకే భాషావర్గమునకు చేర్చుటకు వీలు కాదని కొందరు పరిశీలకుల యభిప్రాయము. పైగా ఈ భాషలన్నియు దాదాపుగా ఆదిమావస్థలోనే మిగిలియున్నవి. ఇంగ్లీషు, ఫ్రెంచి, పోర్చుగీసు మొదలయిన భాషలు ఆ ప్రాచీనభాషలను వాడుకనుండి తొలగించి వాని స్థానము నాక్రమించుట కూడ క్రమక్రమముగా జరుగుచున్నది.

సూడానీ గినియను విభాగమునందు అత్యధికప్రాభవము గలది నైజీరియాకు చెందిన హావుసాభాష. ఈ విభాగమునందు విభక్తుల యుపయోగము దాదాపుగా లేదనియే చెప్పవచ్చును. అట్లే లింగభేదముకూడ కానరాదు. ఇవి ఏకాచ్కధాతువులను కలిగి ప్రతిపదాత్మక భాషావర్గమునకు చెందిన విశ్లిష్ట భాషలు.

బంటూ విభాగమునకు చెందిన భాషలు దక్షిణాఫ్రికాయందు అధికభాగము నాక్రమించుకొని యున్నవి. వీనియందను లింగభేదము లేదు. ఇవి ప్రత్యయాత్మకభాషావర్గమునకు చెందును. ఇందు మాటలను ముందు ప్రత్యయములుచేరి అర్థవిశేషమును కల్పించును. 'తు' అని యనగా 'మనుష్యుడు' అని యర్థము. 'జురి' అని యనగా 'అందము' అని యర్థము. 'అందమైన మనుష్యుడు' అనునర్థమున 'మ్తుమ్జురి' అని వాడబడును. 'మ్' అను ఏకవచనప్రత్యయము విశేషణ విశేష్యములు రెండింటికిని ముందు చేరును. ఇట్లే బహువచనమున 'వతు వజురి' అని యనగా 'అందమైన మనుష్యులు' అని యర్థము. ఇక్కడ 'వ' యన్నది బహువచన ప్రత్యయము. ఈ ప్రత్యయములును ఆయా నామములను బట్టి పెక్కువిధములుగా భేదించును. ఇందు మిక్కిలి ప్రాభవము కలది జాంజిబారునకు చెందిన స్వాహిలీబాష. కాఫిర్, జులూ భాషలు కూడ ఈ విభాగములోనివే.

హాటెంటాట్ బుష్మను విభాగమునకుచెందిన భాషలుకూడ ప్రత్యయాత్మక భాషావర్గమునకు చెందినవి. కాని బంటూ విభాగము పూర్వ ప్రత్యయములను వాడుచుండగా, ఇవి పరప్రత్యయములను వాడుచున్నవి. ఈ భాషలలో జడములు చేతనములు – అన్న విభాగము కలదు. ఇక్కడ కూడ బహువచనప్రత్యయములు బహువిధములుగా నున్నవి. ఈ విభాగమునందు పలుభాషలు కలవు. వానికున్న పరస్పర సంబంధము స్పష్టముగా నిశ్చితము కాలేదు. ఇందలి కొన్ని భాషలు సూడానీగిని యను విభాగమువైపు మొగ్గు చూపగా, కొన్ని బంటూ విభాగమువైపు మొగ్గు చూపుచున్నవి. ఈ భాషలను మాటాడు ప్రజలు తమ్ముతాము 'ఖోయిమ్' (= మనుష్యుడు) అని పిలుచుకొందురు. దీనినిబట్టి బుష్మను జాతి ప్రజలే ఆఫ్రికాయందలి ఆదిమవాసులని కొందరి అభిప్రాయము.

మొత్తముమీద ఆఫ్రికను నీగ్రోకుటుంబమునకు చెందిన భాషలను పదికోట్లమంది వ్యవహరించుచున్నారు.

6. ద్రావిడ కుటుంబము : ఈ కుటుంబమునకు చెందినభాషలు భారతదేశమున దక్షిణభాగమందును, సింహళదేశమున ఉత్తరభాగమందును వ్యవహారమునం దున్నవి. ఉత్తర భారతదేశమునందు అచ్చటచ్చట చెదరువాటుగా వ్యవహృతము లగుచున్నవి.

ఇది దాక్షిణాత్యవిభాగము, ఆంధ్రవిభాగము, మధ్యమవిభాగము, బహిరంగవిభాగము - అని నాలుగు శాఖలుగా విభాగింపబడినది. నాగరకభాష లాటింటిలోను తమిళము, మలయాళము, కన్నడము, తుళు, కొడగు అను నైదుభాషలు దాక్షిణాత్య విభాగమునందే అంతర్భవించును. మిగిలిన నాగరికభాష తెలుగు. ఇది ఆంధ్రవిభాగమునకు మూలపీఠము. మధ్యమ విభాగమునందు మిక్కిలి ప్రసిద్ధమైనది గోండీ. బహిరంగ విభాగమునందు బ్రాహుయీ చెప్పుకొనదగినది. ఇది తక్కిన ద్రావిడభాషలకు దూరముగా బెలూచీస్తానమునం దుండియు తన వ్యక్తిత్వమును నిల్పుకొని యున్నది.

ద్రావిడ కుటుంబభాషలు సంయోగాత్మక భాషావర్గమునకు చెందును. నామములపైని వచనప్రత్యయములుచేరి, విభక్తి ప్రత్యయములు చేరును. అట్లే ధాతువులపైని కాలప్రత్యయములు చేరి, పురుష ప్రత్యయములు చేరును. విభక్త్యంతములైన పదములు సమాసతుల్యములు; సమాపక క్రియలుకూడ సమాసతుల్యములే. మాట ప్రక్కను మాట చేర్చుటతోడనే సమాసము లేర్పడును. జడములు, పశుపక్ష్యాదులు, స్త్రీలు ఒక తరగతికి చెందగా పురుషులు ఒక తరగతికి చెందినట్లుగా పరిగణించుట యీ భాషలలో లింగవిభాగమునకు బదులుగా కనబడు ప్రధానలక్షణము. స్వరసామరస్యమును పాటించుట యింకొక విశిష్టత.

మొత్తముమీద ఈ భాషలను పదికోట్లమందికి పైగా వ్యవహరించుచున్నారు.

7. మలయో పోలినీషియను కుటుంబము : మలయాద్వీపకల్పమునందును, జావా సుమిత్రా బోర్నియో బాలీ మున్నగు దీవులందును, ఫిలిప్పీన్సు మడగాస్కరు న్యూజిలాండు సమోవా మున్నగు ప్రదేశములందును ఈ కుటుంబము వ్యవహారమునందు కలదు.

ఇందు ధాతువు ద్వ్యచ్కమై (రెండచ్చులను గలిగి) యుండును. నామములకు పైని ప్రత్యయములవంటివి చేరుట కానరాదు. వచనభేదము కాని లింగభేదము కాని యీ కుటుంబమునందు గుర్తింపబడ లేదు.

ఈ కుటుంబమునందు ఇండోనీషియను విభాగము, మలనీషియను విభాగము, మైక్రోనీషియను విభాగము, పోలినీషియను విభాగము – అని ప్రధానములయిన శాఖలు నాలుగు కలవు. ఇవి మొత్తముమీద తొమ్మిదికోట్లమంది వ్యవహారమున వ్యాప్తినొందుచున్నవి.

8. ఊరల్ ఆల్టాయిక్ కుటుంబము : ఫిన్‌లాండు, కరేలియా, ఎస్తోనియా, ఉత్తరనార్వే, స్వీడను, హంగేరీ, ప్రాచ్య (యూరేపియను), రష్యా, తుర్కీ, సోవియట్ ఆసియా, మంగోలియా, చైనీసు తుర్కీస్తాను, మంచుకూవో – మున్నగుచోట్ల ఈ కుటుంబమునకు చెందిన భాషలు వ్యవహారమునందున్నవి.

ఇవి ప్రత్యయాత్మక భాషావర్గమునకు చెందిన సంశ్లిష్ట భాషలు. ఇండోయూరోపియను భాషలలోవలెనే ధాతువుపై పరప్రత్యయమును చేర్చిపలుకుట యిందు ప్రచురముగా కలదు. కాని యీ లక్షణమునకిచ్చట మరింత వ్యాప్తి కలదు. తుర్కీ భాషయందు 'సెవ్' అను ధాతువునకు 'ప్రేమ' యని యర్థము. 'ప్రేమించుట' అన్న యర్థమున 'సెవ్మెక్' అని యగును. 'ప్రేమింపజేయుట' అన్న యర్థమున 'సెవ్ దిర్

మెక్' అని యగును. 'సెవ్ మెమెక్' అని యనగా 'ప్రేమింపకుండుట' అని యర్థము. 'సెవ్ ఇల్ ఎమెమెక్' అని యనగా 'ప్రేమింపబడుట కసాధ్యమగుట' యని యర్థము. ఇట్లు ధాతువుపై వేరువేరు ప్రత్యయముల నొకదానివెంట నొకటిగా చేర్చుకొనుచు పోవుటవల్ల విశిష్టార్థములను సాధింపవచ్చును.

ఈ కుటుంబమునందలి విశిష్టలక్షణములలో 'స్వరసామరస్యము' ముఖ్యము. హంగేరీభాషలో 'కేజ్' అని యనగా 'చేయి' యని యర్థము. 'లోపల' అనునర్థమున 'బెన్' అన్నది వచ్చి 'కేజ్ బెన్' అని యగును. ఇదే ప్రత్యయము 'ఇల్లు' అను నర్థముగల 'హాజ్' శబ్దముపై వచ్చినప్పుడు అత్వము నొంది 'హాజ్‌బన్' అని యగును. ఈ భాషలయందును లింగవిభాగము గోచరముకాదు.

ఊరల్ ఆల్టాయిక్ కుటుంబమునందు ఊరలిక్ విభాగము, ఆల్టాయిక్ విభాగము - అని రెండు శాఖలు కలవు. ఊరలిక్ విభాగమునకే ఫీనో్నఉగ్రిక్ విభాగము అను నామాంతరము కలదు. కొందరు ఈ విభాగమునే ఒక కుటుంబముగా పరిగణించుటకు ఇష్టపడుదురు. ఈ విభాగమునందు ఫిన్నిషు, లాప్పు, మగ్యారు (హంగేరియను) ఓస్ట్యాకు, సమోయిదుభాషలు ప్రధానములు. ఆల్టాయిక్ శాఖయందు తుర్కీ, మంగోలియను, తుంగుస్ భాషలు ప్రధానములు.

ఈ కుటుంబమునకు చెందిన భాషలను మొత్తముమీద ఆరు కోట్లమంది మాటలాడుచున్నారు.

9. అమెరిక నిండియన్ కుటుంబము: అమెరికాదేశ మంతటిలోను ఆదిమవాసుల వ్యవహారమునందు వాడుక నొందుచున్నవి. కొలంబస్సు అమెరికాను దర్శించునప్పటికి ఆదిమవాసులు నాలుగైదు కోట్లవరకుండెడివారని, యిప్పటికి కోటి, కోటిన్నరమంది మాత్రమే మిగిలి యున్నారని చెప్పుదురు. వీరు మాటలాడు భాషలు లెక్కకు

మిక్కిలిగానున్నవి. ఆ యా భాషలందు వైవిధ్యము మిక్కుటముగా కలదు. తగిన పరిశీలనకృషి యింతవరకు జరుగలేదు. వందకుటుంబముల వర్గమైన ఆదిమవాసుల భాషలలో నుండవచ్చునని శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

కెనడా, సంయుక్తరాష్ట్రములలో ఆల్గోన్కిను, అతపస్కను భాషావిభాగములు ప్రాచుర్యము నొంది యున్నవి. మెక్సికో, మధ్య అమెరికాలలో అజ్టెక్, మాయా కుటుంబములు ప్రధానములు. అజ్టెకు మెక్సికో యందంతటను ఒకప్పుడు వ్యాపించియుండెను. ఆ భాషయందలి అనేక శాసనములు చిత్రలిపిలో లభించినవి. మాయాభాష సాహిత్య సంస్కృతి సంపన్నమైన ప్రాచీనభాష. తజ్జన్యములయిన భాషలు పెక్కులు ఇప్పుడు వాడుకలోనున్నవి. దక్షిణ అమెరికా యందలి భాషలలో అరవక్ కుటుంబము అగ్రగణ్యము. ఇన్కాజాతి ప్రజలు మాటలాడు భాష 'కుయిచువా'. స్పానిషు విజేతలు వివిధజాతులమధ్య వ్యవహారమునకు క్రైస్తవ మతప్రచారమునకు 'కుయిచువా' భాషనే యుపయోగించెడివారు. 'పెరు' లో స్పానిషుభాషతో సమానముగా దీనికిని వాడుక కలదు.

కుటుంబముల విషయమున ఏకవాక్యత లేకపోయినను రూపాశ్రిత వర్గీకరణమునుబట్టి యీ భాషలకు 'బహుసంశ్లిష్టత' లక్షణముగా భావింపబడుచున్నది. ఇందు వాక్యము మొత్తము పదరూపమున నిమిడిపోవును. 'గ్నగ్లాస్లిక్స్' అన్న పదవాక్యమునకు 'నేనొక గ్రామమునొరకై చూచుచున్నా'నని యర్థము. ఇచ్చట 'గ్' అన్నది 'నేను' అన్న యర్థమును 'నగ్లా' అన్నది 'జీవించుట' యన్న యర్థమును బోధించును. 'నగ్లా' అన్నది 'స్లి' అన్న ప్రత్యయముతో కలిసి 'నగ్లాస్' అనినై 'గ్రామము' అన్న యర్థము నిచ్చుచున్నది. 'ఇ' పూర్వప్రత్యయముగా వ్యవహరించి, తరువాతి పదమునకు క్రియాత్వమును కల్పించుచున్నది, 'జక్' అనగా 'చూచుట' యని యర్థము. చివరనున్న 'స్' వర్తమానా

ర్థకత్వమును సూచించుచున్నది. ఇందులో ఏ యొక్క భాగమును విడిగా నుపయోగించుటకు వీలులేదు; అప్పుడు వానికి పైని చెప్పిన యర్థములు కుదరవు.

ఈ భాషలను కోటిమందికి పైగా మాటలాడుచున్నారు.

10. కకేసియను కుటుంబము : సోవియట్ యూనియను నందలి నల్లసముద్రమునుండి కేస్పియను సముద్రమువరకు వ్యాపించి యున్న కాకసను పర్వతప్రాంతమునందు ఈ కుటుంబమునకు చెందిన భాషలు వ్యవహృతము లగుచున్నవి.

ఈ భాషలయందు పూర్వప్రత్యయములను, పరప్రత్యయము లనుకూడ వాడు పద్ధతి కలదు. వీనిరచన మిక్కిలి క్లిష్టముగా నుండుట చేత శాస్త్రజ్ఞులు మొట్టమొదట వీనిని ప్రత్యయాత్మక భాషలుగా పరిగణించిరి. కాని, పరిశీలనమీదట సంయోగాత్మక భాషావర్గమునకు చెందినట్లుగా నిర్ధారించిరి. వీనియందు మాండలికములును, ఉపభాషలును పెక్కువిధములుగా నుండుటచేత ఇవన్నియు నొకే కుటుంబమునకు చెందినవన్న విషయముననే కొందరకు సందేహము కలుగును. రష్యాభాష ఆయా భాషల స్థానము నాక్రమించుకొనుచుండుటచేత వ్యవహారమున వాని ప్రాధాన్యము పలుచబడిపోవుచున్నది.

కిర్కాసియను, కిస్టియను, లెస్ఘియను మున్నగు భాషలతో కూడిన ఉత్తరకకేసియను విభాగము- జార్జియను, సువానియను, మింగ్రేలియను మున్నగుభాషతో కూడిన దక్షిణకకేసియను విభాగము- కకేసియను కుటుంబమునందు రెండు ప్రధానశాఖలుగా పరిగణింపబడు చున్నవి.

మొత్తమీద దాదాపుగా ఇరువది లక్షలమంది యీ భాషలను వ్యవహరించుచున్నారు.

11. బాస్కు కుటుంబము : ఈ కుటుంబమునకు చెందిన భాషలు స్పెయిను దేశముయొక్క ఈశాన్యభాగమునందును, ఫ్రాన్సు నైరృతిభాగమునందును వాడుకయందుున్నవి.

ఈ భాషలు సమ్మిశ్రణాత్మక భాషావర్గమునకు చెందినవి. బహు సంశ్లిష్టతాలక్షణము వీనియందు ప్రచురము. ఈ భాషయందు 'దకాడ్సు అన్న పదవాక్యమునకు 'నీవు నన్నుతీసికొని పోవుచున్నావు' అనియర్థము. 'దకర్జు' అని యనగా 'నేను వాటిని మోయుదును' అని యర్థము. 'అకర్రి' యనగా 'మోయుట' యని యర్థము. దీని నాధారముగా చేసికొని పదవాక్యము లేర్పడినవి. అందలి చివరి 'ఇత్వము'నకు అన్నింటను లోపము కలిగినది. ఈ కుటుంబమునకు చెందిన భాషలలో జ, ట్జ- అను ధ్వనులు అధికముగా వినుపించును.

బాస్కు ప్రజలు తమ్ముతాము యూస్కర్ (Euskar) అను పేర పిలుచుకొందురు. స్పెయినుదేశమునకు చెందిన గైపుజోక్వా విభాగమును, ఫ్రెంచిదేశమునకు చెందిన లబోర్డిను విభాగమును ఈ కుటుంబమునందు రెండు ప్రధానశాఖలై యున్నవి. మొత్తముమీద యీ భాషలను దాదాపు పదిలక్షలమంది వ్యవహరించుచున్నారు.

12. ఇతర భాషలు : పైని చెప్పుకొన్న యేకుటుంబమునందును చేరక విడివిడిగా నుండు భాషలు కొన్ని కలవు. కేవల మొక్క మనుష్యుని మాత్రమే తీసికొని ఒక కుటుంబముగా పరిగణించుట యుచితముగా నుండదు. అట్లే ఒకే భాషను చూచి దానికొక కుటుంబమును నిర్ధారించుట సరికాదు. అట్లు కుటుంబనిర్ధారణమునకు వీలుకాక భిన్నభిన్నములుగా నున్న భాషలనే యితరభాష లనుపేరున పరిగణించుట జరుగుచున్నది.

ఇటలీయందలి అత్యంత ప్రాచీనభాషయైన 'ఎట్రూస్కను'అనునది అటువంటివానిలో నొకటి. అది యిప్పుడు వాడుకయందు లేదు.

కాని ఆ భాషలో ఉన్న కొన్ని శాసనములును, ఒకగ్రంథమును మిగి లినేయున్నవి.

సుమేరియను భాష క్రీ. పూ. ఏడవశతాబ్దినాటికే మృతప్రాయ మైనది. అయినను విజేతలయిన అస్సీరియనులు ఆభాష నభ్యసించి, ఆ భాషాగ్రంథములకు తమభాషలో టీకలు టిప్పణులు రచించి రక్షించు కొనుచు వచ్చిరి. ఇప్పటికిని అస్సీరియనుల అనువాదములతోపాటు సుమేరియను భాషాగ్రంథములు సురక్షితములై యున్నవి.

క్రీటు ద్వీపమునకు చెందిన మినోవను భాషయు, సింధు ప్రాచీన శిథిలములలోని మొహంజొదారో భాషయు, ప్రాచీనమైన ఇరాను లోని సూసను ప్రాంతమునకు చెందిన ఎలమైట్ భాషయు, ఆసియా మైనరు ఆదిమవాసుల ఖత్తియాభాషయు జగ్రోసు పర్వతప్రాంతము నందలి కసైట్ భాషయు, ఇంకను నిటువంటి ప్రాచీనభాషలు కొన్ని యేకుటుంబమునకు చేరక యేకైకములుగా నుండిపోయినవి.

జపానునకు ఉత్తరభాగమునందున్న హొకేదొ (Hoktaido) ద్వీపమునందును పరిసరములందును 'ఎయినూ' భాష యిరువదివేల మందికి వాడుకభాషయై యున్నది. సైబీరియాకు ఈశాన్యభాగమున హైపరుబోరియను భాషలు ఏబదివేలమందికి వాడుకయందున్నవి. అండ మాను దీవులందలి భాష కుటుంబవిషయమున అనిశ్చితముగానే యుండి పోయినది. బర్మాయందలి ఇరావతీనదికి తదుపనదులకు నడుమనున్న 'కరేన్ భాష' పదిలక్షలమందికి వ్యవహారమునం దున్నది. ఆగ్నేయా సియాయందు వ్యవహారమునందున్న మోన్ ఖ్మేర్, అన్నామీ, ముండా భాషలును భిన్నభిన్న లక్షణములను కలిగి యేయొక్క కుటుంబము నందును పూర్తిగా ఇముడకున్నవి.

## 5. ఎ. రూపాశ్రిత వర్గీకరణము

రూపాశ్రిత వర్గీకరణమునందు ఆకృతినిబట్టి నిర్మాణమునుబట్టి సామ్యమును నిర్ణయించి భాషల సంబంధమును నిరూపింతురు. ఆంగ్లమున దీనిని Syntactical Classification అనియు Morphological classification అనియు వ్యవహరింతురు. ప్రతి పదమునకు ప్రాతిపదికార్థముండును. ఆ పదములు వాక్యములో చేరినప్పుడు అన్వయముఖముగా ఒక యర్థమేర్పడును. అట్టి యర్థమునకు సహకరించుకొన్ని వ్యాకరణాంశము లుండును. 'నీవు బడికి పోయితివి' అన్న వాక్యమునందు నీవు, బడి, పోవు- అన్నవి మూలరూపములు. వానివలన నైఘంటుకార్థము తెలియును. వాక్యమునందు అన్వయముఖముగా నున్న యర్థము నిప్పుడు చూతము. 'పోవు' ధాతువుపైని భూతకాలిక ప్రత్యయము, మధ్యమపురుషైకవచన ప్రత్యయముచేరగా 'పోయితివి' అన్న రూపము ఏర్పడినది. ఈ పోవుట అన్న క్రియను చేసినవాడు కర్త. ఇచ్చట నీవు కర్త. ఎక్కడకు పోయితివి ? 'బడికి.' పోవుటకు లక్ష్యమైనది 'బడి'. కావున 'కి' అని చేరినది. ఇట్లుచేరిన కి, తి, వి- మున్నగునవి ప్రత్యయములు. వీనివలననే అన్వయార్థము బోధపడుచున్నది. ఇట్టివి వేరువేరు విధములుగా నుండును. ఇవి పదరూపమునందును, వాక్యరూపమునందునుగూడ ప్రయుక్తములు కావచ్చును. ఇట్టి అన్వయార్థ బోధకరూపముల యుపయోగమునుబట్టి ప్రపంచభాషలన్నియు 1. ప్రతిపదాత్మక భాషలు 2. సంయోగాత్మక భాషలు 3. ప్రత్యయాత్మక భాషలు 4. సమ్మిశ్రణాత్మక భాషలు- అని నాలుగువర్గములుగా విభాగింపబడును. ఒక వర్గమునకు చెందిన భాషయందు మరొకవర్గమునకు చెందిన లక్షణములు క్వాచిత్కముగా కనిపింపవచ్చును. లక్షణప్రాచుర్యమునుబట్టి, తదావశ్యకమునుబట్టి వాని నాయా వర్గములలో పరిగణించుట జరుగుచుండును. కావున, ఏదోయొక లక్షణమునుబట్టి, నే

భాషనుగాని యే ప్రత్యేకవర్గమునందును చేర్చుట సమంజస మనిపించు కొనదు. ఆ విషయమును గుర్తుంచుకొనుట యవసరము.

1. ప్రతిపదాత్మక భాషలు : చైనా, టిబెట్టు, బర్మా, సయామీ, మలయా మున్నగుభాషలును ఆఫ్రికాయందలి సూడానీభాషయు ప్రతి పదాత్మక భాషావర్గమునకు చెందినవి. ఈ భాషలయందు ప్రతిశబ్దము నింకొక శబ్దముపై నాధారపడక స్వతంత్రముగా ప్రయుక్తమగును. ప్రకృతియని ప్రత్యయమని విడదీయుటకు వీలులేనివిధముగా దేనికదియే పూర్ణపదమై యుండును. అది అవ్యయమువలె వ్యవహరించును; అన ముందుగాని వెనుకగాని రాబోవు పదములను బట్టి యేమియు మార్పు చెందదు. ఇంతకు నీపదము ప్రమాణము ఏకాచ్కము. ఒక పదమునందు హల్లు లెన్నయిన నుండవచ్చునుగాని అచ్చుమాత్ర మొక్కటియే యుండును. ఈ విధముగా ఏకాచ్కములైన పదములను కలిగియుండుట చేత 'ఏకాచ్కభాషలు' అని వ్యవహరించుట సైతము కలదు. ఆంగ్ల మున Mono- syllabic Languages అని యందురు.

ఇచ్చట విభక్తులు కాని, యితరప్రత్యయములు కాని యుండక పోవుటవల్ల పదముల క్రమమునుబట్టియే వాక్యమున కర్థమేర్పడుచుం డును. ఒకేపదము స్థానమునుబట్టియు, తానము (Tone) ను బట్టియు వేర్వేరర్థములను దెల్పును.

చైనాభాష యీ వర్గమునందు అధికప్రాచుర్యము నందినది. ఉదాహరణము లందుండియే గ్రహింతము. 'తా లేన్' అని యన్న ప్పుడు 'పెద్దమనుష్యుడు' అని యర్థము. 'మనుష్యుడు పెద్దవాడు' అన్న యర్థమున అవేపదములను వెనుకముందులు చేసి 'లేన్ తా' అని యందురు. తెలుగునందు 'పెద్ద' శబ్దముపై 'వాడు' అని అదనముగా చేరినసంగతి గమనార్హము. ఆంగ్లమున 'A big man' అని యున్న దానిని క్రమము మార్చినచో 'Man is big' అని యగును. మొదటి

ప్రయోగములో లేని యితరాంశములు రెండవ ప్రయోగములో ప్రవేశించుచున్నవి. చైనాభాషయందు అట్లు ప్రవేశించుట యున్నది లేదు.

'నేను నిన్ను కొట్టుచున్నాను' అన్నయర్థమున 'న్గో తని' అన్నది వాక్యము. ఇందు 'త' కొట్టుట యనుక్రియను బోధించును. 'న్గో' అని యనగా 'నేను' అని యర్థము. 'ని' అని యనగా 'నీవు' అని యర్థము. క్రియకు పూర్వమునను న్నది కర్త్రర్థకము; క్రియకు తరువాత నున్నది కర్మార్థకము. అందువల్లనే 'ని' 'నిన్ను' అను నర్థమును బోధించుచున్నది. ఈ పదములను వెనుకముందులు చేయగా 'ని త న్గో' అని యగును. అప్పుడు 'నీవు నన్ను కొట్టుచున్నావు' అన్న యర్థమేర్పడును. స్థానమునుబట్టియే అన్వయార్థకము కలుగుచున్నదనుట సులభగ్రాహ్యమే.

ఆంగ్లమునందలి 'John married Mary' అన్నవాక్య మున్నదనుకొందము. ఇందలి పదములను వెనుకముందులు చేయగా 'Mary married John' అని యగును. కర్త కర్మయై కర్మ కర్తయగును. దీనికిని చైనాభాషావాక్యమునకును భేదము లేదనిపించును. చైనాభాషయందు ఈ విధమగు నిర్మాణము సార్వత్రికము; ఇతర భాషలయందు క్వాచిత్కము.

'రాముడు నన్ను చూచెను' అన్న తెలుగువాక్యమును చూతము. నన్ను రాముడు చూచెను- రాముడు చూచెను నన్ను- నన్ను చూచెను రాముడు- చూచెను నన్ను రాముడు- చూచెను రాముడు నన్ను మొదలయిన విధముగా పదములు స్థానభేదమును పొందినను అర్థభేదమును పొందుట లేదు. ఇచ్చట అన్వయార్థమును నిర్ణయించునది ప్రత్యయమే కాని స్థానము కాదు. చైనాభాషయందు ప్రత్యయము లేనేలేదు; స్థానమునుబట్టియే అన్వయార్థము నిశ్చితమగుచున్నది స్పష్టము.

చైనాభాషయందలి యింకొక వాక్యమును చూతము. 'వాంగ్ పావ్ మిన్' అనుదానికి "రాజు ప్రజలను రక్షించును" అని యర్థము. 'పావ్' క్రియాపదము; రక్షించుటయని యర్థము. 'వాంగ్' కర్తృపదము రాజు అని యర్థము. 'మిన్' కర్మపదము; ప్రజలు అని యర్థము. పై వాక్యమునందు ఒక నిపాతము చేరినయెడల ఆ పదముల అన్వయార్థమునందు మిక్కిలిభేదము కలుగును. చూతము. 'వాంగ్ ఛిహ్ పావ్ మిన్' అన్నవాక్యమునకు 'రాజుచేత రక్షింపబడు ప్రజలు' అని యర్థము. వెనుకటివాక్యమునకు 'ఛిహ్' అను నిపాతమును చేర్చుట చేతనే ఇట్లు మారుట జరిగినది. 'వాంగ్' మున్నగువానిని పూర్ణపదములు (Full Words) అని యందురు. 'ఛిహ్' అనుదానిని శుష్కపదము (Empty Word) అని యందురు. దీనికి పోవుట, వాడు, సంబంధించుట- అను వేర్వేరర్థములు గలవు. అయినను ఇచ్చట ఈపదము స్వతంత్రార్థమును బోధింపక 'యొక్క' అను అన్వయార్థమును మాత్రమే బోధించుచున్నది. కావుననే దీనిని శుష్కపదము అనియనుట దీనిని ప్రయోగించుటచేత క్రియాపదమునందును, కర్మపదమునందును గలిగినమార్పును సులభముగా గ్రహింపవచ్చును. ఇదేవాక్యమును 'తండ్రి సంతానమును వలె రాజు ప్రజలను రక్షించును' అనునర్థమున 'లాంగ్ ఛిహ్ పావ్ మిన్ యూ ఫూ ఛిహ్ పావ్ త్సు' అని యుండును. యూ= సమానము, ఫూ=తండ్రి; త్సు=సంతానము- అన్నవి యర్థములు. ముక్కకు ముక్కగా అర్థము చెప్పినచో 'రాజుచేత రక్షింపబడు ప్రజలు సమానము తండ్రిచేత రక్షింపబడు సంతానము' అనియే. అన్వయక్రమమునుబట్టి తాత్పర్యార్థము పైని చెప్పుకొన్నట్లేర్పడును.

'ఛిహ్' అన్నది సాహిత్యపరమైన నిపాతము. ఇదే యర్థమున 'తీ' యన్న శుష్కపదము వాడుకయందు కలదు. 'నేను' అనునర్థమున 'వొ' అని 'నీవు' అనునర్థమున 'ని' యని పూర్ణపదములు కలవు. సంబం

ర్థమున 'తీ' యను శుష్కపదముచేరి వోతీ (=నాయొక్క), నితీ (=నీయొక్క) అని యగును. కాలమును సూచించుటకుకూడ వేరు పదములే చేరును. కర్తనుబట్టియే క్రియయొక్క పురుషను గ్రహింప వలయును; అంతేకాని తద్బోధకము మాత్రము ప్రయుక్తము కాదు.

తీ లాయ్=నీవు వచ్చుట=నీవు వచ్చుచున్నావు
వో లాయ్=నేను వచ్చుట=నేను వచ్చుచున్నాను
తా లాయ్=వాడు వచ్చుట=వాడు వచ్చుచున్నాడు
వో లాయ్ లివావ్=నేను వచ్చుట సమాప్తము=నేను వచ్చితిని
వో మింగ్ త్యేన్ లాయ్ = నేను రాబోవు దినము వచ్చుట=
నేను వత్తును.

ఇట్లు పరిమితములయిన పూర్ణపదములను, అన్వయబోధకములైన శుష్క పదములను చేర్చి చైనాభాష పదముల స్థానమునుబట్టి అన్వయార్థమును సాధించుచున్నది.

స్థానము అన్వయార్థమును నిరూపించునని చెప్పుకొంటిమి. అట్లే తానము ప్రకరణార్థమును నిరూపించును. తానము నాలుగు విధములు. పదమునంతను ఒకే స్థాయిలో మెల్లగా పలుకుట నిమ్నతానము (Low Tone); గట్టిగాపలుకుట ఉచ్చతానము (High Tone); మెల్లగా మొదలుపెట్టి గట్టిగా ముగించుట ఉద్వృత్తానము (Rising Tone); గట్టిగా మొదలుపెట్టి మెల్లగా ముగించుట పతత్తానము (Falling Tone). ఈ నాలుగు విధములయిన తానములను చైనాభాషయు, ఈ వర్గమునకు చెందిన యితరభాషలను ప్రయోగించును. ఈ భాష లందు పదములు పరిమితసంఖ్యలోనే యున్నవి. కాని తానభేదమువల్ల అనేకార్థములను బోధింప సమర్థములైయున్నవి. 'ము' అను నొక్క పదమే నేత్రము, ముఖ్యము, అభిప్రాయము, అడవి, తెర, కడుగుట, పిలుచుట, ప్రేమ, సాయంకాలము, తల్లి, ఉంగరము - అను అనేకార్థ

ములను తానభేదమువల్ల సమర్పింప సమర్థమైయున్నది. 'తావో' అను నొకే మాటకు తానభేదమునుబట్టి ధ్వజము, ధాన్యము, మార్గము, కప్పుట, చేరుట, దారి మున్నగు భిన్నార్థములు కలవు. 'లూ' అను మాటకు బండి, మంచు, నగలు, సంచారము, దారి - అను నర్థములు గలవు. నిజమున కీ యర్థముల విషయము పద నిర్మాణమునకు గాని వాక్యనిర్మాణమునకు గాని సంబంధించినది కాదు. ఐనను చైనాభాష యందు నిర్మాణాత్మక సంబంధముకూడ నుండుటచేత చెప్పుకొనుట యవసరమైనది. 'దారి' అనునర్థమున 'తావో' అను పదముగాని, 'లూ' అను పదముగాని ప్రయుక్తము కావచ్చును. వాని కింకను భిన్నార్థ ములు గలవు. కావున స్పష్టతకొరకు ఒకే యర్థముగల రెండు పదము లను జోడించి పల్కుట నిర్మాణమునకు సంబంధించిన విషయము. 'తావో లూ' అని ప్రయోగించినయెడల 'దారి' యన్న ఒకే యర్థము స్పష్టముగా నిర్దిష్టమగును.

ఇట్లు ప్రతిపదము వేర్వేరుగా నుండుటచేతనే ఈ భాషలకు ప్రతి పదాత్మక భాషలు అనుపేరు చెల్లుచున్నది. ఆంగ్లమున వీనిని Isolating Languages అని యందురు. వీనికి అన్వయ సాధకములయిన అంగములేమియు లేకపోవుటచేత నిరవయవభాషలు (Inorganic Languages) అని కూడ అందురు. ఏ పదమున కా పదమే వేరుగా నుండుటవల్ల విశ్లేషాత్మక భాషలు (Analytic Languages) అని కూడ నందురు.

2. సంయోగాత్మక భాషలు : టర్కీ, కాఫిర్, జులూ, సంతాలీ, మఘోర్ మున్నగుభాషలును ద్రావిడ భాషలును సంయోగాత్మక భాషావర్గమునకు చెందినవి. ఈ బాషలయందు ప్రకృతి ప్రత్యయముల కూడికవల్ల పదము లేర్పడును. పదములకే యీ లక్షణము కలదన్న సత్యమును సూచించుటకై కొందరు వీనిని సంయుక్త పదరూప భాష లనియు వ్యవహరించుట కలదు.

సాధారణముగా పదములయం దున్న భిన్నాంగములలో నొక యంగము స్థిరముగా నుండును. దీనిని ప్రకృతి యనవచ్చును. దీనికి ముందుగాని, వెనుకగాని, నడుమగాని యితరాంశములు వచ్చిచేరును. అవి ప్రకృతియందు ఏవిధమైన మార్పును తీసికొని రాకుండ, అవసరమైనచో తామే కొలదిగా మారును. కాని యీ మార్పు పదాంశములను మాటు పరుపగలిగినంతగా ఎప్పుడును జరుగదు. ఏపాటి పరిచయమున్నను ఆ యా యంశములను స్పష్టముగా గుర్తుపట్టవచ్చును. ఇక్కడి ప్రకృతి ప్రత్యయముల కలయిక 'తిలతండుల న్యాయము'గా నుండును. అనగా, ఒకదానిప్రక్క నొకటిచేరి అంటుకొని యుండును.

బంటూభాషా కుటుంబమునందు పూర్వప్రత్యయ సంయోగము (Prefix agglutinating) వాడుకయందు కలదు. ఆ కుటుంబమునకు చెందిన కాఫిర్ భాషను గ్రహింతము. 'ని' అని యనగా 'వారు' అని యర్థము. 'తి' అని యనగా 'మేము' అని యర్థము. 'కు' అను ప్రత్యయము పూర్వమందు చేరి కుని (=వారికి), కుతి (=మాకు) అని యేర్పడును. జులూభాషయందు ఏకవచనబోధకముగా 'ఉము' అనియు, బహువచనబోధకముగా 'అవ' అనియు పూర్వప్రత్యయములుగా చేరును. 'న్తు' అని యనగా 'మనుష్యుడు' అని యర్థము. 'న్గ' అన్న ప్రత్యయమునకు 'చేత' యన్నది యర్థము.

ఉమున్తు = (ఒక) మనుష్యుడు

అవన్తు = (బహు) మనుష్యులు

న్గ ఉమున్తు = మనుష్యునిచేత

న్గ అవన్తు = మనుష్యులచేత

పై ప్రయోగములను బట్టి ప్రాతిపదికలకు ముందు వచనప్రత్యయమును, దానికంటె ముందు కారకమును చేర్చుకొనునని తేలుచున్నది.

ఊరల్ ఆల్టాయిక్ కుటుంబమునందును, ద్రావిడకుటుంబము నందును పరప్రత్యయ సంయోగము (Suffix agglutinating) ప్రచురము. తుర్కీ భాషయందు 'అత్' అని యనగా 'గుఱ్ఱము' అనియర్థము. 'ఎవ్' అని యనగా 'ఇల్లు' అని యర్థము. బహువచనబోధకమైన 'లర్' అను పరప్రత్యయము చేరగా 'అత్ లర్' (=గుఱ్ఱములు), ఎవ్ లేర్ (=ఇండ్లు) అని యగును. స్వరాకర్షణము (Vowel attraction) వల్ల ప్రత్యయమునందు కలిగిన పరిణతి గమనార్హము. వచనప్రత్యయము చేరినపిమ్మట, విభక్తిప్రత్యయముకూడ పరముందే చేరును. 'ఎవ్' శబ్దమునే యితరవిభక్తులను చేర్చి చూతము.

| | ప్రత్యయము | ఏ. వ. | బ. వ. |
|---|---|---|---|
| ప్రథమ | — | ఎవ్ | ఎవ్ లేర్ |
| ద్వితీయ | ఇ | ఎవి | ఎవ్లేరి |
| తృతీయ | — | — | — |
| చతుర్థి | ఎ | ఎవే | ఎవ్లేరే |
| పంచమి | దేన్ | ఎవ్దేన్ | ఎవ్లేర్దేన్ |
| షష్ఠి | ఇన్ | ఎవిన్ | ఎవ్లేరిన్ |
| సప్తమి | దే | ఎవ్దే | ఎవ్లేర్దే |

ద్రావిడభాష లన్నియు సంయోగాత్మకత్వమును స్పష్టముగా ప్రదర్శించును. వీనియందును పరప్రత్యయములకే ప్రయోగము కలదు. స్పష్టతకొరకై తెలుగుభాషాపదమునే యుదాహరణముగా గ్రహింతము.

| | ప్రత్యయము | ఏ. వ. | బ. వ. |
|---|---|---|---|
| ప్రథమ | — | తోట | తోటలు |
| ద్వితీయ | ను | తోటను | తోటలను |
| తృతీయ | తో | తోటతో | తోటలతో |
| చతుర్థి | కొఱకు | తోటకొఱకు | తోటలకొఱకు |

| | | | |
|---|---|---|---|
| పంచమి | వలన | తోటవలన | తోటలవలన |
| షష్ఠి | కు | తోటకు | తోటలకు |
| సప్తమి | అందు | తోటయందు | తోటలయందు |

ఫిలిప్పీనుదీవులందలి టగలోగ్ భాషయందు అంతఃప్రత్యయ సంయోగము (Infix agglutinating) ప్రచురము. ఒక యుదాహరణమును చూతము. 'లేఖ' యను నర్థమున 'సూలత్' అను పదము కలదు. దీనియందు సకారము ఒకయంశము; ఊలత్ అన్నది మరొక యంశము. వీని నడుమ 'ఉమ్' అను అంతఃప్రత్యయముచేరి 'సుమూలత్' అని యగును. దీనికి 'లేఖకుడు' అని యర్థము. 'ఇన్' అను అంతఃప్రత్యయము చేరగా 'సినూలత్' అనినయై 'లిఖింపబడెను' అన్న యర్థమేర్పడును.

ఇట్లే పూర్వపరప్రత్యయములను, పూర్వాంతః పరప్రత్యయములను వాడుకొనుట వేర్వేరు భాషలలో కనిపించును. కేవలనైఘంటుకార్థములో ఈ పదములు స్వతంత్రములుగా నుపయుక్తములు కావచ్చును. అన్వయార్థములో ప్రత్యయములతో సంయోగము చెందును. ఈ సంయోగాత్మకత్వమును తెల్పుటకే ఆంగ్లమున వీనిని Agglutinating Languages అని పిలుతురు. ప్రకృతి ప్రత్యయముల సన్నిహితత్వమునుబట్టి కొందరు 'సంచయాత్మక భాషలు' అని యనుట కూడ జరుగుచున్నది. ఆంగ్లమున Agglomerating Languages అని యన్నప్పుడిదే యభిప్రాయము గోచరించును.

అన్వయార్థసాధకములైన అంగముల వాడుకచేత సంయోగాత్మక భాషలను సావయవభాషలుగా పరిగణింతురు. ఈ తరువాత చెప్పుకొనబోవు ప్రత్యయాత్మకభాషలు, సమ్మిశ్రణాత్మక భాషలు కూడ సావయవభాషలు (Organic Languages) గానే పరిగణింపబడును. ప్రకృతిప్రత్యయములు సంశ్లేషము చెందుటచేత సంశ్లేషాత్మక భాషలు (Synthetic Languages) గా వ్యవహృతములగును. కాని

యీ సంశ్లిష్టత సంయోగాత్మక భాషలందు నామమాత్రమై, ప్రత్యయాత్మక భాషలందు బలము సంపాదించుకొని, సమ్మిశ్రణాత్మక భాషలందు సార్వభౌమత్వమును వెలయించును.

౨. ప్రత్యయాత్మక భాషలు : సంస్కృతము, గ్రీకు, లాటిను, పారశీకము, హిబ్రూ, అరబ్బీ మున్నగునవి ప్రత్యయాత్మక భాషా వర్గమునకు చెందినవి. ఈ భాషలయందు ప్రకృతిప్రత్యయములకలయిక వల్ల పదము లేర్పడును. సంయోగాత్మకభాషలందును ప్రకృతిప్రత్యయముల కలయికయున్నది. అచ్చటి ప్రకృతి స్వతంత్రముగా నుపయోగపడును. ప్రత్యయాత్మకభాషలందు ప్రకృతి స్వతంత్రముగా నుపయోగపడదు. అట్లే ప్రత్యయములకును స్వతంత్రమైన ప్రయోగము, అనగా ప్రకృతిని విడిచి వ్యస్తముగా ప్రయోగించుట యన్నది యుండదు. ప్రకృతిప్రత్యయము లీ భాషలలో క్షీర నీర న్యాయముగా, వేరు వేరుగా నిరూపించుటకు వీలులేనంతగా ఏకీభావము నొందుట యిందలి విశేషము. ప్రత్యయము చేరినప్పుడు ప్రకృతియందుకూడ కొన్ని మార్పులు కలుగును. సంయోగాత్మక భాషలందు ప్రకృతి మార్పు పొందదు; ప్రత్యయాత్మకభాషలలో ప్రకృతియందును మార్పుకలిగి ప్రత్యయమునందును మార్పుకలుగుటచేత, రెండును మరింత సన్నిహితములై స్థూలదృష్టికి విడదీయుటకు వీలులేని ఏకాంగముగనే భాసించును.

సంస్కృతమునందు 'రామ' అన్నది ప్రాతిపదికము. దానిపై నితరవిభక్తులు చేరినప్పుడు భిన్నరూపములు కలుగును. అప్పుడు మాత్రమే ప్రయోగార్హత లభించును. 'రామః'అన్నది ప్రథమా విభక్తి రూపము. రామమ్, రామేణ, రామాయ, రామాత్, రామస్య, రామే-మున్నగువిధముగా ఏకవచనరూపము లుండును. ప్రథమా విభక్తిబహువచనమునందు 'రామాః' అన్నది రూపము. రామాన్, రామైః, రామేభ్యః, రామాణామ్, రామేషు-అన్నవి మిగిలిన విభక్తిరూపములు.

ఈ ప్రత్యయాత్మకభాషలలో విభక్తియు, వచనమును సంపృక్తములై యుండుట ఒక విశేషము.

ఇట్లే క్రియలందును మార్పు కానవగును. 'కృ' అన్నది మూల ధాతువు. వర్తమానకాల ప్రథమైకవచనము కృ + అ + తి = కరోతి అని యగును. ద్వివచనము 'కురుతః' అని, బహువచనము 'కుర్వన్తి'. చకార, చక్రుః, కృత్వా, కారయిత్వా- మున్నగు రూపములు వేరువేరు ప్రత్యయములు చేరగా ఏర్పడును. ఇందు మూలధాతువు మిక్కిలి మార్పునకు పాల్పడినట్లు గుర్తించుట సులభమే.

లాటినుభాషయందు 'గోడ' యన్న యర్థమున 'మురుస్' అని యుండును. కర్మార్థమునందు 'మురుమ్' అనియు, సంప్రదానార్థము నందు 'మురో' అనియు, సంబంధార్థమునందు 'మురి' అనియు రూపము లుండును. క్రియాపదములందును ప్రక్రియ యిట్లే కనిపించును. 'ముగించు' అను నర్థమున 'ఫిని' యన్నది మూలధాతువు. దీనికి కాల బోధక పురుషబోధక ప్రత్యయములు చేరును. 'ఫినివి' అని యనగా 'నేను ముగించితిని' అని యర్థము. దీనికి బహువచనరూపమైన 'ఫిని విముస్' అనుదానికి 'మేము ముగించితిమి' అని యర్థము. మధ్యమ పురుషయందు 'ఫినివిస్తి' అనియు, ప్రథమపురుషయందు 'ఫినివెరున్త్' అనియు రూపములు.

సంస్కృతమునందు 'సమ' అన్నమూలరూపముపై 'త్వ' అన్న ప్రత్యయము కలిగి 'సమత్వ' అని యేర్పడును. 'తా' అన్న ప్రత్యయము కలిగి 'సమతా' అని యగును. ఇచ్చట ప్రకృతియందు మార్పు కలుగలేదు. ఈ రూపముల విషయమున సంస్కృతము సంయోగాత్మక భాషలతో సమముగా వ్యవహరించిన దనవలయును. కాని, యీ వ్యవహారము క్వాచిత్కమే కాని సార్వత్రికము కాదు. భావమునందే 'య' ప్రత్యయము రాగా 'సామ్య' అను రూపమేర్పడును. 'దృఢ' అను రూపమునుండి 'దార్ఢ్య' యనియు 'నిసర్గ' అను రూపమునుండి 'నైసర్గిక'

అనియు నేర్పడినప్పుడు ప్రత్యయాత్మక భాషాలక్షణము స్పష్టముగా కనిపించును.

ఆంగ్లభాష ప్రత్యయాత్మక భాషావర్గములోనిదే. 'ఐ' అనునది కర్త్రాద్యర్థములందు 'మి' యనియు సంబంధార్థమున మై, మైన్-అనియు రూపములను దాల్చును. ఇది యింతవరకు ప్రత్యయాత్మక భాషాలక్షణమే. గ్రీకు మున్నగువానియందువలె ప్రాతిపదికతో సంశ్లిష్టమయిన ప్రత్యయములను గాక టు, ఆఫ్, బై, ఫ్రమ్, ఇన్ మున్నగు పూర్వ ప్రత్యయములను వేరుగా వాడుట ఆంగ్లమునందు వృద్ధియైనది. అనగా ఆంగ్లము విశ్లేషాత్మకత్వమువైపు వృద్ధినొందుచున్నదని యర్థము.

సంస్కృతజన్యములయిన ఉత్తరభారతభాషలందు సైతము ఇట్టి విశ్లేషాత్మకత్వము ప్రచురముగా కనిపించును. 'ఇల్లు' అను నర్థమున 'ఘర్' అన్న హిందీపదము కలదు. 'ఘర్ మేఁ' అని యనగా 'ఇంటిలో' నని యర్థము. 'ఇంటికి' అను నర్థమున 'ఘర్ కో' అనియు 'ఇంటి నుండి' అనునర్థమున 'ఘర్ సే' అనియు 'ఇంటియొక్క' అను నర్థమున 'ఘర్ కా' అనియు రూపములు. ఇచ్చట ఏ ప్రత్యయము వచ్చినను మూలరూపమున మార్పుకలుగలేదు. అనగా సంయోగాత్మక భాషలతో సామ్యమే కనిపించుచున్నదని యర్థము. ఉన్నది యున్నట్లుగా అది సత్యమే. సర్వనామములపై ఈ ప్రత్యయములు వచ్చినప్పుడు ఈ లక్షణము మారిపోయి ప్రత్యయాత్మక భాషాలక్షణము స్పష్టముగా కనవచ్చును. హిందీయందు 'నేను' అన్న యర్థమున 'మైఁ' అనికలదు. అది ముఝ్ మేఁ, ముఝ్ కో, ముఝ్ సే, మేరా- అన్నరూపములను పొందును.

సంస్కృతాదిభాషలలో అంతమందును, ఆంగ్లాదిభాషలలో ఆది యందును ప్రత్యయములు చేరుట చూచితిమి. ధాతువు నడిమి భాగమున కూడ ప్రత్యయములు చేరవచ్చును. అరబ్బీ భాషాధాతువులు

అంతఃప్రత్యయములను చేర్చుకొని ప్రయుక్తములగును. 'క్ త్ ల్' అను క్రియాధాతువునకు 'చంపుట' అని యర్థము. దీనియందు అంతఃప్రత్యయములు చేరి వేర్వేరు రూపములను సిద్ధముచేయును. కతల్ (=చంపెను); కాతిల్ (=హంతకుడు); కితల్ (=దెబ్బ); కిత్ల్ (=శత్రువు); కుతిల్ (=చంపబడెను); యక్తులు (=అతడు చచ్చుచున్నాడు). చివరి రూపమునందు 'య' యన్నపూర్వప్రత్యయము కూడ ప్రయుక్తమైనది.

ఆంగ్లమునందు ring, rang, rung అని యన్నప్పుడు కాని think, thought అని యన్నప్పుడు కాని swear, swore, sworn అని యన్నప్పుడు కాని అంతఃప్రత్యయములు చేరి మూలరూపమునందు మార్పును కొనితెచ్చుట స్పష్టముగా గోచరించును. అనగా ఇట్టియెడల ప్రత్యయాత్మక భాషాలక్షణము ప్రత్యక్ష మగునని యర్థము.

ప్రత్యయములను చేర్చుకొనుటచేతనే రూపమును, అన్వయమును పొందునట్టిపదములను గలిగియుండుటచేత, ఈ భాషలకు ప్రత్యయాత్మకభాషలు అనుపేరు కలిగినది. వీని నాంగ్లమున Inflexional Languages అని యందురు.

4. సమ్మిశ్రణాత్మక భాషలు : దక్షిణ అమెరికాయందును గ్రీనులాండునందును గల కొన్ని భాషలును, బాస్కుభాషలును సమ్మిశ్రణాత్మకభాషావర్గమునకు చెందినవి. ఇందు వేరువేరు పదములు కొంత భాగమును విడిచిపుచ్చి, వాక్యమంతయు నొక్కటే పదముగా నగును.

దక్షిణ అమెరికాయందలి 'చైరో' భాషయందలి ఒక పదరూప వాక్యమును చూతము. 'నాథోలినిన్' అని యనగా 'మా కొఱకు నావను తెమ్ము' అని యర్థము. ఇందు కనీసము మూడుమాటలైన నుండవలయును; లేకున్న వాక్యముకాదు. అయినను మొత్తము వాక్యమంతయు ఒక్కమాటవలెనే యున్నది. 'నా తేన్' అని యనగా 'తెమ్ము'

అని యర్థము. 'ఆమెూఖల్' అని యనగా 'నావ' యని యర్థము. 'నిఙా' అని యనగా 'మేము' అని యర్థము. ఈ మూడు పదములును 'నాథో లినిఙా' అని యయ్యెను.

గ్రీనులాండులోని ఎస్కిమో భాషయందు 'వాడు చేపలవేటకు వెళ్ళుటకు తొందరపడుచున్నాడు' అన్న యర్థమున 'అఉలిసరి అర్తోర్ సువర్పోర్' అని వాడుదురు. 'అఉలిసర' అని యనగా 'చేపలవేట' యని యర్థము. 'పే అర్తోర్' అని యనగా 'ప్రవర్తించుట' యని యర్థము. 'పిన్నే సువర్పోక్' అని యనగా 'వాడు తొందరచేయును' అని యర్థము. ఇందు పే, పిన్నే-అనునవి పూర్తిగా లోపించిపోయిన పిమ్మటనే వాక్య మేర్పడినది.

బాస్కుభాషయందును 'నేను ఇతనిని వానికడకు కొనిపోవు చున్నాను' అను వాక్యమున కంతటికిని బదులుగా 'దకార్క్ఓత్' అని వాడుదురు. 'దకార్సు' అని యనగా 'నీవు నన్ను తీసికొనిపోవుచున్నావు' అని యర్థము. 'అకర్రి'యనగా 'మోయుట'యని యర్థము. 'నేను దానిని మోయుదును'అన్న యర్థమున'దకర్త్'అనియు'నీవు దానిని మోయుదువు' అన్నయర్థమున'దకర్జు'అనియు 'నేను వాటిని మోయుదును' అన్న యర్థమున'దకర్జ్కిత్' అనియు 'నీవు వాటిని మోయుదువు'అన్న యర్థమున 'దకర్జ్కిజు' అనియు వాడుదురు. ఈ వాక్యములను పోల్చి చూడగా 'త్' ఉత్తమపురుషను, 'జు' మధ్యమ పురుషను తెలుపుచున్నట్లు తోచును. 'ద్' అన్నది 'దానిని' అన్న యర్థమును తెల్పుచుండగా 'వాటిని' అన్న బహుత్వమును కలిగించుటకై 'జ్కి' అన్నది వాడబడి నది. 'అకర్రి' అను దానిలోని కడపటి 'రి' అన్నిరూపములందును లోపించిపోయినది.

ఇట్టి లక్షణము సంస్కృత భాషయందును కొంచెముగా క్రియా పదములందును, సమాసములందును కనిపించుచుండును. 'నమామి'

అని యనగా 'నేను నమస్కరించుచున్నాను' అని యర్థము. 'వదతి' అని యనగా 'అతడు మాటాడుచున్నాడు' అని యర్థము. 'మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి' అని యనగా 'మకరాంకునివలె శశాంకునివలె మనోజ్ఞమైన ఆకారము కలవాడు' అని యర్థము. ఇంతకును ఈ లక్షణము సంస్కృతమునందు క్వాచిత్కము.

ఇట్లు సమ్మిశ్రణము చెందు స్వభావమునుబట్టియే 'చెరో' మున్నగు భాషలకు సమ్మిశ్రణాత్మక భాష లను వ్యవహారము కలిగినది. వీని నాంగ్లమున Incorporating Languages అని యందురు. అనేక పదము లేకపదముగా చేరు లక్షణమునుబట్టి సంయుక్తపదరూపభాషలు అని పిలుచుట సైతము కలదు. ఈ లక్షణముచేత వీని నాంగ్లమున Polysynthetic Languages అని యందురు.

కొందరు శాస్త్రజ్ఞులు రూపాశ్రితవర్గీకరణమునకంత ప్రాముఖ్యము నొసగరు. రూపనిర్మాణమునుబట్టి భాషలను వర్గీకరించుట యిచ్చటి విషయము. యూరేషియాఖండమునకుచెందిన చైనాభాషయు ఆఫ్రికాకుచెందిన సూడానీభాషయు ప్రతిపదాత్మక భాషావర్గమునందే పరిగణితములగుచున్నవి.ఆసియాయందలి తుర్కీభాషయు,యూరోపునందలి ఫిన్నిషు మగ్యారుభాషలును ఆఫ్రికాయందలి కాఫిరుభాషయు, ఫిలిప్పీను దీవులందలిటగలోగ్ భాషయు, భారతదేశమునందలి ద్రావిడభాషలును ఒకే సంయోగాత్మక భాషావర్గమునందు అంతర్భవించుచున్నవి.ఇంత దూరస్థములైయుండి, జన్మసంబంధ మొంత మాత్రమును లేని భాషలను ఒకే వర్గమునందు చేర్చుటకు కొందరొప్పుకొనుటలేదు. ప్రతివర్గమునందును పరవర్గలక్షణము కొంత కనిపించుచునే యున్నది. కావున రూపాశ్రితవర్గీకరణమే శాస్త్రీయము కా దని కొందరు వాదించి నిరాకరింతురు.

పై వాదములు యథార్థములనుటలో విప్రతిపత్తి లేదు. శాస్త్రీయత వేరు; సానుకూలత వేరు. రూపాశ్రిత వర్గీకరణము సానుకూలము

కానిమాట వాస్తవము; శాస్త్రీయము కాదనుట వాస్తవము కాదు. ప్రపంచభాషల నన్నింటిని నాలుగు వర్గములలో నిమిడించుట ప్రత్యేక భాషాతత్త్వావగాహనమునకు సానుకూలముకాదు. ఇంతకంటెను వర్గములను విస్తరింపజేసినప్పటికి ఆ ప్రయోజనము నెరవేరదు. పదనిర్మాణము, వాక్యనిర్మాణము ఏ విధముగా నుండునో, ఎన్నివిధములుగా నుండునో అవగాహనము చేసికొనుట కీ వర్గీకరణము సహకరించును. భాషాశాస్త్రజ్ఞులు వాక్యమునే భాషకు చరమప్రమాణముగా గ్రహింతురు. అట్టియెడల వాక్యనిర్మాణభేదములను గుర్తించుట, తదనుకూలముగా భాషాప్రపంచమును వింగడించుట శాస్త్రీయమే కావలయును. ఇంకొక విషయము. భాషల సన్నిహితత్వము పరస్పరసంబంధమును స్థాపింపదు. అట్లే భాషల దూరస్థితి పరస్పర సంబంధమునకు ప్రతిబంధకము కాదు. జన్మసంబంధమును నిర్ణయించుటకువలెనే, నిర్మాణసంబంధమును నిర్ణయించుటకును సాన్నిహిత్యము సహకారకారణము కావచ్చును కాని ముఖ్యకారణము కాజాలదు.

నిజమునకు రూపాశ్రిత వర్గీకరణము జాత్యాశ్రిత వర్గీకరణమునకు సహకరించును. జన్మసంబంధముగల కొన్ని భాషలను ఒక కుటుంబముగా నిర్ణయించితి మనుకొందము. ఆ కుటుంబమునందలి భాషలన్నియు నిర్మాణమునుబట్టి ఒక వర్గమునకే చెందును. ఒక కుటుంబములో భిన్న వర్గములకు చెందిన భాష లుండవు; ఒక వర్గములో భిన్నకుటుంబములకు చెందిన భాష లుండవచ్చును. కావున రూపాశ్రిత వర్గీకరణము పద నిర్మాణ వాక్యనిర్మాణముల నాధారము చేసికొని యుండుటచేత శాస్త్రీయమగుటయేకాక అలంబనీయముకూడ నగుననుటలో సందేహము లేదు.

## 5. 3. భౌగోళిక వర్గీకరణము

వ్యవహారక్షేత్రమునుబట్టి భాషలను వర్గీకరించుటకు కొందరు కుతూహలము చూపుచున్నారు. ప్రపంచమంతయు స్థూలముగా పంచ

ఖండాత్మకముగా పరిగణింపబడుచున్నది. ఆ యా ఖండములందు వ్యవహరింపబడు భాషలను ఆసియాఖండభాషలు, యూరోపుఖండభాషలు, ఆఫ్రికాఖండభాషలు, ఆస్ట్రేలియాఖండభాషలు, అమెరికాఖండభాషలు–అని విభాగించుట కలదు. ఇట్టి వర్గీకరణమును 'భౌగోళిక వర్గీకరణము' అని యందురు. దీనినే ఆంగ్లమునందు Geographical classification అని యందురు.

ప్రతి ఖండమునందు ననేక దేశములు కలవు. ఆ యా దేశములందుకూడ అనేక భాషలు కలవు. అన్నింటిని చెప్పుట అసాధ్యము. అందువల్ల పరిశీలితమైన ప్రధానభాషలను స్థూలముగా పరిగణించుటకు ప్రయత్నింతము.

1. ఆసియాఖండము

| దేశము | భాషలు |
|---|---|
| ఆఫ్ఘనిస్తాను | పుస్తు, పారశీకము |
| బర్మా | బర్మీభాష, ఆంగ్లము |
| కంబోడియా | కంబోడియను (ఖ్మేర్), తాయి (లావోతియను); ఫ్రెంచి |
| సింహళము | సింహళభాష (దక్షిణ పశ్చిమభాగములందు), తమిళభాష (ఉత్తర ప్రాచ్యభాగములందు); ఆంగ్లము |
| చైనా | మందారిను, కాంటొనీసు, వు, మిన్, మియవో హక్కా (ఇవన్నియు చైనా మాండలికములు); టిబెటను, మంగోలియను, మంచూ, వియత్నామీ, తాయీ భాషలు |
| సైప్రసు | గ్రీకు, తుర్కీ, ఆంగ్లము. |
| హాంగ్ కాంగు | చైనాభాష; ఆంగ్లము |

| దేశము | భాషలు |
|---|---|
| భారతదేశము | హిందీ, బెంగాలీ, మరాఠీ, గుజరాతీ, పంజాబీ, రాజస్థానీ, బిహారీ, ఒరియా, కాశ్మీరీ, పహాడీ, లహందా, సింధీ, నేపాలీ, అస్సామీ మున్నగునవి (ఇండో యూరోపియను కుటుంబ భాషలు - ఉత్తరభాగము, తెలుగు, తమిళము, కన్నడము, మలయాళము, తుళు, కొడగు మున్నగునవి (ద్రావిడభాషలు - దక్షిణభాగము) ఖేర్వారీ, సంతాలీ, ముండారీ మున్నగునవి (ముండాభాషలు - హిమాలయ ప్రాంతము); ఆంగ్లము. |
| ఇరాను | ఇరానీ (పారశీకము), అజర్ బైజానీ, కుర్దిష్; ఫ్రెంచి, ఆంగ్లము |
| ఇరాకు | అరబ్బీ, తుర్కీ, కుర్దిష్ భాషలు |
| ఇస్రాయిలు | హిబ్రూ, అరబ్బీ, ఇద్దిష్; ఆంగ్లము |
| జపాను | జపానీ, ఎయినూ (ఎజోయందు); ఆంగ్లము |
| జోర్డాను | అరబ్బీ; ఫ్రెంచి, ఆంగ్లము |
| కొరియా | కొరియను, జపానీ, చైనా; ఆంగ్లము |
| లావోసు | లావోషియను, కంబోడియను; ఫ్రెంచి |
| లెబనాను | అరబ్బీ; ఫ్రెంచి, ఆంగ్లము |
| మలేషియా | మలయ్, చైనా, మోన్‌ఖ్మేర్; ఆంగ్లము |
| నేపాలు | నేపాలీ |
| టిబెట్టు | టిబెటను |
| మంగోలియా | మంగోలియను; చైనాభాష, రష్యముభాష |

| దేశము | భాషలు |
|---|---|
| పాకీస్తాను | బెంగాలీ, ఉర్దూ, పంజాబీ, బెలూచీ, సింధీ, లహన్దా; ఆంగ్లము |
| బాంగ్లాదేశ్ | బెంగాలీ, ఉర్దూ, బిహారీ; ఆంగ్లము |
| సౌదీఅరేబియా | అరబ్బీ, ఆంగ్లము |
| సిరియా | అరబ్బీ; ఫ్రెంచి |
| థాయిలాండు | సయామీ, కరేన్, లావోషియను; ఆంగ్లము |
| తుర్కీ | తుర్కీ, ఆర్మీనియను, కుర్దిష్; గ్రీకు |
| రష్యా | రష్యను, ఆర్మీనియను, జార్జియను, అజర్ బైజానీ, ఉజ్బెకీ, (రష్యను మాండలికములు), ఓస్ట్యాకు, వోగుల్, సమోయెద్, చెరిమిస్, మోర్డ్వీనియను, యాకుత్, ఉయ్గుర్, బష్కిర్, తుంగుస్, మంగోలియను (ఊరల్ ఆల్టాయిక్ కుటుంబము), చుక్చి, కోరియాక్, కమ్చాదల్, యుకగీర్ |
| యెమెన్ | అరబ్బీ, ఆంగ్లము |
| వియత్నామ్ | అన్నామీ, మువోంగ్, మోన్ఖ్మేర్; ఫ్రెంచి |

2. యూరోపు ఖండము

| | |
|---|---|
| గ్రేట్ బ్రిటను | ఆంగ్లము, వెల్ష్, స్కాచ్, ఐరిష్ భాషలు |
| స్పెయిను | స్పానిషు, బాస్కు, పోర్చుగీసు |
| పోర్చుగలు | పోర్చుగీసు, స్పానిషు |
| ఫ్రాంసు | ఫ్రెంచి, బాస్కు, కెటలాను, అల్సాటియను జర్మను, ఇటాలియను |
| జర్మనీ | జర్మను |
| పోలెండు | పోలిష్ భాష, లిథువేనియను, రష్యను, జర్మను, ఇద్దిష్ |

| దేశము | భాషలు |
|---|---|
| హంగేరీ | హంగేరియను, స్లోవక్, జర్మను, రుమేనియను |
| రుమేనియా | రుమేనియను, హంగేరియను, బల్గేరియను, తుర్కీ, రష్యను, ఉక్రేనియను |
| యుగోస్లావియా | సెర్బోక్రోషియను, స్లోవీనియను, జర్మను, బల్గేరియను, హంగేరియను, మేసిడోనియను, ఆల్బేనియను, రుమేనియను, ఇటాలియను, జర్మను, తుర్కీ, గ్రీకు |
| బల్గేరియా | బల్గేరియను, తుర్కీ, మేసిడోనియను |
| ఆస్ట్రియా | జర్మను |
| నార్వే | నార్వీజియను, లాప్పు, ఆంగ్లము, జర్మను. |
| స్వీడను | స్వీడిషు, లాప్పు, జర్మను. |
| డెన్మార్కు | డేనిషు, జర్మను. |
| ఫిన్‌లాండు | ఫిన్నిషు, స్వీడిషు, రష్యను, జర్మను. |
| ఇటలీ | ఇటాలియను, జర్మను, స్లోవీనియను, క్రోషియను, సార్డీనియను. |
| గ్రీసు | గ్రీకు, తుర్కీ, ఆల్బేనియను, బల్గేరియను, మేసిడోనియను. |
| ఐస్‌లాండు | ఐస్‌లాండిక్, డేనిషు. |
| స్విట్జరులాండు | జర్మను, ఫ్రెంచి, ఇటాలియను, రేటోరుమాన్ష్. |
| లూగ్జెంబర్గు | జర్మను, ఫ్రెంచి |
| నెదర్‌లాండ్సు | డచ్చి, ఆంగ్లము, జర్మను, ఫ్రెంచి. |
| ఆల్బేనియా | ఆల్బేనియను, ఇటాలియను, సెర్బోక్రోషియను, గ్రీకు, తుర్కీ. |

| దేశము | భాషలు |
|---|---|
| జెకోస్లొవేకియా | జెక్, స్లోవక్, జర్మను, హంగేరియను, ఉక్రేనియను, రష్యను. |
| రష్యా | రష్యను, ఉక్రేనియను, శ్వైలోరష్యను, కరేలియన్ ఫిన్నిష్, మాల్దోవియన్ రుమేనియను, లిథువేనియను, లెత్తిష్, ఎస్తోనియను. |

3. ఆఫ్రికా ఖండము

| | |
|---|---|
| మొరాకో | అరబ్బీ, బెర్బర్; ఫ్రెంచి. |
| అల్జీరియా | అరబ్బీ, బెర్బర్; ఫ్రెంచి. |
| లిబ్యా | అరబ్బీ, బెర్బర్; ఇటాలియను |
| యునైటెడ్ అరబ్ రిపబ్లిక్ (ఈజిప్టు) | అరబ్బీ, నూబియను, బెజా; ఫ్రెంచి, ఆంగ్లము |
| తునీషియా | అరబ్బీ, బెర్బర్; ఫ్రెంచి, ఇటాలియను |
| మారిటేనియా | అరబ్బీ, బెర్బర్; ఫ్రెంచి. |
| నైగర్ రిపబ్లిక్ | హవుసా, కనూరి, బెర్బర్, అరబ్బీ; ఫ్రెంచి. |
| చాడ్ రిపబ్లిక్ | నూబా, అరబ్బీ; ఫ్రెంచి. |
| సూడాన్ | అరబ్బీ, నూబా, దిన్కా, కనూరి, న్డాకాంగో, బెజా; ఆంగ్లము. |
| సూడానీ రిపబ్లిక్ | ఫులా, మొస్సి, మందిన్గో; ఫ్రెంచి. |
| ఎతియోపియా | తిగ్రే, తిగ్రీనా, అమారిక్, గల్లా, సిదమో, హారరీ, బెజా, సోమాలీ; ఇటాలియను. |
| మాలి | మందిన్గో, ఫులా, మొస్సి; ఫ్రెంచి. |
| సెనెగల్ రిపబ్లిక్ | వొలోఫ, మందిన్గో, ఫులా; ఫ్రెంచి. |
| గినీ రిపబ్లిక్ | ఫులా, మందిన్గో; ఫ్రెంచి. |
| వోల్టా రిపబ్లిక్ | మొస్సి, ఎఫిక్; ఫ్రెంచి. |

| దేశము | భాషలు |
|---|---|
| నైగీరియా | హౌసా, యొరుబా, ఇబో, కనూరి, ఎఫిక్, ఫులా, నుపే; ఆంగ్లము. |
| మధ్యాఫ్రికా రిపబ్లిక్ | సాంబా, ఉబన్గి; ఫ్రెంచి. |
| సెయిరాలోనే | మెండే, తెమ్నే; ఆంగ్లము. |
| పోర్చుగీసు గినీ | ఫులా, మందిన్గో; పోర్చుగీసు |
| ఐవరీకోస్టు రిపబ్లిక్ | మొస్సి, మందిన్గో, క్రూ; ఆంగ్లము. |
| ఘనా | త్వి, ఫాన్తి, గా, యూ, ఇబో, మొస్సి; ఆంగ్లము. |
| తోగోలాండు రిపబ్లిక్ | యూ, ఫోన్, ఎఫిక్, త్వి, మొస్సి; ఆంగ్లము, జర్మను. |
| దహొమెయ్ రిపబ్లిక్ | యూ, ఫోన్, ఎఫిక్, యొరుబా, హౌసా; ఫ్రెంచి. |
| కామెరూన్ | పంగ్వె, బులు, ఫంగ్, యాందే, ఫులా, ద్వాలా (బంటూ భాషలు), ఉబన్గి; ఫ్రెంచి. |
| ఉగండా | గండా, న్యోరో, స్వాహిలీ(బంటూ భాషలు); ఆంగ్లము. |
| కెన్యా | కికుయు, స్వాహిలీ (బంటూ భాషలు), మసై; ఆంగ్లము. |
| సోమాలీ రిపబ్లిక్ | సోమాలీ, అరబ్బి, స్వాహిలీ, అమారిక్; ఇటాలియను, ఆంగ్లము. |
| కాంగో | కాంగో, ఫుల్, లుబా, న్గాలా, స్వాహిలీ, రౌండా, రుండీ; ఫ్రెంచి. |
| తాంజనియా | న్యాంవేజీ, స్వాహిలీ, న్యంజా, రౌండా; ఆంగ్లము, జర్మను. |
| జాంజిబారు | స్వాహిలీ, అరబ్బి; ఆంగ్లము. |

| దేశము | భాషలు |
|---|---|
| అంగోలా | ఉంబిందు, కింబుందు, చోక్వే, కాంగో, లౌండా, న్గోలా, గన్గీలా, హెన్డె (బంటూ భాషలు); పోర్చుగీసు. |
| జాంబియా | మందిన్గో, వాలోఫ్, ఫులా; ఆంగ్లము. |
| రొడీషియా | న్యాంజా, బెంబా, కొలోలో, షోనా, తోంగా, స్వాహిలీ, జులూ. |
| మొజాంబిక్ | మకువా, రోన్గా, షోనా, స్వాహిలీ (బంటూ భాషలు); పోర్చుగీసు. |
| నైరృతాఫ్రికా | ఖోయిను (హాటెన్‌టాట్ బుష్మను కుటుంబము), హెరెరో (బంటూ కుటుంబము), ఆఫ్రికను; ఆంగ్లము, జర్మను. |
| దక్షిణాఫ్రికా | జూలూ, ఖోసా, సోతో, చువానా, తెబెలే (బంటూ భాషలు), ఖోయిను (బుష్మను కుటుంబము), ఆఫ్రికను; ఆంగ్లము. |
| మలగసీ రిపబ్లిక్ (మడగాస్కరు) | మలగసీ: హోవా (ఇండోనీషియను భాషలు); ఫ్రెంచి. |

4. ఆస్ట్రేలియా ఖండము (పరిసరద్వీపములు)

| | |
|---|---|
| ఆస్ట్రేలియా | ఆంగ్లము |
| ఫిజీ దీవులు | మెలనీషియను, ఆంగ్లము, పిడ్జిన్ (ఆంగ్లము); హిందుస్తానీ. |
| హవాయి | హవాయి, జపానీ, చైనా, ఆంగ్లము; కొరియను |
| న్యూకలెడోనియా | మెలనీషియను; ఫ్రెంచి. |
| న్యూగినీ | పపువన్ భాషలు, ఆంగ్లము; పిడ్జిన్ (ఆంగ్లము) |
| పపువా | పపువన్ భాషలు; ఆంగ్లము. |

| దేశము | భాషలు |
| --- | --- |
| సమోవా | పోలినీషియను; ఆంగ్లము, జర్మను. |
| తోంగా | పోలినీషియను; ఆంగ్లము. |
| తిమోర్ | ఇండోనీషియను; పోర్చుగీసు. |
| ఫిలిప్పీన్సు | టగలోగ్, విసయ, ఇలొకనొ, బికోల్ (ఇండో నీషియను భాషలు); ఆంగ్లము, స్పానిషు. |
| ఇండోనీషియా | బహాసా ఇండోనీషియా, జావనీస్, సుండా నీస్, మదురీస్, బాలినీస్, బతక్, బుగి, దయక్ (ఇండోనీషియనువిభాగము); మలయ్, డచ్చి, ఆంగ్లము. |
| న్యూ హిబ్రైడిస్ | మెలనీషియను; ఆంగ్లము, ఫ్రెంచి. |
| సోల్మను దీవులు | మెలనీషియను; ఆంగ్లము. |
| న్యూజిలాండు | ఆంగ్లము; మవోరి (పోలినీషియను మాండలి కము) |
| గిల్బర్ట్, ఎలిస్ దీవులు | మైక్రోనీషియను, పోలినీషియను; ఆంగ్లము. |
| గువమ్ | మైక్రోనీషియను, ఆంగ్లము. |

5. అమెరికా ఖండము

| | |
| --- | --- |
| అలస్కా | ఆంగ్లము, ఎస్కిమో. |
| గ్రీన్ లాండు | డేనిష్, ఆంగ్లము, ఎస్కిమో. |
| కెనడా | ఆంగ్లము, ఫ్రెంచి. |
| సంయుక్తరాష్ట్రములు | ఆంగ్లము; స్పానిషు, ఫ్రెంచి, ఇటాలియను, జర్మను, స్లావిక్, ఇడ్డిష్; ఆదిమవాసుల భాషలు (అరవాక్, చిబ్చా). |
| మెక్సికో | స్పానిషు; పెనూషియా, ఉతోఅజ్టెక్ (ఆదిమ వాసుల భాషలు) |
| బెర్ముడాస్ | ఆంగ్లము. |

| | |
|---|---|
| బహామాదీవులు | ఆంగ్లము. |
| గాతీమల | స్పానిషు, ఆదిమవాసుల భాషలు. |
| హాండురాస్ | ఆంగ్లము, స్పానిషు. |
| కోస్టారికా | స్పానిషు, ఆదిమవాసుల భాషలు. |
| నికరాగువా | స్పానిషు, ఆదిమవాసుల భాషలు |
| పనామా | స్పానిషు, ఆదిమవాసుల భాషలు. |
| క్యూబా | స్పానిషు. |
| డొమినికన్ రిపబ్లిక్ | స్పానిషు. |
| వెస్టిండీస్ | ఆంగ్లము. |
| వెనిజువేలా, కొలంబియా, చిలీ, బొలీవియా, ఎకువే డర్, పారగ్వాయ్, పెరు | స్పానిషు, ఆదిమవాసుల భాషలు (కెచువా, అయ్మారా, తుపీ, గొరానీ) |
| బ్రజిల్ | పోర్చుగీసు, ఇటాలియను, జర్మను, జపానీ, ఆదిమవాసుల భాషలు. |
| బ్రిటిష్ గయానా | ఆంగ్లము, ఆదిమవాసుల భాషలు. |
| డచ్ గయానా | డచ్చి, ఆంగ్లము, ఆదిమవాసుల భాషలు. |
| ఫ్రెంచ్ గయానా | ఫ్రెంచి, ఆదిమవాసుల భాషలు. |
| అర్జెంటీనా | స్పానిషు; ఇటాలియను, జర్మను. |
| ఉరుగ్వాయ్ | స్పానిషు. |

మొదటనే చెప్పుకొన్నట్టు ఇది స్థూల పరిగణనము మాత్రమే. ఇంతకంటెను విశదముగా పరిగణింపవలయునన్న, ఆయా దేశముల భాషలను మరింతగా పరిశీలింపవలయును. ఒక కుటుంబమునకు చెందని భాషలు, ఒక వర్గమునకు చెందని భాషలు ఒక్కచోట చేరియుండుట యీ వర్గీకరణమునందు కనబడును. శాస్త్రజ్ఞులు మొదటి రెండు విధము లయిన వర్గీకరణములను సమ్మతింపగా, ఆచరణప్రియులు చివరి వర్గీకర ణము నభిమానింతురు. వేరువేరు దేశములలో, వేరువేరు భాగము

లలో నున్న భాషలనుగూర్చి తెలిసికొనుట దేశసంచారులు, వర్తకులు, రాయబారులు మున్నగువారికి ఎంతయో ప్రయోజనకరము. మఱియు గానే ఆయాభాషలను గురించి తెలిసికొనుటవల్ల వారికి ఆయాదేశము లందలి పర్యటనము సులభసాధ్యమగును. కావుననే మార్గదర్శినిని ఉప యోగించునట్లే భాషాదర్శిని (Language Guide) ని కూడ ఉపయో గించుకొనవలయునన్న ఉత్సాహముండుట పైని చెప్పుకొన్నవారికి సహ జముగానేయుండును. భౌగోళిక వర్గీకరణము ఆ విధమగు నుత్సాహము నకు తోడ్పడి ఆచరణాత్మక ప్రయోజనమున కనుకూలించును. కావున నిదియు ఆదరణీయము, ఆచరణీయము కాకతప్పదు.

# 6. ధ్వని విజ్ఞానము

భాష వాక్యముల సముదాయము; వాక్యము పదపదాంశముల సముదాయము; పదముకాని పదాంశము కాని కొన్నిధ్వనుల సముదాయము. వక్తనుబట్టి ఉచ్చారణధ్వనులును, శ్రోతనుబట్టి శ్రావణధ్వనులును పరిగణితము లగును. ఇతరేతరధ్వనుల నుండి నిర్ధారించు నుద్దేశముతో ఉచ్చారణధ్వనులను శ్రావణధ్వనులను సామూహికముగా 'భాషాధ్వనులు' అనికూడ నందురు.

ప్రతిభాషయందును ధ్వనులు పరిమితముగానే యుండును. ఒక భాషయందు పాతికధ్వనులు మాత్రమే యుండగా, మరొక భాషయందు వందధ్వనులుండవచ్చును. ఒకభాషయందున్న ధ్వనులు మరొక భాషయందు లేకపోవచ్చును. ఒకభాషయందు లేనిధ్వనులు మరొక భాషయం దుండవచ్చును. ఒక్కొక్కప్పుడు రెండుభాషలలోను ధ్వనులు సదృశముగా నుండవచ్చును; కాని, అవి సమానధ్వనులు కాకపోవచ్చును.

మానవుని ముఖయంత్రము అసంఖ్యాకములైన ధ్వనుల నుత్పత్తి కేంద్రము. అందు కొన్నిధ్వనులుమాత్రమే భాషాధ్వనులుగా పరిగణితము లగును. ప్రతివ్యక్తియు తనభాషయందలి ధ్వనులను తాను స్పష్టముగా తెలిసికొనుట యవసరము. అప్పు డితరభాషలయందలి ధ్వనులను గుర్తుపట్టుట కొంత సులువుగా నుండును. అప్పుడుకూడ తన భాషాధ్వనులనుబట్టి యట్లే పరభాషాధ్వనులను గ్రహించుట, విలక్షణతను గుర్తింపకపోవుట, సదృశత్వమును సమానత్వముగా భావించుట మొదలయిన పొరపాటులు జరుగవచ్చును. ఏ భాషనైనను తద్భాషాభాషుల యుచ్చారణ ననుసరించి యుచ్చరింపవలయును. అట్లు కానియెడల ఆ

భాషణము అవగాహనయోగ్యము కాకుండుటయే కాక, అపహాసభాజనముకూడ కావచ్చును. నిజమున కే భాషను నేర్చుకొనవలయునన్నను ఆ భాషయందలి ధ్వనులను సక్రమముగా సమర్థముగా నేర్చుకొనవలయును. ధ్వనులను నేర్చుకొన్న పిమ్మటనే పదసామగ్రిని, వ్యాకరణ విధానమును నేర్చుకొనుట సాధ్యమగును.

ధ్వను లనగా లేఖనసంకేతములనియు, లిపిని నేర్చుకొనినగాని భాషరాదని చెప్పుచున్నట్లును భ్రమకలుగవచ్చును. ఇతరభాషలను నేర్చుకొనునప్పుడు మొట్టమొదట అక్షరములను వ్రాయుట, వానిని చదువుట, మాటలను నేర్చుకొనుట, వ్రాయుట- యీ విధముగాసాగుచున్నమాట వాస్తవమే. ఈవిధమైన భాషాభ్యాసమునకును,ప్రకృతప్రసంగమునకును సంబంధము లేదు. మనము మాటలాడు భాషనే భాష యనుచున్నాము. దీనికి లిపి యుండిన నుండవచ్చును; లేకున్న లేకపోవచ్చును. ఉచ్చరించు భాషలోనున్న కనిష్ఠధ్వనులకే 'ధ్వనులు' అన్న పేరు. ఆంగ్లమునందు ఇరువదియారు అక్షరములున్నవి. వానిని మనము ధ్వను లనుటలేదు. cut, put- అను రెండు మాటలలోను రెండవ యక్షరము, మూడవ యక్షరము సమానములు. ఉచ్చరించినపుడు మూడవయక్షరము సమానముగానే యున్నది; అనగా ఒకే ధ్వనికలిగి యున్నది. రెండవయక్షరము రెండువిధములయిన యుచ్చారణముకలిగి యున్నది. మొదటిమాటలోని ధ్వనివేరు; రెండవమాటలోని ధ్వనివేరు. సాంప్రదాయికముగా అక్షరములు (alphabets) అని చెప్పుకొనువానికిని ధ్వనులు (phones) అనువానికిని సంబంధము లేదు. వ్యవహారమునుబట్టి భాషాధ్వనులను గుర్తింపవలయును. bed, head- అను రెండు పదములలో రెండవ ధ్వనిని గమనింతము. రెండింటియందును [ఎ] అను ధ్వనియే యున్నది. మొదటిమాటయందు 'ఇ' అను నొక యక్షరమే దానిని సూచించుచుండగా, రెండవమాటయందు 'ఇ, ఎ' అను రెండక్షరములు కలిసి సూచించుచున్నవి. కావున వ్రాతయం దుప

యోగించు అక్షరములకును, ఉచ్చారణమునందలి ధ్వనులకును సమాన త్వమును కల్పించుకొనుట పొరపాటు. [1] శాస్త్రజ్ఞుల పరిగణమునుబట్టి ఆంగ్లభాషయందు హల్ ధ్వనులు ఇరువదిమూడును, స్వరధ్వనులు ఇరువదియేడును గలవు.

అనుభవమునుబట్టి యిక్కడ ఒక విషయమును చెప్పుకొనవలయును. స్వభాషలో ఒక్కయక్షరము వ్రాయుటకాని, చదువుటకాని యెరుగని వ్యక్తి పరభాషలను ధారాళముగా మాటలాడగల్గుట చూచుచున్నాము. ఆ భాషాసమాజముతో కలిసి నివసించుటచేత, వ్యవహారవశముననే ఆ భాష ఆవ్యక్తికి పట్టువడుచున్నది. నిజమునకు ఒకభాషాసమాజమునందు పుట్టుటచేత కాక, పెరుగుటచేతనే భాష పట్టువడును. అందుచేతనే భాష ఆర్జితమేకాని 'వారసత్వము' కాదని చెప్పుకొంటిమి. తద్భాషాసమాజముతో నున్న గాఢపరిచయమునుబట్టి భాషాంశముల నన్నింటిని గ్రహింపవచ్చును. ఇందులో సందేహము లేదు. కాని, యిది జరుగుటకు చాలకాలము పట్టును. అంతేకాక, అందరకు ఇతరభాషాసమాజముల నడుమ నివసించెడి అవకాశముకూడ లభ్యము కాదు. అప్పటికిని తప్పులుచేయుట, సవరించుకొనుట శిశుభాషలో నున్నట్లే తద్భాషాభ్యాసకుని భాషలో నుండును. అంతేకాక స్వభాషాభ్యాసమునందు అభినివేశముకలిగిన వయోజనులకు పరభాషలు పట్టువడుట చాలకష్టము. పూర్వాభ్యాసములు సడలిననే కాని క్రొత్తలక్షణము లలవడవు. మొత్తముమీద భాషాసమాజసహజీవనము వలన అన్యభాష నభ్యసింపవచ్చునని యంగీకరింపక తప్పదు. కాని,అది సులభమైనపని కాదనికూడ అంగీకరింపక తప్పదు.

అంతకంటెను తక్కువశ్రమతో, తక్కువకాలములో అన్యభాషలను అత్యంత సమర్థతతో నేర్చుకొనవచ్చును. దానికి భాషాశాస్త్రము సహకరించును. ముఖ్యముగా ధ్వనిసమూహమును సక్రమముగా,సమర్థముగా ఉచ్చరించుటకు ధ్వనివిజ్ఞానము దారి చూపును.

---

1. English Phonetics- Walter Ripman.

ధ్వనివిజ్ఞాన శిక్షితుడు పరిశీల్యమాన భాషయందలి ధ్వనులను వ్యవహర్త పలుకుచుండగా విని గుర్తించుకొనును. తన శిక్షణనుబట్టి యనుభవమునుబట్టి ఆ ధ్వనులను వింగడించును. ప్రతిధ్వనియొక్క ప్రత్యేకతను నిరూపించుచు వర్ణించును. ఆ వర్ణనమునుబట్టి ఆ ధ్వనులను తానుమాత్రమే కాక, తనవలె శిక్షణనొందిన అందరును పలుకవచ్చును. ప్రయోగమునందు ప్రవాహరూపముగానున్న భాషాధ్వనులను గుర్తించుట కష్టము. కాని, ధ్వనివిజ్ఞాన శిక్షితుడు తన పరిశీలన సామర్థ్యముచేత ప్రయోజనవంతములైన ధ్వనులను గుర్తించి పరిగణించును. అనంతముగా ననిపించిన ధ్వనులు క్రమబద్ధములై పరిమితములుగా ప్రత్యక్షము లగును.

భాషాపరిశీలకుడు పరిశీల్యమాన భాషయందు తాను కనుగొన్న అంశములను భద్రపరుచుకొనవలయునన్న లేఖనవిధానము కావలయును. లిపియున్న భాషయే యైనచో ఆ లిపినే వాడుకొనవచ్చును. లిపియుండియు సమర్థము కానిచో, లిపియే లేనిచో పరిశీలకుడు లిపిని కల్పింపవచ్చును. అది తద్భాషాభ్యాసకులకు వినియోగపడును.

ధ్వనివిజ్ఞానము ధ్వనులను గుర్తించుటకు, వర్ణించుటకు, వర్గీకరించుటకు, అభ్యసించుటకు, లేఖనచిహ్నములను నిర్మించుటకు సైతము పనికివచ్చును. అన్యభాషాధ్వనులనే కాదు; స్వీయభాషా ధ్వనులను సైతము సక్రమముగా తెలిసికొనుటకు ధ్వనివిజ్ఞాన మావశ్యకమే.

## 6. ౧ ధ్వనుల యుత్పత్తి

సొన్నాయివాద్యము పనిచేయువిధానమును జ్ఞప్తికి దెచ్చుకొన్న యెడల ధ్వనుల యుత్పత్తి విధానమును గుర్తుపట్టవచ్చును. వాదకుని నోటియందు ఒక కొనయుండును. ఆ కొన అంతర్భాగమున పీకలుండును. వానిలోనుండి వాయువును పూరగించుచు వాదకుడు అవతలి కొననైపుగా నున్న రంధ్రములను మూయుచు తెరచుచు నుండును.

అందువలన అభిలషితములైన ధ్వను లావిర్భవించును. ఇదేపద్ధతి స్థూలముగా భాషాధ్వనుల యుత్పాదన విషయమునగూడ గోచరించును. ఊపిరితిత్తులనుండి వెలువడెడి వాయువు నాదతంత్రుల నడుమ నుండి ప్రసరించును. అచ్చటనుండి నోటిలోనికి గాని, ముక్కులోనికి గాని ప్రసరించును. ఈలోపుగా ఆ వాయువునకు పూర్తిగా కాని, కొంచెముగా కాని, ఒకప్రక్కగా కాని, ఎట్టయెదుట కాని అవరోధము కల్పింపబడును. అట్లు కల్పించుటచేత వేరువేరు ధ్వనులు పుట్టును. కావున, 'ధ్వనులకు వాయుప్రవాహమే మూలాధారము. ఇది స్థూల చిత్రణము.

ఈ చిత్రణమునుబట్టి అయిదు రకములయిన ధ్వనులను మనము గుర్తింపగలము.

1. వాయునాళము వెంబడి వెలువడు వాయువు నొకచోట పూర్తిగా స్తంభింపజేయుటచేత స్పర్శములు (stops) పుట్టును. వీనిని పలుకునప్పుడు వాయుప్రవాహము రుద్ధమై ఒక్కసారిగా విడువబడును. అందువలన స్పర్శములకు స్ఫోటములు (plosives) అను నామాంతరముకూడ కలిగినది. పడవ, తలిరు, కలిమి; బయలు, దరువు, గడప - అను పదములలోని ప, త, క; బ, ద, గ - అను ధ్వనులు స్పర్శములు.

2. కొన్ని వర్ణములను పలుకునప్పుడు వాయునాళమునుండి వెలువడు వాయు ప్రవాహము ఏదో యొక స్థానమున మిక్కిలి యవరోధము నందును. అప్పుడు వాయు వా యవరోధమును దాటి వెలువడుటకు చేయు ప్రయత్నమువల్ల సన్నని సందుగాని, ఒక సుడివంటిది గాని యేర్పడును. అందుండి వాయువు నిర్గమించునప్పుడు పా ము బు స వంటి శబ్దము వినవచ్చును. ఇట్లు బుసతోడి ధ్వను లగుటవల్ల ఊష్మములు (spirants) అనుపేరు గలిగినది. ఈధ్వనులను పలుకునప్పుడు నాలుకకును స్థానమునకును నడుమ కొంచెము వ్యవధాన మేర్పడును. వాయు వావ్యవధానములో నుండి సంఘర్షణము నొందుచు వెలువడును. కావుననే

సంఘర్షణమునుండి జనించిన ధ్వను లన్న భావముతో వీనిని ఘర్షములు (fricatives) అని కూడ వ్యవహరింతురు. శరము, షండము, సమత – అను పదములందలి శ, ష, స – అను ధ్వనులు ఊష్మములు. ఆంగ్ల భాషయందలి fan, van, thin, then, seal, zeal, shed – అను పదములందలి f, v, th, s, z, sh - అను ధ్వనులు ఊష్మములు.

3. కొన్ని ధ్వనుల నుచ్చరించు సమయమున నాలుక ఒక స్థానమును స్పృశించి వాయు ప్రవాహమునకు అవరోధమును కలుగజేయును. అట్టియెడల మధ్యభాగము రుద్ధమై యుండుటచేత నాలుక యొక్క యిరుపార్శ్వములనుండికాని, ఏదోయొక పార్శ్వమునుండి కాని వాయువు బయల్వెడలును. అట్లు అవరోధమున్న సమయముననే పార్శ్వములనుండి వాయువు వెలువడినప్పుడు పుట్టిన ధ్వనులను పార్శ్వికములు (laterals) అని పిలుతురు. కొందరు వీనిని స్పష్టభాషలో 'side consonants' అని కూడ వ్యవహరింతురు. తల, కళ అను పదములలోని ల, ళ – అను ధ్వనులు పార్శ్వికములు. ఆంగ్లమునందలి lip, leap అను పదములలోని తొలిధ్వని పార్శ్వికము.

4. వాయు ప్రవాహవేగమువలన జిహ్వాగ్రము ప్రకంపనములను పొందుచు, అవ్యవహితముగా పలుమారులు స్థానమును స్పృశించుట జరుగును. దాదాపుగా Calling Bell పనిచేయునట్టి విధానమే యిచ్చటను గోచరించును. ఇట్లు పెక్కు పర్యాయములు వ్యవధానము లేకుండ ప్రకంపనములనొంది స్పృశింపగా జనించిన ధ్వనులకు కంపితములు (trills) అని పేరు. కఱ్ఱ, బఱ్ఱె – అను పదములలోని తుది హల్‌ధ్వని కంపితము. ఆంగ్లమునందలి trill అను శబ్దములోని 'r' కంపితము. జర్మను భాషలోని rot, స్పానిషుభాషలోని rojo అను పదములలోని తొలిధ్వనులు కంపితములు.

5. వాయునాళమునుండి వెలువడు వాయువున కెచ్చట గాని యవరోధము లేకుండ సాగనిచ్చినచో కొన్నిధ్వనులు పుట్టును. వాయువు

నకు అవరోధము లేకపోవచ్చునుగాని ముఖవివరము ఆ యా ధ్వనుల కనుకూలముగా ఆకృతిని మార్చుకొనును. అట్టి మార్పువల్లనే ధ్వనులలో వైవిధ్యము. అచ్చులు (vowels) నిర్నిరోధముగా జనించిన ధ్వనులు. అపుడు, ఇపుడు, ఎపుడు - అను పదములలోని తొలిధ్వనులు అచ్చులు.

ఇందు మొదటి నాలుగు వర్గములు - అనగా స్పర్శములు, ఘర్షములు, పార్శ్వికములు, కంపితములు - అన్నవి హల్లులు. ఐదవ వర్గము అచ్చులు.

ఈపైని చేసిన విభాగము వాయుప్రవాహమున కున్న యవరోధమునుబట్టి జరిగినదనుట స్పష్టము. ఉచ్చారణవిధానమునందలి ప్రయత్నమే యీ విభాగమునందు ప్రధానవిషయము.

నాదతంత్రుల (vocal chords) స్థితినిబట్టి ధ్వనులను రెండు విధములుగా విభాగింపవచ్చును. ఆ విషయమును చూతము. సన్నాయి పోలికతో ధ్వనుల యుత్పత్తిని పరిశీలించుట మొదలుపెట్టితిమి; కావున దానినే కొనసాగింతము. వాదకుడు నోటియందు పెట్టుకొను సన్నాయి కొనకు పీక లుండునని చెప్పుకొంటిమి. అవి రెండును మిక్కిలి దూరముగా నున్నచో ధ్వని యుత్పన్నము కాదు; అతుకుకొని పోయినచో లోనుండి వాయువు ప్రసరించుటకే వీలులేదు. అట్లే వాయునాళము వెంబడి ఉచ్ఛ్వాసనిశ్వాసములందు వాయువు ప్రసరించును ఆ సమయమున (laryrnx) గళగ్రంథికి లోపలి భాగమునున్న స్వరపేటిక (glottis) లో నుండి వాయువు ప్రసరించును. స్వరపేటికయందే నాదతంత్రులు ఒకదానికొకటి ఎదురుగా నిలిచియుండును. ఆ నాదతంత్రుల (vocal chords) నడుమనుండి వాయుప్రవాహము సాగును. అయినప్పటికిని ధ్వని యుత్పన్నము కాదు. ఇటువంటి సమయమున నాదతంత్రులు మిక్కిలి దూరముగా విడివడియుండును. అందువలననే ధ్వని పుట్టుట లేదు. అవి కొంచెము దగ్గరకురాగా వానిమధ్యనుండి వాయువు అవ

రోధము లేకుండ సులభముగా వెలువడు నప్పుడు ధ్వనులుపుట్టును. అట్టి ధ్వనులను 'శ్వాసములు' అని కాని 'అఘోషము' అనికాని పిలుతురు. ఆంగ్లమునందు వీనిని unvoiced sounds అని కాని surds అని కాని వ్యవహరింతురు. కలప, తలపు, పలక-అను పదములలో మొదటి ధ్వనులు శ్వాసములు. వీనిని పలుకునప్పుడు ప్రవాహరూపములో వాయువు వేగవంతమై వెలువడుచుండగా, దానిని నోటియందు నాలుకతో గట్టి ప్రయత్నముచేసి అవరోధించుట జరుగును. కావుననే కొందరు ప్రయత్నమును పరిగణించి కఠోరహల్లులు (hard consonants) అని కూడ పిలుతురు.

నాదతంత్రులు పరస్పరము సన్నిహితముగా నుండగా, వాని మధ్యనుండి యొరసికొనుచు వాయువు వెలువడినపుడు ఉచ్చరితములగు ధ్వనులను 'నాదములు' అని కాని 'ఘోషములు' అని కాని పిలుతురు. ఆంగ్లమునందు వీనిని voiced sounds అని కాని sonants అని కాని యందురు. గరువు, దరువు, బరువు- అను పదములలో మొదటి ధ్వనులు నాదములు. అచ్చు లన్నియు నాదములే.

శ్వాసనాదభేదమును శ్రవణమాత్రముచేత గుర్తింప గలుగుటకు మంచి అభ్యాసము కావలయును. అయినను, వానిని గుర్తించుటకు సాధారణముగా రెండు మార్గములు సూచింతురు. ఉచ్చారణ సమయమున గొంతుముడిపై వ్రేలుంచి పరీక్షించుట యొక మార్గము. నాద ధ్వనులను పలుకునప్పుడు స్వరపేటికయందలి నాదతంత్రుల ప్రకంపనము (vibration) లను గుర్తింపవచ్చును. శ్వాసములను పలుకునపుడు ప్రకంపనములు కలుగవు. కావున, అట్టి యనుభూతి యుండదు. ఉచ్చారణ సమయమున రెండు చెవులయందును వ్రేళ్ళను దూర్చుకొని పరీక్షించుట రెండవ మార్గము. నాదముల నుచ్చరించునపుడు గింగురుమని ఒక రొదవలె వినిపించును; శ్వాసములను పలుకునప్పు డట్టి రొద కలుగదు. దాదాపుగా హల్లు లన్నియు శ్వాసనాద విభాగము నంగీకరించును.

ఇప్పుడింకొక విషయమును చూతము. సొన్నాయి యందు వాయువును పూరగించుచు వాదకుడు తన వ్రేళ్ళతో రంధ్రములను మూయుచు, అవరోధమును కలిగించును. అందువల్లనే వేర్వేరు స్వరము లుత్పన్నము లగును. అట్లే మానవుడు వాయు నాళమునుండి వెలువడు వాయువును నోటియందలి ప్రత్యేక ప్రదేశములందు జిహ్వాభాగములతో అడ్డగించును. పై పెదవిని క్రింది పెదవి గట్టిగా తాకుటవలన ఓష్ఠ్యములు పుట్టును. పలక, బరువు – అను మాటలందు మొదటి ధ్వనులు ఓష్ఠ్యములు. నాలుకకొన పైపండ్ల వెనుక భాగమును తాకుటవల్ల దంత్యములు పుట్టును. తలుపు, దరువు – వీనిలో మొదటిధ్వనులు దంత్యములు. నాలుకకొన ప్రతివేష్టితమై (తిరుగబడి) మూర్ధమును తాకినపుడు మూర్ధన్యములు పుట్టును. ఇచట, ఇక్కడ – వీనిలో చివరివి మూర్ధన్య ధ్వనులు. జిహ్వామూలము మృదుతాలువును తాకినపుడు జిహ్వామూలీయములు పుట్టును. కడి, గడి – వీనిలో మొదటివి జిహ్వామూలీయములు. పై యుదాహరణములలో రెండేసి యుదాహరణములు గలవు. అందు మొదటిది శ్వాసము; రెండవది నాదము.

పైని చెప్పుకొన్నవనియు మౌఖికధ్వనులే. అనగా వాయునాళమునుండి ముఖవివరములో ప్రవేశించిన వాయువు ముఖమునుండి నిర్గమించుచుండగా ఆ యా ధ్వనులు పుట్టునని యర్థము. నోటియందు జిహ్వామూలమునకు పైని లంబిక వ్రేలాడుచుండును. అది మౌఖిక ధ్వనులను పలుకునపుడు నాసికాద్వారమును మూసియుంచును. ముఖద్వారమును మూసి నాసికాద్వారమును తెరచినపుడు అనునాసికములు పుట్టును. ఓష్ఠ్యానునాసికము మ; దంత్యానునాసికము న; మూర్ధన్యానునాసికము ణ; జిహ్వామూలీయానునాసికము ఙ. అచ్చుల నన్నింటిని అనునాసికోచ్చారణముతో పలుకవచ్చును. కొన్ని భాషలయందు అట్టి యుపయోగము అధికముగా కలదు.

ఇంకొక విషయముకూడ నిచ్చటనే గుర్తుచేసికొనుట యవసరము. వాదకుడు సన్నాయియందు గాలి పూరించునట్లే, వక్త శ్వాసకోశములలోని వాయువును వాయునాళము వెంబడి నాకర్షించి ముఖయంత్రమునందు పూరించును. ధ్వనుల యుచ్చారణమునందు ఇది సర్వసాధారణవిషయము. కాని, దీని కపవాదము లేకపోలేదు. ఆఫ్రికాలోని బంటూ కుటుంబభాషలందు గాలిని లోనికిపీల్చి శ్వాసకోశములలోనికి పంపునప్పుడు కొన్నిధ్వనులు పుట్టును. ఇట్టివానిని క్వణనధ్వనులు (clicks) అని కాని అంతఃస్ఫోటితములు (implosives) అని కాని యందురు.

ఇంతవరకు 1. ఉచ్చారణ విధానము 2. నాదతంత్రుల అవస్థానము 3. స్థానము - అను నంశములనుబట్టి ధ్వనుల యుత్పత్తి స్థూలముగా చిత్రితమైనది.

## 6. ఎ. వాచికాంగములు

పైని చెప్పికొన్నట్లు మానవముఖయంత్రమే ధ్వన్యుత్పత్తి కేంద్రము. ముఖయంత్రమునుండి వెలువడు ధ్వనులను గూర్చి తెల్పు శాస్త్రమే ధ్వనివిజ్ఞానము. ముఖయంత్రమునుండి అసంఖ్యాకములయిన ధ్వనులు వెలువడును. వానికి భాషాధ్వనులుగా నుపయోగపడు సామర్థ్య మున్నప్పుడు మాత్రమే యిందు పరిగణింతుము. ముఖయంత్రమునందలి వివిధభాగముల నిర్మాణమునుగూర్చి కొంత తెలిసికొనుట యవసరమే. అయినను, అది శరీరశాస్త్రవిషయము. దానిని గురించి విశదవివేచన చేయవలసిన యవసర మిచ్చట లేదు.

స్థూలముగా వాచికాంగములుగా నోరు, ముక్కు, వాయునాళము, ఊపిరితిత్తులు మున్నగువానిని పరిగణింతుము. నోరు ప్రధానముగా ఆహారగ్రహణమున కుద్దిష్టము. ముక్కు, వాయునాళము, ఊపిరితిత్తులు శ్వాసక్రియ కుద్దిష్టములు. కాని మానవుడు తన సామర్థ్యముచేత ధ్వన్యు

త్పత్తి సాధనములుగా వినియోగించు కొనుచున్నాడు. శ్వాసక్రియ సహజసిద్ధము; ధ్వన్యుత్పత్తి ప్రయత్నసాధనము, నిరంతరాభ్యాసఫలము. నోరు, ముక్కు మొదలయినవి వాచికాంగములే యైనను, వీనికీ శక్తి కల్పితమేకాని స్వయంసిద్ధము కా దనుట వివేచనప్రయోజనము.

### ముఖయంత్రము

1. నాసికావివరము
2. ఆస్యవివరము
3. జిహ్వ
4. జిహ్వాగ్రము
5. జిహ్వామధ్యము
6. జిహ్వామూలము
7. హనుమూలము
8. సప్తపథ
9. క్రిందిదంతములు
10. పైదంతములు
11. క్రింది పెదవి
12. పై పెదవి
13. దంతమూలము (వర్త్స్యము)
14. మూర్ధము
15. మృదుతాలువు
16. లంబిక
17. కొండనాలుక (ఉపజిహ్వ)
18. కృకాగ్రము
19. నాదతంత్రులు




వాచికాంగములను ప్రత్యక్షభాగస్వాములు (direct participants) పరోక్షభాగస్వాములు (indirect participants) అని రెండు విధములుగా విభాగింతురు. ముఖయంత్రమునందుండి, ధ్వనుల యుచ్చారణమునందు ప్రత్యక్షముగా పాల్గొనునవి ప్రత్యక్షభాగస్వాములు. పరోక్షముగా నుండి ముఖయంత్రమునకు ధ్వన్యుత్పాదన సామర్థ్యమున కనువుగా ప్రేరణను కలిగించునవి పరోక్షభాగస్వాములు. పంచేంద్రియములు, నాడీమండలము, మెదడు, కండరములు, శ్వాసకోశము, వాయు

నాళము, విభాజకము- ఇవి యన్నియు పరోక్షభాగస్వాములే. విభాజకముయొక్క యొత్తిడివలన శ్వాసనాళములోనుండి వాయుప్రవాహము ఆస్యములోనికి ప్రవేశించును. అప్పుడచ్చటి జిహ్వాది సాధనములు వివిధ రీతులలో అవరోధమును కల్పించుటచేతను, ప్రవాహగతిలో మార్పు కల్గించుటచేతను భాషాధ్వనులు పుట్టుచున్నవి. కండరముల కదలిక, నాడీమండలము తోడ్పాటు, మెదడునందలి యిచ్ఛాశక్తి మొదలగునవి పై ప్రక్రియను పరిణమింపజేయును. కాని పరోక్షభాగస్వాముల విషయము ధ్వనులను గుర్తించుటలో మనకు ఆవశ్యకము కాదు. కావున, ప్రత్యక్షభాగస్వాముల విషయమును గమనింతము.

ప్రత్యక్షభాగస్వాములనుగూడ తిరిగి రెండు విధములుగా విభాగింపవచ్చును. ఆస్యమునందుండి ధ్వనుల యుత్పత్తికి సహకరించెడి అంగములను ఆభ్యంతరప్రత్యక్షభాగస్వాములని, ఆస్యమునకు వెలుపల నుండి ధ్వనులయుత్పత్తికి సహకరించెడి అంగములను బాహ్యప్రత్యక్ష భాగస్వాములని యందురు. ఓష్ఠములనుండి జిహ్వామూలమువరకు గలది ఆస్యవివరము (oral cavity). దీనియందుగల వేరువేరంగములను ఆభ్యంతర ప్రత్యక్షభాగస్వాములుగా పరిగణింతురు. కృకాగ్రము నుండి కంఠమూలమువరకు గలవి బాహ్యప్రత్యక్ష భాగస్వాములు.

వాచికాంగములను మరల రెండువిధములుగా విభజింపవచ్చును. 1. కరణము 2. స్థానము. ఆస్యమునందు కదలెడి భాగము కరణము; కదలని భాగము స్థానము. కరణము తనకు మీదిభాగమున నున్న స్థానమును సమీపించుట కాని, స్పృశించుట కాని చేయును. ప్రాచీనులు స్థానము (Point of orticulation) నకు ప్రాధాన్యమిచ్చి కంఠ్యములు, దంత్యములు, మూర్ధన్యములు, తాలవ్యములు, ఓష్ఠ్యములు అను విధముగా విభాగించిరి. నవీనులు స్థానమునకే కాక కరణము (articulator) నకుసైతము పరిగణనమవసరముగా భావింతురు. ఓష్ఠ్యముల విషయమున క్రిందిపెదవి కరణము, పై పెదవి స్థానము. పైనిచెప్పిన

కంఠ్యాదుల విషయమున నాలుక కరణము. నాలుక యన్నప్పుడు మొత్తము నాలుకనంతటిని గ్రహింపవలయును. కాని మొత్తమునాలుక యంతయు మీదిభాగమును స్పృశించుట యన్నది నోరు పూర్తిగా మూసి యున్నప్పుడు సాధ్యమగునేమో కాని ధ్వన్యుచ్చారణ సమయమున సాధ్యముకాదు. అందువలన నాలుకను కనీసము మూడు భాగములుగా పరిగణింపవలయును. నాలుకయొక్క కొనను జిహ్వాగ్రము (apex) అని యందురు. ఇది మిక్కిలి చలనశీలము కలది. నాలుకయొక్క నడిమిభాగమును జిహ్వామధ్యము అని యందురు. నాలుకయొక్క ప్రారంభభాగమును జిహ్వామూలము అని యందురు. కంఠ్యముల విషయమున మృదుతాలువు స్థానము; జిహ్వామూలము కరణము. ముందరి దంతములు స్థానముగా జిహ్వాగ్రము కరణముగా దంత్యములు పుట్టును. దంతమూలము స్థానముగా జిహ్వాగ్రము కరణముగా దంతమూలీయములు (alveolars) పుట్టును. నాలుక పైనున్న కప్పుయొక్క మధ్యభాగమునకు మూర్ధము (cacumen) అని పేరు. జిహ్వాగ్రముయొక్క వెనుకభాగము మూర్ధమును తాకగా మూర్ధన్యములు (cacuminals) పుట్టును. ముందరిదంతములకు పైభాగముననున్న కప్పును కఠినతాలువు (hard palate) అని యందురు. జిహ్వాగ్రము ఆభాగమును తాకగా తాలవ్యములు జనించును. కంఠ్యములు మున్నగునవి స్థానమునుబట్టి యేర్పడిన సంజ్ఞలు. జిహ్వాగ్రీయములు (apicals), ప్రతివేష్టితములు (retroflexes), కంపితములు (trills) మొదలయినవి కరణమునుబట్టి యేర్పడిన సంజ్ఞలు.

కృకాగ్రమునుండి కంఠబిలమువరకు గల వివరమునకు 'సప్తపథ' (Pharynx) అని పేరు. అచ్చట నుద్భవించు ధ్వనులకు సప్తపథీయములు (Pharyngals) అని పేరు. స్వరతంత్రులకు నడుమగల స్థలమును కాకలాంతరము (glottis) అని యందురు. అందుద్భవించు ధ్వనులను కాకలాంతరీయములు(glottals)అనియందురు. శ్వాసనాళము(trachea)

నకు పై భాగమున కృకాగ్రము (larynx) కలదు. దీనికే 'కాకలము' అన్నది నామాంతరము. ఇందుపుట్టిన ధ్వనులను కాకల్యములు (laryngals) అని యందురు.

## నాదతంత్రుల అవస్థానము




మొదటి చిత్రము : నాదతంత్రులు దూరస్థములై యున్నప్పుడు శ్వాసక్రియ నిర్నిరోధముగా జరుగును. అప్పుడు సాధారణముగా ధ్వను లేవియు నుద్భవింపవు. పరుగెత్తుకొని వచ్చినవాని శ్వాసక్రియయందు ధ్వని వినిపించును. కాని, అది భాషాధ్వని కాదు.

రెండవ చిత్రము : నాదతంత్రులు అత్యంత సమీపస్థములై ఒక దానితో నొకటి యతుకుకొని పోయినప్పుడును ధ్వను లుద్భవింపవు. ఏదైన బరువును మీదికెత్తవలసినప్పుడు శ్వాసను బిగించి పైకెత్తుదుము. ఇట్టి స్థితిలో నాదతంత్రు లతుకుకొనిపోయి యుండును.

మూడవ చిత్రము : నాదతంత్రుల మధ్య సన్నని చీలికయేర్పడి యుండగా శ్వాసనాళము వెంబడి వాయువు ప్రవహించును. అప్పుడు నాదతంత్రులతో కొంత ఒరపిడి యేర్పడును. ఇట్లు ఒరపిడితో నేర్పడిన ధ్వనులకే నాదము లనిపేరు.

నాలుగవ చిత్రము : నాదములను పలుకునప్పటివలెనే నాద తంత్రుల నడుమ సన్ననిచీలిక యుండును. కాని నాదములను పలుకునపుడు నాదతంత్రులు ప్రకంపితములగుటకు వీలుగా శైథిల్యము నొంది యుండును. ఇక్కడ నాదతంత్రులు బిగిసియుండి ప్రకంపితములు కావు. ఇందువలన గుసగుస (whisper) ధ్వనులు జనించును.

ఇట్లు కృకాగ్రము, సప్తపథ, లంబిక, మృదుతాలువు, మూర్ధము, కఠినతాలువు, దంతములు, దంతమూలము, పెదవులు, జిహ్వాగ్రము, జిహ్వామధ్యము, జిహ్వామూలము, హనుమూలము, ఉపజిహ్వా, నాసిక-ధ్వన్యుత్పాదనమున ప్రత్యేకభాగస్థానములుగా వ్యవహరించును.

## 6. 3 అచ్చుల వర్గీకరణము

కరణముగా వ్యవహరించు జిహ్వాభాగమునుబట్టియు, జిహ్వౌన్నత్యమునుబట్టియు, పెదవుల యవస్థానమునుబట్టియు అచ్చులను వర్గీకరించుట జరుగును.

1. జిహ్వాగ్రము తాలువు వంకగా కాని, పై పండ్లవంకగా కాని లేచుటచేత పుట్టునవి అగ్రిమాచ్చులు. జిహ్వామూలము మృదుతాలువు వైపు లేవగా పుట్టునవి పశ్చిమాచ్చులు. జిహ్వామధ్యము మూర్ధము వైపు పైకి లేవగా పుట్టునవి మధ్యమాచ్చులు.

2. ఉచ్చారణసమయమున నాలుక మొత్తమంతయు బల్లపరుపుగా నుండగా పుట్టునవి నిమ్నాచ్చులు. నాలుక కొంచెము పైకి లేవగా పుట్టునవి మధ్యాచ్చులు. నాలుక బాగుగా పైకి లేవగా పుట్టునవి ఉచ్చాచ్చులు. ఉచ్చాచ్చులకు మధ్యాచ్చులకు నడుమ పుట్టునవి ఉచ్చమధ్యాచ్చులు.

3. ఉచ్చారణసమయమున పెదవులు పరస్పరము దూరస్థములై యున్నచో ఏర్పడునవి వివృతాచ్చులు; కొంచెము సన్నిహితములైనపుడేర్పడునవి అర్ధవివృతాచ్చులు; మరికొంచెము సన్నిహితములైనపుడేర్పడునవి అర్ధసంవృతాచ్చులు; ఇంకను నికటస్థములైనపుడు ఏర్పడునవి సంవృతాచ్చులు. రెండుపెదవులను ముందునకు చాపి గుండ్రముగా నేర్పరిచినప్పుడు వర్తులితములు (rounded vowels) పుట్టును. పెదవులు గుండ్రముగా నేర్పడకున్నయెడల విస్తారితములు (stretched vowels) పుట్టును. వీనిని అవర్తులితములు (unrounded vowels) అనికూడ వ్యవహరించుట కలదు.

Machine అనునప్పుడు ఆంగ్లమునందలి 'i' అగ్రిమస్వరము Hat లోని 'a' మధ్యమస్వరము. Rule లోని 'u' పశ్చిమస్వరము.

జిహ్వౌన్నత్యమునుబట్టి Machine లోని 'i' ఉచ్చాచ్చు. Met లోని 'e' మధ్యాచ్చు. Father లోని 'a' నిమ్నాచ్చు.

పెదవుల అవస్థానమునుబట్టి i, e, a అను నక్షరములవల్ల కలుగు ధ్వనులు విస్తారితములు మాత్రమే. Rule లోని 'u' వర్తులితస్వరము.

పెదవుల దూరమునుబట్టి పైవానిలో 'i' సంవృతస్వరము; 'e' అర్ధసంవృతస్వరము; 'a' వివృతస్వరము. ఆంగ్లమునందలి Fair లోని అచ్చు అర్ధవివృతము.

పై విభాగములలో జిహ్వౌన్నత్యమునుబట్టి చేసిన ఉచ్చాచ్చు (High vowel) మొదలయిన విభాగము, పెదవుల దూరమునుబట్టి చేసిన సంవృతము (closed vowel) మొదలయిన విభాగము భిన్నములు కావు. నాలుకను పైకి తాలువువైపుగా ఎత్తినప్పుడు పెదవులు సమీపస్థములై యుండును. తెలుగునందలి 'ఇ, ఈ' అను ధ్వనులు సంవృతములు. జిహ్వాగ్రము తాలువువైపుగా లేచును. పెదవులు విస్తారితములై సన్నగా విచ్చుకొనును. అట్లే 'ఉ, ఊ' అను ధ్వనులు సంవృతములే. జిహ్వామూలము మృదుతాలువు వంకగా పైకి లేచును. అప్పుడు పెదవులు వర్తులితములై సన్నగా విచ్చుకొనును. ఈ రెండుచోట్లను పెదవులు సమీపస్థములై యుండుటయే జరుగును; జిహ్వాభాగము ఔన్నత్యమును పొందుటయు జరుగును. ఈ లక్షణమునుబట్టి యివి ఉచ్చాచ్చులు.

తెలుగునందలి 'ఎ, ఏ' అను ధ్వనులు అర్ధసంవృతములు. జిహ్వాగ్రము తాలువువైపుగా పైకి లేచును. పెదవులు 'ఇ, ఈ' లను పలుకునప్పటికంటె దూరముగా నుండును. అకారమును పలుకునప్పుడు పెదవులకున్న దూరములో సగముమాత్రమే యిచ్చట నుండును. పెదవులు విస్తారితములై యుండును. 'ఒ, ఓ' అను ధ్వనులును అర్ధసంవృత

ములే. జిహ్వామూలము మృదుతాలువువైపుగా పైకి లేచును. పెదవులు వర్తులితములై 'ఉ ఊ' లను పలుకునప్పటికంటె కొంచె మెక్కువగా విచ్చుకొనును. ఈ లక్షణమునుబట్టి ఉచ్చమధ్యాచ్చులు (High mid vowels).

తెలుగునందలి 'అ, ఆ' అను ధ్వనులు వివృతములు. మొత్తము నాలుక బల్లపరుపుగా నుండగా ఈ ధ్వను లుచ్చరింపబడును. ఈ లక్షణమునుబట్టి యివి నిమ్నాచ్చులు (Low vowels) వీనిని పలుకునప్పుడు పెదవులు విస్తారితములై దూరస్థములై యుండును. ఈ లక్షణమును బట్టియే యివి వివృత స్వరములుగా పరిగణితము లగుచున్నవి.

తెలుగునందలి గ్రాంథికరూపమునందు అర్ధవివృతధ్వనులు కానరావు. వ్యావహారిక రూపమునందు మాత్రమే వినిపించును. వచ్చాడు, వచ్చారు - మొదలయిన పదములలోని 'ఆ' అర్ధవివృతము. ఇది 'ఆ' కారమునకు 'ఏ' కారమునకు మధ్యస్థముగా నుచ్చారితమగును. మేకు, రేకు, - మొదలయినచోట్లనున్న 'ఏ' గ్రాంథికమందు అర్ధసంవృతముగానే ఉచ్చారితము కావలయును. కాని వాడుకయందు అర్ధవివృతముగానే వినిపించును. అట్లే ఓడ, గోడ - మొదలయినచోట్ల 'ఓ' వాడుకయందు అర్ధవివృతముగానే వినిపించును. జిహ్వాన్నత్యమునుబట్టి వీనిని నిమ్నమధ్యాచ్చులు (low mid vowels) అని యందురు.

జిహ్వాన్నత్యమునుబట్టి అమెరికను భాషాశాస్త్రజ్ఞులు ఉచ్చ మధ్య నిమ్న భేదములను పరిగణించిరి; అవాంతర భేదములుగా ఉచ్చ మధ్యము, నిమ్నమధ్యము అని కూడ పరిగణించిరి. అట్లు మొత్తము అయిదు భేదము లేర్పడినవి. బ్రిటిషు దేశస్థులును, జర్మని దేశస్థులును పెదవుల నడిమి దూరమునుబట్టి సంవృత, వివృత, భేదములను పరిగణించిరి. అవాంతరభేదములుగా అర్ధసంవృతము, అర్ధవివృతము అని కూడ పరిగణించిరి. అట్లు మొత్తము నాలుగు భేదము లేర్పడినవి. వివారములు, సంవారములు మున్నగు విధముగా ప్రాచీన భారతీయులు చేసిన విభాగమును బ్రిటిషు జర్మను విభాగము అనుసరించుచున్నది.

ఇప్పుడింక అంతర్జాతీయ ధ్వనిపట్టిక (I P A) ననుబట్టి అచ్చులను గుర్తింతము.

## 6. ౪. అచ్చులు - ధ్వనిలిపి

చాల భాషలలో సాంప్రదాయికముగా నుపయోగించు లిపి సమర్థము గాని సమగ్రము గాని కాదని చెప్పుకొంటిమి. 1912వ సంవత్సరములో అంతర్జాతీయ ధ్వనిలిపి సంస్థ (International Phonetic Association) వారు ధ్వన్యక్షరముల పట్టికను ప్రకటించిరని కూడ చెప్పుకొంటిమి. అవసరము వెంబడిని దానియందు చిన్న చిన్న మార్పులనుకూడ చేసిరి. ఇందు ముఖ్యముగా రోమనుల లిపినే గ్రహించినను, కొన్నియెడల గ్రీకులిపినుండి కూడ కొన్ని యక్షరములను గ్రహించిరి. కొన్నియెడల చుక్కలను, గీతలను అదనముగా చేర్చుటచేత, అక్షరములను తలక్రిందులు చేయుటచేత కొన్ని ప్రత్యేకధ్వనులను సాధించిరి. ఉచ్చారణవిధేయముగా భాషను లిపిబద్ధము చేయవలయు నన్నదియె ప్రధానలక్ష్యము. అట్లని యేమాత్రమును పరిచయములేని లిపిని నవీనముగా సృజించినయెడల ఎన్నో యిబ్బందులు కలుగును. కావున, పెక్కు భాషలకు వాడుకయందున్న రోమను లిపినే గ్రహించుట జరిగినది. దీనిని నేర్చుకొనుట, ఉపయోగించుట సులభము. ఇంతేకాక ముద్రణాది విషయములందుకూడ కొంత సౌలభ్యము కలదు. అయినను సాంప్రదాయికాక్షరములకంటె భిన్నముగా చూపుటకై ధ్వన్యక్షరములను చతురస్రికల నడుమ ప్రదర్శింతురు. ఇప్పుడు అచ్చులను, తదుచ్చారణ విధానమును, ఉదాహరణముఖముగా గమనింతము.

[i] ఉచ్చము; అగ్రిమము; సంవృతము; విస్తారితము. ఉచ్చారణ కాలమున జిహ్వాగ్రము తాలువువైపుగా పైకిలేచును. పెదవులు విస్తారితములై సన్నగా విచ్చుకొనును. తెలుగు ఇల్లు; ఫ్రెంచి ici జర్మను nie; ఆంగ్లము ink.

## అచ్చులు

| | అగ్రిమ | మధ్యమ | పశ్చిమ |
|---|---|---|---|
| సంవృతములు | i y | ɨ ʉ | ɯ u |
| అర్ధ సంవృతములు | e ø | ə | ɤ o |
| అర్ధ వివృతములు | ɛ œ æ | ɐ | ʌ ɔ |
| వివృతములు | | a | ɑ ɒ |

[y] ఉచ్చము; అగ్రిమము; సంవృతము; వర్తులితము. ఉచ్చారణ కాలమున జిహ్వాగ్రము తాలువువైపుగా పైకిలేచును. పెదవులు వర్తులితములై సన్నగా విచ్చుకొనును. దీనిని ఓష్ఠ్యీకృత స్వరము (labialized vowel) అని కూడ వ్యవహరింతురు. ఇ వర్ణమును పలుకుచు ఉ వర్ణమును పలుకుచున్నప్పటివలె పెదవులను గుండ్రముగా చేసి ముందునకు చాపవలయును. ఫ్రెంచి vu; lune.

[e] ఉచ్చమధ్యము; అగ్రిమము; అర్ధసంవృతము; విస్తారితము. జిహ్వాగ్రము తాలువువైపుగా పైకిలేచును. పెదవులు విస్తరించుకొని యుండును. వెనుకటి వర్ణములను పలుకునప్పటికంటె, ఈ వర్ణమును పలుకునప్పుడు పెదవుల మధ్య దూరము కొంచెమెక్కువ. ఆంగ్లము pet. ఫ్రెంచి ete.

[θ] దీనినికూడ [e] ధ్వనిని పలికినట్లే పలుకుదురు. ఉచ్చారణ సందర్భమున పెదవులు వర్తులితములై ముందునకు సాగును. ఫ్రెంచి pen

[ε] నిమ్నమధ్యము; అగ్రిమము; అర్ధవివృతము; విస్తారితము. జిహ్వాగ్రమునకును జిహ్వామధ్యమునకును నడిమిభాగము పైకిలేచును. పెదవులు విస్తారితములై మరికొంత విచ్చుకొనును. ఆంగ్లము add; ఫ్రెంచి dette.

[œ] అన్ని విషయములందును పైధ్వనినే పోలియుండును. ఉచ్చారణకాలమున పెదవులు వర్తులితము లగును. ఫ్రెంచి peuple.

[æ] ఇదికూడ నిమ్నమధ్యము; అగ్రిమము; అర్ధవివృతము; విస్తారితము. అన్ని విషయములందును [ε] వంటిదే. కాని [ε] చటుల స్వరము (tense vowel); ప్రకృతధ్వని శిథిలస్వరము (lax vowel). ఆంగ్లము pad; bat.

[a] నిమ్నము; మధ్యమము; వివృతము; విస్తారితము. ఉచ్చారణ కాలమున నాలుక బల్లపరుపుగా నుండును. పెదవులు విస్తరించుకొని

యుండును. పెదవులు మిక్కిలి దూరస్థములైయుండును. అమెరికనుల ఆంగ్లము palm; ఫ్రెంచి patte.

[ɯ] ఉచ్చము; పశ్చిమము; సంవృతము; విస్తారితము. ఉ వర్ణమును ఉచ్చరించునప్పటివలెనే యుచ్చరింపవలయును. పెదవులు విస్తరించుకొని యుండవలయును.

[u] ఉచ్చము; పశ్చిమము; సంవృతము; వర్తులితము. ఉచ్చారణకాలమున జిహ్వామూలము మృదుతాలువువైపుగా లేచును. తక్కిన జిహ్వాభాగమంతయు కొంచెము వెనుకకు కుదించుకొనియుండును. పెదవులు గుండ్రముగానై ముందునకు సాగును. ఆంగ్లము put ; ఫ్రెంచి tout; జర్మను gut.

[ɤ] ఉచ్చమధ్యము; పశ్చిమము; అర్ధసంవృతము; విస్తారితము. 'ఒ' వర్ణము నుచ్చరించునట్లే యుచ్చరింపవలయును. కాని పెదవులను గుండ్రముగా కాక, విస్తరింపజేసి యుంచవలయును.

[o] పై ధ్వనితో సమానమే. కాని యిది వర్తులితము. అందువలన ఓష్ఠములను గుండ్రముగా నమర్చి ముందునకు చాపవలయును. ఆంగ్లము romance; door; ఫ్రెంచి beau; జర్మను rot.

[ʌ] నిమ్నమధ్యము; పశ్చిమము; అర్ధవివృతము; విస్తారితము. 'అ' వర్ణమునువలె పలుకలయును. ఆంగ్లము cut; hut.

[ɔ] నిమ్నమధ్యము; పశ్చిమము; అర్ధవివృతము; వర్తులితము. పెదవులను గుండ్రముగాచేసి ముందుకు చాపి 'అ' వర్ణమును పలుక వలయును. ఆంగ్లము pot; ఫ్రెంచి notre; జర్మను voll.

[ɑ] నిమ్నము; పశ్చిమము; వివృతము; విస్తారితము. నోరు సంపూర్ణముగా తెరచుకొనియుండును; పెదవులు విస్తరించుకొనును. ఆంగ్లము father; ఫ్రెంచి sabre.

[ɒ] నిమ్నము; పశ్చిమము; వివృతము వర్తులితము. పై ధ్వనిని పలికినట్లే పలుకవలయును. కాని పెదవులను గుండ్రముగా చేసి ముందునకు చాపవలయును. ఆంగ్లము Tom; not.

[ɨ] ఉచ్చము; మధ్యమము; సంవృతము; విస్తారితము. దీని యుచ్చారణ ఇ, ఉ ధ్వనులకు మధ్యస్థముగా నుండును. పెదవులు విస్తరించుకొని యుండును. రష్యను byl.

[ʉ] ఉచ్చము; మధ్యమము; సంవృతము; వర్తులితము. ఇదియు మీాది ధ్వనివలెనే యుండును. పెదవులు గుండ్రముగానై ముందునకు సాగును. స్వీడిషు hus; దక్షిణ అమెరికా మాండలికము shoes.

[ə] ఉచ్చమధ్యము; మధ్యమము; అర్ధసంవృతము. [ɛ], [ʌ] ధ్వనులకు మధ్యస్థమైన ఉచ్చారణ కలిగియుండును. ఆంగ్లము account; ఫ్రెంచి le; జర్మను Ecke.

[ɐ] నిమ్నమధ్యము; మధ్యమము; అర్ధవివృతము; విస్తారితము. దీనిని [a], [ɑ] ధ్వనులకు మధ్యగా పలుకవలయును. అమెరికనుల ఆంగ్లము calm; father.

ఇంతవరకు అంతర్జాతీయ ధ్వనిపట్టిక (I P A) యందలి అచ్చులనుగూర్చి ప్రస్తావించుకొంటిమి. ఉచ్చారణకు సంబంధించిన నాలుగు వివరములను చెప్పుకొనుటచేత ప్రయత్నశీలునకు సరియైన యుచ్చారణ విధానము తప్పక పట్టుపడును. అంతేకాక తాను విన్నధ్వనిని నిర్దిష్టముగా లేఖనరూపమున నిరూపింపగల్గును. కాని, ప్రపంచ భాషల యందలి స్వరధ్వనులన్నియు పట్టికయందలి యిరువది ధ్వనులలోనే అంతర్భవించునని యనుకొనుట అతిశయద్యోతకమే కాని వాస్తవ నిరూపకము కాజాలదు. కావుననే మరికొన్ని ధ్వనులకు అవకాశమును కల్పించుచు పట్టికా నిర్ణేతలు కొన్ని గుర్తులను సూచించిరి. వానిని కూడ గుర్తుంచుకొనుట యవసరము.

పై పట్టికయందు హ్రస్వదీర్ఘభేదము సూచితము కాలేదు. చాల భాషలలో తద్భేదము ప్రధానము. అందువలన దానిని సూచించుట యవసరము. పై సంజ్ఞలకే దీర్ఘమును సూచింపవలసినప్పుడు నెత్తిపై నొక యడ్డగీతను (–) గాని, కుడిప్రక్కగా రెండు చుక్కలు ఒకదాని క్రింద నొకటి ( : ) కాని నిల్పుదురు. ఆంగ్లమునందలి 'pull' లో హ్రస్వమైన [u] ఉన్నది. Fool అన్నప్పుడు దీర్ఘమున్నది. దానిని సూచించుటకు [ū] అని కాని [u:] అనికాని వ్రాయుదురు. Account అన్నప్పుడు మొదటి ధ్వని [ə]. ఇది హ్రస్వము. దీనికి దీర్ఘము [ə:]. ఇది bird అను పదములోని స్వరధ్వని.

కొన్ని యచ్చులు అనునాసికోచ్చారణము కలిగియుండును. దానిని సూచించుటకుగాను నెత్తిమీద ఒక వంకరగీతను (~) నిల్పుదురు. హిందీయందలి 'మాఁ' అను మాటను [mã:] అని వ్రాయవలసియుండును. ఓష్ఠ్యీకరణమును సూచించుటకుగాను అక్షరమునకు కుడిప్రక్క కొంచెమెత్తుగా (ʷ) అని చూపుదురు. అట్లు చేసినపుడు దానికి పూర్వమున్న ధ్వనిని వర్తులితముగా పలుకుదురని యర్థము.

## 6. ౫. హల్లుల వర్గీకరణము

ఇంతకు ముందే '6. ౧' లో హల్లులను నాలుగు విధములుగా విభాగించితిమి. అక్కడ వాయుప్రవాహ నిరోధము నాధారముగా చేసికొంటిమి. అట్లే '6. ౨' లో ఉచ్చారణస్థానమునుబట్టి మరల హల్లులను ఐదు విధములుగా భాగించితిమి. అట్లే నాదతంత్రుల అవస్థానమునుబట్టియు శ్వాసములు, నాదములు – అని రెండు విధములుగా విభాగించితిమి. సమగ్రవర్ణన సామర్థ్యము కలుగుటకు విశదవివేచన మావశ్యకము.

హల్లులను ఆంగ్లమున consonants అని యందురు; దీనికి sonants తో కూడియుండునవన్నది యౌగికార్థము. భారతీయులు

హల్లులను ప్రాణులనియు, అచ్చులను ప్రాణములనియు పిలుతురు. ప్రాణములు స్వయముగా నుచ్చరింపబడును; కావున స్వరములు అనికూడ వ్యవహరింతురు. హల్లులకు స్వయముగా నుచ్చరింపబడు శక్తి లేదు. అందువల్లనే అవి అచ్చులను చేర్చుకొని ఉచ్చారితములగును. ప్రాణములతో కూడియుండుటచేతనే హల్లులకు 'ప్రాణులు' అన్న వ్యవహారము అన్వర్థమగుచున్నది. పైని చెప్పిన consonants అను సంజ్ఞ యీ భావమునే స్ఫురింపజేయుచున్నది. హల్లులను పరిగణించునపుడు క, ఖ – మున్నగువిధముగా ఉచ్చరించుట సంప్రదాయము. నిజమునకు క్, ఖ్ – మున్నగువిధముగా ననవలయును. కాని ఉచ్చారణ సౌకర్యము కొరకు అత్వమును కలిపి పలుకుట అభ్యాసమైనది. అట్లే, ఆంగ్లాది భాషలయందలి k, t, p – మున్నగు ధ్వనులను క, త, ప – మున్నగు విధముగా పలుకుటయే ప్రకృతప్రసంగమునకు సహకరించును.

స్పర్శములను పలుకునప్పుడు కరణము స్థానమును తాకి, తాత్కాలికముగా వాయునాళమునుండి వెలువడు వాయువునకు అవరోధమును కలిగించును. కరణము స్థానమును స్పృశించుటచేతనే, యీ ధ్వనులకు 'స్పర్శములు' అన్నపేరు చెల్లుచున్నది. వాయువునకు అవరోధము కల్గుటనుబట్టి ఆంగ్లమున stops, mutes, occlusives అను పేర్లను వాడుచున్నారు. అవరోధమును తొలగించినవెంటనే వాయువు స్ఫోటము నొందినట్లు ఒక్కమారుగా వెలువడును. ఈ ధర్మమునుబట్టి వీనికి స్ఫోటములు (plosives) అను పేరుకూడ చెల్లుచున్నది.

ఈ స్పర్శములను ఉచ్చారణస్థానమునుబట్టి విభాగింతము. క్రింది పెదవి పై పెదవిని స్పృశించి వాయునిరోధము చేయుటచేత ప, బ- అను ధ్వనులు పుట్టును. ఇచ్చట స్థానకరణములుగా ఓష్ఠములే వ్యవహరించినవి. కావున దీనిని ఓష్ఠ్యములు (labials) అని పిలుతురు. కొందరు మరింత స్పష్టత నుద్దేశించి bilabials అనికూడ అందురు. జిహ్వాగ్రము

మీది దంతముల వెనుక భాగమును తాకుటచేత వాయు వవరుద్ధమగును. అప్పుడు త, ద – అను ధ్వనులు పుట్టును. స్థానమునుబట్టి వీనికి దంత్యములు (dentals) అన్న పేరు అన్వర్థమగుచున్నది. తెలుగునందు దంత్యము లిట్లే యున్నవి. కొన్ని భాషలందు జిహ్వాగ్రము క్రింది దంతముల వెనుక భాగమును స్పృశించును. ఆంగ్లభాషయందలి t, d అనునవి దంతమూలీయములు (alveolars). జిహ్వాగ్రము దంతమూలమును స్పృశించి వాయునిరోధము గావించుటచేత ఈ ధ్వనులు పుట్టును. తమిళమునందు దంత్యములయిన త (ద) లతో పాటుగా దంతమూలీయములయిన త (ద) లు కూడ కలవు. కరణమునుబట్టి వీనికి జిహ్వాగ్రీయములు (apicals) అనుపేరు కొందరకు సమ్మతము. జిహ్వామూలము తనకు మీదనున్న మృదుతాలువును తాకి వాయునిరోధము గావించుటచేత క, గ – అను ధ్వనులు పుట్టును. మృదుతాలువును ఆంగ్లమున soft palate అనియు velum అనియు వ్యవహరింతురు. అందుచేత స్థానమునుబట్టి ఆంగ్లమున soft palatals అనియు, velars అనియు వ్యవహారము గలదు. తెలుగున మృదుతాలవ్యములు అని యనవలయును; కాని 'కంఠ్యములు' అనుపేరే వాడుకయందు ప్రచురముగానున్నది. దీనికి సమానమైన gutturals అను ఆంగ్లవ్యవహారము పలుచబడిపోవుచున్నది. కరణమునుబట్టి జిహ్వామూలీయములు (dorsals) అను వ్యవహారము రూఢి కెక్కినది.

ఆంగ్లమునందు లేకపోయినను భారతీయభాష లన్నింటియందు ట, డ – అను ధ్వనులు కలవు. భారతీయుల ఆంగ్లోచ్చారణమందు ఈ ధ్వనులు ప్రచురముగానే వినిపించును. నాలుకకు పై కప్పునందలి మధ్యభాగమునకు మూర్ధము అనిపేరు. ఆంగ్లమున cacumine అనియందురు. జిహ్వాగ్రము వెనుదిరిగి మూర్ధమును స్పృశింపగా మూర్ధన్యములు (cacuminals) పుట్టును. నాలుక వెనుదిరిగిన లక్షణమునుబట్టి, అనగా కరణమునుబట్టి ప్రతివేష్టితములు (retroflexes) అని యందురు.

పైనిచెప్పుకొన్న ప, బ; క, గ; త, ద; ట, డ – అను ప్రతిజంట లోను మొదటిది శ్వాసము; రెండవది నాదము. హల్లు లన్నింటికి నాద ములుగాను, శ్వాసములుగాను పలుకబడు స్వభావము కలదు. అన్ని భాషలందును ఈ ద్వైవిధ్యమున కవకాశము లేకపోవచ్చును. కొన్ని భాషలందు ఈ ద్వైవిధ్యమునకు ప్రాధాన్యము గలదు. తెలుగునందలి పరువు, బరువు – అను పదములనుబట్టి పకారమును, దాని నాదధ్వని యైన బకారమును విశిష్టములైయున్నట్లు గుర్తింపగలము.

హల్లులలో ఊష్మములు (spirants) అనుపేర కొన్ని ధ్వనులు కలవు; వీనిని పలుకునప్పుడును స్థానకరణములకు స్పర్శయుండును. కాని స్పర్శములను పలుకునప్పటివలె వాయువు పూర్తిగా అవరుద్ధమై, అడ్డు తొలగినపిమ్మట స్ఫోటమునొందుట జరుగదు. వాయువవరుద్ధమై సన్నని సందు (slit) నుండికాని ద్రోణిక (grove) నుండికాని బయటికి బుసతో నిర్గమించును. ఇట్లు బుసతోకూడిన ధ్వనులగుటవల్లనే శ, ష, స మున్నగువానికి ఊష్మములు అనుపేరు కలిగినది. వాయునిర్గమన సమ యమునందలి ఘర్షణమునుబట్టి ఘర్షములు (fricatives) అనుపేరుకూడ వీనికి చెల్లుచున్నది. ఆంగ్లమునందలి f, v, th, s, z, sh మున్నగునవి ఘర్షములను సూచించును. క్రిందిపెదవిని పైదంతములకు క్రిందుగా తీసి కొనివెళ్ళి తగిలియు తగలనట్లు ఉచ్చరింపగా f, v అను ధ్వనులు పుట్టును. ఇచ్చట కరణము క్రిందిపెదవి; స్థానము దంతములు. కాబట్టి వీనిని దంతోష్ఠ్యములు (labio-dentals) అని యందురు. ఇందు [f] శ్వాసము; [v] నాదము. జపానీభాషలో పూర్తిగా ఓష్ఠ్యశ్వాసో ష్మము (labial unvoiced fricative) అయిన [f] కలదు. పెదవు లను బాగుగా తెరచి మండుచున్న అగ్గిపుల్లను ఊదినట్లు ఊదుటచేత ఈ ధ్వని ఉద్భవించును. స్పానిషుభాషయందు ఓష్ఠ్యనాదోష్మము (labial voiced fricative) అయిన [v] కలదు. ఇదియు వెనుకటివలె ఊదుటవల్లనే ఉద్భవించును. కాని, యీ సందర్భమున నాదతంత్రులు ప్రకంపించుట విశేషము.

సాంప్రదాయిక లిపియందు 'th' అను నక్షరములతో నిరూపించు రెండు ధ్వను లాంగ్లమునందు కలవు. Thought అని యన్నప్పటి మొదటి ధ్వని దంత్యశ్వాసోష్మము (dental unvoiced fricative). జిహ్వాగ్రము ముందరి దంతముల వెనుకభాగమును తాకి ఆస్ఫోటింపగా ఈధ్వని జనించును. That అన్నప్పటి మొదటి ధ్వని దంత్యనాదోష్మము. ఇది పుట్టునప్పుడు నాదతంత్రులు ప్రకంపనము నొందును.

Pressure అని యన్నప్పుడు మధ్యస్థమైయున్న ధ్వని మూర్ధన్యోష్మము. నాలుక ముందరిభాగము ఒకవంకగా పైకిలేచి మూర్ధమును తాకుటచేత, బుసతోకూడి యీ ధ్వని వెలువడును. ఇది శ్వాసము. Pleasure అని యన్నప్పుడు మధ్యస్థమైన ధ్వనికూడ మూర్ధన్యోష్మమే. కాని ఉచ్చారణకాలమున నాదతంత్రులు ప్రకంపనము నొందుటచేత, ఇది నాదధ్వని యగుచున్నది.

కంఠ్యోష్మములుకూడ చాల భాషలలో కలవు. జిహ్వామూలము మృదుతాలువును స్పృశించియు స్పృశింపకుండ నుండగా ఈ ధ్వనులు పుట్టును. హిందీయందలి 'కాగజ్' అని యన్నప్పుడు [గ] కంఠ్యోష్మమే. దీనిని పలుకునప్పుడు వాయునిరోధము జరుగదు. ఇది నాదధ్వని. స్పానిషు భాషయందు pagar అనుచోట గల [g] కంఠ్యనాదోష్మమే. స్కాచి, జర్మను భాషలందు కంఠ్యశ్వాసోష్మము కలదు.

తెలుగు నందున్న చ, జ లు దంత్యోష్మములు. చ, జ లు తాలవ్యోష్మములు. జిహ్వాగ్రము ముందరి దంతములను తాకగా ఏర్పడిన ద్రోణిక నుండి వాయువు నిర్గమించును. నాదతంత్రులు ప్రకంపనము నొందగా [జ] పుట్టును; ప్రకంపనము నొందకుండ [చ] పుట్టును. జిహ్వాగ్రము దంతములకు మీదనున్న కఠిన తాలువును తాకగా ఏర్పడిన ద్రోణిక నుండి వాయువు నిర్గమించును. అప్పుడు శ్వాసమైన [చ] యు, నాదమైన [జ] యు నుద్భవించును.

స్పర్శములను పలుకునప్పటివలెనే ముఖయంత్రము నమర్చి, వాయుప్రవాహమును నాసికావివరములోనికి మరలింపగా అనునాసికములు జనించును. కంఠ్యానునాసికము sing లోని [ng]. 'వాఙ్మయము' అను పదమందలి [ఙ] ధ్వని కంఠ్యానునాసికమే. దంత్యానునాసికము [న]. ఓష్ఠ్యానునాసికము [మ]. తాలవ్యానునాసికము [ఞ]. వీనిని పలుకునపుడు నాదతంత్రులు ప్రకంపితములగును. కావున, అనునాసికము లన్నియు నాదములే.

సంస్కృతమునందును, తజ్జన్యభాషలందును ఫ, భ; థ, ధ; ఖ, ఘ; ఠ, ఢ- అను ధ్వనులు కలవు. వెనుకటి స్పర్శములే హకారోచ్చారణముతో కలిసి వెలువడినప్పుడు పై విధముగా ఉచ్చారితములగును. నిజమునకు ఆంగ్లమునందు సైతము ఇట్టి యుచ్చారణ లేకపోలేదు. కాని దానిని వారు వేరువర్ణముగా పరిగణించుట జరుగలేదు. Pit అని యన్నప్పుడు మొదటి వర్ణమును ఊనికతో పలుకుదురు. అప్పుడు హకారము తోడి ధ్వనియే వెలువడును. దీనిని వ్రాతలో ఉచ్చారణ విధేయముగా సూచింపవలయునన్న, ఆ వర్ణమునకు కుడిప్రక్క కొంచెమెత్తుగా 'h' చేర్చవలయును. పై ధ్వనిని [Ph] అని సూచించుట జరుగును. ఫ, భ-మొదలయిన వానిని మహాప్రాణములు (aspirates) అని యందురు. వీనికంటె భిన్నములుగా నిరూపించుటకు ప, బ - మొదలయిన వానిని అల్పప్రాణము లని యందురు.

హల్లులలో 'పార్శ్వికములు' ఒక అంతర్విభాగము నేర్పరుచును. తెలుగునందలి ల, ళ - అనునవి పార్శ్వికములు. జిహ్వాగ్రము దంతములను స్పృశించి వాయువును నిరోధింపగా, నాలుకయొక్క యిరుపార్శ్వములనుండి వాయువు బయల్వెడలును. అప్పుడు [ల] జనించును. పార్శ్వములనుండి వాయువు నిర్గతమగుటచే పార్శ్వికము (lateral) గను, కరణము దంతములను తాకినపుడు పుట్టుటచే దంత్యము (dental) గను

దీనిని పరిగణింతురు. దంతమూలము స్థానముగా కూడ [l] పుట్టవచ్చును. lip, leap అను పదములలోనిది దంతమూలీయ పార్శ్వికమే. [ళ] మూర్ధన్య పార్శ్వికము. జిహ్వాగ్రము వెనుదిరుగుటచేత ఈధ్వని ప్రతివేష్టితముగా సైతము పరిగణితమగును. ల, ళ లు రెండును నాదములే. వెల్ష భాషయందు శ్వాసమగు [l] కూడ కలదు.

కంపితము లను విభాగముకూడ హల్లులందు గలదు. వాయు ప్రవాహ వేగమువలన జిహ్వాగ్రము ప్రకంపనములను పొందుచు, అవ్యవహితముగా పలుమారులు స్థానమును స్పృశించును. పెక్కు పర్యాయములు వ్యవధానము లేకుండ ప్రకంపనముల నొంది స్పృశింపగా జనించిన ధ్వనులకు కంపితములు (trills) అని పేరు. తెలుగు నందలి కఱ్ఱ, బఱ్ఱె - అను పదములలోని తుది హల్ ధ్వని కంపితము. ఆంగ్లమున trill అను పదములోని [r] కంపితమే. దీనిని rolled consonant అని కూడ కొందరు వ్యవహరింతురు. ఫ్రెంచి భాషయందు లంబిక (uvula) ప్రకంపనములను పొందుటచేత కంపిత ముద్భవించును.

ద్రావిడ భాషలందున్న [ర] పై వర్ణముకంటె భిన్నము. ఇది నాలుకకొన దంతమూలమును తాకుటచేత జనించును. దీనిని పలుకునపుడు ప్రకంపనములు కలుగవు. దీనిని తాడితము (flapped consonant) అని యందురు. పైని చెప్పిన కంపితములను, తాడితములను, పార్శ్వికములకు కలిపి ద్రవధ్వనులు [liquids] అని పిలుతురు.

నాదతంత్రులకు నడుమగల స్థలమును కాకలాంతరము (glottis) అని యందురు. అందుద్భవించు ధ్వనులను కాకలాంతరీయములు (glottals) అని యందురు. ఆంగ్లమునందున్న [h] పలుకునపుడు ఘర్షణము కాని అవరోధముకాని లేకుండ వాయుప్రవాహము ఆస్యవివరము నుండి వెలువడును. ఉచ్చారణ సమయమున కాకలాంతరము కొంత సంకోచము నొందును. కావున దీనిని కాకలాంతరీయముగా పరిగణింతురు. ఉచ్చారణ సమకాలమున బుసవంటి ధ్వని వచ్చుటచేత ఊష్మ

ముగా పరిగణింతురు. ఇది శ్వాసము. కొన్ని భాషలలో దీనికి నాదధ్వని కూడ కలదు. కొన్నిచోట్ల [హ] సప్తపథీయోష్మము (pharyngal fricative) గా ఉచ్చారితమగును. దీనికి కూడ కొన్ని భాషలందు నాదధ్వని కలదు.

కాకలాంతరమునందు వాయువునకు సంపూర్ణావరోధము కలిగించి, విడుచుటచేత ఒక ధ్వని పుట్టును. దానిని కాకలాంతరస్పర్శము (glottal stop) అని యందురు. అరబ్బీ మున్నగు భాషలందు ఈ ధ్వనికి ప్రాచుర్యమెక్కువ. ఆంగ్లమున Co-operate మొదలయిన పదములను పలుకునప్పు డీ ధ్వని వినిపించును. తెనుగున అక్షరోచ్చారణ సమయమున 'అ ఆ' మున్నగు విధముగా పలుకునప్పుడు నడుమ ఈ ధ్వని వినవచ్చును.

స్థూలముగా హల్లులను స్థానమునుబట్టి, కరణమునుబట్టి, నాదతంత్రుల అవస్థానమునుబట్టి, వాయుగతినిబట్టి వర్ణించుకొంటిమి. ఇప్పుడింక అంతర్జాతీయ ధ్వని పట్టిక యందలి హల్లులను ఉదాహరణ పూర్వకముగా గుర్తించుకొందము.

## 6. ఉ. హల్లులు - ధ్వనిలిపి

[p] ఓష్ఠ్యము; స్పర్శము; శ్వాసము; అల్పప్రాణము. క్రింది పెదవి పై పెదవిని తాకి వాయునిరోధము చేయుటచేత ఈ ధ్వనిపుట్టును. ఆంగ్లము pin; ఫ్రెంచి patte.

[b] ఓష్ఠ్యము; స్పర్శము; నాదము; అల్పప్రాణము. క్రింది పెదవి పై పెదవిని తాకి వాయునిరోధము చేయుటచేత ఈధ్వని పుట్టును. ఉచ్చారణకాలమున నాదతంత్రులు ప్రకంపించును. ఆంగ్లము bit; స్పానిషు boda.

[t] దంతమూలీయము; స్పర్శము; శ్వాసము; అల్పప్రాణము. జిహ్వాగ్రము దంతమూలమును స్పృశించి వాయునిరోధము చేయగా

నేర్పడును. ఆంగ్లము ten; జర్మను vater. కొన్ని భాషలందు దంత్యము. తల, తెలివి.

[ d ] దంతమూలీయము; స్పర్శము; నాదము; అల్పప్రాణము. పై ధ్వనికంటె నాదముగుట యొక్కటియే విశేషము. ఆంగ్లము bid; ఫ్రెంచియందు దంత్యము dette; తెలుగునందు దరువు.

[ ṭ ] మూర్ధన్యప్రతివేష్టితము; స్పర్శము; శ్వాసము; అల్పప్రాణము. జిహ్వాగ్రము వెనుదిరిగి మూర్ధమును తాకి వాయునిరోధము గావించును. తెలుగు మాట; దీనిని క్రింద చుక్కతో కూడ చూపింతురు. [ ṭ ]

[ ḍ ] పై ధ్వనికి నాదరూపము. దీనిని క్రిందిచుక్కతో [ ḍ ] అని చూపవచ్చును. మేడ, వీడు.

[ c ] తాలవ్యము; స్పర్శము; శ్వాసము; అల్పప్రాణము. ఆంగ్లము such; rich. తెలుగు చంద్రుడు.

[ ɟ ] పై ధ్వనికి నాదరూపము. తెలుగు జయము.

[ k ] హనుమూలీయము; స్పర్శము; శ్వాసము; అల్పప్రాణము. ఆంగ్లము cool; kick;

[g] నాదము. తక్కినదంతయు మీది ధ్వనితో సమానము. ఆంగ్లము good; gay.

[ q ] లాంబికీయము; (uvular) స్పర్శము; శ్వాసము; అల్పప్రాణము. అరబ్బీ qalb.

[ G ] పై దానికి నాదము. ఉర్దూ గజల్.

[ʔ] కాకల్యము; స్పర్శము; శ్వాసము; అల్పప్రాణము. ఆంగ్లము. co-operative. తెలుగు అ ఆ.

[m] ఓష్ఠ్యము; అనునాసికము; నాదము. ఆంగ్లము mad.

[ɱ] దంతోష్ఠ్యము; అనునాసికము; నాదము.

[ n ] దంతమూలీయము; అనునాసికము; నాదము. ఆంగ్లము night. దంత్యానునాసికముగా కూడ వ్యవహరించును.

[ ɳ ] మూర్ధన్యప్రతివేష్టితము; అనునాసికము; నాదము. తెలుగు కణ కణ.

[ ɲ ] తాలవ్యము; అనునాసికము; నాదము. ఆంగ్లము onion; ఫ్రెంచి signe; తెలుగు విజ్ఞానము.

[ ŋ ] హనుమూలీయము; అనునాసికము; నాదము. ఆంగ్లము sing; తెలుగు వాఙ్మయము.

[ N ] లాంబికేయము; అనునాసికము; నాదము.

[ ɫ ] దంతమూలీయము; పార్శ్వికోష్మము; శ్వాసము. ఆంగ్లము milk.

[ ɮ ] నాదము; తక్కిన వర్ణనమున పైధ్వనితో సమానము.

[ l ] దంతమూలీయము; పార్శ్వికము; నాదము; అల్పప్రాణము. ఆంగ్లము long, lull.

[ ɭ ] మూర్ధన్యపార్శ్వికము; నాదము; అల్పప్రాణము. తెలుగు తళతళ.

[ ʎ ] తాలవ్యపార్శ్వికము; నాదము; అల్పప్రాణము.ఆంగ్లము. million; జర్మను Milch.

[ r ] దంతమూలీయము; కంపితము; నాదము; అల్పప్రాణము. ఆంగ్లము red; ఫ్రెంచి riz.

[ R ] లాంబికేయము; కంపితము; నాదము; అల్పప్రాణము.

[ ɾ ] దంత్యము; తాడితము; నాదము; అల్పప్రాణము.

[ ɽ ] మూర్ధన్య ప్రతివేష్టితము; తాడితము; నాదము. కఱ్ఱ; చెఱువు.

[ R ] లాంబికేయము; తాడితము; నాదము; అల్పప్రాణము.

[ ɸ ] ఓష్ఠ్యము; ఊష్మము; శ్వాసము; మహాప్రాణము. జపానీ భాషలోని 'ఫ' ధ్వనిని సూచించును.

[ β ] పైధ్వనికి నాదము. జర్మనుభాషలోని ఉభయోష్ఠ్యమైన [వ] ను సూచించును. స్పానిషు caballo.

[ f ] దంతోష్ఠ్యము; ఊష్మము; శ్వాసము; మహాప్రాణము. ఆంగ్లము fear, cough; ఫ్రెంచి phase; జర్మను fahren.

[ v ] పైధ్వనితో సమానము. ఉచ్చారణకాలమున నాదతంత్రులు ప్రకంపించును. ఆంగ్లము veil. తెలుగు వరుస.

[ θ ] దంతమూలీయము; ఊష్మము; శ్వాసము; మహాప్రాణము. ఆంగ్లము think.

[ ð ] పైధ్వనివంటిదే. నాదము. ఆంగ్లము that; స్పానిషు amado.

[ s ] దంత్యము; ఊష్మము; శ్వాసము; మహాప్రాణము. ఆంగ్లము see; ఫ్రెంచి se.

[ z ] పైధ్వనివంటిదే. నాదము. ఆంగ్లము zoo; easy.

[ ʂ ] మూర్ధన్యము; ఊష్మము; శ్వాసము; మహాప్రాణము. ఆంగ్లము wish, dish.

[ ʐ ] పై ధ్వనివంటిదే; నాదము.

[ ʃ ] తాలవ్యోష్మము; శ్వాసము; మహాప్రాణము. ఆంగ్లము sure; ఇటాలియను scelto.

[ ʒ ] పైధ్వనితో సమానమే. నాదమగుట విశేషము. ఆంగ్లము pleasure, treasure.

[ ç ] తాలవ్యోష్మము, శ్వాసము; అల్పప్రాణము.

[ ʝ ] తాలవ్యోష్మము; నాదము, అల్పప్రాణము.

[ x ] హనుమూలీయము; ఊష్మము; శ్వాసము; మహాప్రాణము. జర్మను ach.

[ ɣ ] పైధ్వనివంటిదే. కాని నాదలక్షణము విశేషము. స్పానిషు pagar.

[ x ] లాంబికేయము; ఊష్మము; శ్వాసము; మహాప్రాణము.

[ ʁ ] లాంబికేయము; ఊష్మము; నాదము; మహాప్రాణము.

[ ħ ] సప్తపథీయము; ఊష్మము; శ్వాసము; మహాప్రాణము.

[ ʕ ] సప్తపథీయము; ఊష్మము; నాదము; మహాప్రాణము.

[ h ] కాకల్యము; ఊష్మము; శ్వాసము; మహాప్రాణము. ఫ్రెంచి la hache.

[ ɦ ] పైదానితో సమానము; నాదము.

[ w ] ఓష్ఠ్యము;కొన్ని యెడల స్పర్శము;కొన్ని యెడలఅర్ధాచ్చు ఆంగ్లము woo, glow.

[ ɥ ] ఓష్ఠ్యము;కొన్ని యెడల స్పర్శము;కొన్ని యెడలఅర్ధాచ్చు. ఫ్రెంచి liti; chir.

[ v ] దంతోష్ఠ్యము; కొన్ని యెడల స్పర్శము; కొన్ని యెడల అర్ధాచ్చు. ఆంగ్లము very; ఫ్రెంచి vu.

[ ɹ ] దంత్యము కొన్ని యెడల,దంతమూలీయము కొన్ని యెడల; కొన్ని యెడల స్పర్శము, కొన్ని యెడల అర్ధాచ్చు. ఆంగ్లము ward.

[ j ] తాలవ్యము; అర్ధాచ్చు. ఆంగ్లము yes, gay.

ఈవిధముగా అంతర్జాతీయ ధ్వనిపట్టికయందు హాల్ధ్వనులు అరువదికి పైగా ప్రదర్శింపబడినవి. నిజమునకు కొన్ని భాషలకు ఇన్ని ధ్వనుల యవసరము లేదు. కొన్ని భాషలకు వీనికి భిన్నములైన ధ్వనుల యవసరముకూడ నుండును. కావుననే కొందరు మరల కంఠ్యములు, దంత్యములు మున్నగువానిని పూర్వకంఠ్యములు, పరకంఠ్యములు, అంతఃకంఠ్యములు మున్నగువిధముగా విభజించిరి. కొన్ని భాషలందు దంత్యములతోపాటుగా అంతర్దంత్యములు (interdentals) కూడ ప్రత్యేకతను కలిగియున్నవి. ఈవిధముగా చూచినప్పుడు ఈసంఖ్య యింకను పెరుగును. కావుననే క్రిందచుక్కలు, మీాదచుక్కలు, అక్షరమునకు అడ్డుగా గీతలు, కుడివైపుగా తిరిగిన అరసున్నను క్రిందచేర్చుట,

ఎడమవైపుగా తిరిగిన అరసున్నను క్రిందచేర్చుట మొదలగు ఇతరసాధనముల నుపయోగించుట కనవచ్చును. I P A లో నున్న ధ్వనిసంకేతములను కూడ కొందరు కొన్నిసరదుబాటులతో నుపయోగింతురు. విన్నధ్వనిని విశిష్టముగా గుర్తించి, లిపిబద్ధముచేయుటయే యిచ్చట పరమలక్ష్యము. అది నెరవేరిననాడు భిన్నములైన గుర్తులను వాడినను నష్టములేదు. ఏమయినను అంతర్జాతీయ ధ్వనిలిపిని వేరుగా వర్ణింపవలసిన యవసరములేదు. క్రొత్తసంజ్ఞలను కల్పించుకొన్నప్పుడు, ఉచ్చారణకు సహకరించునట్లు వానిని వర్ణించుట యవసరము. అట్లు చేయని యెడల లక్ష్యము సిద్ధింపదు.

## 6. ౭. సంయుక్త ధ్వనులు

ధ్వనియని యన్నప్పుడు వాచికాంగములు ఒకేస్థితిలో నుండగా ఒక్కమారుగా ఉచ్చారితమైనదనియే యర్థము. ఇంతవరకు మనము చెప్పుకొన్న ధ్వనులన్నియు నట్టివే. ఉచ్చారణసమయమున వాచికాంగములు ఒకస్థితినుండి మరొకస్థితికి మారుట తటస్థింపదు. కాని, కొన్ని ధ్వనులను పలుకుసమయమున వాచికాంగముల స్థితి మారుట కూడ కలదు. అట్టి ధ్వనులను సంయుక్తధ్వనులుగా పరిగణించుట యవసరము.

అ, క, న- మొదలయినవి సమధ్వనులు. వీని నాంగ్లమున monophthongs అని యందురు. 'క్రం' అని యన్నప్పుడు, చివరి 'ఓ' ను 'ఓవ్' అని యుచ్చరింతురు. కావున, ఇచ్చటి స్వరము సంయుక్త ధ్వని యని తేలును. ఇట్లు రెండు స్వరములకు ఏకకాలమున నుచ్చారణ మున్నయెడల ఆ సంయుక్తధ్వనికి diphthong అనిపేరు. గౌరవము అను మాటయందలి 'గౌ' ను పలుకునప్పుడు ప్రారంభమున 'అ'కారమును పలుకుటకు వీలుగా నోటిని పూర్తిగా తెరచియుంతుము. ఉచ్చారణ ముగియునరికి 'ఉ' కారమును పలికినట్లు నోటిని దగ్గరగా మూసి పెదవులను గుండ్రముచేసి ముందునకు చాపుదుము. దీనిని బట్టి 'గౌ' సంయుక్తధ్వని యని స్పష్టముగా తేలుచున్నది.

రెండేసిధ్వనులు కలిసియున్నట్లే మూడేసిధ్వనులు కలిసియుండి యేకకాలమున నుచ్చరింపబడవచ్చును. మూడుధ్వనులు కలిసిన సంయుక్తధ్వనిని ఆంగ్లమున triphthong అని యందురు. ఆంగ్లమందలి way, స్పానిషుభాషయందలి buey, ఇటాలియను భాషయందలి suoi అను పదములలో మూడుస్వరము లేకకాలమున నుచ్చారితములగును. ఒక్కదాని నుచ్చరించుటకు పట్టుకాలమే రెండు ధ్వనులనుగాని, మూడు ధ్వనులనుగాని సంయుక్తముగా పలుకుటకు పట్టునన్నది యిచ్చట గమనార్హము. రెండుధ్వనులుగల సంయుక్తధ్వనిని ద్వికధ్వని (diphthong) అనియు మూడు ధ్వనులుగల సంయుక్తధ్వనిని త్రికధ్వని (triphthong) అనియు వ్యవహరింపవచ్చును.

ఇచ్చటనే యింకొకవిషయమును గుర్తించుకొనుట యవసరము. సాంప్రదాయికలిపియందు సమధ్వనికి రెండేసి లిపి సంజ్ఞలను వ్రాయుట పెక్కుచోట్ల కనిపించును. ఆంగ్లమునందు th, ph, ch, sh- మొదలయిన హల్లిపులను కలిపి వాడుదురు. ఈ రెండేసి లిపిగుర్తులు ఒక్కొక్క ధ్వనినే సూచించును. ఇట్లు వాడుకయందున్న సంయుక్తలిపి(digraph) ని సంయుక్తధ్వనియని పొరపడరాదు. సంయుక్తధ్వని ఉచ్చారణకు సంబంధించినదికాగా, సంయుక్తలిపి సాంప్రదాయికమైన వ్రాతకు సంబంధించినది. ఆంగ్లాదిభాషలందు సమధ్వనులను సంయుక్తలిపులతో ప్రదర్శించుట, సంయుక్తధ్వనులను సమలిపుల (monographs) తో ప్రదర్శించుట సాంప్రదాయికము. Leave అన్నపదములో e, a అన్న రెండు లిపులును 'ఈ' అన్ని ధ్వనినే సంకేతించుచున్నవి. fate అని యన్నప్పుడు a అను లిపి [e] [y] అను రెండు వరుసధ్వనులకు సంకేతమగుచున్నది. ఇట్లు సంయుక్తలిపులకును, సంయుక్తధ్వనులకును గల భేదమును గమనించుట యవసరము.

హల్లులు స్వతంత్రముగా ఉచ్చారితములు కాజాలవనియు, అచ్చులు కాగలవనియు చెప్పుకొంటిమి. దానికి కారణము శ్రావ్యత

(sonority). హల్లులకు శ్రావ్యత లేదు. అందువల్ల హల్లులు అచ్చులను జేర్చుకొని శ్రావ్యతను సంపాదించుకొనును. అందువల్లనే హల్లులను consonants అనియు, ప్రాణులు అనియు పిలుచుట అన్వర్థమే యని చెప్పుకొంటిమి. అచ్చులలో కూడ వివృతాచ్చులకు శ్రావ్యత యధికము సంవృతాచ్చులకు శ్రావ్యత అల్పము. భాషావ్యవహారము నందు శ్రావ్యత యేకరీతిగా నుండక ఆరోహణావరోహణములను కలిగియుండును. 'క' అని యున్నదనుకొందము. ఇదియొక యక్షరము (syllable). 'క్' అనుదానిపై శ్రావ్యతగల 'అ' చేరినది. శ్రావ్యతారోహణమునుబట్టి అక్కడకు ఒక అక్షరముగా పరిగణింతుము. 'క్రేంకారము' అనుమాటయందలి మొదటియక్షరము 'క్రేం', దీని యందు క్, ర్, ఏ- అను ధ్వనులతోపాటు బిందువుకూడ కలదు. ఇందు 'ఏ' శ్రావ్యతారోహణము కలిగి యున్నది. తరువాతి బిందువు అనునాసికోచ్చారణము గలది. ఇది వెనుకటియచ్చుతో కలిసియే యుచ్చారితమగును. ఈ యక్షరము CCVC క్రమములోనున్నది. (C = consonant; V = vowel). ఇట్టి యక్షరములు ఒకమాటలో కాని ప్రయోగములో కాని యెన్నయిన నుండవచ్చును. శ్రావ్యతనుబట్టియే అక్షరములను పరిగణించుట జరుగును. అక్షరము అని యనగా లిపి యందుపయోగించు లేఖనచిహ్నము (alphabet) అని పొరపాటు పడరాదు.

ఒక్కయచ్చునే యుచ్చరించిన, దానికదియే యొకయక్షరమగును. ఒకటి కాని, రెండు కాని హల్లులకు పిమ్మట అచ్చువచ్చిన యెడల, ఆ సముదాయ మొకయక్షర మగును. ఈ విషయమును ముందే తెలిసికొంటిమి. అచ్చువెంబడి నచ్చువచ్చినయెడల, ఎట్లుండునో తెలిసికొందము. రెండచ్చులకును నడుమ వ్యవధానము లేకుండ నుండి రెండును శ్రావ్యతారోహణమును కలిగియున్నయెడల, వానిని రెండక్షరములుగా పరిగణింపవలయును. అట్లుకాక, ఒకయచ్చుమాత్రమే

శ్రావ్యతారోహణమును కలిగియున్న, ఆ రెండచ్చులును కలిసి ఒకే యక్షరముగా పరిగణితమగును. ఒకే ఊనిక (stress) తో రెండచ్చులను పలికినయెడల ఒకే యక్షరము; వేరువేరూనికలతో పలికినయెడల వేరక్షరములు– ఇది స్థూలముగా చేసికొనతగిన స్పష్టమైన నిర్ణయము.

రెండచ్చులు ఒకేయక్షరముగా పరిగణితమగునపుడు మొదటి యచ్చుగాని రెండవయచ్చుగాని శ్రావ్యతాగుణము నధికముగా కలిగి యుండి అక్షరశిఖరముగా ((Peak of the syllable) గా నెన్నబడును. ఆంగ్లమునందలి pay ఒకటే యక్షరము. మొదటి అచ్చయిన 'a'అక్షర శిఖరము. ఫ్రెంచిభాషయందలి pays [pei] రెండక్షరముల సమూహము. రెండచ్చులునురెండక్షరశిఖరములుగా శ్రావ్యతారోహణమును గలిగియున్నవి. సాధారణముగా సంయుక్తధ్వనియందు అక్షరముగా నెన్నబడుభాగముకంటె మిగిలిన భాగము జిహ్వావస్థానము నున్నతముగా కలిగియుండును. అనగా అక్షరత్వమునొందు ధ్వని వివృతధ్వని కాని, అర్ధవివృతధ్వని కాని యైయుండునని యర్థము.

అక్షరత్వమునొందు ధ్వనికి ముందుగాని, వెనుకగాని అక్షరత్వమునొందని (అనక్షర)ధ్వని యుండవచ్చును. అట్టి అనక్షరధ్వనికి అర్ధాచ్చు (semivowel) అనిపేరు. ఆంగ్లమునందలి yawn, yell, yoke, you మున్నగుచోట్లనున్న 'y' సాధారణముగా హల్లుగానే అనిపించును. k, p– మున్నగుధ్వనులవంటిదనియే తోచును. కాని వీనిని పలుకునప్పుడు ధ్వని యవరుద్ధమగుట మున్నగులక్షణములు స్పష్టముగా గోచరించును. కాని పైనున్న 'y' ని పలుకునప్పుడు అట్టి యవరోధమెంతమాత్రమును గోచరముకాదు. అచ్చులను పలుకునప్పటివలె నాదోచ్చారణముకూడ కలదు. అందువలన, వీనినచ్చులతో సమముగా నెన్నుటయే సమంజసము. మరొకయచ్చుతో కలిసి అనక్షరస్థానమును పొంది, అక్షరత్వమునొందిన యచ్చుకంటె సంవృతమైయున్నపుడు 'y' అర్ధాచ్చుగా పరిగణింపబడుట యుచితమే. wall, well, wake, wool

మున్నగుచోట్లనున్న 'w' కూడ ఇటువంటిదే. అందువలన దీనికి కూడ అర్ధాచ్చు అన్న పేరు అన్వర్థమగును.

ప్రక్కయచ్చును పలుకునప్పటికంటె అర్ధాచ్చును పలుకునప్పుడు నాలుకయున్నతముగా నుండును. అట్లే నాలుక కొన్ని యెడల ముందరికి సాగును; కొన్ని యెడల వెనుకకు కుంచించుకొనును. పెదవుల యవస్థానము ప్రక్కయచ్చునకున్నట్లే మారకుండ కొన్ని యెడల నుండును. yes, wool– అన్నవి యుదాహరణములు. కొన్ని యెడల ప్రక్కయచ్చునకు పెదవుల యవస్థాన మొకవిధముగా నుండగా, అర్ధాచ్చునకు మరొకవిధముగా మారవచ్చును. you, well– అన్నవి యుదాహరణములు. అర్ధాచ్చులు సహజముగా నాదములే. కాని కొన్ని యెడల, అవిశ్వాసములుకూడ నగును. ఇట్లు పెదవులనుబట్టి, నాలుకనుబట్టి, నాద తంత్రులనుబట్టి మరల అర్ధాచ్చులను విభాగించుట కొందరకపేక్షితము.



# హల్లులు

| | ఓష్ఠ్యము | దంతోష్ఠ్యము | దంత్యము/దంత మూలీయము | ప్రతి వేష్టితము | తాలుదంత మూలీయము | దంతమూల తాలవ్యము | తాలవ్యము | హను మూలీయము | లాంబి కేయము | సప్త ఘీయము | కాకల్యము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| స్పర్శములు | p b | | t d | ʈ ɖ | | | c ɟ | k g | q ɢ | | ʔ |
| అనునాసికములు | m | ɱ | n | ɳ | | | ɲ | ŋ | ɴ | | |
| పార్శ్వికోష్మములు | | | ɬ ɮ | | | | | | | | |
| పార్శ్వికములు | | | l | ɭ | | | ʎ | | | | |
| కంపితములు | | | r | | | | | | R | | |
| తాడితములు | | | ɾ | ɽ | | | | | R | | |
| ఊష్మములు | ɸ β | f v | θ ð s z ɹ | ʂ ʐ | ʃ ʒ | ɕ ʑ | ç ʝ | x ɣ | χ ʁ | ħ ʕ | h ɦ |
| అర్ధాచ్చులు | w ɥ | ʋ | ɹ | | | | j (ɥ) | (w) | ʁ | | |

(అనుబంధిత ఉచ్చారణములు
కుండలీకృత సంజ్ఞలతో నిర్దేశింపబడినవి)

ఇతర హల్లులు :- తాలవ్యీకృతహల్లులు ṭ, ḍ మున్నగునవి. కంఠ్యీకృతములు, సప్తపక్షియాకృతములు ṭ, ḍ, z మున్నగునవి. ఉత్క్రాంతములు (కాకల్యాస్ఫోటితములతోడి స్పర్శములు) p' t' మున్నగునవి. అంతఃస్ఫోటిత నాదములు ɓ, ɗ మున్నగునవి.

ఊష్మకంపితము ɬ.

θ, ð ధ్వనులును s, z ధ్వనులకును ఓష్ఠ్యీకృతధ్వనులు ʘ, ʘ̬. ʃ, ʒ ధ్వనుల ఓష్ఠ్యీకృతములు ɥ, ʑ.

ʇ, ʗ, ʖ (క్వణకములు. జులు c, q, x )

ɹ (r, l ధ్వనులకు నడిమిధ్వని) . w నాదము, ʍ నాదరహితము.

స్పృష్టోష్మములు :- సాధారణముగా రెండుహల్లులతో ప్రదర్శింతురు. (ts, tʃ, dʒ మున్నగునవి). కొన్నిమొతల ద్వికసంయుక్త లిపులు (యమళములు) ప్రయుక్తములు (ts, tʃ, dʒ మున్నగునవి). అటుకానిచో ͡ అనికాని ‿ అనికాని (t͡s, t‿s మున్నగు విధముగా గుర్తులుపయుక్తము లగును. tʃ, dʒ అనువాని స్థానమున అప్పుడప్పుడు c, ɟ అనియు నుపయుక్తము లగును.

ఊష్మస్పర్శములు ph, th మున్నగునవి.

పరివృత్తులు :- అనునాసిక్యము ~ . ( k̃ మున్నగునవి )

శ్వాసీకరణము ˳ ( l̥ శ్వాసము ; l నాదము )

ఓష్ఠ్యీకరణము .. ( n దంత్యము ; n̤ ఓష్ఠ్యము )

నాదీకరణము ˬ ( s̬ = z

దంత్యీకరణము ̪ ( t దంతమూలీయము; t̪ దంత్యము )

తాలవ్యీకరణము ˙ ( ż = ẓ )

